# ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు

పరిష్కర్త

డా॥ రావూరు వెంకట సత్యనారాయణరావు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు 4

# తొలిపలుకు

ఈ శతాబ్దంలో తెలుగుదేశాన్ని జాగృతం చేసిన మహనీయు లలో స్వర్గీయ ముట్నూరి కృష్ణారావు గారిది విశిష్టస్థానము. ముట్నూరి కృష్ణారావుగారు స్వాతంత్ర్య పోరాటములో పాల్గొన్న త్యాగమూర్తి, మేధావి, విజ్ఞాని, గొప్పరచయిత. కొన్ని దశాబ్దాల పాటుకృష్ణాపత్రికకు సంపాదకులుగా ఆయన తన సంపాదకీయాల ద్వారా తెలుగు ప్రజానీకానికి మార్గదర్శకత్వము వహించినారు. కృష్ణాపత్రిక అనగానే వెంటనే కృష్ణారావుగారు జ్ఞప్తికి వస్తారు. సమకాలీన సమాజంమీద కృష్ణాపత్రిక ప్రభావం అద్వితీయమైనది.

భారతదేశము గాంధీమహాత్ముని నాయకత్వమున స్వాతంత్ర్య పోరాటములో నిమగ్నమైన కాలములో, దేశాభిమానాన్ని, స్వాతంత్ర్యకాంక్షను ప్రజలలో ప్రబోధింపజేయడానికి ఆసేతు హిమాచలము ఎందరో మహానుభావులు నడుముకట్టినారు. వారిలో తెలుగుదేశమున గణుతికెక్కిన విజ్ఞాన సముద్రుడు ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రిక ద్వార ఆయన తెలుగుమాట్లాడే ప్రజ లలో స్వాతంత్ర్య భావాలను ప్రచారంచేసి ఎందరో నాయకులను సృష్టించినారు. కృష్ణాపత్రిక సంపాదకీయాలు చదివి అనేకులు కర్తవ్యపరాయణులయినారు. సమకాలిక రాజకీయాలను గూర్చియే గాక సాహిత్యము, కళలు, సంస్కృతి, విద్య, ఆర్థికసమస్యలు, మొదలైన అనేక విషయాలను గూర్చి శ్రీ కృష్ణారావుగారు గొప్ప సంపాదకీయాలు వ్రాసినారు రాజకీయంగా, సాంస్కృతికంగానే గాక చారిత్రకంగా కూడ యీ సంపాదకీయాలకు ప్రత్యేక ప్రాధాన్యము ఉన్నది. తెలుగులో కృష్ణారావుగారి వచన శైలి

విలక్షణమైనది. తెలుగువచన రచయితలలో ఆయనది సమున్నతమైన స్థానము.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కృష్ణాపత్రిక సంపాదకీయాలను కొన్నింటిని సేకరించి ప్రకటించవలెనని నిశ్చయించి, యీ సంపాదకీయాల ఎన్నిక బాధ్యత డా॥ రావూరి వెంకట సత్యనారాయణరావు గారికి అప్పగించినది. డా॥ సత్యనారాయణరావు గారు కృష్ణారావుగారి సహచర్యములో ఉత్తేజితులై, కొంతకాలము కృష్ణాపత్రిక సంపాదకులుగా పని చేసిన ప్రసిద్ధ రచయిత. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ పక్షాన యీ బాధ్యతను అంగీకరించి నిర్వహించిన డా॥ రావూరి వెంకట సత్యనారాయణరావు గారికి అనేక ధన్యవాదాలు. కృష్ణాపత్రిక సంపుటాలను అకాడమీకి లభ్యము చేసిన తెలుగు భాషా సమితికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

హైదరాబాదు<br>28-1-1979

దేవులపల్లి రామానుజరావు<br>కార్యదర్శి

# విషయ సూచిక

# పత్రికా సంపాదకత్వంలో "ప్రతిభా గరీయసి"

గత శతాబ్దాంతంలో తెలుగు నేలలో వెలుగు పందిళ్లుగా కొన్ని పత్రికలు వెలసినాయి. అందులో కొన్ని సంపాదకుల ప్రతిభా ప్రాభవాల ద్వారాపత్రికా రాజాలుగా విరాజిల్లినాయి. వాటిలో పేర్కొనదగిన పత్రిక-కృష్ణా పత్రిక. అప్పుడు గుంటూరు, కృష్ణా, మండలాలు కలిసి కృష్ణాజిల్లాగా వుండేవి ఆ సమయంలో కొందరు దేశభక్తులు, సంఘసంస్కర్తలు 1892లో కృష్ణాజిల్లా సంఘం అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించారు. ఆ సంఘానికి ప్రచార సాధన కావలసి వచ్చింది. పెద్దలు ఆలోచించి కృష్ణా-పత్రికను స్థాపించారు. చాలా మంది విరాళాలు అందించారు. ఆదిలో శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు, శ్రీ దాసు నారాయణ రావు గారలు సంయుక్త సంపాదకులుగా వున్నారు. వారి సారథ్యంలో పత్రిక ముందడుగు వేసింది. జిల్లా వార్తలకే పరిమితంగా వెలసిన కృష్ణాపత్రిక క్రమంగా దేశవ్యవహారాలను, సమస్యలను ప్రచురించడం ప్రారంభించింది.

అంతవరకూ ఎక్కడో విద్యార్థిగా, వినయ సంపన్నుడుగా, విజ్ఞాన సాధకుడుగా, నిలిచియున్న ఒక యువకుడు ఆ పత్రికారాజాన్ని చదివి పులకితుడు కావడం, వెంటనే పొంగుతున్న తన హృదియాన్ని ఆ పత్రికకు అంకితం చేయడం జరిగింది. అది పత్రిక అదృష్టమో, ఆయన అదృష్టమో ఎవరూ స్పష్టంగా చెప్పలేరుగాని-ఆయన ఆ పత్రికకు సహాయ సంపాదకుడుగా నియుక్తుడయ్యాడు.

అప్పటికి ఆ పత్రిక పసిపాప. ఈడు ఒక్క ఏడాది. ఆయన ఆ పాపను వేయి కళ్ళతో చూచి వేయిచేతులతో ఊయలవూచి కోటి మూగగీతాలాలపించిఎంతో ఆలరించ గలిగాడు ఆ యువకుడే శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు. ఆయనకోసమే కృష్ణా పత్రిక స్థాపించ బడినట్లయింది సహాయసంపాదకుడుగా పత్రికకు ఎనలేని సేవచేసి

ఆ పాపచేత తప్పటడుగులు వేయిస్తూ, తనలోగల తత్వ, వేదాంత, కవిత్వ, సాహిత్య, నృత్య, గానవిషయాలను తరంగాలుగా పాడుతూ ఎంతో మురుస్తున్న సమయంలో ఆయనకు వంగరాష్ట్రంనుంచి పిలుపు వినవచ్చింది.

బిపిన్‌చంద్ర పాల్ స్వాతంత్ర్య సమరానికి శంఖం పూరించాడు. అర విందుడు అండగా నిలిచాడు. తిలక్ మహాశయుడు దూరంనుంచి ఆశీర్వదించాడు. ఆ పిలుపువిని కృష్ణారావుగారు మనస్సునిలుపుకోలేక, ఉడికే రక్తాన్ని చల్లార్చుకోలేక కలకత్తా పయనమయ్యారు పాల్‌గారి శిష్యకోటిలో చేరారు. ఆయనతో కలిసి పర్య టన జరిపారు. సమరతంత్రాన్ని అవగతం చేసుకొన్నారు. జీవితాన్ని మాతృదేవత చరణసేవకు అంకితంచేశారు. విప్లవాగ్ని అయనలో రగిలింది. విప్లవజ్యోతిని వెంటబెట్టుకొని ఆంధ్రదేశానికి తిరిగివచ్చారు. పాల్‌గారు ఆంధ్రదేశంలో సంచారం చేశారు కృష్ణారావుగారు గురువుకు వీడ్కోలు చెప్పి తాము తిరిగి పత్రికా నిర్వ హణలో కుదుటపడ్డారు.

తరువాత అంటే 1907 లో కృష్ణాపత్రిక సంపాదకులయ్యారు. క్రమంగా పత్రిక యజమానులయ్యారు. కలాన్ని కత్తిగా మార్చుకొని రచనలు సాగించారు. కొన్ని సంపాదకీయాలను రక్త చిత్రాలుగా పోల్చారు పాఠకులు. కొన్నిటిని శంఖారావాలన్నారు. మరికొన్నిటిని రసతరంగిణులన్నారు. కొన్నిటిని సాహిత్య సందేశాలన్నారు. కొన్నిటిని అపూర్వ విమర్శా పత్రాలన్నారు. కొన్నిటిని అత్యుత్త మమైన రాజకీయ రసాంకాలన్నారు. మరి కొన్నిటిని వసంతారామ పులకిత పరభృత గానాలన్నారు. కొన్నిటిని తేనెవాకలనీ, కొన్నిటిని మినువాక గల గలలనీ వర్ణించారు.

ఇన్నిటికీ మూలాధారం ... పరిపూర్ణమైన, ప్రజ్ఞాయుతమైన, ప్రతిభాన్వి తమైన, కృష్ణారావుగారి హృదయస్పందన. అది ఒక చిత్రశాల. అందెన్నెన్ని రంగులో! రంగులు అనేకములు. కుంచె ఒక్కటే ... ఆ కుంచె ఆయన కలం. రంగులు వేటికవి భాసించగలవు. కాని కృష్ణారావుగారి కళా నైపుణ్య విశేషమున

అవి మిశ్రితములై, భావసమ్మిశితములై, అపూర్వవర్ణ సంశోభితములై, రసోచిత పరిపుష్టి నందుకొని, ఏతత్ భావనా సృష్టికి తగిన కాంతులతో విలసిల్లే చిత్రములుగా మారుచుండెడివి. అవి సంపాదకీయములు కావు. సందర్భోచిత, భావనాపూరిత, కళావైదగ్ధ్య ప్రమాణములు ... పరిణామములు. ఆ కుంచె ఎరిగిన శిల్పరహస్యములు ఎన్నరానివి. ఎన్నెన్ని చిత్ర విచిత్ర దర్శనములు కృష్ణాపత్రిక పుటలలో, పాఠకలోకం పై వారం ఏ చిత్రపటం దర్శనమీయ నున్నదోననితహతహలాడెడివారు. అది రాజకీయమా! సాహిత్యమా! శిల్పమా! కవనమా! గానమా! ప్రకృతి పరిశోధనమా! ఈశ్వరస్వరూప సందర్శనమా! భాస్వదుద్దీపనాపరమైన వేదాంతమా! జీవితనైరాశ్యమా! వైరాగ్యమా! నశ్వరతత్వమా! శాశ్వతత్వమా! ఏది రాబోవు చిత్రపటము ?

చిత్రకారుడు గంభీరుడు ధీరుడుకూడ తాను చిత్రించబోవు చిత్రమును గూర్చి రవంతైన ముచ్చటించువాడు కాదు_ మౌనముద్ర-అచ్చమైన మౌనముద్ర. అరవెచ్చగా కాగిన రక్తం ఎదలోంపరుగులు తీస్తుండగా, పదిలంగా కూర్చుని, కదలక మెదలక అదునైన, పదునైన చిత్రాలు గీసి పత్రికకు అందించి "ఇది మీ సొత్తు" అని పాఠకలోకానికి వదిలి, నిష్కామకర్మ యోగిగా, నిలబడగలిగిన నిండుతనం కృష్ణారావుగారి కొక్కరికే వుందేమో!

గాంధి మహాత్ముని సందేశం విని, ఆయన అనుచరులుగా మారి, భరతమాత చెందే వేదన ఎదలోనింపుకొని, క్షణక్షణం ఆమె పసిడి పాదాలు క్షాళనం చేసి ఆ పవిత్రోదకం శిరస్సునజల్లుకొనే మహాసంకల్పంతో జీవితాన్ని వెలుగు బాటలో నడిపించుకున్న ప్రముఖ బాటసారి ముట్నూరి కృష్ణారావుగారు.

మహాత్ముడు చూడగానే కృష్ణారావుగారిలో భావనాబలాన్ని గుర్తించారు. "ఈయన కళ్ళల్లో ఆధ్యాత్మిక జ్యోతులు వెలుగుతున్నాయి. ఈయన్ని బయటకు తీసుకురావాలి. తనంత తాను రాడు. ప్రయత్నించాలి'' అని పట్టాభిగారితో అన్నారు మహాత్ముడు. కాని కృష్ణారావుగారు పత్రికను వదిలి వెళ్ళడానికి అంగీ

కరించలేదు. రాజకీయంగా ఆయన అజ్ఞాతవాసిగానే వుండాలని సంకల్పించు కొన్నారు. అందువల్ల పత్రికారంగంలోనే ప్రత్యక్షవీరులుగా సాక్షాత్కరించారు. "వేయి కత్తులకన్న ఒక కలం మిన్న" అన్న ఆర్యోక్తికి అనవాలుగా నిలువగలిగారు. పత్రికా సంపాదకులుగా నాలుగుగోడల మధ్య ఉన్నట్లు కనిపించినా ఆయన మనస్సు రాజకీయ రంగంలోనే పరిభ్రమిస్తూ ఉండేది. పంచబంగాళమైన భారతస్వాతంత్ర్యాన్ని, వంచనపాలైన భారతజాతినీ, తుంచి దూరంగా విసిరి వేయబడిన భారతసంస్కృతినీ తిరిగి పునరుద్ధరించాలనే దీక్ష వారిలో ఎల్లప్పుడు ద్యోతకమయ్యేది. అది తీరని కక్షగా మారి కళ్ళలో ఎర్రజీరలు రూపొందేవి రాజకీయవేత్తలు, స్వాతంత్ర్య సమర యోధులు ఒకమహా తపస్సంప న్నుని వద్దకు పరుగులు తీస్తూ వచ్చినట్లు కృష్ణాపత్రిక కార్యాలయ గవాక్షంవద్ద వేచివుండడం సామాన్యదృశ్య మారోజులలో. కృష్ణారావుగారువారిని చూచి,తలపం కించి,ఆహ్వానించి,వారిలోవీరరసం,పిండిపోసి,ధీరోధాత్తుల్ని జేసి,సమరరంగనీతులు బోధించి "జయం సాధించండి'' అని పంపుతూ వుండేవారు. అవును, ఆయన మహా యోధుడు, శిబిరము వదలని యోధుడు, అక్కడనుంచే శింజినీటంకారాల విని పించగల యోధుడు. అక్కడప్రతిష్ఠతుడైనట్లుండి ఫాలాక్షునివలె మూడవ నేత్రము తెరువగలిగిన యోధుడు. ఒక అసాధారణ యోధుడు— అసామాన్యమైన యోధుడు. అహింసా సమరంలో ఆరితేరిన యోధుడు- ఆ సంపాదకుడు.

కృష్ణాపత్రిక కార్యాలయంలో అర్ధరాత్రివేళ రాజకీయనాయకుల రహస్య సమావేశాలు జరుగుతూ వుండేవి. ఎప్పుడూ బండిఎక్కని కృష్ణారావుగారు బండిలో రహస్యంగా అక్కడికి వస్తూవుండేవారు. ఆ సమావేశాలలో సత్యాగ్రహానికి సంబం ధించిన నిర్ణయాలు తీసుకోబడేవి. ఆకార్యాలయం చుట్టూ సి.ఐ.డీలు మూగుతునే ఉండేవారు. అయినా జైలు కోరేవారేగాని, వద్దనే వారక్కడ ఎవరుంటారు?

కృష్ణారావుగారు రెండు మూడుసార్లు శ్రీకృష్ణజన్మస్థాన మలంకరించారు. వెల్లూరుజైలులో ఉండగా వారు శ్రీగోపాలరెడ్డి ప్రభృతులకు సంస్కృత కావ్యాలు చెప్పారు. వేదాంతం కృష్ణారావుగారిలో కొల్లలు.

అవును, ఆయన పరమవేదాంతి. అస్థిరత్వమెరిగిన శాశ్వత చిదానందమూర్తి. జీవితమర్మ మెరిగిన కర్మయోగి. పరమాత్మని దివ్యభావనలోని వైచిత్ర్యాన్ని, ఆయన సృష్టిలో కళావైదగ్ధ్యాన్ని, ఆయనలో విశ్వస్వరూపతత్వాన్ని, విజ్ఞాన తేజాన్ని గుర్తించిన మహాప్రవక్త మా గురుపాదులు. అందరు చదివిన బాసలే ఆయనా చదివారు. అ చదవడం చదువులలో మర్మమెల్ల దెలియుట. ఆ మర్మ ములలోని మధుర దర్శనము నందుకొనగలిగిన జ్ఞాని కృష్ణారావుగారు.

ఆది అరవిందుని తత్వము కానిండు, రవీంద్రుని కవిత్వము కానిండు, త్యాగరాజుకీర్తన కానిండు, పోతరాజుప్రార్థన కానిండు, అన్నియు ఆయన గుండె లలో కదిలి, మెదిలి, బయటకు ఉరికి, రసవాహినులుగా ప్రవహించుటకు సిద్ధంగా ఉన్న దివ్యసంపదలే. భవ్యజీవన స్వర్ణవాహినులే శిల్పరహస్యము ప్రకృతిలో ప్రతి చివురాకునందునూ, ప్రతి పువురేకు నందునూ, ప్రతితీగలో, మొగ్గలో ఆయన దర్శింపగలిగారు. జగమొక చిత్రశాలంగా సదా ఆయనకు ద్యోతకమయ్యేది. చేతులు జాచి స్వాగతమిచ్చేది. ఎగిరే సీతాకోకచిలుకలో, మూగే తుమ్మెదలో, రాగాలాపన చేసే కోయిలలో, తేనె పలుకులు వల్లించే రామచిలుకలో, రెక్కల ల్లార్చే పాలపిట్టలో, గొంతులో మువ్వలసవ్వడులు వినిపించే గువ్వలో ఆయనకు గాయకులు కనిపించేవారు. అవును, వారందరూ భగవంతునిఆస్థాన వాగ్గేయ కారులే.

ప్రకృతిని రాధగా పరిశీలించడం, ఆమెలో తొణికిసలాడే, తొంగిచూచే భావనలను, అందందు గమనించి ఉప్పొంగడం కృష్ణారావుగారికి పరిపాటి. ఒక కొమ్మపై విరిసిన పూలను తాకుతూ, పరుగులుతీస్తూ, మరొక కొమ్మపై వ్రాలుతూ ఆటలాడుతూ విహరించే సీతాకోకచిలుకను చూచి అయనగారు ఎంతో ఊహించే వారు. ఇంగిలీకంలో వైడూర్యపు కాంతులు రంగరించినట్లున్న చివురాకుపై ఒక సీతా కోకచిలుక-జరీ చుక్కల సీతాకోకచిలుక, వేదాంతుల హృదయాలలో వెలిగే చిరు జ్యోతులకు ఆనవాలుగా తిరిగే సీతాకోకచిలుక-చిత్ర కారులకు వెన్నెల అంచులు దిద్దే సీతాకోకచిలుక-రెక్కలువిప్పుకొని పరిభ్రమించడం, ఫలకరించడం, వ్రాలి నట్లుగా వ్రాలి, గాలిలోకి తేలిపోవడం-అక్కడ ఒకసారి ఓంకారంగా, కొంతసేపు

శ్రీకారంగా తిరగడం- ఈ దృశ్యాల్ని చూస్తూ ఉండేవారు కృష్ణారావుగారు. వెన్నెల గిలకల్లాంటి ఆయన నేత్రాలు ఆ చిలుకతోపాటే తిరుగుతూ ఉండేవి. ఆయన మనసా చిలుక రెక్కల మీదే పొరుగుతూ ఉండేది. చివురాకులో శిల్పమా ముందు ఆరాధించ వలసింది- దాని నాధారం చేసుకొని, హావభావ విన్యాసాలతో తాకి పరుగులు తీసే, వ్రాలి దూరమయ్యే - పలుకరించి పారిపోయే ఆ సీతాకోక చిలుకలో గల వేదాంతరహస్యమా ? ముందు ఆలోచించవలసింది ? అన్న సంశయంలో పడేవారు మా గురుపాదులు

ఇంతలో ఆ చిలుక, అ చివురాకును విడిచి ఒక అరవిచ్చిన మొగ్గనంటుకొని పదక్షిణం చేస్తూ ఉండేది. ఆయన మెల్లగా అడుగులు అటు వేసేవారు. చూపులు గిరగిర తిప్పుతూ ఆ చిలుక పరిభ్రమణానికి మనస్సులో శ్రుతి కలుపుకునేవారు. ఇంతలో విడిచి వచ్చిన చివురాకు జ్ఞాపకంవచ్చేది. ఆమె మీద జాలి కలిగేది వెనక్కి తిరిగి వచ్చి చివురాకును చూసేవారు. ఆమె విరహోత్కంఠగా కనిపించేది. వేదనపాత్రై వేడికన్నీటిని విడుస్తున్నట్లు కనిపించేది వారికి. అప్పుడా చివురాకు నుద్దేశించి "నే చెప్పలేదుటమ్మా. అతడు ధూర్త నాయకుడు. యదునందనుడు కూడా యిలాటివాడే! ఆయన్ని పట్టి సందిట దాచుకోలేక రాధ అలా ప్రకృతిలో లీనమైంది. అప్పుడామెనుండి ఆయన తప్పించుకొలేకపోయాడు. ఆమె మొగ్గగా మారితే, తానుపుప్పొడిగామారి ఆమెఎదలో దాక్కొనేవాడు. ఆమెపువ్వుగా విరిస్తేచిరుగాలిగా మారి కదిలించేవాడు. చివురాకుగా రూపొందితే కేకిపింఛంతో తాకి తన్మయత్వం కల్పించేవాడు ఎక్కడికి పారిపోగలడు? అతడెందరినో గెలిచాడు. అతగాణ్ణి ఆమె గెలిచింది. ఆమె అన్వేషణ మానింది. అతడు అన్వేషి అయ్యాడు. ఆ సురమౌళికి, ఆ వనమాలికి రాధాన్వేషణ జీవనకేళి అయింది.

కృష్ణారావుగారి దృష్టిలో సృష్టి ఒక కళానిలయం. అన్నితావుల్లో దివ్య పురుషుని రూపకల్పన గోచరించేది. "ఇందుగల డిందు లేడను సందేహము వలదన్న" సత్యదర్శనంలో ఆయనకెంతో విశ్వాసం. నశ్వరమైన ఈ జగత్తులోనే

శాశ్వతత్వాన్ని కల్పించే సౌందర్యస్వరూప మేదో దాగివున్నదనీ, దాని అన్వేషణే జీవితధ్యేయ మనీ వారిమతం. అన్నివైపులనుంచి వారికి వేణునాదం వినిపించేది. అందువల్లనే ఒక్కొక్కప్పుడు వ్రాస్తున్నకలాన్ని క్రిందపెట్టి వేణవునుగూర్చి, వాణి వీణనుగూర్చి పెద్ద ఉపన్యాస మిస్తూ ఉండేవారు కృష్ణారావుగారి భావనాబలమట్టిది. వారికలం ఎప్పుడూ ఉద్విగ్నమైన, ఉజ్జ్వలమైన, ఉపజ్ఞాపూరితమైన, ఊహాతీతమైన భావాలనే సంతరించుకొని కృష్ణాపత్రిక పుటలలో ముత్యాల ముగ్గులు పెట్టేది. అందువల్లనే వారిని రసతపస్విగా పేర్కొన్నారు. వారి సంపాదకీయాలు రాజకీయ, సాంఘిక, భౌగోళిక విషయాలకు పరిమితం కాకుండా. కళాదర్శనం, సౌందర్య దర్శనం, ఆత్మదర్శనం మొదలైన- అద్భుత విషయాలను వెలార్చేవి.

ఏది వ్రాసినా "పరిపూర్ణత" గోచరించేది. మనస్సు పండినప్పుడు మాత్రమే అలాటి పరిపూర్ణత సిద్ధిస్తుంది రాజకీయాలు వ్రాసినప్పుడు భావతీవ్రత గోచరించేది. ఎట్టి పరిస్థితిలోనూ వారికలం జంకేదికాదు. బొంకడం అసలు లేనేలేదు. ధర్మమైన విషయాలు చిత్రించడంలో ఆయనగారు రానున్న కష్టాన్నికూడా మరిచేవారు. ప్రభుత్వానికి వెరవడం ఎన్నడు లేదు, ఎప్పటికప్పుడు కారాగార సింహ ద్వారం వద్ద నిలబడినట్లే భావించుకొనేవారు. ప్రతిదినం ఇంటికి వెడతారో లేదో ననే సంశయమే. తిరిగి మర్నాడు ఆఫీసుకి వస్తారో రారోనని మాకెప్పుడూ భయమే. పట్టాభిగారు, బయలుదేరి కృష్ణాపత్రిక ఆఫీసుకు వచ్చేముందు కబురు పంపే వారు-కృష్ణారావు ఆఫీసులో ఉన్నాడులేదో చూచిరమ్మని. ఉన్నారని విని వచ్చేవారు.

స్వాతంత్ర్య సమరం కొనసాగుతున్న రోజుల్లో కృష్ణాపత్రిక సంపాదకీయాలు ఆంగ్లంలోకి అనువదించబడి ప్రభుత్వానికి అందజేయబడుతూ వుండేవి. అప్పటి ప్రభుత్వ అనువాదకులు శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు ఆయన కృష్ణారావుగారికి బందరు నోబుల్ కాలేజీలో గురువులు. అయినా ఆయన కార్యక్రమం ఆయన అమలు జరుపుతూవుండేవారు. ఒకసారి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు కృష్ణాపత్రిక సంపాదకీయ మొకటి ఆంగ్లంలోకి అనువదించి ఇంగ్లాం

డులోని ఆంగ్ల పత్రికకు పంపారు. అది చూచి బ్రిటిష్ ప్రభుత్వం భగ్గున మండింది దర్యాప్తు చేయవలసిందిగా భారతప్రభుత్వానికి పంపింది. మద్రాసు గవర్నరు భానుమూర్తిగారి మీద విరుచుకు పడ్డారు భానుమూర్తిగారు ఇలా చెప్పారు. ''కృష్ణాపత్రిక సంపాదకీయాలన్నీ ఇలాగే ఉంటాయి.చాలావాటిని నేను అనువదించి మీకు పంపాను.మీరు చర్య తీసుకొనలేదు ఇక తర్జుమా చేసి లాభం లేదని వూరుకొన్నాను.ఇదివరకు వ్రాసినవి దీనికన్నా గొప్పగా ఉన్నాయి అయినా ఉద్యోగిగా నా ధర్మం నేను నెరవేర్చలేనందుకు చింతిస్తున్నాను నా రాజీనామా స్వీకరించండి" అని కాగితాలు అందించారట తెల్లదొర తెల్లపోయాడు. పాతవిష యాలు బయటపడతాయనే భయంతో భానుమూర్తిగారిని పొగిడి వదిలివేశాడు. కృష్ణాపత్రిక సంపాదకీయాల ప్రతిభను,భావ విజృంభణను నిరూపించేవి. రెండవ ప్రపంచ సంగ్రామ సమయంలో కృష్ణారావుగారు రచించిన సంపాదకీయాలు వ్యంగ్యములతో కూడినవి ఛలోక్తులవలె, చమత్కారములవలె, కనిపించని దొంగపోటులవలె గోచరించు వాక్యములతో నిండి యుండెడివి హాస్యము అంతర్వాహినిగా ప్రవహించెడిది. బయటికి అందెడువారు కాదు బ్రిటిష్‌వారిని వెనుక వేసుకొన్నట్లే యుండెడిది. అది సందర్భోచితముగా వారు సంతరించుకొన్న వ్యాససరళి.

ఆ కాలములో కాగితము కరువై పత్రిక బక్కచిక్కి యుండవలసిన పరి స్థితి ఏర్పడింది ఉన్న కొద్ది పుటలలోనే సంపాదకీయము-బరువైనసంపాదకీయము- దాగియుండెడిది. పాఠకులు దానికై వేచి వుండెడివారు. ఉలిపిరి కాగితములో చుట్టిన ఉక్కు ముద్దవలె సంపాదకీయము ఆ కొద్దిపుటల పత్రికకే ఎంతో ఉదాత్తత కల్పించెడిది.

ఆంధ్రులకు కృష్ణాపత్రిక ప్రతివారము అందు అమూల్యమైన కానుక. ఒక ప్రతిపై లక్ష కళ్ళు కొని చేతబట్టుకొని బజారువెంట పోవటము అసంభ వము. దాచుకొని ఇళ్ళకు పరుగులు తీసెడివారు. ఆనాడు కృష్ణాపత్రిక చేరని పల్లె లేదేమో. ఒకరు చదువగా వేయిమంది వినెడివారు.పత్రికకోసం ఎంత దూర మైనా పరుగులు తీసెడువారు. అవి సంపాదకీయములు కావు. అద్భుతసందేశము.

ఆదివ్యాసరచనమూ కాదు - కృష్ణారావుగారు గుండెలనుండి గ్రుమ్మరించిన వెలుగుదొంతర. ఒక వేదాంతి దేశనాయకుడుగా మారి కవిగా, కలం చేతబట్టి వెదజల్లిన వెన్నెలవిత్తనాలు. అందుకే చెళ్ళపిళ్ల కవి అన్నారు, "కృష్ణారావుగారు ఒకఋషి, కనిపించని కవి " అని. అవును. ఆయన కవిగాని కవి.

ఇంకొక్క మాట చెప్పి ఈ వ్యాసం ముగిస్తాను. ఆయన కలం చేతపట్టి నాటికే "పత్రికానిర్వహణ ధూర్వహుడు. నవీనాంధ్ర భావోద్వేగ నిర్మాత.గద్య రచనా పరిపోషకుడు," అన్నారు పురాణం సూరిశాస్త్రిగారు. సంపాదకత్వమ్ము వహించి పత్రికను సకలకళాశోభితముగా నవీనభావనోద్దీపనమ్ముగా నిజచారిత్ర గౌరవ పతిష్ఠమ్ముగా నిర్వహింప దొడగినారు." అని పేర్కొన్నారు.

ఈ నిర్వహణ నలుబది సంవత్సరముల పాటు జరిగినది. వారెంత పెరిగినారో, కలమెంత పెరిగినదో, పత్రికా గౌరవమెంత పెరిగినదో, తెలుగుజాతి గౌరవమెంత పెరిగినదో, చెప్పుటకు పెద్దగ్రంథము వ్రాయవలెను. గురుపాదుల ప్రతిభ నీ కొద్ది పుటలలో పేర్కొన చూచుట కడలిని కడవలో పట్టుటకు ప్రయత్నించుట వంటిది.

ఒక్క సందేహము నామనస్సునం దెప్పుడునూ మెదలుచుండును. "మరియొక కృష్ణారావు జన్మించునా? అతడిట్టి సంపాదకీయములు రచించునా? కృష్ణాపత్రిక వెలుగు తిరిగి తెలుగునేలపై ప్రసరించునా?" ఇదీ నా సందేహము ఇది నా కల మాత్రమే.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు ఈ మహనీయుని శతజయంత్యుత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని కృష్ణాపత్రికలోని సంపాదకీయాల్ని ప్రచురించుటకు పూనుకొనినందుకు నేనెంతో వారిని అభినందిస్తున్నాను. సంపాదకీయాల ఎన్నిక చేయడం, పరిచయ వాక్యాలు వ్రాయడం అనే మహద్భాగ్యాన్ని, కృష్ణారావు గారి అంతే వాసినైన నాకు అందించిన అకాడమి అధ్యక్షులు డా॥ బెజవాడ

గోపాలరెడ్డిగారికీ ఉపాధ్యక్షులు శ్రీ రామానుజరావుగారికీ, కార్యదర్శి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికీ నా హృదయపూర్వక అభివందనాలందిస్తున్నాను.

**డా॥ రావూరు వెంకట సత్యనారాయణరావు.**

# దేశభాషలు - మతభేదములు

భాషాప్రయుక్త రాష్ట్రమన్న "ఇండియను సోషల్ రిఫార్మరు" పత్రికకు ఏవగింపు. హిందూదేశము నందు వాడుకలో నున్న దేశభాషలు కేవలము హిందువులకు సంబంధించినవే కాని, క్రైస్తవులకును, మహమ్మదీయులకును వానితో నెట్టి సంబంధమును లేదనియు, క్రైస్తవులకు ఇంగ్లీషును, మహమ్మదీయులకు తురకమును, స్వభాషలనియు, గావున తెలుగు, అరవము, కన్నడము మొదలగు దేశభాషల ప్రకారము రాజధానుల నేర్పరచుట భేదోపాయమే కాని ఐకమత్య సంధాయకము కాదనియు "ఇండియను సోషల్ రిఫార్మరు" పత్రిక వాకొనుచున్నది. ఆంగ్లేయ భాష హిందూదేశమునకు సంజీవిని వంటిదని భ్రమించు వ్యామోహితులకు దేశభాషావాదము రుచించక పోవుటలో నాశ్చర్యము లేదు. కాని ఈ వ్యామోహ పరవశత్వముచే యథార్థము కూడ మఱుగగు చున్నది.

దేశీయ క్రైస్తవుల స్వభాష ఆంగ్లేయమా? ఇంతకంటె నన్నృత మొకటి లేదు. ఈ "రిఫార్మరు" గారొక్కమారు దేశీయ క్రైస్తవ ప్రార్థన మందిరములకు బోయి చూచిన యెడల, వీరిట్టి యపవాదమును జేసి యుండరు. బైబిలు గ్రంథము దేశభాషల లోనికి అనువదింపబడుటయే కాక, క్రైస్తవ సంబంధమైన సాహిత్యమెంతయో దేశభాషల యందు పెరుగుచున్నది. ఏకొలది దేశీయ క్రైస్తవులో వేష భాషల యందు బూర్తిగ దొరల ననుకరించుచుండ వచ్చును. అట్టి వారు ఒక్క క్రైస్తవులే గననేమి, తక్కిన మతస్థులలోను గలరు. కాని అట్టి వారతిస్వల్ప సంఖ్యాకులు; వారును క్రమముగ తగ్గిపోవుచున్నారు. మతము క్రైస్తవమైనంత మాత్రమున వేషభాషాదులలో గూడ యురపియనులు ననుకరించ నవసరము లేదనెడి పట్టుదల దేశీయ క్రైస్తవులలో నెక్కుడుగ్గ వ్యాపించు చున్నది. వారును తెలుగు, అరవము, కన్నడము మొదలగు భాషల ననుసరించి

ప్రత్యేకమైన '' మిషను" ల నెలకొల్పి, తదనుకూలముగ వేరు వేరు సభలను జరుపుకొనుచున్నారు ఆంధ్ర దేశమున బుట్టి పెరిగిన ఏక్రైస్తవుడు తాను ఆంధ్రుడు కానని నిరాకరించును? తన మాతృభాష తెలుగు కాదని చెప్ప సాహసించును? ఆంగ్లేయ భాషా జ్ఞానము ఎక్కువగుచున్న కారణముచేత, దేశభాషలు విలుప్తమగునని భ్రమపడుట కేవలము వెర్రి. దేశీయ క్రైస్తవ లింకను యురపియను మిషనరీలచే పాలింపబడుచుండుటచే, వారిలో నితరుల కంటె పాశ్చాత్య వ్యామోహ మెక్కువ యున్న మాట నిజమే కాని వారిలోను స్వదేశబోధ ప్రారంభమైనది. యురపియను మిషనరీల జోక్యము లేకయే తమ సంఘమును తాము పాలించుకొను కోరిక ఉదయించినది. కొన్ని ఆర్థిక రాజకీయ కారణములచే నీ కోరిక సత్వరముగ సఫలమగుట లేదు. సోదర దేశీయులతోపాటు తాము దేశోద్ధరణమునకు బూనుకొనవలె ననెడి ఉత్సాహము పెరిగిన కొలదియు, హిందూదేశ రాజ్యాంగమున తమ సంఘము ఉచితస్థానము నాక్రమింపవలయు ననెడి అభిమానము వర్ధిల్లిన గొలదియు, వారును స్వయం సహాయమును, స్వావలంబనమును, ఆశ్రయించి, దేశభక్తి యందు, అనగా, వేష భాషాదులందు గాఢానురాగముతో బ్రవర్తిల్లెదరనుట నిక్కము. భాషాప్రయుక్త రాష్ట్ర వాదము హిందువుల కెంత యంగీకారమో క్రైస్తవులకును అంత యంగీకారమని నిశ్చయముగ జెప్పగలము. బొంబాయి లోని పారశీలకు "గుజరాతి" స్వభాషయైనప్పుడు, దేశీయ క్రైస్తవులకు ఇంగ్లీషే స్వభాష యనుట కంటె అసంగత మొకటి లేదు.

మహమ్మదీయుల విషయములో ఈ "రిఫార్మరు" చేసిన యాక్షేపణ మాత్రము నిజమా ? మహమ్మదీయులకు దేశము మొత్తముమీద హిందూస్థానీ సార్వజనీన భాషగ నున్నమాట నిజమే. కాని ఆయా భాగములయందు నివసించు మహమ్మదీయులు ఆయా భాగములయొక్క దేశభాషలలో వ్యవహరించుకొనుచునే యున్నారు. వంగదేశమునందలి మహమ్మదీయులలో నేకొలది మౌళవీలకోతప్ప తక్కిన మహమ్మదీయ జనమునకు హిందూస్తానీ స్పర్శయే లేదు. వీరి స్త్రీలు, బాలురు, పురుషులు, ఇంట, బయట మాట్లాడుకొను భాష వంగభాషయని ఈ

రిఫార్మరునకు తెలియదు కాబోలు. వంగదేశములో మాటనుబట్టిగాని, వేషమును బట్టిగాని, మహమ్మదీయుని గుర్తించుట సాధ్యము కాదు. వంగభాషలో గ్రంథములను వ్రాసి వన్నెకెక్కిన మహమ్మదీయులెందరో గలరు. వంగదేశ మహమ్మదీయులు హిందువులతో సమానముగ బంకించంద్ర, రవీంద్రనాథుల కృతులను జదివి ఆనందింప గలుగుచున్నారు. ఉత్తర హిందూస్థానములో హిందూస్థానీయే మహమ్మదీయులతోబాటు హిందువులకును మాతృభాషగానున్న సంగతి లోకవిదితము. గుజరాతులోని మహమ్మదీయులు తురకములో కంటెను గుజరాతీ భాషలోనే ఎక్కువ సౌలభ్యముతో వ్యవహరించెదరు. వర్తకము చేయు ప్రతి మహమ్మదీయుడు బొంబాయి రాజధాని యందంతటను సకల వ్యవహారములను గుజరాతి భాషలోనే జరుపుకొనును. అంతియకాని, గుజరాతిభాష హిందూభాష యని వారు విడనాడుటలేదు. దక్షిణదేశము నందలి మహమ్మదీయులును, అరవములో వ్యవహరించుకొనెదరని "రిఫార్మరు" పత్రికకు దెలియనిది కాదు "మాప్లా" మహమ్మదీయులకు హిందూస్థానీలో నొక్కమాటయైనను రాదు. వారికి మళయాళమే మాతృభాష. హిందూదేశమును నలువైపుల జూచిన యెడల మహమ్మదీయులు వేషములయందు కాకపోయినను దేశభాషలయందైనను బూర్తిగ బాల్గొనుచున్నారని అంగీకరింపక తప్పదు. హిందువులు సంస్కృతము నెట్లు పవిత్రముగ నెంచెదరో, అటులే మహమ్మదీయులు పరిషియను అరబ్బీ భాషలను పవిత్రముగ నాదరించవచ్చును. అంతమాత్రముచేత దేశభాషలు హిందువులవే కాని, మహమ్మదీయులవి కావనుట హాస్యాస్పదము.

టర్కీలోను క్రైస్తవులు కలరు. వారికెల్లరకును అచ్చటి మహమ్మదీయులకు వలెనే అరబ్బీ మాతృభాషగా నున్నది. అంతియకాని అరబ్బీ మహమ్మదీయ భాషయని, అచ్చటి క్రైస్తవులు మన "రిఫార్మరు" వలె ప్రతిఘటించుటలేదు. గ్రీసు దేశములో మహమ్మదీయులు కలరు. కాని అచ్చటి మహమ్మదీయులు, గ్రీకును క్రైస్తవ భాషయని నిరసించక, గ్రీకునే తమ మాతృభాషగ నెంచుకొనుచున్నారు. సిరియాలోని క్రైస్తవు లెల్లరకును అరబ్బీయే మాతృభాష.

రష్యాలో "కాజక్కు" అను మహమ్మదీయ జాతివారు కలరు. వారికి కౌంటు టాల్సుటాయిగారి రష్యను భాషయే మాతృభాష. ఏ భూభాగము నందున్నవారు, వారే మతస్థులైనను, ఏ జాతివారైనను ఆ భూభాగమునందు చిరకాలానుగతముగ వ్యవహరింపబడుచున్న భాషను మాతృభాషనుగ జేసికొనుట సహజము, ధర్మము, సత్యము. భూభాగమునకును, అచ్చట వ్యవహరింపబడు భాషకును ఒక సూక్ష్మ సంబంధముండి తీరును.

భాష కేవలము మానవకల్పితము గాదు. అచ్చటి వాయువుల సంచలనము, అచ్చటి జలముల మాధుర్యము, అచ్చటి కేదారముల రామణీయకము, అచ్చటి ఆకసము యొక్క దీప్తి, అచ్చటి శుకశారికల ధ్వన్యనుకరణము అచ్చటి భాషయందు ప్రతిబింబించి యుండును. అప్పుడే యది దేశభాష యగును. దేశభాష యనగా, సెన్ససు రిపోర్టుల లెక్కకాదు. ఆ దేశము యొక్క జనులెట్లు ఆ దేశగర్భమునుండి పుట్టి పెరిగెదరో, అటులనే ఆ దేశభాష కూడ ఆ దేశగర్భమునుండి పుట్టి పెరుగు భాషయై యుండును. శీతోష్ణస్థితిగతులను బట్టి జాతుల వర్ణము గలుగునటులే, ప్రకృతియొక్క వైచిత్ర్యమును బట్టి దేశభాషలును ప్రత్యేకరూపములను దాల్చును. తెలుగుకు త్రిలింగ దేశము జన్మస్థానము త్రైలింగుల మధుర వచనములకు ఈ త్రిలింగభూమి యెంతయు రాగోద్దీపనము నొందుచుండును. ఇచ్చటి చెట్లు, చేమలు, పొలములు. కాలవలు సర్వము—తెలుగు భాషకు శృతిగలిపి, తమ కంఠస్వరమును గూడ తమ సోదర మానవుల తెలుగు బాసతో మేళవింపజేయును. ఆంధ్ర మండలమున పరభాష మాట్లాడుడు. అప్పుడీ ప్రకృతి యంతయు మూకీభావము వహించి స్తంభించును. అప్పుడు పరభాష శృతిలేని సంగీతమువలె జీవకళలేక, రసహీనమైన ధ్వని విశేష మగును. పరభాషావలంబనము కేవలము ప్రకృతి విరుద్ధమగుట నిర్వివాదాంశము. ఏ మతస్థుడయినను, ఏ జాతివాడయినను, ఆంధ్రమండలమును తన మాతృభూమిగ నెంచుకొనగలిగిన యెడల, ఆ మాతృగర్భమునుండి బయల్వెడలిన తెలుగు భాషను స్వభాషగ నెంచుకొనవలెను; కానియెడల అద్యుది మాతృతిరస్కారము, సోదర ద్రోహము. ఈ వాయువులను బీల్చుచున్నంత కాలము,

అందుండి వెలువడు భాషామృతమును గూడ గ్రోలుటయే జన్మ సాఫల్యము. మానవుడు ప్రకృతికి దూరమై కృత్రిమ మార్గములను బట్టుటచేతనే, అస్వాభావికమైన, కల్పితములైన, భేదములయందును, వైషమ్యముల యందును, జిక్కుకొని ఆత్మోన్నతిని గోల్పోవుచున్నాడు. "రిఫార్మరు" పత్రిక భాషల తత్వమును గాని, ప్రకృతి మానవుల సంబంధమునుగాని, జాతీయ క్రమోన్నతిని గాని సరిగ బుద్ధిస్థము చేసికొని యుండిన యెడల, ఇట్టి హాస్యాస్పదమయిన ప్రసంగములను జేసియుండదు హిందూదేశమున ఆంగ్లేయ భాషకు శాశ్వతముగ పట్టభద్రతను గట్టవలెననెడి వెర్రి తలంపుతో, దేశభాషలకును మతములకును ముడిపెట్ట జూచుచున్నది. హిందూధర్మ మీ దేశమున సనాతన ధర్మమై యుండుటచే దేశభాషలలో హిందూ ధర్మమునకు సంబంధించిన సాహిత్యమెక్కువగ నుండుట సహజము మహమ్మదీయ క్రైస్తవమతము లిటీవల వచ్చి యుండుటచే వాని సాహిత్యము చాల తక్కువగ నున్న మాట నిజము. ఈ మతము లిటీవల వచ్చినవే కాని, ఈ మతావలంబకులు కూడ నిప్పుడు క్రొత్తగ వచ్చినవారు కారు. వీరి ప్రపితామహులును హిందువులే వీరిప్పుడు క్రొత్త మతమును స్వీకరించినను, వీరి యధరములు, దంతములు, తాలువులు, జిహ్వ — వీరి వాగ్యంత్రమంతయు తెలుగు భాషకే యలవడియున్నది. అట్టివారి నోట పరభాష శుద్ధముగ పల్కబడనేరదు. భాష ఆత్మకు సూక్ష్మశరీరము వంటిది. ఏదేశము యొక్క ఆత్మయైనను ఆ దేశభాష మూలముననే వ్యక్తము కావలెనుగాని అన్యభాషామూలమున సరిగ నభివ్యక్తము కాజాలదు. మతము లెన్ని మారిన నేమి ? ఏకభాషా వదులకు బత్యేక వ్యక్తిత్వము కలదు ప్రపంచములో నొక క్రైస్తవ మతమే కలదని స్థూలబుద్ధికి దోచవచ్చును. కాని, రష్యా, జర్మను, ఫ్రెంచి, ఇంగ్లీషు సాహిత్యములను పరిశీలించిన యెడల ఒక్క క్రైస్తవ మతమే భిన్న జాతులలో నెట్టి వైచిత్ర్యమును (Diversity) బొందగలదో తేటతెల్లమగును. అటులనే, హిందూదేశము నందును, ఆంధ్ర, వంగ, కళింగ, కర్ణాటకాది మండలముల యందలి భిన్నమతావలంబకులు తత్వవిచార సాధన సంపత్తిని తమ దేశభాషల మూలమున వ్యక్తపఱచుటకు బ్రారంభించిన యెతల, హిందూదేశము

నందలి క్రైస్తవ, మహమ్మదీయ సంప్రదాయములు కూడ గ్రొత్త రూపరేఖా విలాసములతో ప్రకాశించి, మతవైచిత్ర్యముతోబాటు మత సామంజస్యము గూడ నేర్పడుటకు సాధనభూత మగును. క్రైస్తవులలోనే, రష్యను క్రైస్తవులు, జర్మను క్రైస్తవులు, ఫ్రెంచి క్రైస్తవులను సూక్ష్మ భేదము లేర్పడి, క్రైస్తవ ప్రపంచము నెట్లు ఎక్కువ ఐశ్వర్యసమృద్ధముగ జేయుచున్నవో, అటులనే భారతవర్షము నందును, ఆంధ్ర క్రైస్తవులు, ఆంధ్ర మహమ్మదీయులు, ఆంధ్ర హిందువులు అను ప్రత్యేక కళలు, క్రొత్త తళుకులు మేలిసొబగులు బయలుదేరి సమగ్ర భారత జాతీయ వృక్షమును నానాశాఖా, పత్ర, పల్లవ, పుష్ప, ఫల శోభితముగ నొనర్చి, విశ్వము నంతను మోహింపజేయును.

దేశభాషలను వివిధ రాష్ట్రములలో రాజ్యభాషలనుగ జేయుటవలన, హిందూదేశములోని క్రైస్తవులయొక్కగాని, మహమ్మదీయులయొక్కగాని ఐకమత్యము చెడిపోవు ననుట వట్టి కల్ల. ఆంధ్ర, వంగ, కళింగ, మహారాష్ట్రాది భాషల మూలమున, అఖిల భారత హిందూ ధర్మమునకు హానిగలుగ నప్పుడు, ఈ దేశభాషల మూలమున అఖిల భారత క్రైస్తవ మహమ్మదీయ ధర్మములకు మాత్రము హాని యేల కలుగవలె ? దేశభాషల మూలముననే వీనికి హాని కలుగు నెడల, ఇంగ్లీషు మూలమున వానికి సమగ్ర దృష్టి చేకూరునా? ఆంధ్ర మండలము నందలి మహమ్మదీయులు తెలుగు భాషను హిందువుల భాష యని త్రోసివైచి, ఆంగ్లేయ భాషను దమనెత్తిపై బెట్టుకొందురా? ఆంగ్లభాషకు బదులు హిందూస్థాని ఎప్పుడూ హిందూదేశమునకు సార్వజనీన భాషగ నంగీకరింపబడుచున్నదో, అప్పుడు మహమ్మదీయులు తద్భాషామూలమున తమ యఖిల భారత దృష్టిని సంరక్షించుకొనుటకు ఎక్కువ యవకాశము గలుగును. అంతియ కాని ఇంగ్లీషు భాష మహమ్మదీయుల కెట్లు ఐకమత్య సంధాయకము కాగలదో యూహింప లేకున్నాము. భారతవర్షము ఇంగ్లీషు భాషలో శిక్షణము నొంది, తన్మూలమున పాశ్చాత్య విజ్ఞానమును గ్రోలుటకు సంశయింపదు. కాని ఆ కారణముచే విద్యాలయముల యందును శాసనసభా మందిరముల యందును ఇంగ్లీషునకు పట్టభద్రత

నొసంగుట జాతీయ గౌరవమునకును, దేశాభివృద్ధికిని, భంగకరమని ఎంత త్వరగ తెలుసుకొన గల్గితిమేని, అంత త్వరగ మనకు విముక్తి చేకూరును.

కృష్ణా పత్రిక
జూన్ 19 వ తేది, 1920 సం॥

# లోకమాన్యుడు

సూర్యమండలమును వట్టి కండ్లతో జూడజాలము. ఒక మసియద్దము అడ్డము పెట్టుకొన వలెను. అప్పుడే సూర్య భగవానుని జ్వాలాకృతి ఒకించుక గోచరమగును. అటులే మహనీయుల దివ్య మహిమలను సన్నిధాన వర్తులును, సమకాలికులును, ప్రత్యక్షముగ జూడజాలరు. ఆ కాంతిపుంజములు వారి కనుల మిరుమిట్లు గొలుపును. సామీప్యము జీవితము యొక్క అంతర్యమును దాచిపెట్టును. స్వల్ప విషయములు బహుళ రూపము దాల్చును. ప్రధానాంశ ములు మరుగునకు బోవును. భిన్నావస్థల సామంజస్యము వ్యక్తము కాదు. ఘటనాఘటనలకు సందర్భము కనుపడదు. సమకాలికులకు మహాత్ముల నిజతేజో బింబము దృగ్గోచరము కాదనుట నిస్సంశయము. మృత్యుచ్ఛాయలు దిగవలెను. కొంత కాలము గడువవలెను. దురభిమానములు, చిత్తవికారములు, దుర హంకారములు మొదలగునవి ప్రేక్షకుల మనములనుండి తొలగి పోవలెను. మహనీయుని సమాధి సమ్ముఖమున నుపవిష్టులమై, ప్రశాంత చిత్తములతో ధ్యానము చేయవలెను. అప్పుడు జీవితము యొక్క యధార్థ స్వరూపమొకించుక గోచరము కావచ్చును.

కాని మన మనస్సులు ప్రస్తుతము దుఃఖాగ్నిచే పరితప్తమగుచున్నవి. అశ్రుజలములు కనుల నడ్డగించుచు దిక్కులు శూన్యములై గన్పట్టుచున్నవి. నిశ్చలముగా ధ్యానించగల చిత్తస్వాస్థ్య మెక్కడ? ఇప్పుడెట్లు ఆ మహనీయుని రూపరేఖలను దిలకించగలము? భౌతికకాయము పంచత్వము నొందినను' అదియే తిరిగి కంటబడుచున్నది. క్షణభంగురమైన భౌతిక రూపము విలీనమైన దని ఎందు కింత చింత? నిజమే. హృదయమర్మ భేదకములగు ఆ ''సింహావ లోకనములు'' ఇక కనుపడవు. సరస్వతీ మందిరమునకు సోపానములా యన్నట్లు తేజరిల్లుచుండెడి విశాల ఫాలతల మధ్యలి ఆ రేఖల నిక చూడజాలము,

ఎట్టి తీక్ష్ణబుద్ధినైనను స్వమార్గమున కాకర్షింపగల ఆ వాక్యముల పుంఖాను పుంఖముల నిక వినపోము. మహారాష్ట్ర చరిత్ర దేవతను ప్రత్యక్షము చేయు చుండిన ఆ రూపమిక ఎక్కడిది? ఈ భౌతిక దేహమును గౌరవముతో తిలకించితిమి. భక్తితో బూజించితిమి. ప్రేమతో స్పర్శించితిమి. ఇంతకాలము గౌరవమునకు భక్తికి, ప్రేమకు ఆస్పదమైన భౌతిక రూపము నుండి దృష్టియెట్లు మరల్ప గలము? ఆ దేహము చితానలమున భస్మీభూతమగు గాక! ఆ గంభీర రూపమును, ఆ దివ్య విగ్రహమును, స్మృతి పథంబున నిలిపి ధ్యానించెదము! ఏ మృత్యువు ఆ రూపమును నా హృదయ ఫలకము నుంచి తుడిచివేయ గలదు? ఏ చితాగ్ని నా ధ్యాన విగ్రహమును భస్మము చేయగలదు? మాసములు గడువ నిమ్ము! సంవత్సరములు దొర్లనిమ్ము! కాలము గతించిన కొలదియు నా ధ్యేయము, నా మానస మూర్తి, స్వర్గపరిమళముతో, ధవళకాంతులతో వెలుగుచుండును.

నా హృదయ మందిరమున బ్రతిష్ఠించుకొనిన విగ్రహము కేవలము పాంచభౌతికము కాదు అందింకను కొంచెము భౌతికస్పర్శ కలదను మాట నిజము. కాని చితానలమున ఆ స్పర్శ హరించి పోవుచున్నది. భౌతిక రూపము విలీనమైన కొలది, అందుండి అమర రూపము బయల్వెడలు చున్నది. కాని ఆ భౌతికోపాధిని నేను నిరసించ లేను. నేను దానిని ప్రేమించి యుంటిననియా? కాదు. ఆ దేహము నా తల్లియొక్క శరీరము నుండియే కదా ఉత్పన్నమైనది? నా దేశజనని శరీరము భౌతికమని పరిహసించెదనా? ఈ మృత్తిక, ఈ జలము, ఈ వాయువు, ఈ యగ్ని, ఈ యాకాశము నా తల్లి యొక్క అంగములు. ఆ మహనీయుని శరీరము తిరిగి నా తల్లియంకముననే విలీనమైనది. ఏది జన్మ హేతువో, అదియే చరమ పదము. లోకమాన్యుని భౌతిక విగ్రహమున దేశమాతను జూడజాలని కనులు కనులు కావు. అందలి ప్రతి బిందువు, ప్రత్యణువు, ప్రతి శ్వాస నిశ్వాసయు తల్లియొక్క గాంభీర్యమును, తల్లియొక్క ప్రేమను, తల్లి యొక్క పవిత్రతను చాటినవి మాతృ రూపమును బ్రత్యక్షము చేయగల దివ్య శరీరుల చరితము లెంత ధన్యములు!

మృత్యువు ప్రాణముయొక్క వేడిమిని చల్లార్ప వచ్చును. ఎంతవఱకు? ప్రాణము పృథ్వి నాశ్రయించు నంతవఱకు. కాని జన్మబంధనము నుండి తప్పించుకొనగల జీవన్ముక్తుల వేడిమి యెప్పటికిని క్షీణించదు. సమాధి లోపల నుండి కూడ ఆ వేడి తీక్ష్ణ తరముగ బహిర్గతమగు చుండును. జీవముయొక్క నిజ స్వరూపము వేడిమి. వేడిమి వలననే జడత్వము నశించును వేడిమి వలననే ప్రాణము వికసించును వేడిమి వలననే శిలారూపములగు విఘ్నము లన్నియు గరగి పోవును. లోకమాన్యుని స్పర్శయందు ఆ వేడిమిని బొందని దేశీయు డెవడు? వాని చూపులందు, వాని హస్తచలనము నందు, వాని వాక్కునందు, వాని చింతనలయందు, ఆ వేడిమి వెల్లిగక్కు చుండెడిది. "చిత్పవనుది" జీవితము ఉష్ణరూపమని చెప్పుటలో నాశ్చర్యమేమి? నిరంతర కార్యదీక్ష, అకుంఠిత స్వాతంత్ర్య నిరతి, విద్యుత్ప్రతిభాన్విత మగు బుద్ధిపాటవము, కూలంకషమయిన పాండిత్య గరిమ—ఇవన్నియు ఉష్ణ విశేషములు. ప్రతిబంధకము లెదురొ్కనిన కొలదియు, ప్రతివాదములు సంఘటించిన కొలదియు, కార్యభారము హెచ్చిన కొలది, ఆ వేడిమి బహుళరూపము దాల్చు చుండెను. ఆగ్నేయాస్త్రముల వేడిమి, రణ వీరుల వేడిమి, క్రోధాగ్ని యొక్క వేడిమి తాత్కాలికము. కాని స్వాతంత్ర్యోద్దీపిత మయిన ఉష్ణము ఎప్పటికిని చల్లారునది కాదు. శత్రువులను దునుమాడిన కొలదియు నది తీక్ష్ణమగును. ఉన్నతపదవుల నధిరోహించిన కొలదియు అందుండి సహస్రముల కొలది విస్ఫులింగములు దూరదూరముల వఱకు నెగురు చుండును. స్వాతంత్ర్య నిరతియొక్క ఉష్ణవాహిని యందొక్క మా రోలలాడిన ఎవరు సాహసోపేతులు కారు? లోకమాన్యుని కులమెట్టిదని ప్రశ్నింప నక్కర లేదు. ఒక్కమాటలో జెప్పెదను. అగ్నికులము లోకమాన్యుని కులము వాని యుపాసన రుద్రోపాసన.

పరాధీనులైన భారతీయులలో వేంద్రమెక్కడ? పరాధీనత యొక్క ప్రతిఫలము శీతలము. భారతీయుల బుద్ధి ఘనీభవించి పోయినది. హృదయము చల్లబడినది. దృష్టి మందగించినది. ప్రాచీన చరిత్ర వైభవము కూడ స్మృతి నుండి జారిపోయినది. తమస్సునందుండి సత్వమనుభ్రమయందు చిక్కుకొనిరి

క్రియాశూన్యతనే నివృత్తి యని తలంచుచుండిరి. మరణము నందలి చైతన్య విహీనతనే శాంతి యనుకొనిరి. ఇట్టి యలసులు వేడిమినెట్లు భరింపగలరు? చింతనలు, ఊహలు, ఆదర్శములు, వాక్కులు, ప్రయత్నములు పృథ్విపై ప్రాకుచుండవలసినదే కాని, పైకిపోవుటకు సాహసింపరు. సర్వము విధికి లోబడి యున్నది, మనమేమి చేయగలము? కష్టములు వచ్చిన భరించెదము. గౌరవ భంగము కలిగిన సహించెదము. ప్రభువుల నాశ్రయించి బ్రతికెదము. విద్య లంతరించినను, ఐశ్వర్యము నష్టమైనను, మతములు విలుప్తమైనను, నెమ్మదిగ కాలము గడపెదము. ఆసేతుహిమాచల పర్యంతము శాంతి రాజ్యము సేయు చున్నది కలవరము వలదు సంఘర్షణ గిట్టదు. ప్రతిరోధము నిషేధము. సంతృప్తి, విస్మృతి, ఆశ్రయము, ఉపేక్ష, మానవు నలంకరింపదగిన గుణగణ ములు. కట్టా! మృత్యుంజయులను. కర్మసిద్ధులను, శూరాగ్రేసరులను గనిన భారతభూమి యెంత అధఃపతిత మైనది! స్వధర్మ పరధర్మ విచక్షణము లేదు. వ్యామోహ వల్లగు లల్లుకొనినవి. భయభ్రాంతు లావరించినవి సమస్త భూమండలమునకు గురుపీఠము నధిష్ఠించిన భారతవర్షమున కిక మోక్షము లేదని విధి లిఖించెనా? ఇంకను నా మాతృభూమి పతనము నుండి పతనమునకు తమస్సు నుండి తమస్సునకు బడుచుండవలసినదేనా? లేదా ఇక ఆశ? ఛీ! నిరాశయందు దగుల్కొని మానవాత్మను అగౌరవపరుపకుము. భారతవర్షము జరామృత్యువులను జయించిన దేశము! అట్టి కర్మభూమి కల కాలము దాస్యకూపమున బడియుండజాలదు. ఆర్య విజ్ఞానమున నింకను ప్రతిభ గలదు. ఆర్యుని శీలమున నింకను ఆర్జవము గలదు. ఆర్యుని రక్తమునందింకను వేడిమి చల్లారలేదు. "ఆత్మవశం సుఖం పరవశం దుఃఖమ్" "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అదుగో! పాంచజన్యము మ్రోగినది బాల గంగాధరుడు నీలకంఠునివలె మాతృదేశము యొక్క దాస్యమును తన గళమున నుంచుకొని నిర్వీర్యమైన దేశమును వీరభూమిగ జేయ సమకట్టెను.

బాలగంగాధరుడు పండితుడు. కాని, వాని పాండిత్యము ప్రాత గ్రంథ

పేటికలను మోయు నిర్జీవ వాహకత్వము వంటిది కాదు. దేశమునందలి పాశ్చాత్య వ్యామోహమును బటాపంచలు గావించి, ఆర్యవిజ్ఞాన ప్రతిభను నవ్యజగత్తు మధ్యను ప్రతిఫలింప జేయగలిగిన శేముషీ దౌరంధర్యము లోకమాన్యుని లోకో ద్ధారకునిగ నొనర్పగల్గెను. లోకమాన్యుడు లండనులో నుండగా, అచ్చటి పాశ్చాత్య పండితులు కొందఱు వీరి దర్శనార్థమై వచ్చిరి "రాజ్యాంగము నా స్వరూపము కాదు. వేదవేదాంగాది దర్శనముల అధ్యయనమే నా పరమావధి. కాని, భారతవర్షము ప్రస్తుతము అస్వాభావికావస్థ యందుండుటచే, నేను రాజ కీయ క్షేత్రమున బనిసేయుట ఆపద్ధర్మముగా నెంచి కార్యాసక్తుడనై యుంటి'' నని ఆ పండిత పరిషత్తులో లోకమాన్యుడు తన శాస్త్రాభిమానమును వెలి బుచ్చెను. భారతవర్షము ప్రకృత దాస్యకూపమున బడియుండక, స్వాధీనతా రసము నుపభోగించుచుండిన యెడల, గంగాధరుడు భాస్కరాచార్యునివలె ఏ నవ్య సూర్యసిద్ధాంతమునో లేక సాయనాచార్యునివలె, ఏ రహస్య వేదదీపికనో వ్రాసి ఆచార్య పదవి నధిష్ఠించెడి వాడు. కాని భారతవర్షము అజ్ఞాతవాసమున నున్నంత కాలము, స్వస్వరూప జ్ఞానజ్యోతి ప్రకాశించుటకు వీలు లేదు. బాల భారతము యొక్క కోమల చిత్తము పాశ్చాత్య గురువుల వశమైయున్నది ఆత్మవిశ్వాసము నశించినది. ఆత్మగరిమ శూన్యమైనది. సంకల్పశక్తి కుంటువడినది దీని కంతకును రాజ్యాంగ దాస్యమే కారణము. పరాధీనత యందున్న జాతులకు ప్రపంచము నందెచ్చటను గౌరవము లేదు; నిలువ నీడయు లేదు. తనయింటిని తాను జూచుకొనలేని వానికి గౌరవ మెక్కడనుండి వచ్చును? దేశీయులలో తిరిగి ఆత్మవిశ్వాసము, ఆత్మగౌరవము, క్రియాకౌశలము సిద్ధించవలెననిన, ముందుగ నీ రాజకీయ పరాధీనత తొలగవలెను. అందుకై లోకమాన్యుడు తన సర్వశక్తియుక్తుల నీముఖమున జెప్పెను. ఆర్యసభ్యత యొక్క ప్రాచీనతను జాటుటకై ఓరియను గ్రంథమును వ్రాసెను. జనులను నిర్వీర్యులజేయు శుష్క వైరాగ్యము నుండి మరలించి "శాస్త్రాదపి శరాదపి" యను ఆర్యోక్తిని సార్థకంబుగ భారతయోధుల జగద్విఖ్యాతంబైన నిర్వక్ర పరాక్రమమును

ప్రజ్వలింప జేయుటకై శ్రీకృష్ణుని పగిది గీతారహస్యము నుపదేశించెను. ఇంకను ఎంతకాలము ఉద్యోగపర్వమునం దుండుట.

రాజ్యాంగము లోకమాన్యుని దృష్టిలో సాధనమే కాని, సాధ్యము కాదు. కావుననే రాజ్యాంగమునందు సహితము లోకమాన్యుడు ధర్మవీరుని త్యాగ బలమును, విశ్వ భావమును, అకుంఠిత కార్యదీక్షను ప్రదర్శింప గల్గెను. దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించనంత కాలము తాను పునహాలో స్వగృహము నందున్నను, లేక మాండలేలో కారాగారము నందున్నను, ఒక్కటిగనే భావించెను, రాజ్యాంగమునకు కొన్ని వరములు, కొన్ని పదవులు, కొన్ని సంస్కరణములు, కొన్ని రాజకీయోపాయములు, మొదలగు తుచ్ఛ, ప్రయత్నములతో వారికి పని లేదు. అధికారవర్గమువారి యనుగ్రహ ప్రాపకములచే గొన్ని సదుపాయముల నరయుట యన వారి కేవగింపు. దేశీయులలో నేమూలమున ఆత్మగౌరవము, ఆత్మ విశ్వాసము, విశాలదృష్టి కార్యదీక్ష, త్యాగశక్తి, వ్యక్తమగునో, ఆ సాధన సంపత్తిని సమకూర్చుటయే లోకమాన్యుడు కర్తవ్యముగా నెంచ గల్గెను. అట్టి మహనీయునకు ఒక ఆంధ్ర కవి కీర్తించినటుల "చెరశాలలు వర చంద్రశాలలు" అగుటలో నాశ్చర్యమేమి? ఏ యొక్క సందర్భముననో, మనము భావోన్మాదులము కావచ్చును. ఏ యాకస్మిక ప్రేరణముననో అపూర్వమైన త్యాగమును జూపవచ్చును. ఏ యుత్సాహవశము ననో ప్రాణమును సహితము అర్పించిన ధీరయువకులు కలగు కాని ఇందెక్కువ దీక్ష కాని, నియతి కాని లేదు. నలుబది సంవత్సరములు ఏక దీక్షతో, ఏక సంకల్పముతో, ఏకభావముతో, యావజ్జీవితమును ఎట్టి తొట్రుపాటును లేక, ఎట్టి బెదిరింపులకును జంకక, మోహదృగ్వల్లులకు లోబడక, వృద్ధాప్యము వచ్చుచున్నను, నూతన అవస్థాంతరములు పైన బడుచున్నను, ఒక్కశృతికిమేళవించిన రాగ ప్రస్తారము వలె, జీవన విధానమును నడుపజూచుట యన నేమో మనము సామాన్యముగ గ్రహింపజాలము. నలుబది సంవత్సరములు ఒకటే వ్రతము, ఒకటే దీక్ష ఒకటే సంకల్పము. కలసరములు వచ్చుచున్నవి; పోవుచున్నవి. ఉద్యమములు పుట్టుచున్నవి; గిట్టుచున్నవి సంస్కర్తలు తారచువ్వల వలె లేచి క్రింద

బడుచున్నారు కాని ఇన్నిటి మధ్యను, తాను మాత్రము హిమవత్పర్వత శిఖరము వలె నిలువబడి, స్వాతంత్ర్య మంత్రమును జపించుచుండిన లోకమాన్యుని తపో మహిమ వర్ణనాతీతము.

లోకమాన్యుడు వట్టి రాజకీయ సంస్కర్త కాడు. కేవల రాజకీయోద్యమము నందు నిర్మాణశక్తి యెక్కడ కలదు ? లోకమాన్యుడు "జాతీయ నిర్మాత"; నిక్కము. నేడెవని నామము ఆసేతుహిమాచల పర్యంతము సంస్మరించుచున్నది ; తిలకుని పవిత్రనామము కాదా ? ఎందుచేత ! తిలకుని జీవితము భారతవర్షము నంతను ఇముడ్చుకొనగల్గెను. ఇందుకై లోకమాన్యుడు తన మహారాష్ట్రత్వమును వదలుకొనలేదు. హిందూత్వమును విడనాడలేదు. లోకమాన్యుడు మహారాష్ట్రులలోకెల్ల మహారాష్ట్రుడు. హిందువులలోకెల్ల హిందువు. మహారాష్ట్ర సాహిత్యము వానియందు మూర్తిభవించెను మహారాష్ట్ర చరిత్ర వానియందు సజీవమయ్యెను. మహారాష్ట్ర వేషము వానియందు క్రొత్తపెన్నెసు దెచ్చెను. హిందూధర్మ సాధన, చింతనము, వానియందు ప్రస్ఫుటమయ్యెను. అయినను స్థానిక సంప్రదాయములు వానిని బాధించివైచుటకు బదులు, ఉన్నత ధామములకు బోవుటకు సోపానము లయ్యెను. మహారాష్ట్ర చరిత్ర మూలమున భారతవర్షీయేతిహాస గర్భమున జేరగల్గెను. తుకారాముని అభంగుల ద్వారమున ఆర్యుల బ్రహ్మజ్ఞాన స్వరూపమును దెలుసుకొనగల్గెను. మహారాష్ట్రీయ నిర్మాణమున భారత జాతీయ నిర్మాణ రహస్యము వ్యక్తమయ్యెను. మహారాష్ట్రము లోకమాన్యుని కేంద్రము, భారతవర్షము దాని పరిధి. విశ్వమునకు భారతవర్షము కేంద్రము. భారత జాతీయోద్యమమును, విశ్వమానవోద్యమముయొక్క భాగముగ గమనించుటచేతనే ఇంగ్లాండులోని లేబరు పార్టీతో మైత్రిచేసికొనెను. ఇందుచేతనే లోకమాన్యుడు నేడు భారతీయులెల్లరి లక్ష్యమునందును ధ్రువతారా తుల్యముగ వెలుంగుచున్నాడు. రాష్ట్రవ్యత్యాసములు, మతభేదములు, రాజకీయ కక్షలు—మొదలగు భిన్నసంప్రదాయముల మధ్యనుండియు, వానిచే బంధింపబడక ఎల్లరి భక్త్యుత్సాహముల నాకర్షింపగల్గెను. తిలకుగారి దహన

సంహ్కారమునకు ఒక పార్సీకులస్థుడు 80 మణుగుల గంధపుచెక్కల నొసగుటయు, గాంధి, సౌకతాలీ, కిచ్లూగారు వారి కళేబరమును మోయుటయు భారతభూమి యంతయు వారి నిర్యాణమునకు చింతా సముద్రమున మును గుటయు. జాతీయ భావమునకు ప్రబల దృష్టాంతము. లోకమాన్యుని దృష్టిలో భారతజాతి యెట్టి మతభేదములు, భాషావ్యత్యాసములు, ఆచార వ్యత్యాసములు లేని ఒక కలా విహీనమైన, నిరాకారమైన, విశుద్ధ మానవత్వము కాదు. నానా రూప శోభితమై, వివిధాలంకార భూషితమై, విచిత్ర కళాసమన్వితమైన మానవ కోటి నంతను, ప్రతిబింబింప జేయగల సృష్టి వైచిత్ర్యము. "ఉదార చరితా నాంతు వసుధైవ కుటుంబకం" అను ఆర్యసూక్తి లోకమాన్యుని యందు సార్థకమయినది.

కృష్ణా పత్రిక
ఆగష్టు 7 వ తేది, 1920 సం॥

# శ్రీనివాస శాస్త్రి

శ్రీనివాస శాస్త్రిగారు వైస్రాయిగారి యింట విందుగుడుచుచు నొసగిన ఉపన్యాసము బహు రసవంతముగ నున్నది. హిందూదేశములోని రాజ్యాంగము ప్రజాప్రభుత్వముగ మారిపోయినను, ఆసేతుహిమాచల పర్యంతము ప్రజలు ప్రభుత్వము యెడల పూర్తిగ విశ్వాసమును గోలుపోవుట బహుఘోరముగ నున్నదని శాస్త్రిగారు తమ విషాదమును వెలిబుచ్చిరి. ఇండియాప్రభుత్వము ప్రజాప్రభుత్వమైనదని చెప్పుటకు శాస్త్రిగారికి జాల యాధారములు కలవు. వైస్రాయిగారు కూడ నీ విషయమై విశేషముగ నుగ్గడించిరి. హిందూదేశమున కడచిన అయిదు సంవత్సరములలోను బొందిన రాజకీయాభివృద్ధి మన గ్రహణ శక్తికి మించి యున్నదని నుడివిరి కాదా? ఒక్క శాస్త్రిగారి జీవితమే యిందుకు దార్కాణము. ఈ తార్కాణము నందు శాస్త్రిగారికి గూడ నమ్మకము గలదు. తన వంటి ప్రజాప్రతినిధిని నానా రాజ్య సభకు బంపిన పిమ్మట, ఇండియాలో నింకను ప్రజాప్రభుత్వ మేర్పడ లేదని సంశయించుటేలకో యని శాస్త్రిగారే విచారపడుచున్నారు. శాస్త్రిగారెన్ని సభలకు బోయి యుండిరో చూడుడు! బ్రిటిషు ఇంపీరియల్ కాన్ఫరెన్సు, లీగు ఆఫ్ నేషన్సు మొదలగు మహాసభారాజములకు బోయి, ప్రపంచ విఖ్యాతి గాంచిన రాజకీయ దురంధరుల పార్శ్వమున సుఖాసీనులగుటకు అధికారము కలిగిన పిమ్మట, హిందూదేశమునకు ప్రపంచములో నెట్టి గౌరవ స్థానము వచ్చినదియు హిందూదేశ ప్రజలింకను గ్రహింపజాలక పోవుట విచారకరము! ఇంతియేనా? శాస్త్రిగారు ప్రీవీ కౌన్సిలరైనారు. చక్రవర్తులకు, సామ్రాజ్యధురీణులకు అపూర్వముగ నొసగబడు లండను నగర రాజము యొక్క స్వాతంత్ర్యము శాస్త్రి గారికి బ్రసాదింపబడిన పిమ్మట, హిందూదేశ ప్రజలకు బ్రిటిషు ప్రభుత్వము యెడల నింకను అవిశ్వాసమా? ఒక శాస్త్రి గారిపై కుంభవర్షము వలె గురిసిన గౌరవ పరంపరలను గాంచియైనను, హిందూ

దేశ మెట్టి రాజకీ యారోహణము గావించుచున్నదియు దెలుసుకొన కూడదా? ఆస్ట్రేలియా, కనడా, న్యూజిలెండు మొదలగు దేశాంతరముల యందు భారత ప్రభావమును ప్రత్యక్షముగ ప్రదర్శించుటకై శాస్త్రిగారి వంటి సుధీమణి పయన మగుచుండ హిందూదేశ మింకను గోరదగిన దేమి? ఇంతియకాక. వీరు అమెరికా ఖండమునకు బోయి, హిందూదేశము బ్రిటిషు సామ్రాజ్యమునుండి విడిపడుటకు ప్రయత్నించుచున్నదని అచ్చట కొందరు తుంటరులు పలుకుచున్న అపభ్రంశపు మాటలను బారద్రోలి హిందూదేశము యొక్క రాజభక్తిని ఖండాంతరములలో జాట జూచుచున్నారు. ఇట్టి మహత్కారములను తలంచుకొని, శాస్త్రిగారు తమ యాధిక్యతను గొనియాడుకొనుటలో నాశ్చర్యమేమి?

విద్యుద్దీపములు ఆకాశము నందలి నక్షత్రగణములను జూచి, అవి తమ వలె ప్రకాశించుట లేదని మురియుచున్నట్లు ఒక జపాను కవి వర్ణించి యున్నాడు. మన శాస్త్రిగారి ఆత్మ విశ్వాసము కూడ నీ విద్యుద్దీపములను బోలి యున్నది. తమ గౌరవ్యాధిక్యత యందే భారతవర్షము యొక్క గౌరవము కలదని వీరి యభిప్రాయము. అంతియకాని, భారతవర్షము యొక్క గౌరవమునందే తమ గౌరవము గలదను భావము వీరికి గలుగలేదు పంజాబు పరాభవము వలన దేశమున కగౌరవము వాటిల్లలేదు మహమ్మదీయులు దుఃఖము చెందియున్నను, దేశము సుఖముగ నున్నది సంస్కారణములు నిరర్థకములైనను అసంతృప్తి పడ నవసరము లేదు కెన్యా కాలనీలో భారతీయులకు తిరస్కారము కలిగినను చింతింపవలదు. దక్షిణాఫ్రికా నుండి దేశీయులు గెంటబడుచున్నను భయము చెంద వలదు. స్వదేశములో నిరువది అయిదు వేల మంది తరుణ వయస్కులు జయిలుఖానాలో గుందుచున్నను, దాసు, లజపత్రాయి, నెహ్రూల వంటి నాయ కులు బంధింపబడినను, మాలవ్యవంటి పావన చరితునకు వాగ్బంధము గల్పింప బడుచున్నను, మహాత్ముని వంటి లోకోత్తముడు కారాగృహముల పాలైనను. దేశమునకు గొదువ యేమి? వీని యన్నిటిని ఒక దోమకాటుగ, నెంచి, శ్రీనివాస శాస్త్రిగారు రాజమందిరములలో గుడుచుచున్న విందులకు, పొందుచున్న గౌరవ ములకు, భారతవర్షము గర్వించవలదా?

కాని దేశీయులు గాంధివంటి పిచ్చివాని వెంబడిపడి కేవలము వివేక శూన్యులైనారు. లేనియెడల శ్రీనివాసశాస్త్రిగారివంటి దేశభక్తాగ్రేసరుడు యూరపు ఖండములో దిగ్విజయము గాంచి, స్వగృహమున కేతెంచినప్పుడు, దేశీయులు వారికెట్టి కృతజ్ఞతను జూపిరి? శాస్త్రిగారు సహితము దేశీయుల కృతఘ్నతను దెలిసికొని విచారసాగరమున మునిగిరి. వీరు బొంబాయిలో నోడదిగుటతోడనే, వేలకొలది దేశీయులు వీరి నెదుర్కొనుటకు వచ్చెదరను విశ్వాసముతో నుండిరి. కాని వారిని సన్మానించుటకు బదిమంది మిత్రుల కంటె నెక్కువమంది యెదురుకోలునకు రాలేదట. సోదర దేశీయులు తమ సేవ నింత నిరసన భావముతో జూచిరే యని అమిత విచారమును దెల్పిరి! అప్పటినుండియు వీరు పోయిన ప్రదేశముల యందెల్ల పాలకులు తమకు ఒసగిన గౌరవము భారత వర్షముయొక్క గౌరవముగ నెంచుకొన వలయునని బోధించుచువచ్చిరి. కాని ఏ కొలదిమంది మిత్రులో తప్ప వీరి నాదరించువారే లేకపోయిరి. ఈ సంగతి వారికి బాగుగ హృద్గతమైనది దేశములో బ్రిటిషు రాజనీతి యెడల విశ్వాసము పూర్తిగ బోయినదని గ్రహించిరి. బ్రిటిష్ రాజనీతియందే విశ్వాసము లేనప్పుడు, ఆ రాజనీతిని బలపరచుచున్న శాస్త్రిగారియందు మాత్రము విశ్వాసమెట్లు కుదురగలదు? ఈ రహస్యము ఒక్క బొంబాయిలోనే కాక సిమ్లాలోగూడ వైస్రాయిగారి సమ్ముఖమునందే వెలిబుచ్చెను. శాస్త్రిగారు ఇంగ్లాండునకుబోయి చేసిన దేమియో మాకు దెలియదు రేపు కాలనీలకు బోయి చేయగలిగిన దేమియో మేమూహింప జాలము. కాని ఈ యొక్క రహస్యమును వెల్లడించుటచే వీరు నిజమైన దేశసేవ గావింప గలిగిరని చెప్పగలము,

వీరు రేపు బ్రిటిషు కాలనీలకును, అమెరికా ఖండమునకును, బోవుచున్నారు. అప్పుడుకూడ వైస్రాయిగారి ముందర వెల్లడించిన మాటను వెల్లడించుచు ''హిందూదేశీయులకు బ్రిటిషు ప్రభుత్వము యెడలను బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుల యెడలను, విశ్వాసము పూర్తిగ బోయినది. నాకు మాత్రము బ్రిటిషు వారి యెడల అధిక విశ్వాసము గలదు. భారతీయులు నన్ను తమ ప్రతినిధినిగ నెంచుకొనుటలేదు. నేను మాత్రము ప్రజాప్రతినిధిగనే ఎంచుకొనుచున్నాను. హిందూదేశమునకు గలుగుచున్న అగౌరవములను నేను నా యగౌరవముగ

భావించుకొనుట లేదు కాని నాకు గలిగిన గౌరవములను దేశమునకు చెందిన గౌరవములుగ దలంచుచున్నాను హిందూదేశీయులు బ్రిటిషు ప్రభుత్వమును స్వదేశ ప్రభుత్వముగ నెన్నుటలేదు. నేనుమాత్రము ఇండియా ప్రభుత్వమును "నేషనల్ గవర్నమెంటు" గ నెంచుకొనుచున్నాను. హిందూదేశీయులు గాంధి మహాత్ముని మూలముననే తమకు విముక్తి గలుగునని భ్రమపడుచున్నారు. నేను మాత్రము నా ఖండాంతర ప్రయాణముల వలననే హిందూదేశమునకు ఆధిక్యత వచ్చునని ప్రకటించుచున్నాను. దాసు, నెహ్రూవంటి హిందూదేశ ప్రముఖులు భోగులయ్యు నేడు విరాగులై జయిళ్ళలో గుందుచున్నారు. నేనన్ననో విరాగి నయ్యు, నేడు భోగినై రాజమందిరముల విందుల నారగించుచున్నాను. హిందూ దేశీయులు ఆత్మవశమే సుఖమనుచున్నారు నేనుమాత్రము పరవశమే ముక్తి దాయక మనుచున్నాను హిందూదేశమునకు స్వరాజ్యము వచ్చినగాని కాలనీల లోని భారత ప్రవాసుల స్థితి చక్కపడదని హిందూదేశీయులు నిరాశ చెంది యున్నారు. బ్రిటిషు కాలనీలే హిందూదేశమునకు స్వరాజ్య మిప్పించగలవని నే నాశపడుచున్నాను. హిందూదేశము యొక్క కోశము సన్నగిలినప్పుడు, నా ప్రయాణమునకు అరువదివేల రూపాయలను వ్యయపఱుచుట మహాదోషమని భారతీయులు వాదించుచున్నారు. నా వంటి రాయబారిపై నెన్ని లక్షలు ఖర్చు పెట్టిన భారతవర్షము యొక్క భాగ్యమునకు అంత శుభప్రదమని పలికితిని. అస్మద్దేశీయులు నన్ను గౌరవించుట లేదు; నేను మాత్రము మిమ్ములను గౌరవించు చున్నాను. సత్యవ్రతమే ముక్తిదాయకమని భారతీయుల విశ్వాసము. బ్రిటిషు సామ్రాజ్య నీతియే సకల కామప్రదమని నా మతము. భారతీయులు గాంధిని బూజించుచున్నారు. మీరు నన్ను గౌరవింపుడు. ఇదియే నా సందేశము''. అని శాస్త్రిగారు అపరోక్షముగ నైనను, పరోక్షముగ నైనను బ్రకటించి ధన్యులయ్యె దరు కాక !

కృష్ణా పత్రిక
మే 20 తేది, 1922 సం॥

# బ్రిటిషు సందేశము

విక్టోరియా రాణి గద్దెక్కి నప్పటినుండి నేటివరకు బ్రిటిషు మంత్రులొకరి తరువాత నొకరు హిందూదేశము యొక్క భవితవ్యమును గూర్చి చిత్రవిచిత్ర కంఠములతో బలుకుచునే యుండిరి. ఒకప్పుడు కన్సర్వేటివు పక్షమువారు మంత్రులగుచుండిరి ఇంకొకప్పుడు లిబరలు పక్షమువారు మంత్రులగుచుండిరి. ఏపక్షము వారధికారమునకు వచ్చినను హిందూదేశము పట్ల వారవలంబించిన రాజనీతి మాత్రము ఒక్క పద్ధతినే అనుసరించుచు వచ్చుచున్నది. హిందూదేశ రాజ్యాంగములో ఏ యిరవదేసి సంవత్సరములకో కొన్ని మార్పులు జరుగుచుండినను, అవి పరిపాలనా సౌష్ఠవమునకు సంబంధించిన బయటి మార్పులే కాని, అసలు రాజనీతి సూత్రము ఎట్టి మార్పును జెందక, ఒకటే రూపమును దాల్చి యున్నది. దీనికి కారణము లేకపోలేదు బ్రిటిషు రాజ్యాంగము, "పార్టీ గవర్నమెంటు" అను పద్ధతి గలదియైనను, హిందూదేశ రాజ్యాంగము మాత్రము ఈ పక్షముల బయటనే యుంచబడుచుండెను. కన్సర్వేటివులైనను, లిబరలులైనను, హిందూదేశ విషయము చర్చకు వచ్చుసరికి స్వపక్ష విపక్షములను భేదము లేక ఒక్కటగుదురు ఏ యాకస్మిక కారణము చేతనో ఇట్లు జరుగుచుండుట లేదు. హిందూదేశ విషయమై ఉభయ పక్షముల వారికిని ఒక్క లక్ష్యముండుటయే వీరి యైక్యతకు ప్రధాన కారణము ఐర్లాండు విషయములో బ్రిటిషు రాజ్య తంత్రజ్ఞులకు భేదములు కలవు. ఒకరు ఐర్లాండునకు "హోమురూలు" ఇయ్యవలెనను వారు ఇంకొకరు ఐర్లాండు బ్రిటిషు పార్లమెంటు క్రిందనే యుండవలెనను వారు. అటులనే "టారిపు" విషయములో వారిలో వారికి భేదములు కలవు. కొందఱు ఇంగ్లాండు స్వేచ్ఛావాణిజ్యపద్ధతి నవలంబించవలె ననెదరు. కొందఱు పరదేశముల నుండి వచ్చు సరకులపై పన్నులు వేసి తమ పరిశ్రమలను రక్షించవలసినదని కోరువారు కలరు. ఇటులనే "చర్చి" విషయములో భేదములు

కలవు. బ్రిటిషు రాజ్యాంగము ఏ యొక్క "చర్చి" తోను ప్రత్యేక సంబంధము కలిగి యుండకూడదని వాదించువారు కొందఱు, చిరకాలము నుండి వచ్చుచున్న "ఇంగ్లీషు చర్చి" ని విడనాడ కూడదని ప్రతిఘటించువారు కొందఱు. ఇటులనే అనేక విషయములయందు వారిలో వారికి భేదములు కలవు. ఒక కాలములో నున్న వివాదము లింకొక కాలములో లేకపోవచ్చును. ఒక కాలములో నొక విషయమును గూర్చి పార్టీ లేర్పడును ఇంకొక తరుణములో నింకొక యంశమును గూర్చి పక్షము లేర్పడును. ఎప్పటి కప్పటి కేవో క్రొత్త సందర్భములు వచ్చి పార్టీ లేర్పడుచునే యుండును. పార్టీలు లేని కాలము లేదు.

పార్టీలు వచ్చుచున్నవి, పోవుచున్నవి. హిందూదేశ వ్యవహారము మాత్రము బ్రిటిషు చరిత్రలో నేటివరకు గూడ పార్టీ విషయముగ బరిణమించి యుండ లేదు. ఈ కారణముచే, బ్రిటిషు రాజ్యాంగములో నెట్టి మార్పులు జరుగుచున్నను, ఎట్టి పార్టీ లేర్పడుచున్నను, హిందూదేశ రాజ్యాంగము చెక్కు చెదరక అనాది నుండి నేటివఱకు ఒక్కటే సూత్రమును అనుసరించి వచ్చుచున్నది. హిందూదేశ రాజ్యాంగములో గొన్ని సంస్కరణములు జరిగిన మాట నిజమే. అవి పరిపాలనా సౌకర్యమునకును, బ్రిటిషు ప్రభుత్వమును సుస్థిరముగ జేయుటకును ఉద్దేశింప బడిన మార్పులే కాని అసలు లక్ష్యములో మాత్ర మిసుమంతయైనను, పరివర్తన మొందలేదు. ఇంతవఱకును జరిగిన మార్పులు కన్సర్వేటివు పక్షము వారధికారమునకు వచ్చినప్పుడు సిద్ధించినవే కాని, లిబరల్సు ప్రభుత్వమునకు వచ్చినప్పుడు జరిగినవి కావు దీనిని బట్టియే యీ మార్పుల యొక్క స్వరూపమును తెలసుకొనవచ్చును బ్రిటిషు వారు హిందూదేశము యెడల నవలంబించుచున్న రాజనీతియందు ముఖ్యముగ మూడు విషయములు కలవు: (1) హిందూదేశమునకు స్వపరిపాలనార్హత లేదు (2) ప్రాచ్య దేశీయులకు నిరంకుశ ప్రభుత్వ విధానమే సరియైనది. (3) బ్రిటిషు ప్రభుత్వములో దేశీయు లెక్కువగ బాల్గొను నటుల జేయవలయును. ఈ మూడు సూత్రములమీదను బిటిషు రాజనీతి నిలిచి యున్నది. ఏ బ్రిటిషు రాజనీతిజ్ఞుడు మాట్లాడినను ఈ ప్రధాన సూత్రములను వదలలేదు. లిబరల్సు ఎక్కువ

యుదారభావములను,విశాలాదర్శములను వెలిపుచ్చవచ్చును. కన్సర్వేటివులు సంకుచితభావములను వెలిపుచ్చ వచ్చును.కాని ఈ భేదములు మాటలలోని వ్యత్యాసములే కాని క్రియలో మాత్రము ఎల్లరును ఒక్క త్రోవయే త్రొక్కుచుండిరి. మార్లీ వంటి ఉదారాశయుడు సహితము, తాను జూడగలిగి నంతవఱకు హిందూదేశమునకు నిరంకుశ ప్రభుత్వమే యుండకతప్పదని వాక్రుచ్చెను.కాలనీలలోని స్వపరిపాలన వంటిది కూడ హిందూదేశమునకు దగదని సూచించుటకై కనడాలోని ఉన్నికోటు ఇండియాకు బనికిరాదని చెప్పెను. మార్లీ మంత్రి హిందూదేశ రాజ్యాంగములో జేసిన మార్పులు బ్రిటిషు ప్రభుత్వములో దేశీయులు పాల్గొనుటకు బన్నిన తంత్రమే కాని, హిందూ దేశీయులకు స్వపరిపాలన మొసగుటకు గాదని తానే స్పష్టముగ నిరూపించెను. ఈ మార్లీ మంత్రి ఈ సూత్రములను వ్యక్తీకరించి యుండుట చేతనే, ఆయన గావించిన సంస్కరణములు కన్సర్వేటివు పక్షము వారికి గూడ సమ్మోదార్హము లైనవి.

హిందూదేశ రాజ్యాంగము యొక్క ఆదర్శము స్వరాజ్యమని మొట్టమొదట భారతవర్ష పితామహుడగు దాదాభాయి నౌరోజి కలకత్తా సభావేదిక నుండి ప్రకటించెను.కాని ఆంగ్లరాజ్య తంత్రజ్ఞు లెవరును దీని నామోదించి యుండలేదు. ఎటులైన బ్రిటిషు ప్రభుత్వము వారిచే దీని నాదర్శముగనైన ఒప్పించ వలయునని మన ప్రముఖులు ప్రయత్నించుచు వచ్చిరి. వంగదేశ విభజన సమయములో గంభీరోపన్యాసములు చేసిన బిపిన చంద్రపాలుగారు కూడ కేవలము ఆదర్శ ప్రకటనమునకై ప్రయత్నించిరి. స్వదేశాందోళనపు రోజులలో నెవరును రాజ్యాంగ సంస్కరణములను గోరలేదు ఎట్టి ''రిఫారము స్కీమును'' నిరూపించలేదు. హిందూదేశ రాజ్యాంగముయొక్క లక్ష్యము కాలనీల వంటి స్వరాజ్యముగ బ్రిటిషు పార్లమెంటు వారొప్పుకొనవలెనని గోరిరి, వారిచే నీ ప్రకటన జేయించుట యెట్లో యెవరికి తెలిసినది కాదు. హిందూదేశ విషయము పార్టీవిషయము కాదని పైని జెప్పియుంటిమి. లక్ష్యమును నిర్వచించ వలసినదని గోరుటతోడనే, అది పార్టీ విషయమై తీరును. ఇంగ్లాండులో నన్ని పక్షముల వారును స్వరాజ్యమును లక్ష్యముగ నంగీకరించెదరనుట వట్టికల్ల. ఆ లక్ష్యమును నిర్వచించక పోవుట

చేతనే, ఇంతవరకును హిందూదేశ రాజ్యాంగము పార్టీవిషయము కాకుండ నుండుటకు సాధ్యమైనది కాని మన ప్రముఖులలో గొందఱికి హిందూదేశరాజ్యాంగమును పార్టీవిషయముగ జేసినగాని, గత్యంతరము లేదను అభిప్రాయము కలిగినది. లాలా లజపత్రాయలు, లోకమాన్య బాలగంగాధరతిలకు మొదలగు వారు ఇంగ్లాండులోని లేబరు పార్టీతో మైత్రిసలిపి, వారి పార్టీ ప్రోగ్రాములో ఇండియాకు స్వరాజ్యము నియ్యవలెననెడి విషయమును చేర్పించిరి. ఈ మార్గము తక్కిన ప్రముఖులకెంత మాత్రము రుచించలేదు లేబరు పార్టీ వారికి పార్లమెంటులో పలుకుబడి లేదు. వీరింతలో అధికారమునకు వచ్చెదరను ఆశయు లేదు. ఇట్టి సందర్భములో కాంగ్రెసు లేబరుపార్టీతో జేరుట యుపద్రవకరమని బెసంటమ్మ మొదలగువారు వాదించ మొదలిడిరి ఏలయన, ఎప్పుడు లేబరు పార్టీవారు దీనిని దమప్రోగ్రాములో జేర్చుకొనిరో, తక్కినపార్టీల వారు దీనికి ప్రతికూలు రగుదురని వారి భయము.

ఇట్లుండ శ్రీనివాసశాస్త్రి మొదలగువారు దీనిని పార్టీ విషయముగ జేయుట కిష్టము లేకపోయిన, తిలకువంటి వారు లేబరుపార్టీతో చేరినను గారణముచే, తాము లిబరలు పార్టీవారితో మైత్రిసలుప మొదలుపెట్టిరి. లిబరల్సు మూలముననే హిందూదేశమునకు మోక్షము వచ్చునని మితవాదులును, లేబరు పార్టీవారే హిందూదేశమునకు మిత్రులని జాతీయవాదులును, వాదింపసాగిరి. ఇంగ్లాండులోని కన్సర్వేటివు పక్షమువారు సామాన్యముగ "లార్డ్సు" లేక జమీందారులు అని చెప్పవచ్చును. లిబరల్సు పక్షమువారు సామాన్యముగ "కేపిటలిస్టులు" లేక షాహుకారులని చెప్పవచ్చును. లేబరు పార్టీవారు కూలిజనమను సంగతి ఎల్లరకును విశదమే ఇంగ్లీషు జమీందారులు సర్వసామాన్యముగ సంస్కరణ విముఖులయి యుందురను సంగతి అందరెరిగినదే ఇండియాను పార్టీవిషయముగ జేసినయెడల కాంగ్రెసు లిబరల్సు పక్షమున జేరవలెనా? యను విషయమును జర్చించ వలసి వచ్చును. లిబరల్సు పక్షము వారిలో నెక్కువ మంది షాహుకారులు. మ్యాన్చెస్టరు, బర్మింగుహాము షాహుకారులు హిందూదేశమునకు ఎప్పటికైనను స్వరాజ్యమిచ్చివేయుట కొప్పుకొనెదరా? హిందూదేశరాజ్యాంగమునకు రెండు దిక్కులు

కలవని కర్జను ప్రభువు వెనకనే చెప్పియుండెను. ఒకటి రాజ్యాంగ పరిపాలనము (admini-stration), రెండవది ధనశోషణము (Exploitation). మొదటిది రాజదండము, రెండవది తులాదండము ఇవి యన్యోన్యాశ్రయములు. హిందూదేశమునకు స్వరాజ్యమొసగిన పిమ్మట, బ్రిటిషు వర్తకులు పూర్వము వలె నీ దేశమును దోచుకొన గలుగుదు రనుట వట్టికల్ల. బొంబాయి మిల్లులపై విధింపబడిన ఎక్సయిజు డ్యూటీకి యర్థమేమి? మొన్న బట్టల దిగుమతులపై ఇండియా గవర్నమెంటువారు సుంకములను హెచ్చించుటతోడనే, ఇంగ్లాండులో మ్యాన్చస్టరు వర్తకులు మాంటాగ్యు మంత్రియొక్క యింటిని జుట్టివేయ లేదా? మ్యాన్చస్టరు లిబరలు పక్షమువారికి ప్రధానస్థానము. ఇక లిబరలు పక్షము వారు తమ ధనశోషణ పద్ధతికి ప్రతికూలమైన స్వరాజ్యము యొసగెదరని ఎవరు నమ్మగలరు? ఇక లేబరుపక్షము మాత్రము స్వరాజ్య మొసగునాయని ప్రశ్నించ వచ్చును. హిందూదేశమునకు స్వరాజ్యము ఇచ్చిన యెడల, బ్రిటిషు షాహుకారున కెంత నష్టము వాటిల్లునో బ్రిటిషు కూలివానికిని అంతియే నష్టము వాటిల్లితీరును, మ్యాన్చస్టరు మిల్లులు మూలపడిన పిమ్మట, మ్యాన్చస్టరు కూలీలును పస్తుపడుకొన వలసినదే.షాహుకార్లు, పనివాండ్రు అను విభాగమున్నంత కాలము ఒకరిపై యొక రాధారపడి యుండక తప్పదు. ఇంతకును ఇంగ్లాండులోని లేబరు పార్టీవారు భారతవర్షమున కనుకూలురని ఎంత భ్రమించినను, వారి సాను భూతిని క్రియారూపముగ ప్రదర్శించుటకు ఇంతలో వారి కవకాశము రాజాలదు. ఇంగ్లండులోని లేబరుపార్టీ యొక్క స్థితిగతులే తారుమారగుచున్నవి. లిబ రల్సుకును లేబరుపార్టీకిని గల భేదము క్రమముగ దగ్గిపోవుచున్నది. "కమ్యూనిష్టు" అను బోల్షివిక్కులవలె సర్వసమానత్వమును గోరువారు బహు స్వల్పముగ నున్నారు. ఈ సందర్భముల నన్నిటిని బరిశీలించిన యెడల, ఇండియా విషయము పార్టీవిషయ మగుటకు వీలున్నట్లు కనుపట్టదు. పార్టీవిష యమైనను ప్రస్తుతము ప్రయోజనకారియగు నను ఆశయు లేదు. హిందూ దేశమును అణచి యుంచుటకు కన్సర్వేటివులు, లిబరల్సు, లేబరు—అన్ని పక్ష ముల వారు యొకటే. ఒకరు వెలిగించేది లేదు. ఇంకొకరు వెలిగించక పోయేది లేదు.

1917 లో మాంటేగ్యు మంత్రి పార్లమెంటులో ప్రసిద్ధ ప్రకటనయందు హిందూదేశ రాజ్యాంగమునకు స్వరాజ్యము లక్ష్యమని వ్యక్తీకరించ లేదాయని ప్రశ్నించ వచ్చును. ఈ ప్రకటన నెవరి యిష్టప్రకారము వారన్వయించుకొన వచ్చును. అంత చమత్కారముగ వ్రాయబడినది ఈ ప్రకటన యుద్ధ సందర్భములో జేయబడిన సంగతిని మరువ కూడదు. ఇంగ్లాండప్పుడు బహు ఆపత్తులో జిక్కుకొని యున్నది. హిందూదేశములోని సైన్యమంతయు యుద్ధరంగములకు బంపబడి యుండెను ఈ సందర్భములో ప్రజలేమి చేసిపోవుదురో యని, వారిలో నాశ కల్పించు నిమిత్తము బెసెంటమ్మ "హోమురూలు'' ఆడావిడిని బ్రారంభించెను. బ్రిటిషు అధికారు లీయమ చేసిన మహోపకారమును గ్రహింపజాలక, ఆమెను, ఆమె యనుయాయులను, నిర్బంధావాసమున నుంచిరి అంతటితో దేశమునకు నిప్పంటుకొనినట్లయ్యెను. అట్టి విషమదశలో ఆంగ్లేయ రాజ్య తంత్రజ్ఞులు హిందూదేశీయుల కోపతాప శమనార్థము నాలుగు చల్లని మాటలను జెప్పవలసి వచ్చెను. 1857 లో సిపాయిల తిరుగుబాటైన పిమ్మట, 1858 లో విక్టోరియా మహారాజ్ఞి "మేగ్నా చార్టా" ను ఘోషించి నటుల, 1917 "హోము రూలు'' ఆందోళనములో మాంటాగ్యూగారి సుప్రసిద్ధ ప్రకటనము బయలు దేరినది. క్రొత్త ఇండియా యాక్టులో బీఠిక యందేమి చెప్పబడి యున్నది? హిందూదేశీయులు స్వరాజ్యమునకు అర్హులు కారు. ఇదియే ఆ చట్టమునకు బీజ మంత్రము. ఈ చట్టముయొక్క చివర భాగమేమిటి? ముందు జరుగవలసిన సంస్కరణములకు అక్కడ బ్రిటిషు పార్లమెంటువారును, ఇక్కడ ఇండియా గవర్నమెంటువారును విచారణకర్తలుగ నియమింప బడిరి. భారతవర్షమునకు నింతకంటె నెట్టి యగౌరవము వాటిల్లగలదు? ఇదియా హిందూదేశము యుద్ధమునకు జేసిన సాయమునకు దగిన ప్రతిఫలము? "హిందూ దేశీయులు స్వరాజ్యమున కనర్హులు'' అను మాటలతో బ్రారంభమైన చట్టమును స్వరాజ్య దానపు పట్టా యని మన మితవాదులు హర్షింప మొదలిడిరి స్వరాజ్య మాదర్శమని కాని, స్వరాజ్య మింత కాలములో నియ్యబడునని కాని, దానికి ఫలానా మెట్లని కాని, ఈ చట్టమునందు నిరూపింపబడి యుండలేదు, భారతీయులు స్వపరిపాలనమున

కయోగ్యులు అను విషయమే స్పష్టముగ నిరూపింపబడినది. ఈ చట్టములో యొసగిన సంస్కారణములను దేశీయులు సరిగ నిర్వర్తించినదియు లేనిదియు నిర్ణయించుటకు బయటివారు విచారణకర్తలుగ నియమింపబడుట కూడ దేశీయుల ఆయోగ్యతనే వేనోళ్ళ చాటుచున్నది. ఈ సంస్కారణము లెట్టివైనవియు ఆ పీఠికలోనే యుదాహరింప బడెను ఈ సంస్కారణములు హిందూదేశీయులను స్వరాజ్య ద్వారమునకు దీసికొనిబోవు మార్గమున నడుచుటకు దోడ్పడ గలవని సూచింపబడెను. స్వరాజ్యమునకు ఈ సంస్కారణము లెంతదూరమున నున్నవియో చూడుడు ఈ సంస్కారణములు స్వరాజ్య ద్వారమైనను గాదు.ఆ ద్వారమునకు దీసికొని పోవు మార్గమైనను గాదు. స్వరాజ్యముయొక్క ద్వారమునకు దీసికొనిబోవు మార్గమున నడుచుటకు యోగ్యత యున్నదియు లేనిదియు దెలుపగల పరీక్షయని ఆ ప్రకటనయే స్పష్టముగా జెప్పుచుండ మన మితవాదులు దీనిని స్వరాజ్య దానపు పట్టాయని హెచ్చరించుకొనిరి.

మితవాదులు భ్రమపడుటకు గొన్ని సందర్భములు కలవు. కేవల మీ ప్రకటన యొక్కటియె వీరి యెదుటనున్న యెడల, మన మితవాదులవంటి అమాయకులు సహిత మింత సులభముగ మోసపోరు. ముఖ్యముగ రెండు విషయములు మితవాదుల భ్రాంతికి గారణము లయ్యెను. ఒకటి, వర్సైలీసు సంధి పత్రము క్రింద ఇండియాచేత సంతకము పెట్టించుట. రెండు, నానారాజ్య సభలో ఇండియాకు ఒక కుర్చీ లభించుట. ఈ రెంటికి దోడు సింహాప్రభువు "లార్డు" అగుట, ప్రభు సభలో గూర్చుండుట, అండరు సెక్రటరీ యగుట, తరువాత గవర్నరగుట. ఇక మన మితవాదులకు గావలసిన దేమి? కండ్లు జిగాలనెను. హిందూదేశ మీ విధముగ తారాపథమున నెగురుచున్నదని భ్రమపడిరి. కాని వీరి భ్రమ విడిపోవుట కెంతకాలమో పట్టలేదు. క్రొత్త శాసనసభలు వచ్చి ఒక్క సంవత్సరము కాకపూర్వమే డయార్కియొక్క బూటకము తెలిసివచ్చినది. మిలిటరీ వ్యయము నిసుమంతయైనను దగ్గించ లేకపోయిన పిమ్మట శాసన సభల నిస్సహాయత్వము తేటపడినది దేశములో నిరాఘాటముగ సాగుచునుండిన

కరిన చర్యలను గాంచిన పిమ్మట అధికారవర్గము యొక్క నిరంకుశత్వము చెక్కుచెదరలేదని స్పష్టపడినది. వీటి యన్నిటి కంటెను మన మితవాదులను గలవరపరచినది. మాంటేగ్యుయొక్క పదభ్రష్టత. మాంటాగ్యు మంత్రి మన మితవాదులకు గురువు, సఖుడు, బంధువు, సచివుడు. అట్టివాడే త్రోసిరాజైన పిమ్మట, వాని నాశ్రయించుకొని యున్న మన మితవాదుల కిక నిలువనీడ యెక్కడ? ఇంగ్లండులో నే పార్టీయు హిందూదేశ పక్ష మవలంబించదను కొంటిమి. తుదకు ఒక్క మాంటేగ్యు బీదవానికి బెన్నిధివలె లభించెను. అతడు కూడ బోయిన పిమ్మట నిక దిక్కెవ్వరు? బ్రిటిషు రాజ్య తంత్రజ్ఞుల మతమునకును మన మితవాదుల. మతమునకును విశేషభేదము లేదు. హిందూదేశమునకు స్వపరిపాలనా యోగ్యత లేదని ఉభయులును అంగీకరించెదరు. భారతీయులు ఆంగ్లేయుల గురుత్వముక్రింద తర్బీయతు కావలెనని చెప్పుటలో గూడ నుభయులు నేకీభవింతురు. ఒకరు స్వరాజ్యమును బరమలక్ష్యముగ నెంచరు. ఒకరు ఎంచుకొనెదరు. ఇంతియే యుభయులకును గల భేదము. మితవాదు లెట్టి యాశాభంగమున కైనను ఒప్పుకొనెదరు కాని, హిదూదేశమున కెప్పటికిని స్వరాజ్యము సిద్ధించదు, అని చెప్పుటకొప్పుకొనరు. దీని కెంతమాత్రము సహింపరు. స్వరాజ్యమును వెయ్యిసంవత్సరముల కిచ్చినను చింత లేదు. ఇయ్యక పోయినను వ్యసనము లేదు ఎప్పటికినిఇయ్యమని మాత్రము చెప్పితిరా! దుర్భరము. స్వరాజ్యము పరమలక్ష్యమని స్పష్టముగ వ్యక్తీకరింపక పోయినను మేలే కాని దూరలక్ష్యము కూడ కాదనెదరా? ఇక ఆటకట్టిపెట్ట వలసినదే.

ఏ పని చేసిన మితవాదులు సహితము కల్లోల పడెదరో, ఆ పనినే లాయిడు జార్జి ప్రధాని యిప్పుడు సూటిగ జేసెను. మితవాదుల సహనమునకు గూడ గొంత మేర యున్నదను సంగతి లాయిడు జార్జి మఱచిపోవుట విచారకరము పంజాబు విషయమును బరిష్కరించక పోవుగాక, తుర్కీ సంధిని సవరించక పోవుగాక, శాసనము పేరట నెట్టి యశాస్త్రీయ పద్ధతులతోనైనను అసహాయోద్యమమును జెండాడుచు గాక! కెన్యా, ఫిజీ కాలనీలలో నల్లవాని నీచత్వమునకు బాల్పరుచు గాక! సైనిక వ్యయమును దగ్గించక క్రొత్త పన్నులను తలపై

వేసి రద్దును కాక; ఏమి చేసినను మితవాదు లోపికపట్టి యుండగలరు గాని, మాటలలో నైనను, స్వరాజ్యము పరమాదర్శమని బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞులు చెప్పరా? వారు చెప్పకపోవుదురు కాక! వారి పదమాదర్శ మదియేనని మిత వాదులు చాటుచున్నప్పుడైనను, విననివారివలె మౌనము ధరించి యూరుకొన కూడదా! లాయిడు జార్జి యీ యోచన చేయలేదు. మరుగులను మెరుపులను దీసివైచి, బ్రిటిషు రాజనీతి యొక్క యథార్థ స్వరూపమును, సంస్కారణముల భావి వికాసమును, బట్టబయలుగ జేసి మితవాదుల యాగ్రహమునకు బాత్రు డయ్యెను. లాయిడు జార్జి మాత్ర మేమి చేయగలడు? సత్యమును మరుగుపరచుట లోను, అసత్యమునకు, మెరుగు పెట్టుటలోను లాయిడు జార్జిని మించినవాడు నేటి పాశ్చాత్య రాజనీతి కోవిదులలో లేడని సాహసము చేసి చెప్పవచ్చును. యుద్ధ సందర్భములో లాయిడు జార్జి హిందూదేశమును నుగ్గడించిన నుగ్గ డింపులా, చేసిన పొగడ్తలా; తన వచోవిలాసము నంతను అందు ప్రదర్శించెను. హిందూదేశీయులకు జ్ఞాపకశక్తి తక్కువయని లాయిడు జార్జి సంశయపడి యుండ వచ్చును. రవి యస్తమింపని అఖండ బ్రిటిషు సామ్రాజ్యము యొక్క ధైర్య స్థైర్యములను, సాహసౌదార్యములను లాయిడు జార్జి ప్రశంసించినది జర్మనులను నిర్వీర్యులను జేయుటకు గాని, భారతీయుల స్వాతంత్ర్యాధికారము లను ప్రతిపాదించుటకు గాదు. కాని భారతీయుల విశ్వాస మతికోమల మైనది. లాయిడు జార్జి యొక్క వాగమృతధారలను గ్రోలి భారతీయులు తబ్బిబ్బులైరి. బ్రిటిషు సామ్రాజ్య రక్షణార్థము ఈ తబ్బిబ్బులు ప్రయోజనకరము లైనంత వరకు భయపడవలసిన పని లేదు. కాని యుద్ధము ముగిసినను, విజయము సిద్ధించినను, బ్రిటిషు సామ్రాజ్య పతాకము కీర్తి శిఖరముపైన అప్రతిహతముగా నెగురుచున్నను, ఇంకను భారతీయులు తబ్బిబ్బులగుటకు గారణమేమి? బ్రాంతి వినాశ కారణము సామ్రాజ్యమును సంరక్షించిన లాయిడు జార్జి భారత వర్షమును మాత్రము సంరక్షింప జాలడా? చూచెను మితవాదులలో బెరుగు చున్న బ్రాంతిని. వినెను శాసన సభలలో మితవాదులు వచించు చున్న భ్రమాత్మకమైన పలుకులను. నానాటికి ప్రమాదము ఘీతిఘీభ చున్నది. లాయిడు జార్జి యంతట తన మోహినీ

వేషమును దీసి వైచి, తన నిజరూపమున నిలువబడి సింహగర్జనము గావించెను. ఇప్పుడైనను మితవాదులు భ్రమను వీడరా? ఇంకను స్వరాజ్యము నభిలషించెదరా? ఇంకను ఎంతకాలము తాము ఆత్మవంచకులై, ఇతరులను వంచించెదరు? లాయిడు జార్జి సామాన్యపు పార్లమెంటుసభ్యుడు కాదు. ఐరోపా ఖండము జర్మను పదఘాతము క్రింద దద్దరిల్లుచున్న సమయమున, లోకైక సంరక్షకుని వలె, శాంతిదూతవలె, నిలువబడిన, సచివ పుంగవుడు. బ్రిటిషు రాజ్యాంగము పక్షముల సంఘట్టనమున దగుల్బాజీని సామ్రాజ్య సంరక్షణకు సమర్థతతో పూనుకొన జాలని విపదవస్థలో, సమస్త పక్షముల నేకీభూతము చేసి, ఏడు సంవత్సరములు తదేక రీతిగ సామ్రాజ్య చక్రమును నిర్వక్ర పరాక్రమముతో త్రిప్పుచున్న సామ్రాజ్య నిర్మాత. ఐర్లాండున ఆంగ్లేయ ద్వేషానల జ్వాలలు ప్రజ్వలించి బ్రిటిషు దీవులకు దుర్భరోపద్రవములను గల్పించుచున్నతరి, చలింపని సంకల్పబలముతో, చెదరని మనోధైర్యముతో, ఐర్లాండునకు హోమురూలు ప్రసాదించి ఐర్లాండుతో ఐర్లాండే ఢీకొనునటుల జేయగలిగిన రాజ్యతంత్ర నిపుణుడు. అట్టి రాజనీతి విశారదుడు పార్లమెంటు సభలో నిలువబడి భారతవర్షము యొక్క భవితవ్యము ఆచంద్రార్కముగ నెట్టి రూపమున నుండగలదో త్రికాలజ్ఞుని వలె వ్యక్తీకరించెను. ఇంక కపటము లేదు, మోసము లేదు, భ్రమ భ్రాంతులు లేవు. భారతవర్షము స్వరాజ్యవాంఛను వదలుకొన వలెను. బ్రిటిషు అధికారులే శాశ్వతముగ హిందూదేశ రాజ్యాంగ కర్తలై యుందురు. సంస్కరణముల పరీక్షలో భారతీయులు తీర్ణులయినను, బ్రిటిషు అధికారవర్గము యొక్క ప్రాబల్యము క్షీణించుటకు వలనుపడదు వారి హోదాలు, వారి మర్యాదలు, వారి గౌరవములు, వారి యధికారములు, వారి జీతములు, వారి పించనులు, వారి రాకపోక ఖర్చులు - ఇవి తప్పవు - శాసన సభ్యులారా! ఈ విషయము నంగీకరించెదరా? మీకీ సభలు, ఈ సభ్యత్వము దక్కును. బ్రిటిషు అధికారుల ప్రాబల్యము నామోదించరా? సంస్కరణములు తుడిచి పెట్టుకొని పోవలసినదే? ఇందు మాయ లేదు మర్మము లేదు ఒకటే మాట ఒకటే బాణము. మీరు అవలంబించ వలసినది నిష్కామ కర్మ. స్వరాజ్యము వచ్చునను ఆశతో మాత్రము "కో-ఆపరేటు"

చేయకుడు. బ్రిటిషు అధికారవర్గమునకు దోడ్పడుటయే మీ కర్తవ్యము. ప్రపంచములో ఏది మారినను, ఏ రాజ్యములు తలక్రిందులయినను, ప్రళయములు వచ్చినను, ప్రపంచములో మారని వస్తువు, క్షీణించని వస్తువు, స్థిరముగ, నిత్యముగ నిలిచియుండు వస్తువు బ్రిటిషు అధికార వర్గము,— బ్రిటిషు మెడికలు ఆఫీసర్లు, బ్రిటిషు పోలీసు ఆఫీసర్లు, బ్రిటిషు మిలటరీ ఆఫీసర్లు, వారి హెచ్చు జీతములు, హెచ్చు పింఛన్లు ఇది శిలాక్షరము, బ్రహ్మాస్త్రము. దీనికి తిరుగు లేదు. అమోఘము! ఇదివరకే బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుడును, ఏ యాంగ్లేయ సచివుడును ఇంతకంటె స్పష్టముగ, అసందిగ్ధముగ, నిష్కపటముగ, బ్రిటిషు రాజనీతిని నిర్వచించి యుండలేదు. దీనికి ప్రత్యుత్తరమేమి? సహాయమా? అసహాయమా?

కృష్ణా పత్రిక
ఆగస్టు 12వ తేది, 1922 సం॥

# వివాహ సంస్కారము

మతాంతరులతో వివాహ సంబంధమును గల్పించుకొనుట కింతవరకు ఏ మతసంప్రదాయము నంగీకరించుట లేదు. ఏ మతమువారా మతముయొక్క బిగువును, ప్రత్యేకతను, గాపాడ జూచుకొనుట సహజము. మానవుని ప్రవృత్తి ధర్మములు విశృంఖలముగ నున్న కాలములో మతాచారములును. మతనిబంధనలును, మానవుని చిత్తసంస్కారమునకును, ఆత్మీయోన్నతికిని, దోడ్పడ గలిగియుండెను. కాని కాలములు మారినవి. ఆచారములు సహితము మితితప్పి మానవ జీవనము యొక్క సహజ విలసనమునకు ప్రతిబంధకములైనవి. స్వమతాభిమానము అన్యమతాసహిష్ణుతగ పరిణమించినది. మానవులు తమలో తాము గిరులు గీసికొని నన్ను ముట్టుకోవద్దు మాలకాకి యను సామెతగ వైషమ్యములను బెంచుకొన సాగిరి. ప్రకృతి యిట్టి ప్రతిరోధమును సహింపజాలదు. వర్తమాన కాలముయొక్క లక్షణము కలయిక. మానవుడిక తన గిరుల యందు బంధింపబడి యుండజాలడు. ఇంతకాలము విడివడి యున్న దిక్కులు అన్యోన్యాశ్లేషణమునకై చేతులు చాచుచున్నవి. మానవ జీవనము ప్రాచీన నియమముల నతిక్రమించి ఈ మహాసమ్మేళనమున సంగమింప జూచుచున్నది. జాతిభేదములు, మతభేదములు, వర్ణభేదము లిక మానవుని విభాగములుగ విభజించి యుంచజాలవు. ఈ యుద్ధముల వెనుక, ఈ జాతీయ స్పర్ధల మరుగున, ఈ రాష్ట్రీయ దురభిమానముల క్రింద, మానవైక్యత యను ఒక నూతన మహాశక్తి బయల్వెడలుచున్నది. మానవు లందరు ఒక్కటి యను మహానాదము విశ్వాంతరాళము నుండి ప్రతిధ్వనించుచున్నది. ఈ దివ్యవాణి నాలకించుటకు మతములు జంకుచున్నవి, జాతులు భయపడుచున్నవి. వర్ణములు తల్లడిల్లుచున్నవి. కాని ఈ సంకోచములు మేఘశకలముల వలె నంతర్ధానము కాక తప్పదు. ప్రపంచములోని భేదములు వైచిత్ర్యములు పూర్తిగ తుడిచి పెట్టుకొని పోవునని మేము చెప్పుట లేదు.

లోకములున్నంత కాలము భేదము లుండి తీరును వైచిత్ర్యములు వర్ధిల్లుచునే యుండును. కాని అవి మానవుని కలయికకు మాత్రము ప్రతిబంధకములుగ నుండ నంత కాలమె వానికి గల ప్రయోజనము. ఎప్పుడవి మానవైక్యతకు కవాటము బంధించునో అప్పుడు వానిని ప్రకృతి సహింపజాలదు. అవి కొంతకాలము ప్రకృతిని నిరోధించి జీవింప గలిగినను వాని కప్పుడే యముని వారంటు తయారుగ నున్నదని తెలిసికొనుడు ప్రపంచములో నిప్పుడు సమస్త దేశముల యందును జరుగుచున్న కలవరములను పరివర్తనములను బరికింపుడు. ఇవి మానవైక్యత కెంతవరకు దోడ్పడ గలుగుచున్నవో, యంతవరకవి సౌఖ్య దాయకము లగుచున్నవి. అవి యెంతవరకు ప్రతిబంధకము లగుచున్నవో, అంతవర కవి అశాంతికరములును దుఃఖదాయకములు నగుచున్నవి. ప్రతి మానవుడును తన మతమునందు తన జాతియందు, తన వర్ణమునందు, తన యాచార విచారముల యందు, తన ఆహార విహారముల యందు, సుస్థిరుడై యుండవచ్చును. కాని తక్కిన మతస్థులతో, తక్కిన జాతులతో, తక్కిన వర్ణస్థులతో, కలిసి నివసించుటకు, సమిష్టి జీవనమున బాల్గొనుటకు, సమాన ప్రతిపత్తితో మెలంగుటకు, ఎట్టి ప్రతిబంధకము నుండకూడదు.

కాని రాజ్యాంగకర్తలును సంఘ మత ప్రవర్తకులును సభాపతులును తమ పూర్వ సంప్రదాయముల నతిక్రమించుటకు సాహసింప జాలకున్నారు. ఒక క్రైస్తవుడు ఒక హిందూస్త్రీని వివాహము చేసికొన జూచిన యెడల అటు క్రైస్తవసంఘమును ఇటు హిందూసంఘమును ఆ వివాహము నశాస్త్రీయమని ఘోషిల్లును. వారికి సంఘములో గౌరవము లేకపోవుటయే కాక, వారి సంతతికి వారసత్వము మొదలగు న్యాయసంబంధమైన హక్కులు కూడ లేకుండ బోవు చున్నవి. ఇట్టి యన్యాయమును తొలగించుటకై 1878 లో ఒక చట్టము చేయ బడినది. ఇది సివిలు మ్యారేజి అక్టు అను పేరుతో జరుగుచున్నది. ఈ యాక్టు ప్రకారము వివాహము చేసికొన దలచినవారు తాము హిందువులము కాము, క్రైస్తవులము కాము, మహమ్మదీయులము కాము, పారశీలము కాము, బౌద్ధులము

కాము అని ప్రకటన చేయ వలసి యుండును. ఈ యాక్టు ప్రకారము వివాహము చేసికొనువా రే పూర్వ మత సంప్రదాయమునకు చెందకూడదని దీని యర్థము. బ్రాహ్మసామాజికు లింతవరకును ఈ యాక్టు క్రింద నీ ప్రకటన చేసికొనియే వివాహ సంస్కారములను గావించుకొనుచున్నారు. తక్కిన వారు కేవలము వివాహము కొరకు మతాంతరులగుట కూడ తటస్థించుచున్నది. ఒక క్రైస్తవ కన్యను వివాహము చేసికొన దలచిన హిందూ యువకుడు తానైనను క్రైస్తవ మతమును పుచ్చుకొన వలెను, లేదా కన్యయైనను, ఏ ఆర్య సమాజ పద్ధతి ప్రకారమో హిందు వైనను గావలయును వెనుక యొక పార్సీకన్య ఒక మహమ్మదీయుని వివాహమాడ దలచి, తన విశ్వాసమునకు విరుద్ధముగ పార్సీ మతమును విడనాడి, మహమ్మదీయ మతము స్వీకరించ వలసివచ్చెను. మరి కొందఱు తమ మతమును విడనాడుట కిష్టము లేనివారు, వివాహమునైనను వదలుకొన వలసి వచ్చుచున్నది. లేదా లోకము వివాహముగ నెంచని సంబంధమును కలిగియుండవలసి వచ్చుచున్నది ఈ పై మూడు పద్ధతులు కూడ వ్యక్తి స్వాతంత్ర్యమునకు, మత గౌరవమునకు, సంఘ పారిశుద్ధ్యమునకు భంగకరములని ఒప్పుకొనక తప్పదు. ప్రకృతిని మన కృత్రిమ నియమములచే బంధింపజాలము. ప్రకృతి యొక్క సంకల్ప మమోఘము. తన పనిని తానెవ్విధముననో నెరవేర్చుకొని తీరును. తుదకు మానవుడు ప్రకృతిని శాసించబోయి, ఆత్మవంచకుడగుట తప్ప మరియొక ఫలము సిద్ధింప జాలదు.

సకల దేశములలోను మతాంతరులతో వివాహము చేసికొనుటకు స్వాతంత్ర్య మొసగుచు చట్టములు చేయబడినవి. ఒక్క హిందూదేశమునందే యట్టి చట్ట మింతవరకును జేయబడి యుండలేదు. డాక్టరు గవరుగారు కడచిన సంవత్సర మొక బిల్లును సిమ్లా శాసనసభలో ప్రవేశపెట్టజూచిరి. ఈ బిల్లు ప్రకారము ఏ మతస్థుడైనను తన మతమును వదలకుండ అన్యమతమువారితో సంబంధ బాంధవ్యములను చేసికొనవచ్చును. ఈ బిల్లును బ్రకటించుటతోడనే అన్ని మతములలోని పూర్వాచార పరాయణులును చెలరేగిరి. కొరాను గ్రంథము

మహమ్మదీయేతరులతో బరిణయ మంగీకరింపదని మహమ్మదీయ మౌళవీలును, మతాంతరులతోడి సంబంధ మశాస్త్రీయమని హిందూ పండితులును, ఇవ్విధము ననే క్రైస్తవ మతస్థులును వాదింపదొడగిరి. ఆ బిల్లును శాసనసభలో సెలెక్టు కమిటీవారి పరిశీలన నిమిత్తము ప్రవేశపెట్టుటకు గూడ నంగీకరింపబడలేదు. డాక్టరు గవరుగారీ బిల్లును తిరిగి ఈనెల 12వ తేదీని శాసనసభలో ప్రవేశ పెట్టిరి. అప్పుడు జరిగిన చర్చ మాత్రము బహు రసవంతముగ నుండెను. ఒక మారు త్రోసివేసిన బిల్లును తిరిగి ప్రవేశపెట్టుట కూడదని రంగాచార్యులుగారు వాదించి తమ న్యాయవాద వృత్తియొక్క యుక్తికౌశలమును బ్రదర్శించిరి. ఈ బిల్లు మహమ్మదీయమత విరుద్ధమని హస్సేనాలీ, అస్టుద్ ఉల్లా మొదలగు మహమ్మదీయ సభ్యులు కొరాను పాఠములను వల్లింప మొదలిడిరి ఈ బిల్లు ఆమోదింపబడినయెడల దేశములో గలభాలు జరుగునని ఒక మౌళవీ శాసనసభను బెదిరించెను. గవర్నమెంటు ఈ బిల్లువిషయములో నే పక్షము నవలంబించక తటస్థముగ నుండునని సర్ విలియం విన్సెంటు గారు నుడివిరి. శాసనసభ ఈ చట్టము నామోదించినచో తన గౌరవ ప్రతిష్ఠలను గోలుపోవునని వంగదేశ సభ్యులగు ముఖర్జీ, మిత్రరుగార్లు నొక్కి వక్కాణించిరి హిందువునైనను కేవలము పూర్వాచార పద్ధతి ప్రకారము వివాహ సంస్కారము నవలంబించుట కిష్టము లేనంత మాత్రమున నేను హిందువును గాను, మహమ్మదీయుడను గాను, అను అర్థవిహీనమైన ప్రకటన చేయవలసినదని నిర్బంధించుట యేపాటి న్యాయమని ఎ. సి. చటర్జీగారు ప్రశ్నించిరి. ఎవరి పరిశుద్ధాంతఃకరణ ప్రవృత్తి ప్రకారము వా రాచరించుటకు ఎల్లరకును స్వాతంత్ర్య ముండవలయునని జమ్నాదాసు ద్వారకదాసు గారు పలికిరి. ఈ బిల్లు క్రొత్త పద్ధతుల ప్రకారము వివాహము చేసికొనువారికి స్వాతంత్ర్య మొసగుచున్నదే కాని, ఎవరిని సంస్కర్తలు కావలసినదని నిర్బంధించుట లేదని బి. ఎన్. మిత్రగారు సూచించిరి. ఈ బిల్లు వెంటనే శాసనము కాబోవుట లేదనియు, దీనిని మార్చదలచిన వారు సెలెక్టు కమిటీలో జేరి, తమ యిష్టప్రకారము దానిని సవరించ వచ్చుననియు డాక్టరు గవరుగారు సమాధానము చెప్పిరి. చర్చయనంతరము వోట్లు తీసికొనబడెను. ఈ బిల్లును సెలెక్టు కమిటీకి

విచారణ నిమిత్తము పంపుటకు గూడ నంగీకరింపనివారి పక్షమునకు 33వోట్లు వచ్చెను అంగీకరించినవారి పక్షమునకు 34 వోట్లు వచ్చెను. ఒక యెక్కువ వోటుతో నీ బిల్లును విచారించుటకు సమ్మతింపబడినది ఈ సెలెక్టు కమిటీవారి సలహాలు వచ్చుటకు మూడు మాసములకు తక్కువ పట్టదు. ఈ బిల్లును విచారించుటకే యింత చర్చ జరిగి, ఇంత కష్టముతో బయట పడినప్పుడు, దాని పునర్విచారణ సమయమున నియ్యదెంతవర కామోదింపబడునో చెప్పుట గష్టము.

రాష్ట్రీయ స్వాతంత్ర్యమును గోరుచున్న భారతవర్షము ఈ సంస్కరణము నామోదించక తప్పదు. వ్యక్తి స్వాతంత్ర్యము నంగీకరింప జాలని దేశమునకు రాష్ట్రీయ స్వాతంత్ర్యమున కర్హత లేదు. భారతజాతి స్వాతంత్ర్యమును గోరుచున్నది ఇంగ్లాండుయెడల ద్వేషముండి కాదు, కేవలము స్వార్థపరత్వము చేతను గాదు. భారతవర్షము విశ్వరంగ మధ్యమున సమాన ప్రతిపత్తితో నిలువబడుటకై స్వాతంత్ర్యము నభిలషించుచున్నది స్వాతంత్ర్యముద్ర అంగప్రత్యంగమున అంకితముగాని భారతజాతికి నానారాజ్యసభలో గౌరవము లేదు, స్థానము లేదు. భారతజాతి తన పూర్వపు మాంద్యమును వదులుకొన వలెను. అభ్యున్నతి పథమును ద్రొక్కుటకు దగిన ధైర్య సాహసములను జూపవలెను. పూర్వాచారములను మేము నిందింపము. కాని వాని యవసరము తీరినది. అవి యిప్పుడు పాషాణప్రాయములై జాతీయ జీవమును ప్రతిబంధించుచున్నవి. వానిని సడలించవలసిన తరుణ మాసన్నమైనది ఇంతకాలము జాతిభేదము, మతభేదము, వర్ణభేదము మొదలగు వ్యత్యాసములను గాపాడుట కేర్పడిన నిబంధనల బిగువును తగ్గించి, మానవైక్యతను బురికొల్పు నూతన సంస్థలను గల్పించవలసిన అవసరము గలిగినది. సంఘ ప్రవర్తకులీ యుగ ధర్మమును గమనించిరా, భారతవర్షము తిరిగి తన ప్రాక్తన వైభవమును బొందగలదు. గమనించరా, లోపలను, బయటను గూడ దాస్య శృంఖలముల జిక్కుకొని కృశించిపోవును.

కృష్ణా పత్రిక
సెప్టెంబరు 16 తేదీ, 1922 సం,,

# భారత శక్తి

చిత్రవిద్యా విశారదులగు శ్రీ అవనీంద్రనాథ రాకూరు గారిటీవల ఒక చిత్తరువును వ్రాసిరి. ఇందు ముువ్వురి రూపములు కాననగును. గాంధి రవీంద్రు లెదురుపడి కూర్చుండి యుందురు. గాంధి సహజ వినయ సంపత్తితో ముందు కొరిగి, మోమున, చిరునవ్వు మొలకలెత్త, రవీంద్రుని జూచుచుండును. రవీంద్రుడు అవనత వదనుడై, పద్మాసనాసీనుడై. ఏదియో దీర్ఘయోచన చేయుచున్నట్లు కనుపట్టును. అనతి దూరములో ఆంద్రూస్ కోమల విశ్వాసముతో నా యుభయులను వీక్షించుచుండును. వీరిలో నెవ్వరును మాట్లాడుచున్నట్లు లేదు. ఏరియందును చలనమైనను గానరాదు రంగముపై నిస్తబ్ధత ఆవరించి యున్నట్లు తోచును. ఆ నిస్తబ్ధత శూన్యమైనది కాదు అయ్యది చింతాశక్తిభరితమై సముద్ర గర్భము వలె నతిగంభీరముగ గోచరించును. ఈ చిత్తరువును గీయుటలో చిత్ర కారుని హృదయ మేమియో తెలియదు ఇయ్యది కేవలము రూపపటము మాత్రము కాదని చెప్పగలము. కేవల రూపపటముగ నది కొంతవరకు కొఱవడి యుండు నేమో యని సందేహము కలుగవచ్చును కాని, చిత్రకారుని ఉద్దేశము మాత్రము ఆ మూర్తిత్రయము యొక్క ప్రతిబింబములను చిత్రించుట కాదనుట నిస్సంశయము. ఇక దీని భావ మేమియై యుండునో యోచించెదము.

దీనిని యోచించుటకు దృష్టి బాహ్యమునుండి మరలి, అంతరంగమున జొచ్చవలెను. ఆ యంతరంగము ఏ యొకరిది కాక, భారతవర్షము యొక్క అంతరంగమై యుండవలెను. నేడు భారతవర్షము యొక్క బహిరంగము తరంగ తాడితమై బహుసంక్షుభితమై యున్నది. మన దృష్టిని ఈ బాహ్యతరంగముల నుండి మరల్చుట చాల కష్టము. మన మనములు ఉద్రేక పూరితములై యున్నవి. స్వపక్ష విపక్షములను ఆవేశముల యందు జిక్కుకొని యున్నాము. ముఖ్యముగ రాజనీతి మన దృష్టిని బహువికృత మొనర్చి యున్నది. ప్రతి విషయమును రాజ

నీతిబుద్ధితో జూచుట కభ్యాసపడితిమి. యుద్ధరంగములోని శిబిరముల వలె మన మును ముఠాలుగ కూడి ఒకరి నొకరు దునుమాడుచుంటిమి. మన హృదయముల కిరుప్రక్కలను స్వాభిమానము. అసహనము అను ఇద్దరు ద్వారపాలకు లెప్పుడును వేచియుందురు. ఏదియు నీ యిరువురను సమాధాన పరచనిదియు లోపల ప్రవేశించుటకు వీలులేదు. ఇట్టి సన్నిధానమున నిశ్చలమైన ధ్యానము, నిష్పాక్షికమైన పర్యాలోచనము, కష్టసాధ్యము అయినను గొంత నిగ్రహముతో దృష్టిని లోపలికి మరల్చెదము. భారతవర్షము యొక్క హృదయ కుహరమున నేడెట్టి సంచలనము జరుగుచున్నదియు దెలిసుకొనుటకు ప్రయత్నించెదము. అప్పుడేమైన ఆ చిత్తరువుయొక్క ఆంతర్య మొకింత సంభావ్యము కావచ్చును.

ఆ లోపల బయటి యాందోళనముకంటె నతితీవ్రమైన భావాందోళన మొకటి జరుగుచున్నట్లు తప్పక గోచరించును ఇట్టి సంఘట్టనము భారతవర్షమున నిదివఱ కెప్పుడైన జరిగియుండెనా యని సంకోచము కలుగుచున్నది కాని ఆ భావాందోళనమున రెండు చింతాశక్తిధార లొండొంటి నొరసికొనుచు ద్వంద్వ యుద్ధమున జిక్కుకొనిన రెండు మత్తేభముల వలె నెదురెదురుగ నిలువబడి ఢీకొనుచున్నట్లు కాననగును నిజము భారతవర్షము యొక్క భావప్రపంచమున రాజ్యము సేయుటకై ఇద్దరు మహావ్యక్తు లొక్కమారుగ బద్ధకంకణులై యున్నారు. ఉభయులును బలసంపన్నులు, మహాతేజస్వులు, స్వతంత్రులు. వీరిలో ఒకరికొకరు తీసిపోవువారు కారు గాంధి రవీంద్రు లిరువురు ఏకకాలమున భారత చిత్తాబ్జము నధిష్ఠించుటకు తీవ్ర ప్రయత్నములను గావించుచున్నారు. అచ్చట నిద్దరకు స్థలము కలదా? ఒక యొరలో రెండు కత్తు లొక్కమారుగ నెట్లు దూరగలవు?

ఈ యుభయులును సామాన్యులు కారు వీరు భారత సంజాతులైనను, వీరి నామములే నేడు ప్రపంచములోకెల్ల పూజ్యము లగుచున్నవి. ఏ దేశములోనైనను. వీరి నిరువురిని పేర్కొనిన పిమ్మటనే ఇంకొకరి నామమును స్మరించుట కర్హత కలుగుచున్నది వీరి సరసను గూర్చుండుటకు మరియొకరికి అధికారము లేదు.

ఇరువురును ఉత్తమ మానవులు; కేవలము దేవజాతికి సంబంధిచిన మహాపురుషులు. లోకమంతయు విస్మయపడునటుల వీరిరువురును అత్యున్నతమైన కైలాస శిఖరము నారోహించి, అచ్చటకు రండని సోదర మానవులెల్లర నాహ్వానించుచున్నారు. వీరిలో ఏ యొకరైనను, చాలును ఏ దేశమునైన నుద్ధరించుటకు. కాని ఒక్కమారుగ, ఒక్క దేశమునందే, ఇద్దరును ప్రత్యక్షమైరి. మానవ చరిత్రలో నిట్టి నిదర్శనము మరియొకటి లేదు. బౌద్ధయుగము నందనేక మహానుభావులు ప్రభవించిన మాట నిజము. కాని ఎల్లరును ఆ కాలమున ఒక్క గౌతమ శాక్యమునికి వశీభూతులైరి. గౌతము డొక్కడే అద్వితీయుడై భారత హృదయసీమయందు ఒక వేయి సంవత్సరములు నిరంకుశముగ, నిరాఘాటముగ, రాజ్యము సేయగలిగెను. కాని నే డేకకాలమునం దిద్దరవతార పురుషులు ప్రభవించిరి, ఇది యపూర్వము.

పోనీ, వీరిలో ఒకరధికులైనను బాగుండెడిది. రెండవవారు మొదటివారి కనువర్తులగుట కాస్పద ముండును. వివేకానందస్వామి రామకృష్ణ పరమహంసుని ధర్మమునే ప్రచారము చేసినట్లు, కేశవ బ్రహ్మనందుడు మహర్షి దేవేంద్రనాథుని పనినే కొనసాగించినట్లు, వీరిలో రెండవవారు అగ్రేసరునకు అనుచరుడై ఒకరి కార్యము ఒకరు సఫలపరచుకొనెదరు. కాని గాంధి రవీంద్రులలో అట్టి హెచ్చుతగ్గులను బరిగణించుటకు వీలు లేదు. వీరిని రాజనీతిదృష్టితో పరిశీలించుట యుక్తము కాదని పైననే నుడివియుంటిమి. రాజనీతి కక్షలను బెంచును. అందు నిర్మలదృష్టి కుంటుపడును. వీరిలో హెచ్చుతగ్గులను జూచుట కర్హు లెవరు? ఇరువురనుండియు చింతాశక్తి రెండు ధారలుగ బయల్వెడలి దేశమును ముంచుచున్నప్పుడు తారతమ్య పరీక్ష చేసి లాభమేమి? ప్రకృతి యీ యిరువుర నొక్కమారుగ సృష్టిచేసినది. ఇరువురకును ప్రకృతి సరిసమానముగ శక్తి యొసగి ఆడించుచున్నది. ఇక వారి హెచ్చుతగ్గులను పరిశీలించి ప్రకృతిని నిరసింప నొల్లకుడు,

ఈ యుభయులు ఒక్క పద్ధతికి చెందియున్నను, అంత చిక్కు లేకుండెడిది. వీ రొక్క పద్ధతివారైన యెడల, ప్రకృతి యేల నిద్దర నొక్కమారుగ సృష్టించినది ? ప్రకృతియందు వైచిత్ర్యము కలదుగాని పునరుక్తిదోషము లేదు. ఈ యిరువురి పద్ధతులు భిన్నములు, స్వతంత్రములు, అగుట చేతనే వారిరువురి రాకకు అవసరము కలిగెను. తన్మూలమున సంఘర్షణము సంఘటిల్లెను. ఈ యిరువుర భేదము రాజకీయ సంబంధమైనది కాదు అతివాద మితవాద భేదము కాదు సహాయాసహాయవర్తుల భేదము కాదు ఒకవిధముగ నిరువురును అసహాయవర్తులే ఉభయులకు ప్రస్తుత విజాతీయ రాజ్యాంగ విధానమునందు విశ్వాసము లేదు. ఉభయులును నేటి యూనివర్సిటీ విద్యాపద్ధతుల నాదరించరు ఇరువురును దేశవిముక్తిని బరాపేక్షచే సాధింపజూచు భిక్షుకులు కారు. ఇరువురకు స్వదేశధర్మమే ఆచరణీయము. ఇద్దరును ఆధ్యాత్మికవాదులు. ఇట్టి సామ్యముండుటచేతనే, వీరికి గల భేదము స్వరాజ్య పరరాజ్యములకు గల వైరుధ్యముతో గూడినదికాక ధర్మాంతర్గతమైన ప్రభేద మగుచున్నది.

ఈ ధర్మగత ప్రభేద మెట్టిది ? దాని మర్మము గాంధి రవీంద్రులకు దెలిసినట్లుగ మరియొకరికి తెలియదు కావుననే వారొకరియెడల యొకరికి భయమును. భక్తియు గలవు ఈ పోరాటమును వారు చూచుచునే యున్నారు. చూచుటయే కాదు. ఈ పోరాటము వారి హృదయములయందే నేడు జరుగుచున్నది. ఇద్దరిలో నీ పోరాటము జరుగుచుండుట చేతనే వారి చింతాశక్తి కూడ నింత తీక్ష్ణ మగుటకు గారణమైనది పోరాటము లేనిది శక్తి బహిర్గతము కాదు. ఈ సంఘర్షణమునందే భారత హృదయమున చింతాచక్ర మతివేగముతో తిరుగుచున్నది ఆ వేగమును జూచుటకే గాంధి రవీంద్రునివంక చూచుచున్నాడు. రవీంద్రుడు చింతానిమగ్నుడై పడికూడ నందుకొనియే. ఈ ధర్మప్రభేదము వలన గలిగిన చింతాస్పందనము (Thought vibration) భారతవర్షమును గూడ దాటి ఖండాంతరముల యందును ప్రతిధ్వనించుచున్నది. ధర్మములోనే ఇట్టి ద్వంద్వము పూర్వ మెన్నడును సంఘటించి యుండలేదు, ఘుదక్కిది యెట్లు

పరిణామము పొందునో యని లోకమంతయు సత్యాతురతతో జూచుచున్నది. అవనీంద్రనాథ ఠాకూరుగారి చిత్రరువునందలి ఆండ్రూసు ఆ లోకము యొక్క మూర్తి. ఆ లోకము బయటి రాజకీయలోకము కాదు. రాజకీయలోకమునకీ యాంతరంగిక ద్వంద్వమును తిలకించగల నిర్మలదృష్టి యెక్కడ? ధర్మ జిజ్ఞాస యైనను లేనిచోట్ల నిట్టి నిర్నిమేషదృష్టి వికసింపజాలదు. ఆ లోకమునకు భారతీయుడు గూడ సంజ్ఞగ నుండుటకు పనికిరాడు భారతీయుడు ప్రస్తుతము బాహ్యాందోళనములో చిక్కుకొని స్వపక్ష విపక్షములను కోలాహలములో నిమగ్నుడై యున్నాడు ఏ భారతీయునినైనను కదలింపుడు. గాంధినైనను నిరసించును. లేక రవీంద్రునినైనను నిరసించును. లేక యే జోలియు లేక కేవలము ఉదాసీనుడై యుండును. ఆండ్రూస్ యొక్క సందర్భ మట్టిది కాదు. ఆండ్రూసు బహుభాగ్యశీలి. సత్యాగ్రహాశ్రమము, శాంతినికేతనము వాని హృదయమునందు సమభావమున వెలుగుచున్నవి. ఆండ్రూసున కుభయులును గురుతుల్యులే. ఉభయులకును ఆండ్రూస్ విశ్వాసపాత్రుడు కాగలిగెను.

ఈ ధర్మగత ప్రభేద మెట్టిది? రవీంద్రునినుండి నేడొక గంభీర జ్ఞానధార విశ్వతోముఖమై బయల్వెడలుచున్నది. గాంధినుండి ఆత్మవితరణ శక్తి అపూర్వ రీతిని ధర్మప్రపంచమును కదలించి వైచుచున్నది. సమస్త దేశముల పరిజ్ఞాన ములనొక జ్ఞానవాహినియందు సంగమింప జేయుటకు రవీంద్రుడు విశ్వభారతిని సంకల్పించెను. ఆత్మవితరణముచే లోక కల్యాణమును చేకూర్చుటకు గాంధి సత్యాగ్రహాశ్రమమును నెలకొల్పెను భారతశక్తి నేడీ ద్విముఖముల భావజగత్తును స్పందింప చేయుచున్నది. భారతవర్షము జ్ఞాన సముపార్జనా మార్గము త్రొక్కెనేని దాస్య శృంఖలము లవి యంతటవియె జారిపోయి, జగద్గురు పీఠము వహించి, విశ్వసౌభ్రాతృత్వమును నెలకొల్పవచ్చునని రవీంద్రకవి బోధించుచున్నాడు ప్రస్తుత ధర్మసంఘట్టనములో భారతీయుడు జ్ఞాన సముపార్జనమును గట్టిపెట్టి ఆత్మవితరణ మార్గము నవలంబించినయెడల, భారతవర్షము తన ముక్తిని సాధిం చుకొన గల్గుటయేకాక ఖడ్గబలమునకు బలి యగుచున్న మానవత్వము తిరిగి

శాంతి కల్యాణముల తేజరిల్లగలదని గాంధిమహాత్ముడు చాటుచున్నాడు. రెంటికిని నేడు భారతాభ్యంతరమున ద్వంద్వయుద్ధము జరుగుచున్నది. ఈ రెండును ఒక ధర్మ ప్రపంచములోని వైనను బరస్పరము ఢీకొనుటకు కొంత కారణము కలదు. జ్ఞాన సముపార్జనము ఏ కొలది పండితవర్గముయొక్క సాధనకాని, జనసామాన్యమున కతీతమైన విషయము. ప్రాచీ ప్రతీచీ సభ్యతలను సమన్వయదృష్టితో పరిశీలించగల అధ్యాపకులెందరు కలరు? లోక మెప్పుడును ఏ కొలది జ్ఞానుల చేతనో ఉద్ధరింపబడుచుండు ననుట నిశ్చయము. కాని మానవజాతి నంతను నచేతనముగ చేయదగు నీ దినములలో ఒక విద్యాపీఠముచే భారత మోక్షమును సంపాదింప చూచుటయందు కొంత లోపము కలదు. ఆత్మవితరణశక్తి ఏ కొలది పండితుల యధీనమునందో యుండునది కాదు పామరులు కూడ కొలది శిక్షణముచే త్యాగసాధన నవలంబించవచ్చును. అకాలీశిక్కులు నేడుచూపుచున్న ఆత్మబలి దానమె యిందుకు నిదర్శనము. ఈ శిక్కులు విద్యాధికులు కారు. పండితులు కారు విశ్వభారతియందు శిక్షణమును గరుపగల అధికారులు కారు. కాని ఆత్మధనమునందు సాటిలేని వారు. ధర్మాగ్ని ప్రజ్వలించిన మరుసటి క్షణములో అపూర్వ త్యాగబలము వారినుండి బయల్వెడలెను. దిగువజాతులు సహితమీ మార్గము మూలమున ఒక క్షణములో తమ గర్భిత ఆత్మశక్తిని కనుగొన కలుగుదురు సమగ్ర మానవజాతి నుద్బోధింప వలసిన నీ యుగములో త్యాగసాధనకంటె సాధారణ ధర్మ మెక్కడ కలదు? కాని ఇందును గొంతలోపము కలదు. ఆధునిక యుగము జ్ఞానయుగము. సంఘముయొక్క మేధస్సునందు ప్రబోధము జరుగకుండ, హృదయము కదలినంత మాత్రమున, పరిపూర్ణత సిద్ధించదు జ్ఞానవిరహితమైన భక్తి మతావేశముక్రింద పరిణమించి, లోకశాంతికి గొంత ప్రతిబంధకము కావచ్చును. ప్రకృతి భారతశక్తియొక్క పూర్ణప్రభావమును లోకమునకు జాటుటకై రవీంద్రుని జ్ఞానసాధనకును, మహాత్ముని త్యాగసాధనకును, వైషమ్యమును పురికొల్పి విచిత్ర లీలను ప్రదర్శించుచున్నది. వీని సంఘర్షణ యొకటొకటి ప్రతిరోధించుకొనుచున్నట్లు బయటకు గనుపట్టుచున్నదే కాని నిజముగ, కలియకకై ప్రయత్నించుచున్నది ఆండ్రూస్ వ్యక్తియందు ఈ రెండు ధారల నేకోన్ముఖమునకు దెచ్చి

ప్రకృతి తన యాంతరంగికావేదనను సఫలపరచు కొనుచున్నది. ఈ చింతాశక్తి సామాన్యమైనది కాదు ఫిరంగిమందు కంటె నెక్కువ విదారణమైనది. ఈ చింతాశక్తి (Thought - power) రాజ్యములను గూలద్రోయ గలదు. సభ్యతలను తారుమారు చేయగలదు. మానవోన్నతిని నిరోధించు అవరోధము లన్నిటిని భస్మీపటలము చేయగలదు. సకల దాస్య శృంఖలములను చూర్ణము చేయగలదు. భవిష్యత్తునకు క్రొత్త బాటలను నిర్మింపగలదు. చింతాశక్తి యొక్క ప్రతిభ యద్వితీయము. అవనీంద్రనాథ ఠాకూరు ప్రణీతమైన చిత్తరువు భారతశక్తి యొక్క ద్వైవిధీభావ సమ్మేళనమును సూచించుట లేదా ?

కృష్ణా పత్రిక
అక్టోబరు 14 తేది, 1922 సం॥

# జేబున్నీసా నాటకము

భారత జాతీయ సౌధమునకు హిందూ మహమ్మదీయమైత్రి మూలభిత్తియని గాంధి మహాత్ముడుపదేశించిన మంత్రము ప్రతి జాతీయవాదియు సదా స్మరించు చుండవలసిన విధి యనుట నిస్సంశయము ముఖ్యముగ నీ సఖ్యత యంకురించు చున్న ఈ దినములలో నీ విషయమై యెంత శ్రద్ధ వహించినను, ఎక్కువ కాజాలదు. ఈ సఖ్యత కేవలము ఒక్క రాజకీయరంగము నందే కాక జాతీయ హృదయాంతరాళము వఱకు వేరు నాటుకొనునటుల సకల విధముల ప్రయత్నము చేయవలసి యుండును. సాంఘిక వ్యవస్థలలో, ఆచార వ్యవహారములలో, ఆట పాటలలో, కవితలలో, సమస్త విధముల నీ యంకురమునుదోహదము చేసినగాని, ఇయ్యది సుస్థిరముగా నాటుకొని పత్ర పుష్ప ఫల శోభితమై వర్ధిల్లజాలదు. దీనిని నాశనము చేయజూచు ప్రతికూల సందర్భము లెన్నియో కలవు. అన్నిటికంటెను ఎక్కువ ఉపద్రవకర మైనది అన్యమతాసహిష్ణుత. భారతజాతీయ నిర్మాణమును భగ్నపరచు శత్రువులలో నీ యసహనమును మించినది మరియొకటి లేదు. ఇయ్యదియే మన మాతృదేశమును మూడు నాలుగు వందల సంవత్సరములు రుధిరప్రవాహమున ముంచివేసెను. ఆ నిశిథ సమయమున భారతరంగము విద్వేషము, క్రోధము క్రౌర్యము, మొదలగు పిశాచములకు నాట్యరంగమై దుస్సహ దుఃఖ వారినిధియందు మునిగెను. ఆ కథను స్మరించిన ఎవరి హృదయము జలదరించకుండును? అయ్యది కాలమహిమ. ప్రపంచము నందంతటను అన్యమత సహన మనునది మృగ్యమై యశాంతి విప్లవముల తల్లడిల్లుచుండిన కాలమది. ఆ యుగలక్షణమే మన హిందూదేశమును గూడ నావరించి పరజాతులకు బలిగ నొనర్చెను. ఏది భారత జాతీయపతనమునకు కారణ మయ్యెనో అది తిరిగి తల యెత్తకుండ నాశనమైనగాని భారతజాతికి తిరిగి విముక్తి సిద్ధింప జాలదనుట నిక్కము, నిర్వివాదాంశము.

నేడు కావలసినది కేవలము అసహనముయొక్క అభావమే కాదు. కేవల సహనము అశాంతి లేకుండ చేయగలుగునేమో కాని, దేశమును సభ్యతయొక్క గాఢాలింగమున బంధింపజాలదు. కావలసినది సహనముకంటెను అతీతమైన, గంభీరమైన, ప్రేమతత్వము అన్యమతములను ప్రేమింపగలిగినప్పుడే సభ్యత చిరస్థాయిగ నుండగలుటయేకాక, నిజమైన శాంత్యానందముల నొసగగలదు. హిందువు లెప్పుడు మహమ్మదీయ ధర్మమును, మహమ్మదీయ సభ్యతను, మహమ్మదీయ సాహిత్యమును ప్రేమించి వాని రసామృతమును గ్రోలగలుగుదురో, అప్పుడే హిందువులు మహమ్మదీయులకు నిజమైన మిత్రులు, బంధువులు, సోదరులు కాగలరు. అయితే, మహమ్మదీయులు హిందువుల ధర్మపరతను, హిందువుల సామాజిక నీతిని, హిందువుల పూజావిధానములను, హిందువుల కళాశిల్పములను, హిందువుల వీరులను, ప్రేమింపగల ఉదారతను చూపగలిగినప్పుడే. మహమ్మదీయులు హిందువుల నాకర్షించి తమ ప్రేమయందు సమభాగులుగ జేసికొన గలుగుదురు అంతియకాని వారి సభ్యతను వీరు, వీరి సభ్యతను వారు, అంటుకొనినంత మాత్రమున మైలసోకునో యనికాని, వారి వీరులను గీర్తించిన వీరికి, వీరి వీరులను స్మరించిన వారికిని క్రోధాగ్నిరగులునని కాని, భీతిల్లుచున్నంత కాలము ఉభయుల మైత్రియు యథార్థమైనది కాజాలదు. సహనము ప్రేమగ వికసించినపుడే హిందువులు ఔరంగజేబుయొక్క స్వమతాభిమానమును, మహమ్మదీయులు శివాజీయొక్క స్వధర్మనిరతిని, గౌరవింప గలుగుదురు. అట్టి యన్యోన్య గౌరవమును బురికొల్పగల మార్గముల నన్వేషించుటయే ప్రతి జాతీయవాదియొక్క కర్తవ్యము. నేటి సంస్కర్తలు, ధర్మనిర్ణేతలు, విమర్శకులు, కవులు ఈ కార్యమును కడు జాగరూకతతో నిర్వహించవలసి యున్నది. భూతకాలమును పూర్తిగ మఱచి నూతన జాతీయ సౌధమును నిర్మింపజాలము. అట్లు ప్రయత్నించినను, అయ్యది నిలువదు భూతకాలము ఎంత శిథిలమయ మైనను, ఎట్టి ఘోర సంఘర్షణముల కాకరమైనను, అందు భావికాలపు బీజము అంకురించి యున్నదని నమ్మక తప్పదు. హిందూ మహమ్మదీయ సంఘట్టనమున మహారాష్ట్ర, రాజపుత్ర, శిక్కు రాష్ట్రములు, నిర్మాణమైనవి— ఈ రాష్ట్రముల చారిత్రము నెవరు మఱువ

గలరు? భారతీయుని జాతీయ స్మృతినుండి యవి యెప్పటికైన పరిమార్జిత మగునా? హిందూ మహమ్మదీయ మైత్రిని బలపరచు నిమిత్తము వానిపై తెరగప్పుట కంటె పరిహాసాస్పదమైన కార్యము మరియొకటి లేదు. జాతీయ నిర్మాతల కౌశల మంతయు వాని నుపయోగించుటలో గలదు— శివాజీ.రాణాప్రతాపు గురుగోవిందుల పూత చారిత్రములు అన్యమతాసహిష్ణుతను, క్రోధమును, ద్వేషమును బురికొల్పుట కైన నుపయోగించవచ్చును. లేదా, స్వధర్మనిరతి, స్వాతంత్ర్యదీక్ష, ఆత్మబలి దానము మొదలగు ఉదారగుణముల గనులుగనైన నుపయోగించవచ్చును. రచయితల యుద్దేశమును, వారి కథానిర్మాణ సంవిధానమునుబట్టి ఫలితము సిద్ధించుచుండును— మహమ్మదీయులు సైతము విస్మయానందములను చూరకొనునటుల శివాజీ చరిత్రను వ్రాయవచ్చును— లేదా హిందువులలో క్రోధాగ్ని రగుల్కొలుపు విధమునైన వ్రాయవచ్చును అంతయు వ్రాయసగాండ్ర హృదయము ననుసరించి యుండును— ఈ వీరుల చరిత్రలలో హిందూ మహమ్మదీయ సభ్యతను బురికొల్పు కథాసందర్భము లెన్నియో కలవు కవులా రసవంతమైన పట్టులను నూతన జాతీయాభ్యుదయముకొఱ కుపయోగించుట సహజము, ధర్మము. కర్తవ్యము.

జేబున్నీసా నాటకము అట్టి కథాసందర్భమై యుండ అ. కాశేశ్వరరావు గారు ''స్వరాజ్య'' పత్రికలో కృష్ణాపత్రిక వంటి జాతీయవాద పత్రిక యిట్టి నాటకమును ప్రచురించుట విచారకరమని వ్రాసిరి. వీరు నిజముగ నా నాటకమును బూర్తిగ చదివి చూచినయెడల నట్టి విపరీత వ్యాఖ్యానమును చేసియుండరని గట్టిగ చెప్పగలము. ఒక మహమ్మదీయ కన్య హిందువును ప్రేమించినట్లు సూచించుటయే ఉభయజాతులకు వైరకారణ మగునని కాశేశ్వరరావుగారుగాని వారి మహమ్మదీయ మిత్రులు కాని చెప్ప సాహసించినయెడల, అందుకు మేము సమ్మతింపజాలము. మానవ హృదయమునందలి ప్రేమవిలసనము, మానవుడు గీసికొను గిరులను దాటిపోకూడదని చెప్పిన, జాతీయవాదులు మౌనము వహించి నను ప్రకృతి యెట్లు సహించి యూరుకొన గలదు? ప్రతి సంఘమును తన ప్రత్యేకతను కాపాడుకొనుటకై విధి నిషేధములను కట్టుబాటుల నేర్పరచుకొనుచుండిన మాట నిజమే. ఒక మహమ్మదీయ మతమే కాదు. సకల మతములును మతాంత

రులతో బరిణయ మొప్పుకొనవు వెనుక భూపేంద్రనాథ బాసుగారు తీసికొని వచ్చిన ''సివిల్ మ్యారేజి బిల్లు''ను హిందువులు మహమ్మదీయులు క్రైస్తవులు సమముగ ఖండించిరి పూర్వాచారపరాయణు లెల్లరు తమ మతమున కుపద్రవము వాటిల్లినటుల ఎలుగెత్తి యరచిరి కాని ప్రకృతి యీ బిల్లులకొరకును. ఈ ధర్మ శాస్త్రముల కొఱకును, వేచియుండదు. ప్రేమ సామాన్య మానవుల యందు మామూలు రస్తాలలో నడచినను, ఒక్కొక్క ప్రేమికునియందు జాతిమతములను కల్పిత భేదముల నతిక్రమించి, మానవకోటియొక్క అంతరంగైక్యతను దివ్య వాణితో ప్రబోధించుచుండును. సకల దేశములలోను సమస్త కాలములందును ఇందుకు దృష్టాంతములు లభించగలవు. ఒక మహమ్మదీయ రాజకన్య ఒక హిందూ ధర్మవీరుని ప్రేమించినట్లుగ వ్రాయుటయే ధర్మవిరుద్ధమైనచో, ఇక మానవ హృదయమునకు శరణ్య మెక్కడ ? పంచాంగములు తప్పయిన, నక్షత్రగతులు తప్పునా ? స్వమతావేశము చేతను, అన్యమతాసహిష్ణుత చేతను, మానవ హృదయమును బంధించుటకు ప్రయత్నించవచ్చును కాని ప్రకృతి తన యమోఘ సంకల్పముచే, తన యకుంఠిత గతిచే, తన శాసనాధిక్యతను నిలుపుకొనగలదు — పూర్వాచార పరాయణులు ఆంక్ష చేయనిండు; రాజ్యాధికారులు దండింపనిండు: ప్రకృతిబలముచే జాతిమత శృంఖలములను ద్రెంచుకొని విశుద్ధ మానవత్వమునకై నిలువబడు నాయికా నాయకుల ప్రణయమహిమ ఆచంద్రతారార్కముగ వెలుగ గలదు. కవులు, కళావిదులు, ఆ ప్రణయరసము నాస్వాదించి, తమ యనూన. రచనలచే భారతీదేవికి నూతన నూతన అలంకారములను సమర్పింప గలుగుదురు. జేబున్నీసాయొక్క ప్రణయతత్వమెట్టిదో, అయ్యది హిందూ మహమ్మదీయ సమ్మేళనమునకు మంగళసూత్రముగ నెట్లు విరాజిల్ల గలదో, ముందుసంచికలో చూప ప్రయత్నించెదము. ఈ నాటకము మరిరెండు వారములలో పూర్తి కాగలదు — అప్పుడు పాఠక మహాశయు లిందలి సారమును గ్రహింప గలుగుదురు,

కృష్ణా పత్రిక

జులై 14 వ తేది, 1928 సం॥

# జేబున్నీసా నాటకము

## II

ఏ గ్రంథమైనను, ఏ వాఙ్మయమైనను, పరమతదూషణా భూయిష్ఠమై జాతిద్వేష పూరితమైనచో, నయ్యది త్యాజ్యము, గర్హ్యము. భారతవర్షముయొక్క శ్రేయమును గోరువారెల్లరు సమస్త విధముల, సర్వావస్థల నిది మనోగతము చేసి కొనవలసిన విషయ మనుట నిక్కము. దేశమును శాశ్వతముగ పరాధీనముగ నుంచుటకు పర రాజ్యతంత్రజ్ఞులు భేదోపాయమును అతిచతురతతో ప్రయోగించు చున్నప్పుడు దేశీయు లీ విషయమున పరాకుగా నుండజాలరు. అంతియకాక భారతవర్షమునకు ప్రత్యేకముగ ఈశ్వరోద్దిష్టమైన భవితవ్యము కలదు. ప్రపంచ మంతయు జాతీయ దురహంకారముచే క్రోధభూయిష్ఠమై తల్లడిల్లుచున్న తరుణ మున సమస్త జాతులును వారివారి ప్రత్యేక స్వభావ స్వధర్మములను పాలించు కొనుచు, నేక దేశమున, ఒక రాజ్యములోపల, సోదర భావముతో మెలంగుటకు ఆస్పదము కలదని లోకమునకు జూపవలసిన బాధ్యత హిందూదేశముపై బడి నది. హిందూదేశముయొక్క ఇతిహాసధారను అనాదినుండి నేటివరకు సూక్ష్మదృష్టితో పరికించినయెడల, ఈ మహాజాతీయ సమ్మేళనమే ఈదేశము లోకమునకు చాట వలసిన పారమని తెలియగలదు. జాతీయ సమ్మేళన మనిన, సకల మతములు సకల సంప్రదాయములు సకల సంఘములు, వానివాని ప్రత్యేకకళలను విశిష్ట లక్షణములను విడనాడి విలాసములేని వికాసరహితమైన ఒక మట్టిముద్దవలె నగుట కాదు. ఒక మతము, ఒక భాష, ఒక సభ్యత యుండినగాని అయ్యది ఏకరాష్ట్రముగ నుండజాలదని చరిత్ర విమర్శకులును రాజ్యతంత్రజ్ఞులును మొన్నటివఱకు బోధించుచుండెడివారు. హిందూదేశము నేడు నానాజాతుల తోడను నానామతముల తోడను నిండియుండిన కారణముచే నియ్యది ఒక్క స్వతంత్ర రాజ్యముగ వర్ధిల్లుటకు దగిన యోగ్యత లేదను బోధ యిప్పటికిని అప్పుడప్పుడు

మన శ్రోత్రపుటములపై బడుచుండును. కాని ప్రకృతిధర్మమును, సృష్టివైచిత్ర్యమును మానవస్వభావమును, పరిశీలించినవారు మానవకోటిలో భేదము లనునవి యెప్పటికిని అంతరింపజాలవని గుర్తింప గలుగుచున్నారు. ప్రాత మతము లంతరించినను, వాని స్థానమున క్రొత్త మతము లంకురించుచునే యుండును సంప్రదాయములు శాఖోపశాఖలై చీలిక లగుచునే యుండును. అచారములు వ్యత్యాసము చెందుచనే యుండును. సాధనవిధానములు సంఘమునకు, సంఘమునకేకాక, వ్యక్తి వ్యక్తికి గూడ మారుచునే యుండును. సముద్రమువలెంగి మానవజాతి యెప్పుడును భేదములచే తరంగాయితమై యొప్పుచుండు ననుట నిక్కము.

మానవజాతిలో భేదములను రూపుమాప చూచుట వట్టి వ్యర్థప్రయాస యని చరిత్ర ముక్తకంఠముతో ఘోషించుచున్నది. ఏడు వందల సంవత్సరములు రష్యను సామ్రాజ్యభారముక్రింద నణచిపెట్టబడినను పోలెండు రష్యాలో నంతర్భూతమగుట కొప్పుకొనలేదు. ఫిన్లెండుజాతి నామరూపములు లేక యంతరించినదని చరిత్రకారులు వ్రాయ ప్రారంభించిరి. ఇంతలో "నేనున్నాను. నేను నేనే" అని ఆ విస్మృత జాతినుండి ఒక మేఘగంభీర నిస్వనము దిగదిగంతముల ప్రతిధ్వనించినది. రవి యస్తమింపని అఖండ బ్రిటిషు సామ్రాజ్యమునకు చిన్న ఐర్లాండుద్వీపము బోధించుచున్న పాఠమేమి? బాల్కను రాష్ట్రముల యుదంతము కంటె వేరు నిదర్శన మేమి కావలెను? ఫిలిపైనులు, కొరియనులు, ఫార్మోజనులు మొదలగు ఊరుపేరు లేని స్వల్పజాతులనుండి సహితము "నా సంప్రదాయము, నా సభ్యత, నా దేశము" అను ప్రచండావేదన బయలుదేరినది. పూర్వముకంటె ప్రపంచములో కలయిక వృద్ధి యగుచున్నను, రైళ్ళు టెలిగ్రాఫులు దిక్కుల నొక్కచోట జేర్చినను, వానితోబాటు భేదములుకూడ వృద్ధిపొందుచునే యున్నవి. రాతిగోడలో బడిన విత్తనముకూడ చినుకు పడుటతోడనే రాళ్ళను ఛేదించుకొనుచు మొలకయెత్తి తన వృక్షత్వమును ప్రకటించుకొనునేకాని శిలలో నంతర్భూతము కాదు. ప్రచండ తీక్ష్ణ దీప్తితో వెలుగుచున్న శ్వేతజాతులు అమెరికాలోని 6 లక్షల నీగ్రోల నణచియుంచ జాలకున్నారు. ప్రకృతి మూలకంపమున

నొక్కటియైనను, నానాత్వము, వికాసధర్మమని ఒక్క వైజ్ఞానికులేకాక, సంఘ తత్వవిదులును రాజ్యతంత్రజ్ఞులును ఒప్పుకొనక తప్పదు. స్వాతంత్ర్యము, సమ త్వము, భ్రాతృభావము అను భావములయందీ నానాత్వసిద్ధాంత మిమిడియున్నది. ఈ సిద్ధాంతము నెంత బాగుగ హృదయస్థము చేసికొనిన, ప్రేమ యంత స్థిరముగ నాటుకొనగలదు. అప్పుడు స్ఫటికమణియొక్క పలు పలకలనుండి ప్రసరించు వివిధములైన రంగులవలె వివిధ మతములును, జాతులును, ఒక్క విశ్వ మానవునియొక్క విభిన్నమైన విలాసములని ద్యోతక మగును. సత్యము ఒక్క టియే కాని దాని దిక్కులు మాత్రము అనంతములు. ఏజాతియు, ఏ సభ్యతయు, ఏ మతమును, ఆ యఖండ సత్యమును బూర్తిగ వెల్లడింపజాలదు. సత్యము మానవుని బుద్ధితరంగిణియందు ప్రతిఫలించుటతోడనే అయ్యది ఖండములై చంచల స్వభావమును బొందును మానవుడు తన బుద్ధికి గోచరమైన ఖండమును బూర్ణమనుకొని అన్యుల బుద్ధికి గోచరమైన దిక్కులన్నిటిని అసత్యములని భ్రమిం చుట చేతనే వివిధ మతస్థుల మధ్య దురహంకారము, అసహిష్ణుత, క్రోధము ప్రబలి లోకము అశాంతిభూయిష్ఠ మైనది. "ఏకం సత్ విప్ర బహుధా వదన్తి" యను వేదవాక్యము మరువబడినది తన మతము సత్యమైన యెడల తద్వ్యతిరిక్తములైన మతములు కూడ నెట్లు సత్యములు కాగలవని మానవుడు మీమాంస చేసికొని ఖండన దూషణాదులకు గడంగెనే కాని ఒక్క కిరణము స్ఫటికద్వారమున ప్రకాశించినప్పుడు విభిన్నములైన సప్త వర్ణములుగా జీలుటలో గల రహస్య మును గ్రహింప జాలకుండెను.

ఈ మహాసత్యమును సిద్ధాంత రూపముననేకాక, ఒక వ్యవస్థరూపమున గూడ ప్రదర్శించుటకు ఎనుబది సంవత్సరముల క్రిందట గంగానదీ తటమున రాజా రామమోహనరాయ లోక బ్రహ్మమందిమును నెలకొల్పెను. హిందువులకు దేవాలయములు కలవు. మహమ్మదీయులకు మసీదులు కలవు. పారశీకులకు సినగాగులు కలవు. క్రైస్తవులకు చర్చీలు కలవు. వీరు వేరువేరుగ సాధన భజన

లను చేసికొనుచుండుట సహజము. కాని వీరెల్లరు ఒకచో సమావేశమై, సకల మతములకును అతీతమై సకల మతములను అంగీభూతముగ జేసికొను, విశ్వజనీన ధర్మమును ధ్యానము చేయుటకు గూడలి యింతవరకును లేకుండెను. ఉదారచరితు డగు అక్బర్‌పాదుషా తన దివ్యానుభవము కొఱకు సకల మతసాధకులను తన దర్బారునందు సమావేశపరచుకొన గలిగెను కాని, జనసంఘములో నీ యుప దేశమును సంస్థగ నెలకొల్పుటకు ప్రయత్నించలేదు. ఆ మహత్కార్యమును రాజ రామమోహనరాయలు సాధించి నూతన యుగపురుషు డయ్యెను.కాని వాని యనంత రము ఈ సంస్థ వివిధమతస్థులకు సమ్మేళన రంగమగుటకు బదులు, ప్రత్యేక సంప్రదాయముగ పరిణమించి, మతముల సంఖ్యను బెంచెను. నేడు గాంధి మహాత్ముడు తిరిగి ఎవరి మతమును వారు యథావిధిగ ననుష్ఠించుచు, పరమత ముల యెడల సహనమును చూపుటయేగాక, వాని గౌరవాగౌరవములను తనవి గానే భావించుకొనవలయు నను నూతన ధర్మమును నిదర్శనరూపముగ బోధించెను ప్రపంచములో ఎవరి మతమును వారు సంరక్షించుకొనుచుండిరి కాని, అన్యమతము నకు హాని కలిగినప్పుడు,తద్రక్షణకై కత్తిదూసిన ధీరు డింతవఱకును అవతరించి యుండలేదు గాంధిమాహాత్ము డిందుకు అగ్రయోధుడు. కిలాఫత్ విషయములో హిందువులు మహమ్మదీయులకు అలడయై నిలువవలసినదని చెప్పినప్పుడు చాల మంది విభ్రాంతిచెందిరి. హిందువులు కిలాఫత్ విషయమున జోక్యమును గల్పించు కొనుట సమంజసము కాదనిరి. హిందువులు కిలాఫత్‌ధర్మమును తమ దృష్టితో విమర్శించి, అయ్యది మూఢవిశ్వాసమని అధిక్షేపించిరి. మౌఢము కానిమ్ము, మూర్ఖ త్వము కానిమ్ము, అయ్యది మహమ్మదీయులకు ప్రాణతుల్య మైనప్పుడు, అన్యులెవరి కిని అపాయకరము కానప్పుడు,సోదరదేశీయులగు హిందువులు వారి కష్టనిష్ఠురము లలో బాల్గొనికి లాఫత్‌సంరక్షణకు బూనుకొనినగాని,హిందూ మహమ్మదీయులమైత్రి యథార్థము కాదని ఘంటాపథముగ జాటెను. స్థూలదృష్టితో పరికించిన ఇయ్యది రాజనీతివలె గనుపించవచ్చును గాని, లోతుగ నాలోచించిన యెడల నియ్యది భారతవర్షమున జాతీయనిర్మాణము నిమిత్తము అనుష్ఠించవలసిన నవధర్మమని గ్రహింప గలుగుదుము. రామమోహనుడు సర్వ సౌభ్రాతృత్వమును నెలకొల్పుటకు

సకల మతముల వెనుకనుండెడి ఐక్యతను జూపి, జనుల దృష్టిని అందు నిబద్ధము చేయజూచెను గాంధిమహాత్ముడు ఇంతకంటెను పైమెట్టెక్కి, పరమతములకు హాని కలిగినప్పుడు, తద్రక్షణకై పూనుకొని పూర్ణమైన సౌభ్రాతృత్వమునకు మార్గము చూపెను. గాంధిమహాత్ముని అసహాయోద్యమము జయప్రదము కానిండు, కాకపోనిండు మహాత్ముడు తలపెట్టిన స్వరాజ్య ప్రయత్నము సఫలము కానిండు, కాకపోనిండు కాని కిలాఫత్ సంరక్షణమును హిందువులకు పవిత్రకార్యముగ విధించుటలో మహాత్ముడొక్క హిందూదేశమునకే కాక లోకాంతరములకు శాంతిసంధాయకమైన, ప్రేమపూరితమైన దివ్యానుష్ఠానమును ప్రదర్శించి ధన్యుడయ్యెను. మహాత్ముడొనర్చిన ఘనకార్యములలో కెల్ల నిది మకుటమై తనరారును. భావికాలము మహాత్ముని చరిత్రనంతను మఱచునేమో కాని, ఈ భాగము మాత్రము ఆచంద్రతారార్కముగ యుగయుగాంతములకు దివ్యజ్యోతియై వెలుగగలదు. ఈ సత్యమును దృశ్య ప్రబంధమున బోధించుటకై జేబున్నీసా నాటకము లిఖింపబడినదని పాఠక మహాశయులకు విన్నవించుచున్నాము. హిందూ మహమ్మదీయ మతములు శివాజీ ఔరంగజేబు యోధల రూపమున హోరాహూరీని సంఘర్షణ నొందుచున్నప్పుడు, ప్రణయతత్వము జేబున్నీసారూపమున అంతర్వాహినిగ ఢిల్లీ నుండి పునహావైపునకు ప్రవహించెను. దీని సారస్యమును ముందు సంచికలో సవిస్తరముగ దెలిపెదము.

కృష్ణా పత్రిక
జులై 21 వ తేది. 1923 సం॥

# జేబున్నీసా నాటకము



ఈ వారపు సంచికలో జేబున్నీసా నాటకము సంపూర్ణమైనది. ఇప్పుడు పాఠకమహాశయు లీ రూపకమును నాంది మొదలుకొని భరతవాక్యము వఱకు జదివి అందలి గుణదోషములను పరిశీలించెదరు కాక! సగము కూడ ముద్రింప బడక పూర్వమే అ కాశేశ్వరరావు గారియ్యది హిందూ మహమ్మదీయ సఖ్యతకు భంగకరమని ఎట్లూహించి పత్రికలలో భయధ్వానముల గావింప సాహసించిరో మేము గ్రహింపజాలకున్నాము. ఈ నాటకముయొక్క శబ్ద సౌష్ఠవమునుగాని, కథా సంవిధాన నిర్మాణమునుగాని, పాత్రౌచిత్యమునుగాని, కవితా సారస్యమునుగాని, విమర్శింప బూనుకొనలేదు. అది ప్రస్తుతాంశము కాదు. ఈ రచన మన జాతీయ భావమునకు భంగకరమా యనునదియే ప్రకృతము చర్చనీయము కవిహృదయమే కాక, నాటక ప్రదర్శనము కూడ కేవలము తద్వ్యతిరిక్త ఫలసూచకమని నొక్కి వక్కాణించుచున్నాము. జేబున్నీసా నాటకము హిందూ మహమ్మదీయ వైరమును విషయముగ గైకొనినను, ఇయ్యది శాంతిరస ప్రధానమైనదని ఆలంకారికులు తప్పక యొప్పుకొనెదరని తలంచెదము ఇందలి ప్రధానపాత్ర జేబున్నీసా. ఈ కన్యాలలామ మొదటనుండి తుదివఱకు శాంతిరసమునకు అధిష్ఠాన దేవతయై యొప్పుచున్నది. ఆ పాత్ర రంగముమీదకు వచ్చినప్పుడెల్ల శాంతి మాధుర్యములు వెల్లివిరిసి ప్రవహించుచుండును. కాని నిబిడాంధకారముచే మందగించిన మన దృష్టి ఆ తటిల్లతపై నిలువజాలునా?

రణదుందుభి ధ్వానములచే దశదిశలు పిక్కటిల్లుచుండెను. హిందూ మహమ్మదీయ మతములు మత్తగజములవలె నెదుర్కొని జీవన సాగరమును మహాసంక్షోభ మొనర్చుచుండెను. బయట నెక్కడను శాంతి లేదు. భద్రత లేదు.

రౌద్ర భీభత్సములు దేశమునం దంతటను తాండవ మాడుచుండెను. జాతులు క్రోధ ప్రేరితములై నోళ్ళు తెరచుకొని ఒండొంటిని భక్షించుకొనుచుండెను. దుస్సహము! దుర్భరము! ఇట్టి క్రౌర్యమును ప్రకృతి సహితము భరింపజాలదు. ఒకానొకప్పుడు అగ్నిపర్వతములు బ్రద్దలై సస్యభరితములైన ప్రాంతములు క్షణములో భస్మీపటలము లగుచుండు నను మాట నిజము. నదులు పొంగి గ్రామములను పట్టణముల నొక్కపెట్టున పొట్టను బెట్టుకొనుచుండు నను మాట నిజము. కాని యిట్టి యుపద్రవములు స్థిరములు కావు ప్రకృతి యీ వినాశమునకు తిరిగి ఎన్నియో రెట్లెక్కువగ ప్రత్యుపకృతిని గావించును. "లావా" ప్రవాహముచే దగ్ధపటలమైన ప్రదేశము మరుసటి ఋతువులో వనలక్ష్మికి క్రీడారంగమై యొప్పును. నదియొక్క వెల్లువలకు బలియైన భూమి సస్యశాలినియై తనరారును. ప్రకృతి సహజముగ దయామయి, స్నేహమయి, కరుణామయి. అప్పుడప్పుడు ఖడ్గమును ధరించినను, కృపాణముయొక్క నిశిత ధారనుండి కృపారసమును ప్రవహింప జేయును. శ్రీకృష్ణుని నిత్యరూపము మురారి కాదు — తన వంశీగాన మాధుర్యముచే జీవులను ప్రేమరసాంబుధియం దోలలాడించు మురళీధరుడు.

ఆ హిందూ మహమ్మదీయ సంఘట్టనమున దేశము తల్లడిల్లిపోయినది. మానవ హృదయమునుండి హాహాకారములు బయల్వెడలెను. రాజ్యములు తారుమారగుగాక! ప్రాంతములు ధ్వంసమగుగాక; కాని సభ్యతలు మాత్రము నాశనము కాజాలవు. ఈవల హిందూ మతముగాని ఆవల మహమ్మదీయ మతముగాని విలుప్తమగుట యసంభవము ఈ రెండు మతములు నొక్క భారతభూమి యందు సమావేశమైనవి కాని దురభిమాన భూయిష్ఠుడైన మానవు డీ సంగమము యొక్క ఆంతర్యమును గ్రహింప జాలకపోయెను. ఒకరి నొకరు శత్రువునిగ చూచుకొని అసహనమును బెంచుకొనిరి క్రోధాగ్నిని రగుల్గొలిపిరి వైరమును సాధించిరి. అట్టి విషమావస్థయందు సకల మత ప్రసవినియగు ప్రకృతి తన ప్రేమ సందేశమును జేబున్నీసా చేతికిచ్చి భారత రంగమునకు బంపెను. ఆ శాంతిదూత యొక్క మధుర వాక్కులచే, ప్రేమశీలముచే భారతభూమి తిరిగి

ఆనందసంధాయిని యగును. స్థూలదృష్టికి ఈ సంఘర్షణము వైరముగ గనుపడు చున్నదియే కాని అది నిజముకాదు హిందూ మహమ్మదీయ మతములు సామరస్యము నొందుటకై అవి యన్యోన్యము ఒరసికొనుచుండును. ఆ యొరసికొనుటనే స్థూలదృష్టితో గాంచి వైరము పొసగినదని భయపడితిమి. పై వినాశనమునకు దిగులొందితిమి ఇది ప్రకృతియొక్క లీల ఈ విరసము భావికాలపు సామరస్యము యొక్క సూచన. భూమిని నాగలితో జీల్చినగాని పంటకు పదును గాదు విత్తనము పైభాగము క్రుళ్ళినగాని మొలకెత్తదు అగ్నిపరితప్తమైనగాని బంగారము వన్నెకెక్కదు. హిందూ మహమ్మదీయ మతముల వైరము నందుకాని సఖ్యత యుదయించలేదు.

శివాజీ ఔరంగజేబులకు సంఘటిల్లిన యుద్ధముయొక్క స్వరూపమును చరిత్రకారు లింకను సరిగ అన్వయించి యుండలేదు. పాశ్చాత్య చరిత్రకారులు స్వప్రయోజనము కొఱకు ఈ యుద్ధమును బరమార్థ రహితముగ వర్ణించిరి. శివాజీని "కొండ యెలుక" యనిరి. ఔరంగజేబును హిందూవిగ్రహ భంజకుడనిరి. కాని శివాజీయొక్క స్వధర్మ దీక్షనుగాని, ఔరంగజేబుయొక్క అన్యమత సహిష్ణుతనగాని, వెల్లడింపరైరి ఈ యుభయులు నొకరిపై నొకరు మతము పేరట కత్తిదూసినను ఎవరును అన్యమత వినాశమును గోరలేదు. మహమ్మదీయాధికారులు కొందరు క్రోధోన్మత్తులై హిందువులను చెండాడుచున్నప్పుడు. వారిని, వారి ధర్మమును, సంరక్షించుటకు శివాజి ఖడ్గపాణి యయ్యెను. హిందువులలో స్వదేశ భక్తిని ఉద్దీప్తి నొందించెను "స్వధర్మే నిధనం శ్రేయః" యను ధర్మమును బోధించెను. అంతియకాని, మహమ్మదీయ మతమునుగాని, మహమ్మదీయ జాతినిగాని నాశనము చేయ సమకట్టలేదు ఈ నాటకములో చిత్రింపబడిన శివాజీ మహమ్మదీయులకు పూజాపాత్రుడైన యోధుడుకాని వారి క్రోధమును రగుల్గొలిపిన వైరి కాదు. ఈ శివాజీ మహమ్మదీయ స్త్రీలను రక్షించెను. మహమ్మదీయుల మసీదులను గాపాడుటయేకాక, తన రాజ్యమునందున్న మహమ్మదీయుల కొఱకు ప్రజల శ్శుంకములనుండి క్రొత్త మసీదులను గట్టించెను.

భారతవర్షము సర్వమత సంధాయినియై విలసిల్లుగాక యని భగవాముని గీర్తించెను,

ఔరంగజేబు క్రూరుడు కాదు. విగ్రహ భంజకుడును కాదు. జేబున్నీసా యొక్క తండ్రి యని చెప్పిన చాలును వాని సర్దారులు, సేనాపతులు అచ్చటచ్చట హిందువులను బీడించుచున్నట్లు, హిందూ దేవాలయములను నాశనం చేయుచున్నట్లు. తెలియుటతోడనే తన సామ్రాజ్యమున అట్టి యన్యమతాసహిష్ణుత కూడదని ప్రకటించెను హిందూమతావలంబకుల జోలికి బోయిన సర్దారులు కఠిన దండనల కర్హులగుదురని చాటెను. ఈ ఫర్మానా కేవల మీ కవియొక్క కల్పన కాదు ఔరంగజేబుయొక్క చరిత్రకారుడగు యదునాథ సర్కారుగారిటీ వల దీనిని గనిపెట్టి ముద్రించెను. ఇట్టి ఫర్మానాను బ్రకటించిన ఔరంగజేబును, మహమ్మదీయులకు మసీదులను గట్టించి. మహమ్మదీయ స్త్రీలను, తన సర్దారులు చెరబట్టినప్పుడు విడిపించి రక్షించిన శివాజియు, పాఠకుల మనముల నెట్లు రంజింపజేయ గలరో వేరుగ జెప్ప నక్కరలేదు

జేబున్నీసా కామిని కాదు - కవయిత్రి. ఈ విదుషీమణి రచించిన ప్రేమ గీతములు ఉర్దూ సాహిత్యమున నిప్పటికిని నిలచియున్నవి. ఈ కన్యారత్నము శివాజీయొక్క స్వధర్మ దీక్షను గాంచి సమ్మోహిత యగును. కాని తన ప్రేమను బహిరగ పరుపదు. రాజరాజ దండనమునకు భీతిల్లియా ? కాదు, స్వమతస్థుల యాగ్రహమునకు బెదిరియా ? కాదు. తన ప్రేమ శివాజీయొక్క స్వధర్మదీక్షకు భంగకారణ మగునని భయపడెను డిల్లీపాదుషా యొక్క కుమారిక త్రిలోక సుందరి - కవయిత్రి ఏ నాయకు డిట్టి కన్యయొక్క వలపువలలో జిక్కకుండును ? శివాజీ ఉన్నీసాకొఱకు స్వధర్మ దీక్షను త్యజించి మతాంతరుడైన పిమ్మట జీవచ్ఛవముకాక మరియేమి ? ఉన్నీసాయొక్క ప్రేమకు భాజనమైన లక్షణము లిక శివాజీయందేమి యుండును ? శివాజీ పాదుషాకు సేనాధిపతి యగుగాక ! లేక ప్రధానమంత్రి యగుగాక ! ఉన్నీసా ఇట్టివానిని ప్రేమింప జాలదు. శివాజీపతనమునకు దాను గారణము కాజాలదు. అట్టి యాలోచనను

తాను సహింపదు. కాని శివాజీని ప్రేమింపకుండ నుండజాలదు. ప్రేమ ప్రాణదాయి. ఉస్నీసా శివాజీని చెరనుండి తప్పించును. హిందూ మహాసంఘము తనను తాను గాపాడుకొనుటకు ఏ శక్తి శివాజీరూపమున బహిర్గత మయ్యెనో, దానిని సంరక్షించి, అన్యమత రక్షణమన నేమియో లోకమునకు జాతి ప్రకృతియొక్క ఆదేశమును యథావిధిగ నెరవేర్చును ఉస్నీసా యీ కార్యమును చేయుటచే మొగల్‌పాదుషాకు విద్రోహ మొనర్చెనా ? లేదు. తన ప్రేమవిలసనముచే ఔరంగజేబునందు సహన సౌశీల్యాది గుణముల నుదయింపజేసెను. ఉస్నీసా తన కామసంతృప్తికొఱకు స్వమతమును వీడలేదు. శివాజీని మానభ్రష్టునిగను జేయలేదు. స్వధర్మానష్ఠానమును తాను బాలించుకొనెను. హిందూ స్వాతంత్ర్య సంరక్షకునకు అభయహస్త మొసగెను. ఉస్నీసావంటి ఉదారచరిత, శాంతి దూత, ముసల్మాను సంఘమున బుట్టిన తరువాత నెవరీ సంఘమును ప్రేమింప జాలకుందురు ? గౌరవింపకుందురు ?

గాంధిమహాత్ముని శృంగధ్వని యీ నాటకమున వినిపించుచున్నది. మహాత్ముని హిందూ మహమ్మదీయ సఖ్యతాసందేశము నూతనమైనది కాదు. అది భారతవర్షము యొక్క హృదయాంతరాళమున అనాదినుండియు బ్రతిధ్వనించు చునే యున్నది. ఋషులు హిమాద్రిశిఖరముల నుండి "ఏకం సత్ విప్ర బహుధా వదన్తి" యను మంత్రము నెప్పు డుచ్చరించిరో అప్పటినుండియు ఆ సందేశము ప్రతిధ్వనించుచునే యున్నది. ఎప్పుడు శ్రీరామచంద్రుడు దక్షిణ యాత్ర చేసి ఆర్యానార్య సమ్మేళనమునకు దారి చూపెనో అప్పటినుండియు నీ సందేశము ప్రతిధ్వనించుచునే యున్నది. ఎప్పుడు గౌతమ శాక్యముని జ్ఞానధన మును సంస్కృత పేటికలనుండి పెల్లగించి జనసామాన్యమున కంఠకు బంచి పెట్టెనో అప్పటినుండియు నీ సందేశము ప్రతిధ్వనించుచునే యుండెను. ఎప్పుడు కబీరుదాసుని జిహ్వాగ్రమున రామ్ రహీముల నామములు నృత్యము చేసెనో అప్పటినుండియు నీ సందేశము ప్రతిధ్వనించుచునే యుండెను. ఎప్పుడు జేబు న్నీసా శివాజీయొక్క స్వధర్మ నిరతిని ప్రేమించి రక్షించెనో అప్పటినుండియు

నీ సందేశము ప్రతిధ్వనించుచునే యున్నది. ధర్మ సామంజస్యమే భారతేతి హాసము వెనుక నున్న శ్రుతి. ఆ శ్రుతికే సకల యుగములు మేళవింపబడినవి. ఆ శ్రుతియే నేడు మహాత్ముని ముక్తకంఠము నుండి దివ్యవాణిగ శబ్దాయమానం బగుచున్నది జేబున్నీసా నాటకమును బరించినవారును, ప్రదర్శించినవారును, వీక్షించినవారును, ఈ రససిద్ధిని బొందగలుగుదురు. ఇదియ నాటకముయొక్క ఫలశ్రుతి

కృష్ణా పత్రిక
జులై 28 వ తేది, 1928 సం॥

# తెలగ మహాసభ

ఈ నెల 7వ తేదిన బందరులో సమావేశమైన ప్రథమ తెలగ మహాసభ, నేడు దేశములో నన్నివైపుల వ్యక్తమగు చున్న జాతీయ జాగరణమునకు నిదర్శనముగ నున్నది సభ యనుట తోడనే విద్యాధికుల దృష్టి సామాన్యముగ ఉపన్యాసముల మీదను, తీర్మానముల మీదను, ప్రాలును. కాని కాపు మహాసభ యందు గావింపబడిన ఉపన్యాస తీర్మానాదుల యందు విశేష మేమియు లేదు. సన్మాన సభాధ్యక్షులగు తోట పేరయ్యనాయడు గారి యుపన్యాసముగాని, సభాపతులగు శ్రీ రాజా బొమ్మదేవర వేంకటరాయల నాయడు బహద్దరుగారి యుపన్యాసముగాని. సామాన్యముగ రాజకీయ సభలయందు గనుపడు మామూలు ధోరణుల ననుసరించి యుండెనేకాని, దేశములు దృశ్యాదృశ్యముగ ప్రజావళిని గదలించి నూతన జాతీయ నిర్మాణమును బురికొల్పుచున్న నవశక్తి యొక్క స్వరూపము నొకించుకియైనను స్పృశించకపోవుట శోచనీయము. సభలో జేయబడిన తీర్మానములు కొంతవరకు స్వకులాభివృద్ధికి సంబంధించిన సంస్కార సూచకములై యున్నను, హిందూదేశమునే గాక, సర్వఖండముల నూగించుచున్న నవ్యభావములను వ్యక్తీకరించుట లేదు. ఈ సందర్భమునుబట్టి మన విద్యాధికుల దృష్టి యింకను స్థూలమైన బయటి రాజకీయ విషయముల యావరణ నతిక్రమించి మానవసంఘములను, సృష్టింపుచు, మార్చుచు, వికాసము నొందించు ప్రకృతి తత్వమును పరిశీలనతో బరికింప గలుగుట లేదని తేటపడుచున్నది. ఏ నాలుగు సంవత్సరముల క్రిందనో యిట్టి మహాసభ సమావేశ మగుటకు ఆస్పద ముండెనేమో సభాధ్యక్షులు ప్రశ్నించుకొని యుండినయెడల, వర్తమాన పరివర్తనము యొక్క చిత్రగతు లొకించ దృగ్గోచర మయ్యెడివి.

తెలగ మహాసభకు సుమారు మూడు వేలమంది కాపు మహాజనులు విచ్చేసిరి. పీఠాక గ్రామముఖ్యాధు కాధు, ఒక తాల్లూకాదార్లు కాదు, ఈ జిల్లాలోని షన

మూడు తాలూకాల నుండియు, కుగ్రామముల నుండి సహితమూ, పిలుపు నందు కొని యాత్రాస్థలమునకు వచ్చినటుల విచ్చేసిరి. వీరు ఆంగ్లభాషా సంపర్కము గలవారు కాదు. సామాన్యముగ రాజకీయ రంగములందు వేషాభినయ ప్రదర్శనములను గావించు నాయకులు కారు ఏ కొలదిమందియో అట్టి విద్యాధికులును వచ్చియుండిరి. కాని విశేషజనము అచ్చకాపులు, భూస్వాములు, కృషీవలులు, కాయకష్టముచే జీవించు సచ్ఛూద్రులు వీరిలో గొందఱు విద్యాధికుల నాగరిక వేషముల ననుకరించినను, వారి వర్చస్సు మాత్రము విద్యాధికులలో వలె వాడిపోయి యుండలేదు వారింకను భూదేవిని నమ్ముకొని యున్న విశ్వాసులు — నిష్కపట జీవనములను గడుపుచున్న సరళ హృదయులు — నిరంతరము ప్రకృతితో చెలిమి గరపుచున్న పురుషులు. పచ్చిక బీళ్ళపై నావరించియుండు స్వచ్ఛంద విశ్రాంతి, జొన్నచేనుల యందు వినబడు కలకల ధ్వని, పంటకాలువల నమ్రతతో గూడిన నడక, గోవుల విశ్వాసముతో గూడిన విలోకనములు యీ కాపు మహాజనుల యందు ప్రతిఫలించుచుండెను. వారి నిగనిగ లాడుచుండు శరీరములను, కండపుష్టిగల భుజస్కంధములను, ప్రాణవిలసనముతో విరాజిల్లుచున్న ముఖమండలములను, గాంచిన, హిందూజాతి యొక్క నిజశక్తి, ప్రాణ మర్మము, దేహపాటవము, కోమల విశ్వాసము, ఎక్కడ దాగియున్నవో బోధయగుచుండెను. వారిని జూచిన వెనుక విద్యాధికులు తమ శుష్క కాయములను పర్కాశాల వెనుక నెందుకు మరుగు జేసికొనుచున్నదియు తెల్లమైనది పట్టణములును, ఆధునిక శిక్షణా పద్ధతులును, నవీన నాగరకుల నెట్లు పీల్చి పిప్పిచేసి. జీవచ్ఛవములుగ జేయుచున్నదియు గ్రాహ్యమైనది. ప్రకృతి తనను విశ్వసించి ఆశ్రయించుకొనిన వారినే రక్షించునుగాని, తనను విడనాడి దూరస్థులగు వారిని భక్షించునని కూడ గోచరమైనది.

ఏందు కింతమంది జానపదులు గుంపులు గుంపులుగ బయలుదేరి వచ్చిరి? విద్యాధికుల వచోమాధుర్యమును గ్రోలుటకా? కాదు రాజ్యతంత్రజ్ఞుల ప్రాగల్భ్యమును జూచి యానందించుటకా? కాదు. వారి యుపన్యాసములను విని చప్పట్లు

చరచి యుండవచ్చును. తీర్మానములకు జేతు లెత్తమన్నప్పుడెల్ల జేతులెత్తి యుండవచ్చును. కాని ఇవి ఏవియు వారి హృదయమర్మము నాకర్షించి యుండ లేదని మేము నొక్కి చెప్పగలము. నాయకులు వీరిని తమ స్వార్థమున కుపయోగించుకొనినను ఉపయోగించుకొందురు గాక. వారి కోమల విశ్వాసమును సాధన భూతముగ జేసికొని ఉన్నత పదవులను బడసినను బడయుదురు గాక! ఇవన్నియు బయటి వికారములు కాని వీని యన్నిటి వెనుకను, ఒక చైతన్యము వారియందు వికసించుచున్నదని వారిని జూచినంత మాత్రనే తోచగలదు. ఆ చైతన్య మిప్పుడు పుట్టినది కాదు అది ప్రకృతి జన్మతః వారియందు నాటిన బీజము— అదియె యనాదినుండియు వారినిబట్టి ఒక మార్గములో నడిపించుచున్నది— అదియే వారి యాచార వ్యవహారములను, వారి సంబంధ బాంధవ్యములను, వారి నీతి మర్యాదలను, గాపాడుచు వచ్చినది. అదియే కులము — కులము సంకుచిత మైనది కావచ్చును, స్థానికమైనది కావచ్చును, కాని కల్పితము మాత్రము కాదు. వ్యక్తి యెంత యథార్థమో, కుటుంబ మెంత యనివార్యమో, కులముకూడ అంత స్వభావసిద్ధము. కులమే మానవునకు ప్రాణము, బలవర్ధకము, నీతిదాయకము. దానిని విడనాడిన వ్యక్తి నీటబాసిన కమలము భంగి వాడిపోవును. నీ చరిత్ర యంతయు నీ కులమునందు మూర్తీభవించి యున్నది. నీ పూర్వరూపము నీ కులమునందే కలదు. కులము ద్వారముననే వ్యష్టి సమిష్టిజీవనమున సంగమించి అపూర్వమైన సంఘశక్తిని బొందును. మానవుని పురోభివృద్ధియందు కులము గావించిన ఉపకారము మరి యే యితర వ్యవస్థయు జేసియుండలేదని మానవ చరిత్రను బరిశీలించిన విజ్ఞులు చెప్పగలరు.

తెలగ మహాజన సభ యీ కులప్రబోధము యొక్క విలాసమేకాని మరి యొకటి కాదు. "మేము తెలగవారము, మేము కాపులము.'' అను యాత్మజ్ఞానమే నేడీ మహాసభయందు వెలిగినది. దేశములలో ననేకమైన తెగలు కలవు. సర్వవిధముల తెలగ సంఘమును మించిన సంఘము లెన్నియో కలవు కాని కులమను సందర్భము వచ్చుటతోడనే చిన్నగొప్పలను భేదము లేదు. ఎవరి తల్లి వారికి పూజ్యురాలు. ఎవరి కులము వారికి గొప్పది. ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి." "మేము కాపులము" అను ఆత్మజ్ఞానము, స్వాభిమానము, హృదయాంతరాళమున

ప్రజ్వరిల్లుచుండుట చేతనే యీ మహాసభయొక్క ఆహ్వానము నింతమంది సంత సముతో నందుకొనిరి అది వారికి తల్లిపిలుపు వలె మధురమైనది "అబ్బాయి" యని అమ్మ పిలుచుటతోడనే ఏ కొమారుడు పరుగిడి రాకుండును? కులాభిమాన మన అట్టిది దేశ మంతయు నొకటై ఒక విధముగ నడుగు వేయవలసిన తరు ణములో నిట్లు కులాభిమానములను బెంచుకొనుట యుక్తమా యని శంక కలుగ వచ్చును. కాని దేశమన నేమి? ఒక కాలమున నలుగురు విద్యాధికు లొకచో జేరి దేశమన తామే యని మిడిసిపడుచుండెడివారు ఏ యేబదిమంది విద్యాధికులో, ఏ నూరుగురు విద్యార్థులో, గూడి మహాసభ జయప్రదముగ జరిగినదని ప్రక టించుకొనుచుండెడివారు. విద్యాధికులలో బ్రాహ్మణులే యెక్కువమంది యుండు చుండుటచే నివి యొక విధముగ ఆంగ్లబ్రాహ్మణ సభలుగనే యుండెడివి. ఈ భ్రాంతిదేవత కొంతకాలము నిరాఘాటముగ రాజ్యము చేసిన మాట నిజము.

బ్రాహ్మణేతరోద్యమము బయల్వెడలిన పిమ్మట నీ భ్రాంతి కొంతవఱకు విచ్చినది. కాని ఈ బ్రాహ్మణేతరము కూడ పైదాని వలెనే కాల్పనిక మైనదేకాని అంతర్గతముగ నొక సూత్రము కలది కాదు. బ్రాహ్మణుల సర్వాధిపత్యమును తొలగించుటయే కర్తవ్యమై యున్నంత కాలము బ్రాహ్మణేతరోద్యమము గొంత బనిచేసినది. ఆ కర్తవ్యము చాలవఱకు నెరవేరినది. ఇప్పుడు జరుగుచున్న మున్సి పల్, తాలూకా, జిల్లాబోర్డు యెన్నికలనుగాని, నేటి శాసనసభల యెన్నికలను గావి, బరీక్షించినయెడల బ్రాహ్మణ విద్యాధిక మండలి యొక్క రాజకీయాధిక్యత య స్తమించుచున్నదని స్పష్టపడగలదు, రాజకీయ విషయములో బ్రాహ్మణేత రోద్యమము దేశమునకు గావించిన మేలు శూన్యమైనను, సాంఘికముగ మాత్రము అద్భుతమైన కార్య మొనర్పగలిగిన దనుట నిస్సంశయము. అంతవరకు నిద్రించు డున్న సంఘములు మేల్కొనినవి. అంధవిశ్వాసము నందు మునిగియున్న కులములలో వివేచనాశక్తి, స్వాభిమానము, ఆత్మవిశ్వాసము ఉదయించినవి. ఏ యితర ఉద్యమము ఇంత త్వరలో, బహుళముగ కార్యకారియై యుండలేదు. కాని యీ యుద్యమము యొక్క నాయకులయందు జాతీయభావముకాని, నిజ

స్వాతంత్ర్యానురక్తిగాని ప్రబలి యుండకపోవుటచే బ్రాహ్మణేతర సంఘములో విజృంభించిన నూతన శక్తిని ఊర్ధ్వముఖముగ నడిపింప లేకపోయిరి. కాని కలిగిన ప్రబోధము అటులనే నిలిచియుండదు. అది సంఘము లోపల ఇనికి, వివిధ కులములయొక్క వ్రేళ్ళవఱకు వ్యాపించినది. వెనుకటి శాసనసభల యెన్నికలలో బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదములు ప్రబలి యుండ, నేడు కమ్మ, కాపు, రెడ్డి, వెలమ, క్షత్రియ మొదలగు కులకక్షలు ప్రబలుచుండుట కనులార గనుచున్నాము కాని యిలదుచే నిరుత్సాహపడవలసిన పని లేదు. బ్రాహ్మణేత రోద్యమము వచ్చి బ్రాహ్మణ విద్యాధికుల ప్రభుత్వమును గూలద్రోసినట్లే, ఈ కులాభిమానముల వలని బ్రాహ్మణేతర విద్యాధికుల పట్టముకూడ పడిపోవు సూచనలు కనుపట్టుచున్నవి. అన్యకులములోని విద్యాధికుని కంటెను, స్వకులములోని ఇంగ్లీషురాని రయితే తమకు సరియైన ప్రతినిధిగ నుండగలడను విశ్వాసము ప్రజలలో నెప్పుడు వ్యాపింప సాగినదో, యప్పుడే విద్యాధికుల యాధిక్యత యంతరించు దినములు సమీపించుచున్న వనుట నిశ్చయము. విద్యాధికులు ప్రజాశక్తికి దోసిలొగ్గవలసిన మహోదయము వచ్చుచున్నది.

ఈ దృష్టితో బరికించినయెడల, నేడు మన తెలుగు జిల్లాలలో బయలు దేరిన కులాభిమానములు శుభప్రదములు కాగలవని తోచితీరును. కులాభిమానములు యథార్థములు. నిద్రాణమైన శక్తులను మేలుకొలుప గలవి. ఆత్మవిశ్వాసమును బురికొల్ప గలవి. సంఘబలమును దోహదము చేయగలవి. ఎందుచే నైననేమి, కులాభిమానములు ప్రజ్వరిల్లుచున్నవి. నాయకుల కర్తవ్యము వానిని జల్లార్చుట కాదు. వాని నెల్లను స్వాతంత్ర్యరథమునకు గట్టి నడిపించినయెడల, దేశము త్వరలో గమ్యమును జేరగలదు. దేశము నిద్రించి యున్నపుడు, అంతయు నొక్కటివలెనే కనుపట్టినది. కాని అది మృత్యువుయొక్క ఛాయ. అందు జీవము లేదు. వికాసము లేదు, శక్తి లేదు. నేడు దేశము మేల్కొనినది. అనగా సకల మతస్థులు, అన్ని వర్ణములవారు, సర్వకులములవారు మేల్కొనినారు. ఈ మేలు కొలుపుతో స్వాభిమానములు బయలుదేరినవి. కానిందు అవయవములెల్ల కదల

నారంభించినవి, సంచలనము కలిగినది. ఇక నివి యన్నియు నేకము కాగలవు ఈ యల్లకల్లోలమునుండి జీవముతో గూడిన శాంతి ప్రబలును ఈ సంఘర్షణము నుండి సామరస్యముతో గూడిన వికాసము విలసిల్లును. ఈ స్వాభిమానముల నుండి ఏకోన్ముఖమైన ప్రజాశక్తి యుద్భూత మగును. తెలగ మహాసభ యిట్టి మహోదయము రానున్నదని జాగంట మ్రోగించినది. సమస్త కులములును శంఖమును బూరించి ముందుకు నడచుచున్నవి. వాని సమ్ముఖమున మాతృ మందిరముయొక్క స్వర్ణశిఖరములు దివ్య స్వప్నములవలె భాసిల్లుచున్నవి. యాత్రికులారా! మీ మీ కులము లొసంగగల కానుకలతో, మీ కుల గీతములను బాడుకొనుచు, మాతృదర్శనము కొఱకు అడుగిడుడు. తల్లి మిమ్ముల నందఱను ఒక్క ప్రేమాశ్లేషణమున కౌగలించుకొని, ఆశీర్వదించి, ధన్యులనుగ చేయ గలుగును. భయపడకుడు.

కృష్ణా పత్రిక

అక్టోబరు 13 వ తేది, 1923 సం॥

# అకాలీ యజ్ఞము

నేడు అకాలీ యుద్యమము పాల్పడుచున్న పరీక్షను లోకమంతయు సత్యాతురతతో గనుపెట్టుచున్నది. వెనుకటి చరిత్రనుబట్టి అకాలీ లిప్పటిపరీక్షయందు కూడ నుత్తీర్ణులై శాశ్వత కీర్తిని బడయగలరను విశ్వాసము కలుగును. కాని యీ పరీక్ష ఎవ్విధమున జరుగుచున్నదియు, దీని నెదుర్కొనుటకు శిక్కులెట్లు సంసిద్ధు లగుచున్నదియు దెలిసికొనుట యుక్తము. అకాలీ యుద్యమము సరాసరి కాంగ్రెసుకు సంబంధించకపోయినను, అయ్యది గాంధిమహాత్ముని అహింసాత్మకమైన సత్యాగ్రహముయొక్క పరిణామమే యని ఒప్పుకొనక తప్పదు. పోలీసువారు ప్రకటించిన వృత్తాంతములలో కూడ నీ యుద్యమము మహాత్ముని చేతనే ప్రేరేపింపబడిన దని నుడువబడినది. గురుకాబాగును వశపఱచుకొనుటలో అకాలీలు గావించిన శాంతయుద్ధము మహాత్ముడు బార్డోలీలో తలపెట్టిన సంకల్పము యొక్క క్రియారూపమే యని కాంగ్రెస్‌నాయకులు కూడ శ్లాఘించిరి. కాంగ్రెస్ పూర్వపు భిక్షాపాత్రను వదిలివేసి సత్యాగ్రహ ఖడ్గమును ధరించి నప్పటినుండియు, దేశీయులలో నొక యపూర్వమైన శక్తియు, నిగ్రహమును బయల్వెడలిన వనుట నిస్సంశయము. అటు ముల్షీపేటలో. ఇటు గురుకాబాగులో. నిటీవల నాగపురములో—ఎచ్చట స్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లినను సత్యాగ్రహాగ్నియే ప్రజ్వలించినది. సత్యాగ్రహము హిందూదేశీయులకు తారకమంత్రమైన దనుట నిక్కము. ఇట్టి సందర్భములో కాంగ్రెసు అకాలీపరీక్షను బయటి విషయముగ నెంచుకొనజాలదు. అకాలీలు సత్యాగ్రహముయొక్క శాంతఖడ్గమును విసర్జించ నంతవఱకు అకాలీలు ప్రదర్శించుచున్న సాధనాబలమును కాంగ్రెసు తనదిగనే భావించుకొనక తప్పదు. కావున నీ పరీక్షను ఏ పంజాబుమూలనో జరుగుచున్న ఒక వృత్తాంతముగ గాక, మహాత్ముని అధ్వర్యమున భారతవర్షము ప్రారంభించిన యజ్ఞములోని భాగమును భావముతో తిలకించెదముకాక.

గవర్నమెంటువారు శిక్కు మత సభయగు శిరోమణి గురుప్రబంధక సంఘమును, వాలంటీర్ల సమితులగు అకాలీ దళములను, రాజద్రోహకరమైన సభలుగ నిషేధించి, వానికి సంబంధించిన నాయకులను బంధించి నప్పటినుండియు నీ యకాలీ యుద్యమములో మరియొక పర్వము ప్రారంభ మైనదని నమ్మవచ్చును. గవర్నమెంటువారి చర్యలు శిక్కులకు విస్మయమునుగాని, భీతినిగాని, గలిగింపలేదు. గవర్నమెంటువారిట్టి చర్యల నవలంబింప బోవుచున్నారని రెండు మాసములనుండియు ఋకారు వ్యాపించి యుండెను. అప్పటినుండియు ప్రబంధ సంఘమువారీ రాబోవు పరీక్షకు సంసిద్ధులగుచునే యుండిరి. గవర్నమెంటువారు కూడ నీ విషయములో గడు జాగరూకతతో బ్రవర్తించుచున్నట్లు గనుపట్టుచున్నది. రెండు మాసముల క్రిందనే చాల పోలీసు సిబ్బంది అమృతసరమునకు వేంచేసెను. శిక్కు నాయకు లందరకు అరెస్టువారంట్లు సిద్ధముగ నున్నవని వదంతి ప్రబలెను. జనులలో నపూర్వమైన కలవరము ప్రజ్వలించెను. ప్రజలలో సంక్షోభము పుట్టిన వేళలో నాయకుల నరెస్టుచేయుట యుక్తము కాదని కాబోలు వారంటులను జారీ చేయకుండ నిలిపివేసిరి జనులలో గలవరము తగ్గిపోవువరకు వారేమియు జేయలేదు. చాలమంది యా వదంతి నిజమైనది కాదని కూడ తలంచిరి. ఇండియన్ పోలీసు ఆఫీసర్లకు గూడ నీ యుపేక్ష యర్థము కాలేదు. దాదాపుగ నంతయు జల్లబడి, జనులు, పరాకుగనున్న సమయములో నొక దినమున అకస్మాత్తుగ అరెస్టులు, సోదాలు ప్రారంభ మయ్యెను. శిరోమణి కమిటీలో మెంబరుగ జేరుటయే నేరమని ఉత్తరువు చేసిరి. అకాలీ దళములు రాజద్రోహ సంఘములుగ శాసింపబడినవి. అంతయు నొక్కమారుగ జేయబడెను. కాని గవర్నమెంటువారు వీనికి సంబంధించినవారి నందరిని అరెస్టు చేయలేదు. ఎవరీ యుద్యమమునకు మెదడుగ నుండి నడుపుచున్నారని వారికి అనుమానము తగిలెనో ఆ కొలది నాయకులను మాత్రమే పట్టుకొని కొట్టులో బెట్టిరి. ఎక్కువమంది నరెస్టుచేసిన కొలదియు జనులలో నెక్కువ కలవరము చెలరేగునని గవర్నమెంటువారికి బాగుగ

దెలియును. ఈ యుద్యమము యొక్క మెదడును మాత్రము పట్టుకొని పిసికి వేసిన యెడల, ఉద్యమ మది యంతట నదియె నశించి పోవునని వారి నమ్మకము. కావున ఏ కొలదిమందిని బట్టుకొనిన నీ యుద్యమ మంతరించునని వారు నమ్మిరో అంతమందినే వారు పట్టుకొనిరి. గవర్నమెంటువారి సందర్భములో నవలంబించిన క్రొత్త పద్ధతి యిది.

అకాలీ లీ రహస్యమును గ్రహించిరి. ఈ యుద్యమమునకు ఆయువు పట్టు లనదగిన వా రరెస్టయిన మాట నిజము ప్రారంభ దశలోనే గవర్నమెంటు వారీ చర్య నవలంబించి యుండిన యెడల నీ యుద్యమ మేమయ్యెడిదో చెప్ప జాలము. అకాలీ యుద్యమము నేడు పరిపక్వస్థితి యందున్నది. శిక్కు సంఘ మంతయు నొక్క జీవివలె మేల్కొనినది స్త్రీలు సహితము తమ ప్రాణముల నర్పించుటకు సంసిద్ధులై యున్నారు అకాలీ యుద్యమ మిప్పు డే నలుగురి నాయకుల మీదనో ఆధారపడి యుండలేదు ఒక నాయకుడు పోయిన, వాని స్థానములో పదిమంది దుముకుటకు సిద్ధముగ నున్నారు సంఘమంతయు నొక యంత్రము వలె బనిసేయగల శిక్షణ మలవడినది నాయకులు శిక్కుసంఘము సజీవముగ నొనర్చి, ఒక్క పద్ధతిలో నడుపగల స్వతంత్ర శక్తి ప్రసాదించుటకు బనిచేసిరే కాని, తమనాయకత్వ మితరులకు బోవునేమో యను అసూయతతో పెనగులాడినవారు కారు. నాయకులు చెరసాలలలో బంధింపబడిన తరువాత శిక్కు సంఘము చెల్లాచెదరయ్యెనా ? లేదు. ముక్తసరమను గ్రామము అకాలీ దళములకు ప్రధాన కార్యస్థానముగా నిర్ణయింపబడెను. అమృతసరము నుండి యీ గ్రామము 250 మైళ్ళ దూరములో నున్నది - ప్రతిదినము 25మంది చొప్పున ఒక్కొక్క యకాలీదళము కాలినడకమీద ముక్తసరమునకు బోవుచుండును. నాభా సంస్థానము లోని జాటో యీ గ్రామమునకు ఇరువది మైళ్ళు అకాలీ దళములు రాకూడదని గవర్నమెంటువారు నిషేధించినది యీ గ్రామమే. ఈ యుత్తరువు నుల్లంఘించుటకై ముక్తసరమునుండి ప్రతిదినము 25 మంది చొప్పున జాటోకు బోయి అరెస్టగుచుందురు.

ఈ దళములో శిక్కులు జేరుచున్న విధము ముఖ్యముగ గమనింప దగి నది అమృతసరములో స్వర్ణదేవాలయము నందు ప్రతిదినము తెల్లవారుజామున సంకీర్తనము ప్రారంభమగును - శిక్కులా గీతములను గానము చేసినకొలదియు తన్మయులగుచుందురు వివిధ గ్రామములనుండి వచ్చిన శిక్కులును ఈ భజనలో జేరుచుందురు ఉదయము ఎనిమిది గంటలవరకు అనన్య భావముతో భజన జరుగు చుండును. భజనబృందమును నూరునుండి రెండు, మూడు, నాలుగు, వెయ్యి వరకు హెచ్చుచుండును. ఆ సమయములో 25గురు శిక్కువీరులు నియోజింప బడుదురు. వారి కంఠధామము పుష్పమాలలతో నలంకరింపబడును. వారు శిక్కు గ్రంథపీఠమున కెదురుగ నిలువబడి తిరిగి గురుగీతములను బాడి, సత్యాగ్రహ ప్రతిజ్ఞను స్వీకరించెదరు. ఈ ప్రతిజ్ఞ ప్రశ్నోత్తర మాలికగ నుండును. నాయ కుడు వారిముందు నిలువబడి ''నీవు శిక్కుధర్మమునకు నీ ప్రాణములను సహిత మర్పించుటకు సిద్ధముగ నుంటివా ? పోలీసువారు నిన్నెట్టి బాధలు పెట్టినను, ఒడలనుండి రక్తము ధారలై ప్రవహించుచున్నను, నీవు అహింసావ్రతమును వీడక శిక్కుధర్మమునకు నిలువబడెదవా'' ? మొదలగు ప్రశ్నలు వేయబడును. శిక్కువీరు లొకరి తరువాత నొకరు ప్రమాణము చేసి, గురువుని ప్రసాదమును స్వీకరించెదరు. ఈ యిరువది అయిదుగురు వీరులును గురుగోవిందుని గీర్తించుచు కాలినడక మీద 250మైళ్లు ముక్తసరమును జేరుటకు బ్రయాణ మగుదురు. వీరిని వీక్షించుటకై, మార్గము పొడుగున వేలకొలది శిక్కులు, హిందువులు, మహమ్మ దీయులు వేచియుందురు. ప్రతి గ్రామమువారును వారికి విందొసగుటకై పోటీలు పడుచుందురు. ముక్తసరము చేరిన పిమ్మట, రెండు మూడు రోజులు విశ్రాంతి తీసికొని తిరిగి యీ విధముననే ఉదయము ప్రతిజ్ఞ చేసి, నాభాలోని జాటోలో శాసనోల్లంఘమునకు గడంగెదరు. జాటోలో గవర్నమెంటువా రవలంబించుచున్న చర్యలు కూడ చాల వింతగ నున్నవి. ఇచ్చట పొలిమేరనే పోలీసువారు అకాలీ దళము నెదుర్కొని ముందు దళాధిపతి నరెస్టుచేసి తీసికొని పోయెదరు. అంత టితో దళమంతయు చెల్లాచెదరగునని వారి యాశ. కాని మిగిలినవారి నుండి మరి యొకరు ముందు నిలువబడి దళమును నడుపసాగును. పిమ్మట పోలీసువారు

దళమునంతను బట్టుకొని రైలుమీద రెండువందల మైళ్ళ దూరమునకు తీసికొని పోయి తిండి పెట్టకుండ ఏ యడవిమధ్యనో, ఏ నిర్జనస్థలములోనో వదలివేసె దరు. ఈ విధముగ జాటోలో ప్రతిదినము శాసనోల్లంఘనము జరుగుచున్నను, పోలీసువారు దళములను బట్టుకొని దూరప్రాంతమున వదలివేయుటయే కాని కారాగృహశిక్ష నొసగుట లేదు వీరిని చెరశాలలో బెట్టినయెడల ఎన్నివేలమంది శిక్కులైనను గొట్టులను నింపుటకు సిద్ధముగ నున్నారని గవర్నమెంటునకు దెలి యును. జాటోలో దమ నిషేధపు టుత్తరవు నుపసంహరించుకొనెదరా, వారి ప్రతిష్ఠకు భంగకరము అరెస్టు చేసెదరా ఖైదీల సంఖ్య హెచ్చి ఉద్యమము బలి పడును. కావున పట్టుకొని వదలివేయుట సంభవించుచున్నది. గవర్నమెంటువా రవలంబించుచున్న చర్యలలో నిది యొక క్రొత్త పద్ధతి

నాయకులను బట్టుకొనినంత మాత్రమున, శిరోమణి గురుద్వార ప్రబంధక కమిటీ కెట్టి నష్టమైనను వాటిల్లెనా? లేదు. నాయకు లరెస్టుకాక పూర్వమే తగిన కిట్టుభాటులు చేయబడెను మెంబర్లు అరెస్టయినప్పుడు, తమ ప్రతినిధులను నియ మించుకొనుటకు అధికార ముంచుకొనుటచే, బ్రతివారును తరువాతివారి నేర్పరుచు కొని యుండిరి. ఈ కారణముచే నెవ రరెస్టయినను నష్టము లేదు. వారి స్థాన ముల నాక్రమించుటకు మెంబర్లప్పుడే యేర్పడి యుండిరి. ఇప్పుడున్న నాయకులు క్రొత్తవారైనను, పని యథాప్రకారముగ సాగుచున్నది. క్రొత్త మెంబర్లు ప్రతి దినము అమృతసరములో బహిరంగముగ నూరేగుచున్నను. గవర్నమెంటువారు క్రొత్తవారి నరెస్టు చేయుటలేదు. అరెస్టుచేయ నారంభించిన యెడల, మెంబర్లు తేగల పాతరవలె బుట్టుకొని వచ్చెదరని వారికి దెలియును. ఎక్కువ మంది నరెస్టుచేసి జనులలో గలవరమును గలిగించుటకు గవర్నమెంటున కిష్టము లేదని యీ సందర్భమువలన గూడ తేటపడుచున్నది. భారతనములో జంకు ప్రవేశించిన దనుట నిశ్చయము ఏ తప్పు చేసిరను నెపముతో మొదటి మెంబర్ల నరెస్టు చేసిరో, ఆ తప్పునే జేయుచున్నామని క్రొత్త మెంబర్లు బహిరంగముగ ప్రకటించి నను, గవర్నమెంటు వీరి నరెస్టు చేయుటకు ఎందుకు సాహసించుట లేదు?

అరెస్టుల వలన నీ యుద్యమము నశించదను సంగతి వారికి గ్రాహ్యమై యుండ
వలెను. కాని గవర్నమెంటువారి చర్య లింతటితో నంత మొందలేదు. పత్రికలను
పత్రికాధిపతులను, దండింప జొచ్చిరి. ఈ యుద్యమము వారిమూలముననే
వ్యాపించుచున్నదని వారి యూహ. ప్రబంధక కమిటీవారి ప్రకటనలను పంజాబు
పత్రికలలో, ప్రచురింపకూడదని గవర్నమెంటువా రుత్తరువు చేసిరి. కాని
''అకాల్'' యను ఉర్దూ దైనికపత్రికయు ''పరదేశి'' యను గురుముఖి పత్రి
కయు వానిని యథాప్రకారము ప్రచురించుచునే యున్నవి. శిక్కుల సంకల్ప
మ ప్రతిహతము. దండనీతిచే గవర్నమెంటువారు శిక్కులను భీతిల్ల జేయుదు
రనుట వట్టి కల్ల కాని గవర్నమెంటువారు కూడ దమ పట్టు నింతలో వదలరని
కూడ దెలిసికొనట యుక్తము

ఈ సందర్భములో కాంగ్రెసు వారి కర్తవ్య మేమి? ఈ నెల 13వ తేదీని
వర్కింగు కమిటీవారు అమృతసరములో సమావేశమై యీ విషయము నామూ
లాగ్రముగ విచారించెద రనుటకు సందిగ్ధము లేదు అకాలీ యుద్యమముతో
కాంగ్రెసుకు సంబంధము లేదను భావముతో నుపేక్షించుటకు వీలులేదు. శిక్కులు
నేడు కేవలము ధర్మస్వాతంత్ర్యము కొఱకు బోరాడుచున్నారు. తమ మత వ్యవ
స్థలను బాలించుకొను అధికారము తమకే కలదని దృఢపరుప జూచుచున్నారు.
ఈ ప్రయత్నములో శిక్కు వీరులు, అహింసాపద్ధతి నవలంబించుట మహత్తర
మైన విషయము లోహపు ఖడ్గము సాధింపని కార్యమును సత్యాగ్రహము నిర్వ
హింపగలదని చూపుటకు ప్రతిజ్ఞ బట్టినారు — శిక్కులీ విషయములో విజయులై
తీరెదరు. శిక్కులలో నున్న సంఘీభావము మతోద్రేకము, ప్రతిజ్ఞాపాలనము
మరి యే యితర సంఘము నందును లేవు వారు ప్రతి గ్రామమునందు తాలూకా
యందు, జిల్లాయందు సోపాన పరంపరగ సంఘములను నెలకొల్పుకొనిరి. మూడు
వందల మంది సభ్యులు కలిగిన శిరోమణి కమిటీ అన్నిటిని ఒక సూత్రమున
నడుపుచున్నది వారికి ధన సాహాయ్యమునకు కూడ లోపము లేదు శిక్కు
దేవాలయము లన్నియు వారి వశమైనవి. దీనికి సంవత్సరమునకు గొన్ని

లక్షల రూపాయల రాబడి గలదు. సర్వవిధముల శిక్కు-సంఘము ఈ పరీక్ష యందు గడతేరుటకు దగిన వసతులన్నియు గలవు—ఇతర సంఘముల సహాయము వారి కవసరము లేని మాట నిజము. కాని కాంగ్రెసు అంత మాత్రముచే నుపేక్షను వహింపజాలదు.

కృష్ణా పత్రిక
నవంబరు 10వ తేదీ, 1923 సం,,

# ఏది నిజము?

ఇటీవలనే యిండియాదేశములోను, సింహళద్వీపములోను గల వర్తక సంఘము లొక సమాజముగా నేర్పడి అన్యోన్యముగా తమ వర్తకవిషయముల నాలోచించుకొనుచున్నవి. ఇందు ముఖ్యముగా ఐరోపీయ వర్తకసంఘములే యెక్కువగా జేరియున్నవి. ఈ సమాజమువారి ఐదవ వార్షికోత్సవ మీనెల 3వ తేదీని బొంబాయినగరములో ప్రారంభమయ్యెను. సభాధ్యక్షులైన నెల్సన్ గారు యిండియాదేశపు వర్తకాభివృద్ధికి మిక్కిలి తోడ్పడిన సివిలు సర్వీసు ఉద్యోగుల నెక్కువగా ప్రశంసించిరి. తరువాత బొంబాయి రాష్ట్రమునకు గవర్నరుగా నుండి ప్రఖ్యాతికెక్కిన సర్ జార్జిలాయడ్ గారు బ్రిటిషు పరిపాలనలో భారతవర్షము పొందిన యభివృద్ధిని గూర్చియు ఆంగ్లేయోన్నతోద్యోగుల ప్రయోజనములను గూర్చియు నొసంగిన మహోపన్యాసములోని ముఖ్యభాగములను స్థలాంతరమున ముద్రించితిమి. పాఠక మహాశయులు ముందుగా నా వ్యాసమును జదువుదురుగాక. నేత్రములకు రంగు సులోచనములు ధరించినవారికి లోకమంతయు నదే రంగులో గన్పించుట సహజము. ఇండియాలోని సివిలు సర్వీసు ఉద్యోగు లందఱును ఆంగ్లేయ వర్తక మహావట వృక్షమునకు రాజకీయాధికారము గల ఊఁతలని చెప్పవచ్చును. రాజకీయముగా యింగ్లీషువారీ దేశమునకు గలిగించు నష్టము లొక లెక్కలోనివి గావు. విదేశీయమైన బ్యాంకుల ద్వారా, రైళ్ళద్వారా, స్టీమర్లద్వారా వర్తకసంఘముల ద్వారా, ఇన్స్యూరు కంపెనిల ద్వారా, భారత జాతి యొక్క ప్రాణరక్తము పీల్చివేయ బడుచున్నదనుట యతిశయోక్తి గాదు. బ్రిటిషు పరిపాలనలో యిండియాదేశ మెంతవఱకు బాగుపడినదో శ్రీమాన్ డబ్లియు. డబ్లియు పియర్సన్‌గారు 1917వ సంవత్సరములో "భారతవర్షమునకు" అను నొక గ్రంథముచ వ్రాసిరి. అది యింతవఱకును ముద్రింపబడలేదు. అందలి భాగములు కొన్ని యిటీవలనే ఇంగ్లీషు పత్రికలలో

ప్రచురింప బడుచున్నవి వానిలో ''ఇండియాదేశ దారిద్ర్య"మను నొక వ్యాసము లోని సారాంశము దిగ్రింద బొందుపరచుచున్నాము.

''మొట్టమొదట యింగ్లీషువారు గాని యితర పాశ్చాత్యజాతులు గాని యిండియాదేశమున కే మోహముతో వచ్చిరి? పరోపకారము కొరకు వారు రాలేదు. ఈ దేశజనులను ఉద్ధరించుటకు వారు రాలేదు. అప్పుడీ దేశస్థితి యెంత గందరగోళముగా నున్నను, ప్రసిద్ధి కెక్కియున్న యీ దేశభాగ్యమును గూర్చి వినియే వారిచట నడుగు పెట్టిరనుట నిర్వివాదాంశము. కాని కేవలము వర్తక ప్రయోజనములు గల పరదేశీయు లిటకు వచ్చి బహు ధనవ్యయకరమైన విజాతీయ పద్ధతి ననుసరించి యీ దేశము నొక శతాబ్దమునుండి పాలించుచున్న తరువాతగూడ నిది ధనవంతమైన దేశమే యనుట శుద్ధతప్పు. మన బ్రిటిషు పాలకులు మాటిమాటికిని ఇండియాలో పూర్వము శాంతి లేకుండెనని చెప్పు చుందురు. కాని అప్పుడే యీ దేశ మెక్కువ ధనవంతముగా నుండెను. దేశ మిప్పు డంతకంతకు దరిద్రవంతమై పోవుచున్నదనుట కెన్నియో నిదర్శనములు గలవు. ఇంగ్లీషువారు శాంతముగాను, సురక్షితముగాను పరిపాలించుచున్న కాలములోనే దేశమిట్టి దౌర్భాగ్యస్థితిలోనికి వచ్చినదని డిగ్బీ, హిండ్మన్, రమేశ చంద్రదత్తు, దాదాభాయి నౌరోజి మున్నగువారి గ్రంథములే చాటుచున్నవి.

ఇండియాలో చాలమందికి వ్యవసాయమే ముఖ్య జీవనము. బ్రిటిషు పరిపాలనలో వేలకొలంది మైళ్ళ పొడవుగల ఇనుపదారులు వేయబడినవి. వీనిచే ముఖ్యముగా బ్రిటీషు భాగస్వాములకు పుష్కలముగా లాభములు చేకూరుచున్నవి. కలకత్తాకు సౌధనగరమని పేరు వచ్చినది. ఆ పెద్ద పెద్ద సౌధము లన్నియు బ్రిటీషు వర్తకులవే. కాని ఇండియాదేశపు రైతు మాత్రము మునుపటికంటె దరిద్రుడై పోవుచున్నాడు. కడచిన 40 సంవత్సరముల నుండియు నీ దేశములో రానురాను సగటున ప్రజల ఆదాయము తగ్గినకొలదిని జీవితవ్యయము వృద్ధియగు చున్నది. 1850 వ॥ సం॥లో వేసిన అంచనా ప్రకారము ఇండియాలో మనిషికి దినమునకు 2 పెన్నీలు (అనగా రు. 0-2-0) ఆదాయమని లెక్కవేసిరి. అదియే

1882 సం॥ లో 1 1/2 పెన్నీ (0-1-6) గాను 1900 సం॥లో 3/4 పెన్నీ (రు. 0-0-9) గాను తగ్గిపోయినది "మీ యభివృద్ధియే మా బలము" అని శ్రీ విక్టోరియా మహారాణిగారు చేసిన ప్రకటన యెంత పరిహాసోక్తిగా మాతెనో చూడండి "

అనుదినమును వృద్ధియగుచున్న క్షామముల సంఖ్యయే యీ దేశము యొక్క ఆర్థిక దుస్థితిని వివరించుచున్నది అనావృష్టి దోషముచే పంట లొక యేడు చెడిపోయిన యెడల, దేశములో సమృద్ధిగా రైశ్నున్నప్పుడు నానాటికి భాగ్యవంతు లగుచున్న ప్రజల కింతమాత్రము చేతనే క్షామము రావలసిన పని యేమి ?

1858వ సం॥లోనే ఈ దేశపరిపాలన 'కుంభిణీ' వారి చేతిలో నుండి యింగ్లాండురాణి గారి చేతికి వచ్చెను 'లిలీ'గారు వ్రాసిన గ్రంథము ననుసరించి, 19వ శతాబ్దముయొక్క మొదటి 8 సం॥లలోను, మొత్తమున నీ దేశములో క్షామములవలన మృతి నొందినవారు కోటి 80 లక్షల ప్రజలు ఆకలిచే దీర్ఘ కాలము బాధపడి కృశించి చనిపోయినవారి సంఖ్య నిందులో చేర్చలేదు 19వ శతాబ్దమును నాలుగు భాగములుగా విభజించగా :-

| | వచ్చిన కరువులు | చచ్చిన జనులు | |
|---|---|---|---|
| మొదటి 25 సం॥లో | 5 | 10 | లక్షలు |
| రెండవ భాగము | 2 | 5 | లక్షలు |
| మూడవ భాగము | 6 | 50 | లక్షలు |
| నాల్గవ భాగము | 1 | 2 | కోట్లు |

1900 సం॥ము మొదలుకొని యిప్పటివఱకు సుమారు 2 కోట్ల ప్రజలు కరువులచే చనిపోయి యుందురు. సంవత్సరములో నొకనాడైనను కడుపునిండ తిని ఆకలి దీర్చుకొననివారు 7 కోట్ల మంది యున్నారని గోక్లే మహాశయుడు

లెక్క జెప్పెను. చార్లెసు యిల్లియట్ అనునొక లెఫ్టినెంటు గవర్నరు "కర్షక జనులలో సగముమందికి సంవత్సరము పొడుగునను కడుపునిండ అన్నము లేదని నిస్సంశయముగ నేను జెప్పగలను" అని నుడివి యున్నాడు. 1905వ సం॥లో ప్రకటించిన అంకెల ప్రకారము సగటున ఇండియాలో ప్రతి మనిషియు తన ఆదాయములో మూడవవంతు ఏ రూపముగా నైతేనేమి సర్కారుకు పన్నుల క్రింద చెల్లించుచున్నాడు. ఈ దేశములో గంజి తాగు గర్భదరిద్రుడు సహితము ఉప్పుపన్ను చెల్లించుచున్నాడు. ఈ పన్నుమూలముగా ఉప్పు ప్రియమగుటచే వైద్యశాస్త్రజ్ఞులు మానవారోగ్యమున కావశ్యకమని నిర్ణయించిన పరిమాణములో సగమువంతు ఉప్పు మాత్రమే భారతీయులు సగటు మొత్తమున వాడుకొను చున్నారు

భారత దేశైశ్వర్యము క్షీణించుట కింకొక కారణము గలదు. అత్యధికమైన జీతభత్యములను దీసికొను విదేశీయోద్యోగులచే నిచట పరిపాలన నిర్వర్తింప బడుచున్నది. దేశీయు లీ యుద్యోగములలో నుండే యింత ధనవ్యయ మక్కర లేదు. ఇండియాలో నుద్యోగమునకు వచ్చు ఆంగ్లేయునకు రాను పోను ప్రయాణపు ఖర్చులును ఉద్యోగానంతరము పుష్కలమైన పించను ఇవ్వవలయును. ఈ పించను హాయిగా యింగ్లండులో నత డనుభవించుచు యిండియాలోని 'అధికార వర్గము' యొక్క నిరంకుశత్వమును గాపాడుటకు సలహా యిచ్చుచుండును. 1912 సం॥లో యిండియాధనము నుండి యింగ్లాండునకు 5కోట్ల 56లక్షల రూపాయ లిందునిమిత్తమై పంపబడెను. ఇండియాదేశము నుండి యింగ్లాండునకు పంపబడు పబ్లికు ధనము (గవర్నమెంటు ధనము) 24 కోట్ల రూపాయ లనియు ప్రైవేటు వర్తకుల ద్వారా పోవు ధనము 25కోట్ల 35లక్షల రూపాయలనియు యునైటెడ్ రాష్ట్రములకు లెఫ్టినెంటు గవర్నరుగా నుండిన సర్ జార్జి కాంపుబెల్ గారు లెక్క వేసిరి"

బ్రిటీషు పాలకులు వచ్చిన తరువాత నీ దేశములో 32వేల మైళ్ళ పొడవున ఇనుపదారులు వేయబడిన మాట వాస్తవమే కాని ఖర్చు యన్నియు నీ దేశ

క్షేమమున కంటె యింగ్లాండు ప్రయోజనమునకే యెక్కువగా దోడ్పడుచున్నవి, ఉన్నతోద్యోగాధికారము లన్నియు నింగ్లీషువారివే. వర్తక సదుపాయము లన్నియు వారివే ప్రత్యేక సౌకర్యము లన్నియు వారివే. రైల్వేలకై దిగుమతి చేయబడు వస్తుసామాగ్రులన్నియు వారివే. పెట్టుబడి ధనముపై వచ్చుచున్న లాభము లన్నియు వారివే నష్టముల కెల్ల యిండియా గవర్నమెంటువారు హామీగా నుందురు. దేశములోనున్న బ్యాంకులన్నియు తయారైన సీమసరుకులను దిగుమతి చేయుటకును యిచ్చట పండిన ముడిపదార్థముల నెగుమతి చేయుటకును మాత్రమే ఋణము లిచ్చి ప్రోత్సాహ మొసంగును, గాని దేశములోని పరిశ్రమల నుద్ధరించుట కొక బ్యాంకైనను కానీడబ్బు సహాయము జేసిన పాపమున బోవుటలేదు. ఈ బ్యాంకుల మూలముగా దేశములోని ధనవంతులకును, వర్తకులకును పరపతి నిచ్చి వారిని దేశహిత కార్యములకు దూరులుగా జేయుచున్నారు. ఇన్‌స్యూరు కంపెనీల మూలముగా నెవరికిని దెలియకుండా కోట్లకొలది ధనము దేశాంతరములకు బోవుచున్నది జార్జి లయడ్ గారు చెప్పినట్లు ఆనకట్టల మూలముగా మునుపటికంటె నెక్కువ భూమి సాగుబడి క్రిందికి వచ్చి యెక్కువ పంటలు పండుచున్నమాట గూడ సత్యమే. కాని, యిది యంతయు భారతీయునకు సీమసరుకులు కొనే శక్తి స్థిరముగా నుండుటకే తోడ్పడుచున్నది. ఆనకట్ట లీ దేశములో మొట్టమొదట కట్ట నారంభించినపుడే యింగ్లాండులోని రాజ్యాంగవేత్త లీ యంచనా వేసికొనిరి. ఇంగ్లాండులో తయారైన వస్తుసామాగ్రి నెల్ల యేదో విధముగా నెత్తిన వేసి అంట గట్టుటకు లోకువగా నున్న దేశ మిదియే. భారతీయుని భాగ్య మంతయు వ్యవసాయము. వర్షములు సరిగా నుంటేనే యిచట భూమి ఫలించును. పంటలు సరిగా నున్నప్పుడే భారతీయుడు సీమసరుకులన కొనగలుగును ఇచ్చటి వర్షములు ఋతుపవనముల యనుగ్రహమునకు లోనై యుండును. కావున అతివృష్టి అనావృష్టి దోషములచే నిచట పంటలకు గలుగు వడిదుడుకులే ఇంగ్లాండు యంత్రములలో తయారగు వస్తువుల విడుదలకుగూడ సంప్రాప్తమగును. ఈ యపాయమునుండి యింగ్లాండుపరిశ్రమలను కాపాడుటకై యిండియాలో ఆనకట్టలు గట్టుట యావశ్యకమని యోంచబడెను. మూగానిచే గల్గుగుచున్న ప్రయోజన

మంతయు నిజముగా దేశీయునిదే యైనచో ఏ డెల్టాగ్రామములో నైనను రెండు వత్సరములు వరుసగా నే కారణముల చేతనై తేనేమి పూర్తిగా పంటలు లేకపోయి నప్పుడు బాధపడకుండా జీయ్యాత గడుపగల గ్రామస్థు లెందరుందురోలెక్కవేసి కొనుడు ఇన్ని సంత్సరములనుండి యమోఘముగా మాగానిపంటలు బండుచు న్నందుచే ఆ గ్రామస్థులు నిజముగా బాగుపడి యున్నయెడల రెండేండ్లు పంటలు లేనంతమాత్రమున క్షామ మెందుకు రావలెను ? ఆనకట్టలచే బాగుపడినామని సంతోషించు డెల్టాగ్రామముల లోనే యే పదిమంది మోతుబరీ రైతులో అనేక కారణములచే ధనాఢ్యులై యుందురు. మిగిలిన వారందఱు నెంత పండించినను చేతకూలికి పోతగంజి యనునట్లు ఏయేటి కాయేడు పొట్ట గడుపుకొనచు సీమ సరుకుల దిగుమతికే దోడ్పడుచున్నారు అందుచే డెల్టాగ్రామములకు కార్తీక మాసపు కరువులు ప్రతియేటను దప్పకున్నవి.

ఇంక దేశములోని ఖనిజభాగ్యమును అరణ్యభాగ్యమును విదేశీయ వర్తక సంఘములే శాశ్వత కవులుగా ననుభవించుచున్నవి కూలిపని మాత్రమే దేశీయు లకు దక్కుచున్నది విదేశీయ స్టీమరు కంపెనీలన్ననో ఒక్క దేశీయ నౌకా నిర్మాణమును జూచి సహింపజాలవు. వీని దౌర్జన్యము చేతనే ఉత్సాహముతో బయలుదేరిన దేశీయ నౌకా నిర్మాణసంఘము లెన్నియో నిర్మూలింపబడి నవి.పూర్వముకంటె ఇంగ్లీషు పరిపాలనలో ప్రజల యారోగ్యము ఆయుర్దాయము, దేహబలము, ధర్మవర్తన, ఆత్మగౌరవము, శూరత్వము, కళలు, శిల్పము, పరి శ్రమలు, పాండిత్యము, పారమార్థిక చింత, మున్నగు యోగ్యత లెంతవఱకు వృద్ధిచెందెనో విడివిడిగా సరిపోల్చి చూచినయెడల ఇందలి సత్యము పాఠకులకే ద్యోతకము కాగలదు. కాని యిది యంతయు నభివృద్ధి యనియే బొంబాయి గవర్నరుగారి వాదన కాదని పియర్సన్‌వాదన. ఏది నిజము ?

కృష్ణా పత్రిక

డిశంబరు 8 వ తేది, 1928 సం॥

# కస్తూరి రంగయ్యంగారు.

పత్రికా సంపాదనము మన దేశమునకు క్రొత్త విషయము. పాశ్చాత్య దేశములనుండి అరువు తెచ్చుకొనిన వ్యవస్థలలో నిది యొకటి. అంతమాత్రము చేత పత్రికాసంపాదనము కేవలము విజాతీయ మనుటకు వీలు లేదు యుగ లక్షణములను బట్టి కొన్ని క్రొత్త సంస్థలు బయలుదేరుచుండుట ప్రకృతిధర్మము. పత్రికా సంస్థాపనము కేవలము ఈ వర్తమాన కాలముయొక్క సంస్కార మనక తప్పదు. "కలౌ సంఘే శక్తిః" అని స్మృతికర్తలే చెప్పియుండిరి. సంఘ మనగా ప్రజాబాహుళ్యము. సంఘశక్తినే మనము ప్రజాశక్తి యని పిలుచు చున్నాము. జ్ఞానము లేనిచోట శక్తి యుండజాలదు. ప్రజాశక్తి విజృంభించుటకు ముందు ప్రజలలో జ్ఞాన ముదయించుట యవసరము జనసామాన్యము నందు విద్యాప్రచారము, స్వతంత్ర విచారణాసక్తి, సంఘీభావము, మొదలగునవి వికసించునప్పుడే ప్రజలు శక్తివంతు లయ్యెదరు.సంఘము బలిష్ఠమగును. పూర్వ కాలమున ఏ కొలదిమందియో జ్ఞానవంతులై యుండి, రాజ్యములను సంఘములను శాసించుచుండెడి వారు.జనసామాన్యము నిరక్షరకుక్షులై, ఏ కొలదిమంది జ్ఞాన వంతులనో గురిగా బెట్టుకొని విశ్వాసముతో, విధేయతతో, ప్రవర్తించుచుండెడి వారు. ఆ కొలదిమందియు రాజులై యుండవచ్చును శాస్త్రకారులై యుండ వచ్చును. మతగురువులై యుండవచ్చును. కవులై యుండవచ్చును. ఆ కొలది మందియే తమ యిష్టప్రకారము ప్రజలను నడిపించుచుండెడి వారు. వారు స్వార్థపరులై యుండవచ్చును. లేదా లోక సంగ్రహార్థము పాటుపడువారై యుండవచ్చును. ఎట్టివారైనను వారే సంఘప్రవర్తకులుగ నుండి సర్వాధికా రములను నిర్వహించుచుండిరి. ప్రజలు భీతిచేతనో లేక భక్తిచేతనో, వారి యెడల వినయ విధేయతలతో ప్రవర్తించుచుండెడి వారు. రాజు భగవదంశా సంభూతుడుగా నెంచుకొనుచుండిరి గ్రంథములు ఈశ్వర దత్తములుగ నెంచబడు

చుండెడివి రాజశాసనమును ధిక్కరించుట రాజద్రోహము శాస్త్రముల నుల్లం ఘించుట గురుద్రోహము. ప్రజలు శాసనములనుడి విమర్శించుటకు సాహసించెడి వారు కారు. ఎవరైనను ప్రజల ప్రమాణబుద్ధికి భంగము కలిగించినయెడల వారు రాజాగ్రహమునకు బలి యగుచుండిరి. ఇది మానవ పరిణామము యొక్క పూర్వ చరిత్ర- అప్పుడట్టి కట్టుబాటులు మానవోన్నతికి ఆవసరమై యుండవచ్చును. కాని కాలము మారినది. ఏ కొలదిమంది మానవులో ప్రమాణ పురుషులుగ నుండినంత మాత్రమున, ప్రకృతి యొక్క చరమోద్దేశము సిద్ధింపజాలదు ప్రతి మానవునియందును గర్భితమై యుండు శక్తులు వికసించినగాని మానవోన్నతి పూర్తి కాజాలదు. స్వాతంత్ర్య మనునది ప్రతి జీవునకు ఈశ్వరునిచే దానము చేయబడిన పట్టా- ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీయు, స్వతంత్ర వివేచనచే, స్వతంత్ర కర్మకలాపముచే, అభ్యున్నతి నొందినప్పుడే సంఘము సజీవమై తేజోవంతమును శక్తివంతమును అగును. ఈ వ్యవస్థయే ఇంగ్లీషులో "డెమాక్రసీ'' యనియు, "సోష లిజము'' అనియు వ్యవహరింప బడుచున్నది. ఈ స్వతంత్రాసక్తియే మానవ జీవితముయొక్క ప్రతి ప్రకరణమునందును ప్రవేశించి కలవర పెట్టు చున్నది. మత సంస్కరణములు, రాజకీయ విప్లవములు, ఆర్థిక పరివర్తనములు, సాహిత్య విమర్శనలు, పాటకపు జనముయొక్క సమ్మెకట్టులు, మొదలగు ఉద్య మము లన్నియు డెమాక్రసీయొక్క వికారములే. ప్రపంచము నేడు నిరంకుశ ప్రభుత్వమునుండి ప్రజాస్వామికమునకు, "డెస్పాటిజము"నుండి "డెమాక్రసీ''కి సర్వవిధముల పరుగిడుచున్నది. పరప్రత్యయనేయ బుద్ధి నానాటికి అంతరించు చున్నది. ఎంత యల్పజ్ఞుడైనను, ప్రమాణ పురుషులను విమర్శింప జూచుచున్నాడు. ఎట్టి దుర్బలుడైనను రాజశాసనమును ఖండింప జూచుచున్నాడు. ''I think'' "My conscience'' అను పదములు బాలుర నోటినుండి కూడ వెలువడు చున్నవి. ఇదంతయు బయటకు బరిహాసాస్పదముగ గన్పట్టవచ్చును. సంఘము యొక్క ఆచారములు, కట్టుబాటులు, సడలుచున్నవని చింతింపవచ్చును. పెద్ద పిన్న, అధికారి యనధికారి, యను భేదము పోవుచున్నదని దుఃఖించవచ్చును.

ప్రజలు పూర్వమువలె శాసనానువర్తులై ప్రవర్తించుట లేదని ప్రభువులు గుందు చున్నారు సాంఘికులు శాస్త్రానువర్తులై కులమర్యాదలను బాటించుట లేదని పీఠాధిపతులు దిగులొందుచున్నారు పనివాండ్రు విశ్వాసముతో నణగియుండుట లేదని యజమానులు బెదరుచున్నారు విద్యార్థులు పూర్వమువలె వినమ్రులై ప్రవర్తించుట లేదని ఉపాధ్యాయులు విసువు చెందుచున్నారు. బ్రాహ్మణేతరులు పూర్వమువలె జోహారులు గావించుట లేదని బ్రాహ్మణులు చింతాక్రాంతు లగుచున్నారు. పంచములు తిరుగబరుచున్నారని పై వర్ణములవారు కుపితు లగుచున్నారు. నల్లజాతులు స్వాతంత్ర్యమంత్రమును జపించుచున్నారని శ్వేతముఖులు భీతచిత్తులగుచున్నారు. అబలలు సహితము స్వాతంత్ర్యము నపేక్షించుచున్నారని పురుషులు సంక్షుభితు లగుచున్నారు. తిరుగుబాటు అనునది నేటి గాలిలో సర్వత్ర వ్యాపించి యున్నది ఇది కేవలము యూరపియను సంపర్కము వలన వచ్చినది కాదు. యూరపు ఖండములోనే పరిస్థితులు మారిపోవుచున్నవి. సంఘములు రాజ్యాంగములు తలక్రిందు లగుచున్నవి. ఇదంతయు నీ వర్తమాన కాలము యొక్క లక్షణ మనియే తలంచవలెను. ప్రకృతి మానవుని నూతన రంగమునకు గొనిపోవుచున్నది మానవకోటి యొక్క అంగప్రత్యంగముల నన్నిటిని సచేతన మొనర్చుచున్నది. రాజులును, పురోహితులును, శాస్త్రకారులును, ప్రజలను తమ యురులచే బిగించుటకు బ్రయత్నించవచ్చును. కాని వారి దినము లంతరించినవని వారెంత త్వరితముగా గమనించిన అంత శ్రేయస్కరము. ప్రకృతియొక్క యుద్దేశ మమోఘము. రాజశాసనముకాని శాస్త్రకారుల విధి నిషేధములుకాని ప్రకృతియొక్క గతులను నిరోధింపజాలవు. తాత్కాలికముగ ప్రకృతి నిరోధింపబడినట్లు పైకి కనుపట్టినను తుదకు ప్రకృతియే జయించి తీరును. స్వాతంత్ర్య రథము బయలుదేరినది. రజ్జువులపై చేతులు వైచి లాగినవారే ధన్యులు.

పత్రికలు స్వాతంత్ర్య రథయాత్రను దేశ దేశాంతరములకు జాటుచుండు పతాకములని చెప్పనొప్పును. నేడు ప్రపంచరంగమున జరుగుచున్న ప్రచండాందోళనముతో వీ పత్రికలు బయలుదేరి దశదిశలు పిక్కటిల్లు నటుల రణభేరీని వాయించుచున్నవి. కొన్ని పత్రికలు ప్రభుపక్షమును వహించవచ్చును. కొన్ని

ప్రజాపక్షమును వహించవచ్చును. ఏ పక్షము వహించినను ప్రజల చిత్తములకు నివేదించని పత్రిక లేదు ప్రజలే విచారణకర్తలు వారి ముందర ప్రభుత్వములు. శాస్త్రములు ఆచారములు. అధికారములు—సర్వము ముద్దాయిలవలె నిలువ బడవలసినదే. సకల వాదములు ప్రజలకు నచ్చజెప్పి వారి తీర్పుకై వేచి యుండును. పత్రికలు ప్రజాశక్తి నుద్బోధించుచు ప్రజాశక్తిని ఆశ్రయించుకొని యుండును. జనులలో స్వతంత్ర విచారణశక్తిని బురికొల్పుచుండును. దేశ దేశములలోని పరివర్తనములను జాటుచుండును. విమర్శన యందు పుట్టి విమర్శనలను ప్రచారము సేయుచుండును. ప్రజలను నిద్రపోనియ్యవు. సంఘములను మరుగు కానియ్యవు. లోపములను వెల్లడిపరచును. జనవాక్యము నేకోన్ముఖము సేయును భౌతిక ప్రపంచమున రైళ్ళు టెలిగ్రాఫ్లు ఏమి చేయుచున్నవో, పత్రికలు మానసిక ప్రపంచమున ఆకార్యమునే నిర్వహించుచున్నవి లోకము నంతను ఒక్కమారుగ బహిరంగపరచి దేశకాలములను బంధించి వైచుచున్నవి. నదులెట్లు కొండలలో బుట్టు ఊటల నేకముచేసి పల్లపు భూముల నింపునో, అట్లే పత్రికలు మేధావంతుల తలలలో బుట్టు తలంపులను గ్రోడీకరించి జనసామాన్యము యొక్క సంకీర్ణ హృదయములపై వెదజల్లును. పత్రికలు, ప్రజలు తమ స్వత్వరక్షణము నకయి కల్పించుకొనిన వజ్రాయుధములు. వానిముందు ప్రభుత్వములు, మతములు పూర్వాచార దుర్గములు, నిరంకుశత్వములు, – సర్వము గజగజలాడక తప్పదు. ప్రజయొక్క మేఘగంభీర ఘోష పత్రికాద్వారమున ప్రతిధ్వనించి భావికాల గర్భమునుండి ప్రసవించుచున్న ప్రజాస్వామికమునకు స్వాగత మొసగుచుండును. పత్రికల శక్తి యప్రతిహతము.

హిందూదేశము ఈ ప్రపంచాందోళనకు బయటనుండజాలదు. యూరపు, అమెరికా ఖండములందు వీచుచున్న స్వాతంత్ర్య ఝంఝూమారుతము ఈ పురాతన భారత వర్షమును గూడ నూప నారంభించినది. ఇచ్చటి పద్ధతులు వేరుగ నుండ వచ్చును. నడకలు మారవచ్చును. కాని గమ్య మొక్కటియే. ప్రజాశక్తి పీఠాధి పత్యము నధిరోహింప వలసి యున్నది. ప్రజాశక్తి సింహాసనము నధిష్ఠించ వలసి యున్నది –. ప్రజ యన ఒక్క వర్ణము కాదు. ఒక్క తెగ కాదు. సకల

మతములు సమస్త వర్ణములు స్త్రీలు పురుషులు ఎల్లరు తమ తమ నిజ స్వత్వము లతో దమ దమ ప్రత్యేక లక్షణములతో, వెలిగి ప్రకృతియొక్క వైచిత్ర్యమును వెల్లడిపరుపవలసి యున్నది అజ్ఞానమునుండి జ్ఞానము. అశక్తినుండి శక్తి, దాస్యమునుండి స్వాతంత్ర్యము, పీడనమునుండి కల్యాణము, విజృంభించక తప్పదు. పత్రికల కోలాహల మంతయు నీ భావికాలముయొక్క ఆగమనమును దెలుపుటకే యని హిందూదేశములో గడచిన ఏబది సంవత్సరములలోను పత్రికల చరిత్రను తిలకించిన తెలియగలదు. ఈ విషయములో మద్రాసు రాజధాని తక్కినరాష్ట్రముల కంటెను గౌరవాధిక్యతలను సంపాదించినది-జి సుబ్రహ్మణ్యం అయ్యరు, పరమేశ్వరం పిళ్ళె, కరుణాకర మేనాన్ మొదలగు పత్రికాధిపతులు దాక్షిణాత్యుల సంపాదక శక్తిని లోకమున కంతకు జాటిరి. హిందూదేశములో "హిందూ'' పత్రిక యగ్ర స్థానము వహించి సోదర పత్రికలకెల్ల మార్గదర్శక మైనది అనుట నిస్సంశయము. ఒక వైపున సంస్థానాధిపతులు ఇంకొక ప్రక్కను బ్రిటిషు గవర్నరులు, హిందూ పత్రికయొక్క కఠిన విమర్శనలకు బాత్రు లగుచునే యుండిరి. కాంగ్రెసుతో బాటుగా హిందూపత్రిక కూడ జాతీయోద్యమము యొక్క శృంగధ్వనిని రాజ భాషలో లోకమున కంతకు జాటుచున్నది. కీర్తిశేషులైన జి. సుబ్రహ్మణ్య అయ్యరు గారే హిందూపత్రికకు వరుబడి పెట్టిపోయెను. కస్తూరిరంగయ్యంగారు వారి యడుగుజాడల లోనే నడచి హిందూపత్రికను జాతీయవాద పత్రికా రాజముగ నొనర్చ గలిగెను. గోఖ్లే తిలకు శూరులు సూరతులో మత్తగజముల వలె బోరాడుచున్నప్పుడు రంగయ్యంగారు వెనుకాడక జాతీయవాద పక్షము చేరి తన యావచ్ఛక్తులను వినియోగించెను. మద్రాసు గవర్నరగు లాలీ నిష్క్రమణ సందర్భమున వాని ప్రభుత్వమును హిందూపత్రిక ఖండించిన రీతి సకల పత్రికల పొగడ్తలకు బాత్ర మయ్యెను. రంగయ్యంగారు బెసెంటమ్మకు ప్రతికక్షియయ్యు "హూమురూల్" ఆందోళన సందర్భమున ఆమెకు కుడిభుజమై నిలువబడెను.

తుదకు అసహాయోద్యమ సందర్భములో రంగయ్యంగారు కాంగ్రెసుయెడల నెంత భక్తివిశ్వాసములను గనపరచినదియు నెల్లరకు వేద్యమై యున్నది. రంగయ్యం గారి భౌతికశరీరము నేడు పంచభూత విలీనమైనను వారి ఆత్మమాత్రము హిందూ పత్రిక యందు అధివసించి జాతీయోద్యమము యొక్క ఫలసిద్ధికి దోడ్పడుచుండ గలుగును.

-కృష్ణా పత్రిక
డిశంబరు 15వ తేది, 1923 సం॥

# పత్రికా స్వాతంత్ర్యము

సిమ్లా శాసనసభలో గవర్నమెంటు మెంబరగు సర్ ఆలెగ్జాండరు మడ్డిమను గారొకక్రొత్త బిల్లునుప్రవేశపెట్టిరి. ఇండియను పీనల్ కోడ్డు153-ఎ సెక్షనుక్రింద సంఘ విద్వేషములను బురికొల్పు పత్రికలను గవర్నమెంటువారు స్వాధీనపరచు కొనుట కధికారము నిచ్చు నిమిత్తము క్రిమినల్ ప్రొసీజరు కోడ్డునందు సవరణ చేయుట కీ బిల్లుద్దేశింపబడినది. దేశములో హిందువులకును మహమ్మదీయులకును మధ్య రగులుచున్న వైరము లతిశయించి, అనేక స్థలములయందు దొమ్మీలు, తిరుగుబాటులు, హత్యలు మొదలగు శాంతిభంగకరములైన దుండగములు విజృం భించుచుండుటచే, వైరములను బురికొల్పు పత్రికాప్రచారమును తక్షణ మాపు నిమిత్త మీ క్రొత్త యధికారము కావలసివచ్చెనని మడ్డిమను గారీ బిల్లును ప్రవేశ పెట్టుచు ముచ్చటించిరి. ఈ చట్టము పత్రికల నాపుటకంటె, వైరములను బురి కొల్పు కరపత్రములను, పుస్తకములను నిషేధించుట కెక్కువ యుపయోగ పడునని గవర్నమెంటువారి యుద్దేశము. గవర్నమెంటువారు కన్ను తెరచి చర్యను జరుపుటకు ప్రారంభించక పూర్వమే పత్రికలు చందాదారులకు జేరును. కరపత్రములు పత్రికలవలె నొక్కమారుగ ప్రచారము లోనికి రాజాలవు గవర్నమెంటువారు ఐ.పి. సి. 153-ఏ సెక్షనుక్రింద వానిపై నేరము మోపి చర్యదీసుకొనుటకు జాల కాలవిలంబన మగును. అంతలోపల కర పత్రములు చేయగలిగిన చెరుపంతయు జేసి యుండును. ఇట్లు కాలవిలంబనము జరుగకుండ ఎట్టి విచారణయు జరుగక పూర్వమే ఫలాని పత్రికగాని పత్రము గాని పుస్తకముగాని భిన్న సంఘముల మధ్య ద్వేషమును బురికొల్పుచున్నదను అనుమానము పోలీసువారికి గలిగినయెడల వానిని వెంటనే ప్రచారములోనుండి తప్పించి గవర్నమెంటువారు స్వాధీనపరచుకొనుటకై యీ సవరణ ప్రతిపాదింప బడినది. చట్టముల యుద్దేశ మెప్పుడును సహేతుకముగనే యుండును. శాంతిని

భగ్నపరచు దౌర్జన్యమును బురికొల్పు వ్రాతలు వ్యాపించకుండ జేయుట సహేతుకము కాదని ఎవరన గలరు? కాని ప్రజలకు బాధ్యత వహించని ప్రభుత్వము గల దేశములో, సర్వాధికారములును అధికారవర్గమునకే అర్పింపబడిన రాజ్యములో, ఇట్టి చట్టము దుర్వినియోగము చేయబడునని ప్రజలు భయపడుటలో నాశ్చర్యము లేదు. ఉత్తర హిందూస్థానములో మతవైరములను బురికొల్పు పత్రికలు, కరపత్రములు, బయలుదేరుచున్నమాట నిజము. వీని ప్రచారము వలననే జనసామాన్యమునందు అసహనము, క్రోధము, దురభిమానము మొదలగు విప్లవకరములైన బీజములు వెదచల్లబడుచున్నవని లాలా లజపత్రాయి గారు కూడ సిమ్లాసభలో నొప్పుకొని యుండిరి. ఈ దుడుకు వ్రాతల నాపవలసిన అవసరము కలదనుట నిస్సంశయము. జిన్నాగారు కూడ నీ బిల్లువంటి చట్టము అవసరమని ఒప్పుకొని యుండిరి కాని దుడుకు వ్రాతల నాపుటకు చట్టము లెంత వరకు సాధనములను ప్రశ్న యొకటి. ఇప్పుడు తలపెట్టిన చట్ట మెంతవరకు ప్రయోజనకారి యగునను ప్రశ్న రెండవది. ప్రస్తుతపు చట్టమును అధికారవర్గము యొక్క పూర్వ సంప్రదాయముబట్టి పరిశీలించితిమేని పత్రికా స్వాంతంత్ర్యమున కిది యెంతయు భంగకరమని ఎల్లరు నంగీకరింపక తప్పదు మాలవ్యగారి యుపన్యాసములను సాకల్యముగ జదువనిదే కలకత్తా మ్యాజిస్ట్రేటు మాలవ్యగారి వంటి ప్రఖ్యాత పురుషునిపై నిషేధపు టుత్తరువును జారీచేసినప్పుడు, సామాన్య పత్రికలపై నీ చట్టముచాటున నెట్టి దాడియైన వెడలుట కవకాశము గలదు. లాలా లజపత్రాయి గారు సూచించినట్లుగా నీ బిల్లునకు మూడు సారాంశములు కలవు:

1. విచారణకర్త తీర్పు చెప్పిన పిమ్మట పత్రిక స్వాధీనము చేసికొనబడునా?
2. విచారణ జరుగుచుండగనే స్వాధీనము చేయబడునా?
3. 99-ఎ సెక్షనుక్రింద కే పత్రిక వచ్చునదియు నిర్ణయించు సమ్మరీ అధికారము రాజధాని ప్రభుత్వముల కియ్యబడునా?

ఈ మూడు సారాంశములను బట్టి యాలోచించిన యెడల నీ చట్టము పత్రికా స్వాతంత్ర్యాపహరణముగ ఫలించునని చెప్పుటకు శంకింప బనిలేదు. ఈ సెక్షను రేపు కేవలము మతకలహముల

నాపుటకే కాక, మిల్లు యజమానులకును పనివాండ్రకును జరుగు వివాదముల పట్లగూడ బ్రయోగింపబడవచ్చును. నాన్ - కో - ఆపరేషను దినములలో దాసు నెహ్రూల వంటి పెద్దలమీద సెక్యూరిటీ సెక్షను లెల్లు ప్రయోగింపబడినవియు దెలిసికొనినప్పుడు అధికార వర్గమువారి చేతులలో గ్రొత్త ఆయుధమును బెట్టుట కెవరు సమ్మతింతురు? అయినను శాసనసభ్యులీ బిల్లును బూర్తిగ ఖండింపలేదు. సెలెక్టు కమిటీవారి పరిశీలనకు పంపవలసినదని మాత్రము కోరిరి ఇది మిత వాదుల పద్ధతి. ఈ పద్ధతికి దగిన ప్రతిఫల మొసగబడినది. సెలెక్టు కమిటీకి పంపవలసినదను తీర్మానమునకు 25గురు మాత్రమే అనుకూలురైరి. 50మంది ప్రతికూలముగ వోటుచేసిరి. శాసనసభ్యు లప్పటికిని నిరాశ చెందలేదు. ఈ బిల్లు రెండు సంవత్సరముల వరకే అమలులో నుండదగునని రంగాచార్యులుగారు మరి యొక సవరణను దెచ్చిరి. ఈ కాలపరిమితి సవరణ కూడ నోడిపోయెను. 19గురు అనుకూలురును, 48మంది ప్రతికూలురును నైరి. తుదకు సంఘద్వేషము లను బురికొల్పు పత్రికలను గవర్నమెంటువారు జప్తు చేసికొనుటకు 1898 క్రిమినల్ ప్రొసీజరు కోడ్డు సవరణ సిమ్లా శాసనసభచే నంగీకృత మయ్యెను. స్వరాజ్యవాదు లీ బిల్లుచర్చ సందర్భమున రాకపోవుటచే నిట్టి యపజయము గల్గెనని మితవాదులు వాకొనుచున్నారు- స్వరాజ్య సభ్యులీ బిల్లుచర్చలో బాల్గొన వలసిన అవసరము లేదని తీర్మానించుకొనుటచే వారీ విషయములో బాల్గొనలేదు- కాని స్వరాజ్యసభ్యుల యుపేక్ష యీ బిల్లు ప్యాసగుటకు గారణమైనదని మితవాదు లధిక్షేపించుటకు మంచి యవకాశము చిక్కినది - లాలా లజపత్రాయి గారు మాత్రము స్వరాజ్య పక్షమునకు రాజీనామానిచ్చి యీ చర్చలో బాల్గొనిరి.పాంచాల కేసరియొక్క రాజీనామా వలన, స్వరాజ్య పక్షము మరింత దుర్బలమగు ననుటకు సందియము లేదు.

కృష్ణా పత్రిక

అగష్టు 28 వ తేదీ, 1926 సం॥

# ఆంధ్ర విశ్వవిద్యాలయము

## I

## వైసుచాన్సలరు రామలింగారెడ్డిగారి ప్రసంగము.

ఇయ్యెడ నే నెక్కడివో యప్రత్యక్షములగు భావములను, భావికాలపు సంస్కరణములను గూర్చి యుగ్గడింపను. నేడు నా విధియంతయు, వెంటనే యాచరింపదగిన మార్పులకు సంబంధించినది కనుక మన విశ్వవిద్యాలయము వారును ప్రభుత్వమువారును మున్ముందొనరింప వేచియున్న కర్తవ్యాంశములను గూర్చి ముచ్చటించెదను.

నివేశనము:- భవనములు- ఇంతవరకును విశ్వవిద్యాలయ భవనమును గట్టవలసిన స్థలము నిర్దిష్టము గాలేదు. ప్రధాన కార్యాలయమును గూర్చిన యెస్టిమేటులును, ప్లానులును గూడ సంసిద్ధములు గావింపబడలేదు. స్థలవిస్తీర్ణము నందును, భవన నిర్మాణ వైఖరియందును విశ్వవిద్యాలయమువారి యభీష్టమే మన్నింపబడునని తలంచుచున్నాను. ఏది యెటులున్నను ముందు భవననిర్మాణము తొందరగా గావలసియున్నది.

ఆంధ్రదేశము నందలి నేటి విద్యాసౌకర్యములను బరిశీలించినచో నందు మన స్థితి సాటి విశ్వవిద్యాలయములకు జాల వెనుకబడి యున్నటుల గన్పడ గలదు.

1. ఈ విశ్వవిద్యాలయము నంటి, మెడికలు కళాశాల యొకటిగాక నాలుగు సెకండు గ్రేడు కళాశాలలును, నేడు ఫస్టుగ్రేడు కళాశాలలును గలవు విశాఖపట్టణము నందు మెడికలు కళాశాలలోనే ఎమ్. బి. బి. యస్ పరీక్షలు గావింపబడుటకును, వైద్యవిద్యార్థినుల జేర్చుకొనుటకును నవకాశము గల్పించినచో

ఆంధ్రదేశమున వైద్యమునందున్నత విద్య గఱపుటకు మరి యే యూనివర్సిటీ తోడను బనిలేకుండ బోవును

2 ఇక ఆర్ట్సు కళాశాలల యందును, సైన్సుకళాశాలల యందును గఱప బడు విద్య. ప్రబోధితము లగుచున్న విషయముంబట్టి గాని, బోధనా ప్రమా ణము బట్టి కాని యసంపూర్ణముగనే యున్నది. ఊరక పరీక్షలం దుత్తీర్ణు లగుట కైనను భౌతిక శాస్త్ర బోధన మత్యల్పముగనే యున్నది. ఇప్పుడున్న యేడు ఫస్టుగ్రేడు కళాశాల లందును రెండు మాత్రము పదార్థ విజ్ఞాన శాస్త్రమును, నొక్కటి మాత్రము రసాయన శాస్త్రమును బోధించుచున్నవి. రసాయన శాస్త్రము బోధించెడి కళాశాల ప్రైవేటు సంస్థ. అనంతపురంలోని గవర్నమెంటు కళాశాల వారు ఫిజిక్సునగాని కెమెస్ట్రినిగాని బోధించుట లేదు రాజమండ్రి ఆర్ట్సు కళా శాలలో నొక్క ఫిజిక్సును మాత్రము బోధించుచు తత్తుల్య ప్రాముఖ్యమును గల్గిన కెమెస్ట్రిని విడచియున్నారు అటుతరువాత నీ గవర్నమెంటు కళాశాలలలో గాని, లేక ప్రైవేటు కళాశాలలలోగాని వృక్షశాస్త్రము, భూగర్భశాస్త్రము, జంతు శాస్త్రము మొదలగు శాస్త్రములు లేనేలేవు ఇప్పుడు మనము నిర్ణయించిన, యీ విధానములో అప్లయిడ్ సైన్సులకు, తగిన ప్రాముఖ్య ముండవలసినచో నీ సబ్జెక్టులయొక్క ప్రాముఖ్యమును గూడ త్రోసివేయ జవదు.

3 ఆంధ్ర కళాశాలల యందెచ్చటను ఆనర్సు పరీక్షలు లేవు.

4 విశాఖపట్టణములో నొక్క ఇంజనీరింగు కళాశాల మాత్ర మున్నది. ఇంజనీరింగు నందున్నత విద్య నభ్యసింపగోరు మన విద్యార్థులు మదరాసు రాష్ట్రమునకుగాని, మఱి యితర రాష్ట్రములకుగాని పోవలసియుండును.

5 వ్యవసాయ, న్యాయశాస్త్రముల స్థితి గూడ తుల్యముగనే యున్నది. ఈ శాస్త్రములు మన కళాశాలలలో బోధింపబడుటయే లేదు,

6. బాలుర విద్యాసౌకర్యములే తక్కువగా నున్నవి, బాలికల విద్యా సౌకర్యము లంతకంటెను నధమస్థితి యందున్నవి. నేటి ఆంధ్రదేశ మంతటను

గలిపి, ప్రత్యేకముగా స్త్రీలకని నిర్ణయింపబడిన యొక ఆర్ట్సు కళాశాలగాని, యొక సైన్సు కళాశాలగాని కన్పడుట లేదు. మన దేశబాలిక లవసరమైనచో బాలురతో గూడి యొక్క చోటనే చదువుకొన వలయును. లేకపోయిన మఱియొక చోటికి బోవలయును. ఇదిగాక, విశాఖపట్టణములోని మెడికలు కాలేజియందు మఱికొన్ని సంభారముల గూర్చిన తరువాతగాని విద్యార్థినులను జేర్చుకొనుటకు వలనుపడదు.

ప్రస్తుత స్థితి యిది. ఇంక నీ విశ్వవిద్యాలయము వారు ముందేమి చేయవలయు ననునది పెద్ద ప్రశ్నగా నున్నది ఇందులకు గవర్నమెంటువారు వెంటనే పూనుకొని దీని నభివృద్ధిలోనికి దెచ్చుటయే తగిన పరిహారము.

ఈ సందర్భములో ఆంధ్ర యూనివర్సిటీవారును, రివరెండు స్టాథాము గారును, నొసంగిన నివేదికలను గవర్నమెంటువారు గమనింప వలయునని కోరుచున్నాను.

ఆంధ్ర విశ్వ విద్యాలయ సంఘము వారొసంగిన సలహాలలో ముఖ్యము లివి :

1 అనర్సు,పోస్టుగ్రాడ్యుయేటు శిక్షణము లన్నియు విశ్వవిద్యాలయము వారి యధికారముననే జరుగ వలయును,

2 మొట్టమొదట ఆర్ట్సు, సైన్సు, టీచింగు, ఈ మూడును ప్రారంభింపబడ వలయును.

3. వైద్య కళాశాల ప్రారంభింప బడగనే, వైద్యశాస్త్ర బోధనమును గూడ మొదలుపెట్ట వలయును.

4. వ్యవసాయము, వాణిజ్యము, ఇండస్ట్రియల్ కెమిస్ట్రీ, ఇంజనీరింగు (మైనింగు; ఫారెస్ట్రీ) ఈశాస్త్రముల నన్నిటిని క్రమక్రమముగా ప్రవేశపెట్ట వలయును,

5. ధనసౌకర్యములు గలిగిన కొలదియు న్యాయ శాస్త్రము, సాంఘిక శాస్త్రము, నౌకా శిల్పము, నేత, చర్మములను పదునుచేయుట, మొదలగు కర్మ విద్యా శాఖలను ప్రారంభింప వలయును. ఈ కమిటీవారు, గ్రంథ ప్రచురణము సేయవలయునని గూడ సలహా నొసంగిరి.

స్తాథాము గారి రిపోర్టు చాల ముఖ్యమైనది ఆయన పరిస్థితుల నన్నింటిని విచారించి, ఈ క్రింది సంస్థలను ప్రారంభించవలెనని సలహా నొసంగెను. 1. రైల్వే 2. ఖనిజములను దీయుట, మారైను ఇంజనీరింగుకు ప్రత్యేక శాఖలు గలిగిన యొక ఇంజనీరింగు కాలేజి. ఒక వ్యవసాయ కళాశాల. 3. ఒక వాణిజ్య కళాశాల 4. స్త్రీల కొక కళాశాల.

ఏది యెట్లున్నను నొక ఆనర్సు ఆర్ట్సు కాలేజిని స్థాపించుటకు పూర్వము నిర్ణయింపబడిన విధానమే యవలంబింప బడునని యాయన యూహించెను. రాజమహేంద్రవరములోని ఆర్ట్సు కాలేజీని, గణితమును, సైన్సును బోధించెడి ఆనర్సు కాలేజిగా చేయవలయునని యాయన సూచించెను. ఈ పద్ధతి ననుసరించినచో, తగిన యభివృద్ధిని గనబఱచుటకై అనంతపురములోని ఆర్ట్సు కాలేజిని భాషలు చరిత్ర, రాజ్యాంగము మొదలగు వానియందు ఆనర్సు కాలేజీగా చేయవలసి యుండును.

అటుపై విమర్శింపవలసిన యంశ మీ కళాశాలల యందెన్ని యనుబంధ విద్యాలయములుగా నుండవలయును? ఎన్ని యూనివర్సిటీ విద్యాలయములుగా నుండవలయు నననది.

మదరాసు విశ్వవిద్యాలయము మనకు మాతృక కనుక దాని నుదాహరణముగా దీసికొనవచ్చును. ఆ విశ్వవిద్యాలయాధికారమున నీ క్రింది శాస్త్రములు బోధింపబడుచున్నవి.

1. ఆర్ట్సు 2. సైన్సు 3. న్యాయము 4. వైద్యము 5 ఇంజనీరింగు 6. టీచింగు 7. వ్యవసాయము

ఇప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయములో నున్న మాదిరిని స్థాపింపబడదగిన విషయములు : 1. ఆర్ట్సు 2. సైన్సు.

కొండకాలము నంధ్ర విశ్వవిద్యాలయమునందు నెలకొల్పుట కవకాశములున్న విషయము లివి:.

1. విశాఖపట్టణ వైద్య కళాశాలలో ఎమ్.బి.బి.యస్. పరీక్షలు గూడ నెలకొల్పదగినంతవఱకు వైద్యశాస్త్రము.
2. రాజమహేంద్రవరమున నూతనముగా, తగిన సౌకర్యములతో నొక కళాశాలను నిర్మించి యందు ''టీచింగు''ను ప్రవేశ పెట్టవచ్చును.

ఈ వివరణమునుబట్టి, మన యాంధ్ర విశ్వవిద్యాలయమును గూడ తక్కిన యూనివర్సిటీలతోబాటు, చేయుటకు గవర్నమెంటువారు త్వరలో పూనుకొనవలయును. ఈ కార్యము నెప్పుడో చేయుదుమని యాపి యుంచదగదు.

ఈ సందర్భములో, యూనివర్సిటీ పాలకవర్గములను సమకూర్చుటకై వైసుఛాన్సెలరున కే విధముగ కాలనిర్ణయము చేసిరో యా విధముగనే యా యభివృద్ధి నొనర్చుటకుగూడ గవర్నమెంటువారి కొక కాలనిర్ణయమును గావించవలయునని ఛాన్సెలరుగారిని నేను వినయపూర్వకముగ వేడుకొనుచున్నాను.

బెజవాడనుగూడ "టీచింగు సెంటరును'' చేయవలయును. కాని యిచ్చట ప్యాస్‌కోర్సులనే స్థాపించెదరో, లేక పోస్టు గ్రాడ్యుయేటు శిక్షణమునే నెలకొల్పుదురో యా విషయమును విద్యా పరిషత్తువారును, సెనేటువారును నిర్ణయింపదగినది.

విశ్వవిద్యాలయ శాసనము రెండు విధములగు నభివృద్ధి పద్ధతులను సూచించినది అందు మొదటిది విద్యాలయముయొక్క యాంతరంగిక పరిపాలనమునకు సంబంధించినది. దీని విషయమై యింతకు మున్నె చెప్పితిని. ఇక రెండవది బాహ్యాభివృద్ధి. ఇప్పటి ప్రజాభీష్టములనుపట్టి విశ్వవిద్యాలయము

నభివృద్ధిలోనికి దెచ్చుటకై యొక ప్రచురణశాఖను, నొక ఎక్స్టెన్షన్ బ్యూరోను నెలకొల్పదగునని సూచింపబడెను. క్రొత్త సిండికేటు వారీ కార్యములను గూర్చి ముందుగా నాలోచింప వలయును. ఈ కార్యములను నెగ్గించుటకై విశ్వ విద్యాలయమువారికిఁ దగిన బలగము సమకూడుటకై విదేశములలో జదువుకొను టకు వేతనములను పరిశోధనపు స్కాలరుషిప్పులను నెలకొల్ప వలసి యుండును.

ఈ విశ్వవిద్యాలయములో సాధ్యమైనంత వరకు విద్య యంతయు తెలు గున బోధించి, తెలుగుననే పరీక్షలు జరిపించుటకు చట్ట మంగీకరించినది. ఇప్పటి దేశభాషావాదులు క్రమక్రమముగా నన్ని శాస్త్రములును తెలుగున బోధింపవలయునని వాదించిరి అనగా మెట్రిక్యులేషను వరకో, లేక ఇంటర్మీడి యేటు వరకో లేక బి. ఏ. వరకో విద్యాబోధన మంతయు తెలుగున గావింపబడ వలయునని, యీ మార్పు జరుగుటకు గొన్ని మేరల నేర్పఱచిరి. ఇట్లుగాక, కొన్ని సబ్జెక్టులను తెలుగులో చెప్పుటకు బ్రారంభించుట సులభము. దీనికొక్క యుదాహరణము గనుడు. హిందూదేశ చరిత్రను తెలుగులో చెప్పుట సులభమే యగుచో, దానిని బి ఏ. లోను తుదకు ఎమ్. ఏ వఱకు గూడ తెలుగులోనే యేల చెప్పగూడదో తెలియదు ఇవియును, నిట్టి సమస్యలును విద్యాపరిషత్తు వారు దీర్పవలసి యున్నారు.

ఈ విశ్వవిద్యాలయమునందు విమర్శనదృష్టి గలుగజేయు విద్యావిధానము తప్ప మఱి యెద్దియు నెలకొల్ప బడకూడదు. అట్టిచో నుపాధ్యాయులు, తాము బోధించు విషయములను సంతృప్తికరముగ బోధింపవలయునన్న వా రాంగ్లము, మొదలగు విదేశ స్వదేశ భాషలలో మంచి పాండిత్యము గలవారై యుండవల యును. అట్టి పాండిత్య ముండినగాని వా రాయా సబ్జెక్టులలో విమర్శనదృష్టి గలిగి యుండజాలరు. ఈ దేశభాషా స్వీకృతి వలన, విజ్ఞానమున కతిఛాందసము మాపి మేరలు గల్పింపరాదు. విజ్ఞానము విశ్వ సంభరితము, అది మానవ జ్ఞాతి క్షంతకు సన్నిహితమైనది,

కాలేజి పఠన క్రమమునం దేమాత్రము దేశభాషా మూలకము జేయవలెనని నను దాని చిన్నె ఎస్. ఎస్ యల్. సి తరగతియందు గూడ ప్రతిఫలించును. పోనీ, మన విశ్వవిద్యాలయమువారు తెలుగును శోధనోపాయము గావించి మెట్రిక్యులేషను పరీక్షను ప్రవేశపెట్టినచో, నిప్పటి ఎస్. ఎస్. ఎల్. సి. కోర్సును, నా పరీక్షలును చెడిపోగలవు దాని మూలమున నాంధ్రదేశమునకు ప్రత్యేకమైన యొక విద్యాశాఖను నెలకొల్పు నవసరము గలుగ జేయునదియు లేనిదియు నింకను గొంత పరిశోధనము చేసిన గాని చెప్పుటకు వలనుపడదు. ప్రభుత్వోద్యోగములకు దగిన వారిని "రిక్రూటు" చేయు నంశముగూడ దీనితో సంబంధించి యున్నది. విద్యకును, నుద్యోగములకును నెట్టి సంబంధ ముండగూడని మాట సత్యమే, కాని మన విశ్వవిద్యాలయము యొక్క విద్యావిధానము సంపూర్ణముగా నొక ప్రత్యేకమైన పద్ధతిని దాల్చినచో, ఆంధ్రదేశమునకు సంబంధించి నంతవరకు ప్రభుత్వ సేవావర్గము లందు జేరుట కొక ప్రమాణమును గల్పించుట యవసరమగును. నేనీ విషయమునిపై నా యభిప్రాయముల నొసగుట లేదు ఊరక విద్యా పరిపాలనా శాఖలకు గల సంబంధమును సెనేటువారికి దెలియ జెప్పుచున్నాను. ఇదిగాక పరిశ్రమలను వాణిజ్యమును ప్రోత్సహింపకయే, కేవలము మన విద్యార్థులను పరిశ్రమ వాణిజ్యాది శాస్త్రములందు తీర్ణుల గావించి, వారికి ప్రభుత్వములో నుద్యోగముల నిప్పించినంత మాత్రమున దేశముయొక్క విద్యాలోపములు గాని, యార్థిక లోపములుగాని చక్కబడవు. ఈ యంశముగూడ విద్యా విధానమునకును పరిపాలనా శాఖలకును నెంత సంబంధ ముండునదియు వ్యక్తము సేయుచున్నది

ప్రస్తుతమందు గవర్నమెంటు కళాశాలలోని యుపాధ్యాయు లొక చోటి నుండి మఱియొక్క చోటికి, అనగా తమిళదేశము నుండి మదరాసుకును. నచటి నుండి యాంధ్రదేశమునకును బదిలీ చేయబడవచ్చును అందువలన నాంధ్ర విశ్వవిద్యాలయమునకు దగిన యుపాధ్యాయ వర్గమును సమకూర్ప వలయునన్నచో వారందరును ఆంధ్రదేశపు నాల్గు పొలిమేరల మధ్య బనిచేయుచుండువారే యైయుండవలెను. ఈవిధముగా జేయుటకు గవర్నమెంటు కళాశాలల నన్నిటిని

యూనివర్సిటీవారి కప్పజెప్పవలయునో, లేక ప్రత్యేకముగా నుపాధ్యాయులను సమకూర్చవలయునో తేల్చవలసి యున్నది.

ఇక యార్థిక సమస్య యన్నిటికంటెను ముఖ్యమైనది. ఈ విశ్వవిద్యాలయము క్రొత్తది. అందులో మునుపటి విశ్వవిద్యాలయముకంటె గ్రొత్త త్రోవలు త్రొక్కుచున్నది. అందుచే నీ విశ్వవిద్యాలయమునకు ధన మెంత యవసరమో చాన్సెలరుగారును గవర్నమెంటువారును గమనించ వలయునని కోరుచున్నాను. ఆంధ్ర విశ్వవిద్యాలయమువలె మాతృస్థానమునుండి విడగొట్టుకున్న వానియందు గొంత బలహీనత గలుగక తప్పదు మరల పూర్వబలము పొందుటకు గట్టి ప్రయత్నములను జేయవలయును. విశ్వవిద్యాలయము లోపలను, బయటను మేము చేయ బూనుకొన్న యభివృద్ధి పద్ధతులకు దగిన ధనమును విరివిగా నీయవలసి యుండును, టెక్నలాజికలు కళాశాలలును, గ్రంథ ప్రచురణము, ఎక్స్టెన్షన్ శాఖలును, నేటి ప్రజాభీష్టానుసారముగ నెలకొల్పి యున్నత విద్యావిధానమును, జాతీయము, నాచరణ యోగ్యమును జేయుటకై గావింపబడు సంస్కరణములు జేయబడనిచో ప్రత్యేకముగా నాంధ్ర విశ్వవిద్యాలయమును బెట్టిన ప్రయోజనమే కన్పడదు వీని యన్నిటికిని లెక్కలేని ధనము గావలసి యున్నది.

ఇప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు గవర్నమెంటువారిచ్చెడి గ్రాంటు లక్షరూపాయలు. ఇదియైనను నొక్కసారిగా యూనివర్సిటీవారి చేతికియ్యరు. మూడు నెలల కొకసారి కొంత కొంత యిచ్చుచుందురు. ఉత్తర. హిందూ దేశములో లక్నో, ఢక్కా, మొదలగు చోట్ల నెలకొల్పబడిన క్రొత్త విశ్వవిద్యాలయములకు గవర్నమెంటువారిచే పెద్ద పెద్ద గ్రాంటు లీయబడినవి. అయినను మన మిచ్చట ప్రారంభ దశయందే యుండుటంజేసి యంతగా నసంతృప్తి జెంద నక్కరలేదు. మన చాన్సెలరుగారును, వారి గవర్నమెంటువారును నీ విశ్వవిద్యాలయమునకు ధనము నిచ్చు విషయమున తగిన బాధ్యత వహించెదరని తలచుచున్నాను. 1921 సంవత్సరమున నియమింపబడిన ఆంధ్ర విశ్వవిద్యాలయ సంఘమువారు బ్రైసు ప్రభువు వ్రాసిన యీ వాక్యముల నుదాహరించిరి:

"యూనివర్సిటీ బోధనమునకు, స్వాతంత్ర్యమే జీవము. ఏ యుపాధ్యాయుని నాతని రాజకీయాభిప్రాయములను బట్టి గాని, యార్థికవ్యవహారములలో నాతని కున్న యభిప్రాయ భేదముబట్టి గాని నియోగింప గూడదు; తీసివేయ కూడదు. స్వతంత్రులైన పౌరులందరివలెనే యాతడు గూడవాక్స్వాతంత్ర్యమును నిష్టానుసారముగా వోటు నొసంగెడి హక్కును గలిగి యుండవలెను గవర్నమెంటువారు సహాయము సేయు యూనివర్సిటీలయొక్క యధికారవర్గమునందు గవర్నమెంటువారు గూడ ప్రతినిధిత్వము వహించినను, విశ్వవిద్యాలయము యొక్క సాధారణ పరిపాలనమును, శిక్షణమును సాధ్యమైనంత వఱకు యూనివర్సిటీ యధికారుల చేతులందే యుంచవలయును. లేనిచో విద్యావిధానముతో ఎక్కువ సంబంధమున్న యే యధికార వర్గమువారి చేతులందైన నుంచవలయును.

ఈ వాక్యములతో దృప్తి చెందక యా సంఘమువారా యంశము నీ క్రింది వాక్యములతో స్థిరపఱచిరి:

"అందుచేత గవర్నమెంటువారు గ్రాంటునంతయు నొక్కసారియిచ్చివేసి, పై యధికారమును మాత్రము వహించి,కార్యతంత్ర వినిర్ణయము సేయుట మాని తప్పొప్పుల నిరూపణమును బూనుకొంట హితము. ఎచ్చటేని దోషములు ప్రాప్తించినచో గవర్నమెంటువారు వాని బరీక్షించ వచ్చును. ఏ ప్రత్యేక కార్యమునకైన "గ్రాంటు" లర్థింపబడినచో దాని సద్వినియోగమును నిశ్చయింపవచ్చును.'' మన చాన్సెలరుగారికి యూనివర్సిటీ పరిపాలనము సమగ్రముగ సమధిగతమై యుండుటంజేసి వారు దీని నొక ప్రభుత్వశాఖగా పరిగణించుటకు పేమరుపాటుననైన నిచ్చగింపరు.

ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనము దేశములో నెట్టి యుత్సాహమును బుట్టించినదో, చాన్సెలరుగారిచే సెనేటు ప్రారంభింపబడు నీ కాలమున సమకూడిన యిచ్చటి పెద్దల సమావేశమే తెలియ జేయుచున్నది. ఇందనేక రాజులు, జమీందారులు, సమావిష్టులై యున్నారు. వీరి పూర్వులు విద్యాపక్షపాతులు. వీరు

గూడ పూర్వులు చన్న త్రోవ విడనాడక యీ విశ్వవిద్యాలయమునకు విరివియైన ధనసహాయము గాంవిచెదరు గాక ! ఆ ధనముతో దాతల పేరిట పండిత పదవులును, పాఠక పదవులును, నెలకొల్పబడును. ఆంధ్రప్రదేశము లోని జిల్లా బోర్డులును, మ్యునిసిపాలిటీలును తక్కిన స్థానిక సంస్థలును వారి పేరిట నుపాధ్యాయ పీఠములను నెలకొల్పించెదరు గాక యని కోరుచున్నాను ఆంధ్ర విశ్వవిద్యాలయము తక్కిన యధునాతన విశ్వవిద్యాలయముల వలె దేశాభివృద్ధి కరమగు కార్యవిధానమునకు గడంగినది. ఇది యెవ్విధముగను ప్రత్యేకమైన సంస్థ కాదు· అందుచేత నొకవంక నున్నత విజ్ఞాన ప్రచారము కొఱకు గడంగుటజేసి ధనవంతులును, దేశములోని వాణిజ్య పరిశ్రమలకు జీవము వోయ నెంచుటజేసి సామాన్య ప్రజలును నభిమానింప దగినది.

నేను, సర్ మైకేలు సేడ్లరు, సర్ ఆల్ఫ్రెడ్ హాప్కిన్సను, సర్ ఇసం బార్డు ఓవెను, సర్ ఆర్థరు స్మితెల్సు ప్రభృతులైన ప్రజ్ఞాధురంధరుల యొద్ద నుండి యిప్పుడు మదరాసు, లీడ్సు, బర్మింగుహాము, మాన్చెస్టరు మొదలగు, విశ్వవిద్యాలయములం దవలంబింప బడుచున్న నూతన విధానమును స్వయముగా పరిశీలింపగల్గితిని. ఈ విధాన మింగ్లాండులోని క్రొత్త యూనివర్సిటీ లన్నిటి యందును జయప్రదమైనది. ఈ విధానమువలన విద్యాపరిషత్తు. (Acadamic council) వారు సర్వ కార్యములను నిర్వహించుకొని పోవుచుండ, సెనేటు వారు పైనుండి యధికారమును వహించుచుండుటయే దీని జయమునకు గారణము విద్యావిధానమును వినిర్ణయించు నధికారము సెనేటువారికే గలదు అంతర్వ్యవహారము లన్నియు విద్యా పరిషత్తువారికే విడువబడును. ఒక్కొక్కప్పుడు ప్రముఖములైన యంశములను నిర్ణయించుటకు గూడ విద్యా పరిషత్తువారికి దగిన యవకాశ మొసగ బడుచుండును. ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు గూడ సెనేటువారికే సంపూర్ణాధికారము గలదు. విద్యా విషయములకు సంబంధించి నంతవరకు మన విశ్వవిద్యాలయము సర్వస్వతంత్రమై యున్నది ఆ కారణము వలననే విశ్వవిద్యాలయము వారన్ని కార్యతంత్రములందు మితముగను నిగ్రహముతోడను సంచరింపవలసి యున్నది. సెనేటువారికి సర్వాధికార మున్నది

గనుకనే, విద్యా పరిషత్తువారికి ప్రత్యేకింపబడిన కార్యవిధానములో, వారేదో యొక తీర్మానమునకు వచ్చువఱకును తామందు గలుగ జేసికొనకుండ నుండ వలయును. విద్యావిషయములందు, సెనేటు వారేదో యొక నిర్ణయము గావింపక ముందు, విద్యాపరిషత్తువారు స్వతంత్రముగ నొసంగెడి యభిప్రాయము యొక్క ప్రయోజనమును విడనాడరాదు సెనేటువా రూరక, మాటిమాటికి నుపదేశములను గావించుచు, విద్యా పరిషత్తువా రడుగువేసినచో గాదని దిద్ద గడంగినచో, నప్పుడు విద్యాపరిషత్తు స్వతంత్ర రూపములేక, సెనేటులోని యొక శాఖాసంఘమై యీ రెండు సంఘములకును గుదురక, రెంటి బలమును నశింపగలదు. ఈ విధానము జయప్రదమై నెగడిన విద్యాలయములలో సెనేటువారు యూనివర్సిటీ పరిపాల నమునకు జెందిన యంశములను సూచించి, వానిని సాంగముగా సాధనలోనికి దెచ్చుటకై విద్యా పరిషత్తువారికి తగిన యవకాశము నొసంగెదరు సామాన్యముగ చాలమట్టున కీ రెండు సంఘములందును సభ్యులొక్కరై యుండుటవలన, విద్యా పరిషత్తువారు సర్వాంశములను సక్రమముగ పరిశీంచి నివేదించిన తరువాత సెనేటువారు కొన్ని మార్పులను సూచించుచుందురు. ఈ రెండు సంఘములవారు నెట్టి పొఱపును గలవరమును లేక స్నేహముగ వర్తించుటకై నేనీ సూచన గావించుచున్నాను. నా మిత్రులగు సెనేటుసభ్యులు దీనిని గమనించెదరుగాక! విశ్వవిద్యాలయాధికారు లందరును, విశ్వవిద్యాలయ క్షేమమునే మనస్సు లందుంచుకొని, స్వపక్ష పరపక్ష భావములు మఱచి, విభేదము లరయక వర్తిం తురు గాక యని కోరుచున్నాను.

అధీతివర్గములు (Board of Studies) జాతీయ దృష్టితో నేర్పడి, దేశములోని ప్రజ్ఞావంతులతో గూడి యుండునని తలంచుచున్నాడను. ఈ వర్గ ములు సమకూర్పబడగనే, విద్యా పరిషత్తువారి నాహ్వానించి, వారితోగూడి యధీతి మార్గముల నరయ నియమింపవలసి యున్నది. కాలహరణము లేకుండ సంస్క రణముల విషయము దేల్చి యంతటితో, సెనేటు, విద్యా పరిషత్తులవారిచే నామోదితమై సుస్థాపితమగు విద్యావిధానమును నెలకొల్పుటకు గడంగవచ్చును.

ఈ సందర్భములో, కలకత్తా విశ్వవిద్యాలయ సంఘమువారు రచించిన నివేదిక పత్రమును, నితర పత్రములును సెనేటువారికిని దక్షిణ పరిషత్తులవారికిని బంచిపెట్ట గోరుచున్నాను.

మన విశ్వవిద్యాలయము తక్కిన విశ్వవిద్యాలయములతోబాటు సమాన స్థానము నంది, కొన్ని ప్రత్యేక విషయములందు ముందంజ వేయుచు స్త్రీ పురుషుల కున్నత విద్యాబోధనము జేయు కార్యమును సత్వరగతిని నడిపించుటకై నేను విద్యా పరిషత్తువారిని మాటిమాటికి సమావేశ పఱచుచు వారి యాలోచనలను చర్చించుటకై సెనేటు సభ్యులకు నవసరమైనన్ని సెనేటు సమావేశములను గూడ ఏర్పాటు గావింపగోరుచున్నాను. కొంత కాలము వఱకును విద్యా పరిషత్తువారును సెనేటువారును మాటిమాటికి సమావిష్టులు గావలసి వచ్చును.

ఆంధ్రోద్యమమును నెఱవేర్ప దలంచిన కార్యక్రమములో విశ్వవిద్యాలయ స్థాపనము ప్రథమము. ఆ యుద్యమము యొక్క లక్ష్యములందు ఫలించిన వానిలో గూడ నిదియే ప్రథమము. ఈ విశ్వవిద్యాలయము, గాడ్సును ప్రభువు గారి యాజమాన్యమున ప్రజాభీష్టములను ఫలింప జేయునని ప్రజలు విశ్వసించు చున్నారు.

కృష్ణా పత్రిక

సెప్టెంబరు 4 వ తేది. 1926 సం॥

# జాతీయ విద్య

## III

దేశీయ శిల్పము యొక్క పునరభ్యుదయము భరతవర్షము యొక్క సుస్వరూపమును వెల్లడిపరుప గోరుచున్నట్లే, దేశభాషోద్యమము కూడ భరత ఖండము యొక్క భవితవ్యమును వ్యక్తపరుప జూచుచున్నది ముఖ్యముగ గత శతాబ్దము నుండియు నజ్ఞాతవాసము ననుభవించుచుండిన ఆంధ్రము తిరిగి బహిః ప్రపంచమునకు వచ్చుట కెట్టి పబల ప్రయత్నములను గావించుచున్నదియు స్థలాంతరమున ముద్రింపబడిన "నూతన సాహిత్య విజృంభణ" మను వ్యాసమును జదివిన తెలియగలదు ఏటేట నిన్ని వేలమంది యువకులు, ఇంత ప్రేమతో, ఇట్టి నిష్ఠతో విజాతీయ భాష నధ్యయనము చేసికొనుటయే కాక, దానిని వ్యావహారిక భాషగ జేసికొని, మాతృభాషను బరిభవించిన దేశ మీ భూమండలములో నీ దౌర్భాగ్యదేశముతక్క మరియొకటి లేదు. దేశభాషలు ఏ యాఫ్రికను భాషల వంటి యనాగరిక భాషలో అయిన యెడల, పరభాషయే అమెరికను నీగ్రోల మాతృభాష యైనట్లు, ఇంగ్లీషు హిందూదేశీయులకు స్వభాష యగుట కాస్పద మయ్యెడిది. కాని మన విద్యార్థికుల దురదృష్టము వలన హిందూ దేశములోని భాష లట్టి యల్పభాషలు కాకుండెను వీరి దృష్టిలో నివి యెంత హీనము లైనను, ప్రకృతి వీని వధ నిక సహించి యూరుకొనునట్లు లేదు. ఒక కాలమున ఆర్య బ్రాహ్మణులు దేశభాషల నిట్లే నిరసించిరి. సంస్కృతమును దేవ భాషగ నెంచుకొని, అందలి జ్ఞానమును సంస్కృత పేటికలలో తాళము వేసి యుంచుకొనిరి. సంస్కృత విద్వాంసులు దేశభాషలో వ్రాయుట యగౌరవముగ గూడ నెంచుకొనుచుండిరి. ఉత్తమ వర్ణస్థులకు లభ్యమగుచుండిన జ్ఞానము తక్కు వర్ణముల లోనికి జారనీయకుండిరి. ప్రకృతి యిట్టి మాతృభాషా నిరసనమును క్షమింప జాలదు. ప్రజాధిక్కారము సంతకంటెను సహింపజాలదు. అంతట

హిందూసంఘము చైతన్యరహితమై యున్నది పూర్వకాలపు పండితులును శాస్త్రజ్ఞులును పీఠాధిపత్యమును గోలుపోయిరి కించిజ్జీవ చిహ్నము గల ఆంగ్ల విద్యాధిక మండలి స్వధర్మ భ్రష్టులై స్వతంత్ర మార్గమున నడుగిడ లేకున్నారు. యువకులు విజాతీయ విద్యాగారముల యందు బంధితులుగ జిక్కుచున్నారు. ఇట్టి సంకటావస్థలో స్వజాతీయ సంస్థయొక్క నిజరూపమును సృష్టించుటెట్లు ? కాని దేశ మీ ప్రయత్నమును వదులుకొన జాలదు దేశము తిరిగి స్వరూపజ్ఞానమును బొంది తన జాతీయ భవితవ్యమును నిర్మింపగల శక్తిని బొందువఱకు, అనగా స్వరాజ్యము సిద్ధించువఱకు, జాతీయ సంస్కర్తలా లక్ష్యమును మనమునందిడుకొని, తాత్కాలికోపాయముల నవలంబించక తప్పదు. ప్రకృతియు తన నిజ మనోరథమును సఫల పరచుకొనుటకు నిరంతరము తాత్కాలిక సాధనములను స్వీకరించుచు తన్మూలముననే ఆత్మోపలబ్ధిని బొందును. జాతీయ విద్యాలయముల ప్రస్తుత స్థితి మాత్రము దుఃఖకరము. వీనియందు బోధింపబడు విషయము లించుమించుగ విదేశీయ విద్యాలయముల యనుకరణములు. అనుకరణము లగుటచే వీనికి మాతృకకుగల పటుత్వమైనను లేదు. ఉపాధ్యాయ వర్గము స్వతంత్ర శిక్షణమును గరుపగల సంస్కారులు కారు. విద్యార్థులును చాలవఱకు విదేశ విద్యాలయములందు గడతేరలేక, పారివచ్చిన సోమరులు. పరిస్థితులన్నవో కేవలము ప్రతికూలములు. ఇట్టి స్థితిగతులలో జాతీయ విద్యాలయములు కొన్ని యింకను జీవించి దేశీయుల యభిమానమునకు బాత్రములు కాగలుగుట విశేషము కాని యీ స్థితిలో నివి యెంతకాలమో జీవింపజాలవు. ఇవి పూర్తిగ నశించక, కొంతవఱకైనను బ్రజోపయోగకరములుగ నుండదలచిన యెడల, బునస్సంస్కరణ మవశ్యకర్తవ్యము. ఈ విద్యాలయముల నిబంధనలు, పాఠ్యక్రమము, ఉపాధ్యాయ వర్గము, విద్యార్థి స్వీకారము-సర్వము పునస్సృష్టి యైన గాని వీనికి దేశమునందు స్థావరము చిక్కజాలదు. ఏ సంస్థ సంఘము యొక్క, దేశముయొక్క, నిజేచ్ఛను సంతృప్తిపరుప జాలదో అయ్యది జీవింప జాలదు —జీవించుటకు హక్కును లేదు. దేశముయొక్క హృదయాంతరాళమున బ్రవహించు జ్ఞానవాహినుల నాకర్షించి, పోషించగల విద్యాసంస్థలనే ప్రకృతి

యభిమానించి రక్షించుచుండును. అప్పుడే యవి మానవుడు బాహ్యమున నుండి కల్పించిన కృత్రిమోపాయములు కాక, ప్రకృతి తన గర్భితశక్తిని ప్రకటించు కొనుటకు సహజముగ సృష్టించుకొనిన సాధనము లగును

దేశము నేడెంత వ్యాధిగ్రస్తమై వికార రూపము దాల్చినను, ప్రకృతి లోలోన క్రొత్త శక్తిని బూరించి, నూతన సృష్టికి తగిన యుపాధులను సంసిద్ధ పరచుచున్నది. జాతీయ నిర్మాత లీ క్రొత్త యంకురములను బరిశీలించి వానిని తమ సంస్థలయందు దేశోన్ముఖమునకు దీసికొని వచ్చుటకు ప్రయత్నించిన యెడల నీ విద్యాలయములు తిరిగి నూతన జీవకళతో దనరారుట కవకాశము గలుగును. దేశమునందు నలువైపుల జూచినయెడల, జాతీయ జీవనము నాలుగు విధముల బ్రకటిత మగుచున్నదని తెలుసుకొనగలము—ఒకటి: భారత శిల్పముయొక్క పునరుద్ధరణము; రెండవది: దేశ సాహిత్య వికసనము; మూడవది: దేశచరిత్ర సమాలోచనము; నాల్గవది. దేశీయ చర్మవిద్యల పునరభ్యుదయము. మనదృష్టిని చిత్త విక్షేపకర మగు రాజకీయ పక్షలనుండి మరలించి దేశముయొక్క అంతస్సంకల్పములపై బరపినయెడల నీ నాలుగు ప్రకరణముల ద్వారమున భారతవర్షము తిరిగి తన "స్వభావ నియత కర్మ"ను సంస్థాపించుకొనుటకు బ్రయత్నించుచున్నదని ద్యోతక మగును. ఆంధ్రమండలము కూడ నీ సంచలన మునకు ప్రబుద్ధ మగుచున్నది. ఈ నాలుగు యుద్యమములును ఆంధ్రుల నిశిత బుద్ధిని సంస్కారోత్సాహమును ఆశ్రయించి ప్రాంతిక రూపమును దాల్చుటకు జూచుచున్నవి విద్యాలయము లెంతవరకు వీనిని తమయందిమిడ్చుకొని బలపరుప గలుగునో, అంతవఱకే యవి జాతీయ సంస్థలుగ బరిగణింప బడదగును. అంత వరకే జాతీయ పునర్నిర్మాణమున వానికి స్థాన ముండగలదు

కృష్ణా పత్రిక
సెప్టెంబరు 18 వ తేది, 1926 సం॥

# జాతీయ విద్య

## I

ఇరువది సంవత్సరము లైనది దేశములో జాతీయవిద్యారంభము రూపము దాల్చి 1906లో స్వదేశోద్యమ తరంగిణి వెల్లువగ పొంగినప్పుడు వంగదేశము నందు విశేషముగను తదితర ప్రాంతములం దచ్చటచ్చటను జాతీయసంస్థలు నెలకొనినవి. తరుణ వయస్కుల మనంబులు జాతీయ సంస్కారము పొందిన గాని దేశము తిరిగి విజాతీయ సాంకర్యమునుండి బయల్పడి సుస్వరూపము పొందజాలదని జాతీయ సంస్కర్తలు గ్రహించి ముందుగ విద్యా సంస్కరణ మునకు బూనుకొనిరి. కాని వీనిలో నెక్కువ విద్యాలయములు పురిటిలోనే గిట్టి నవి కొన్నిమాత్రము కాలధర్మము నొందక యెటులనో జీవితమును లాగుకొని వచ్చుచున్నవి. అసహాయోద్యమ మారుతము వీనికి తిరిగి కొంత బలమును పుష్టిని గలిగించినను, ఆ గాలి మందగించుటతోడనే యివియు యథాప్రకారము నీరసింప సాగినవి. ఇవి పేరునకు దేశీయ సంస్థలైనను నిజమునకు దేశీయుల లక్ష్యము వీనియందు నిమగ్నముగులేదు. ఈ విద్యాలయములు విజాతీయ విద్యావిధానమును బహిష్కరించుట కేర్పడిన ప్రతిపక్ష చిహ్నములుగ నున్నవి కాని భరతఖండము యొక్క భవితవ్యమును వ్యక్తము సేయుచు, దేశము నందొక నూతన జాతిని సృష్టిచేయగల సంస్థలుగ లేవు ఈ లోపము కేవల మీ సంస్థలను నడుపువారిది కాదు సర్వవిధముల పారతంత్ర్య నిబద్ధమై యున్న దేశమునందు స్వతంత్ర సంస్థలెట్లు వర్ధిల్లగలవు ? కాని స్వతంత్ర సంస్థలు ప్రభ వించనిది దేశమెట్లు తిరిగి స్వాతంత్ర్యమును బడయగలదు? ఇది విషమ సమస్య. దీని పరిష్కారము మీదనే దేశముయొక్క భవిష్యత్తు ఆధారపడి యున్నదనుట నిస్సంశయము,

వైశ్య శ్రేష్ఠులు కూడ బయలుదేరిరి మన గృహములలోని పురాతనాలంకార వస్తుచయ మంతయు ఖండాంతరము లందలి మ్యూజియములకు జేరినది. మన శూన్యగృహములు విదేశపు గాజుసరుకుల తోడను, ఫర్నిచర్ల తోడను నిండిపోయినవి. ఇట్టి యధఃపతనము ఏ దేశమునకు సిద్ధించి యుండలేదు. ఇక ముందును సిద్ధింప జాలదు.

కొంతకాలము క్రిందటివరకు స్వదేశ సంస్థానాధీశులైనను దేశీయ శిల్పము నాదరించుచుండెడివారు వారికిని నేడు సీమరుచు లమరినవి ఇండోరు, బరోడా, పాటియాలా, బర్ద్వాన్ మొదలగు సంస్థానాధిపతులు పూర్వకాలపు రాజమందిర ములను పాడుబడవేసి, కోట్లకొలది ధనమును వెచ్చించి, పారిసు, లండనుల లోని సౌధముల మాదిరి "మ్యాన్షన్సు"ను నిర్మించుకొని అంతటితో నవనాగరకుల రైనట్లు కులుకుచున్నారు. మన సన్నాయికంటె బ్యాండు వాయిద్యములే మన వీనులకు విందుగొలుపు దినములు వచ్చినవి ఇట్టి దుర్గతికి ప్రధాన కారణము ఆంగ్లవిద్యా విధాన మనుట నిస్సంశయము. విద్యార్థులకు దేశీయ శిల్ప పరిచయ మావంతయైనను గలుగజేయుట లేదు పైగ బాల్యమునుండియు "డ్రాయింగు క్లాసుల"ను బెట్టి పాశ్చాత్య చిత్రరచనా పద్ధతిని బోధించుచున్నారు. రాజధాని పట్టణములలో ఆర్టు స్కూళ్లయందు మన విద్యార్థులు పాశ్చాత్య గురువుల పాదములయొద్ద గూర్చుండి, శిల్పములో మన కెట్టి పిత్రార్జితము లేనట్లు, వారి గ్రీకు రోమను ఆర్టు మాడెల్సుకు వరువడి పెట్టుచున్నారు. గవర్నరులును, వారి యనుయాయులును చిత్ర ప్రదర్శనముల నేర్పాటు చేసి, సీమరుచులను ప్రోత్సహించుచున్నారు. మన మేస్త్రీలు శిల్పకౌశల మెరుగని కూలిజనము వలె పబ్లికు వర్క్సు డిపార్టుమెంటువారి బైపు డిజైన్లలో బంధింప బడుచున్నారు. ఆంగ్ల విద్యాధికుల నవీన పద్ధతులే యీ కాలమున సంఘమున కంతకు శిష్టాచారములుగ బరిగణింప బడుటచే, వారి సాంకర్యమునొందిన రుచులే దేశయు లెల్లరిలోను వ్యాపించుచున్నవి. తుదకు సహజ సిద్ధముగ రసజ్ఞత యందు అశిక్షిత పటుత్వము గల స్త్రీజనములో గూడ దేశీయ శిల్ప నిరసన మేర్పడినది. ఒక కాలమున హిందూదేశము నంతను సౌందర్యవంతముగ జేయుచుండిన

రసస్రోతము ఫల్గుణీనది వలె నంతర్ధానమైనది. దేశమున కిట్టి శిల్ప దారిద్ర్యము సిద్ధించిన దను చింతయైనను విద్యాధికులలో నుదయించలేదు. వెనుక మహమ్మదీయ యుగారంభమున మహమ్మదు గజనీ హిందూదేశముపై దాడి వెడలి రెండు మూడు పర్యాయములు సోమనాథ దేవాలయముపై బడి అందలి ధన కనక వస్తు వాహనములను దోచుకొని పోయెనని చరిత్రలో జదివి రోషము చెందితిమి మహమ్మదీయ యుగాంతమున ఔరంగజేబు పాదుషా అనేక దేవాలయములను నాశనము చేసెనని తెలిసికొని దుఃఖించితిమి విజయనగర సామ్రాజ్య కాలమున నత్యద్భుతముగ జెక్కబడిన శిలావిగ్రహము లెన్నియో భగ్నావశేషములై నేటికిని తుంగభద్రలో కన్నీరును గార్చుచున్నవి. మహమ్మదీయులు విగ్రహ భంజకులైన నగుదురు గాక ! కాని నేడు మనము చేయుచున్న పని యేమి? నేడు మనము చేతులార మన కళాలక్ష్మిని నాశనము చేసికొనిన స్వధర్మ భంజకులము— ఆత్మ విధ్వంసకులము. మహమ్మదీయుల కాలములో మన చూపు చెడలేదు. మన రుచులు సాంకర్యము నొందలేదు బయటి విగ్రహములు నష్టమైన నష్టమగు గాక! కాని ప్రతి భారతీయుని హృదయ మందిరమున రసాధిదేవత యగు కళాలక్ష్మి నిండు సౌందర్యమున వెలుగుచుండెను అంతియ కాదు మన కళాలక్ష్మి మహమ్మదీయ ప్రభువులను సహితము రసగ్రహణ పారీణులనుగ జేసి, వారిచే తనకు నూతన మందిరములను జేయించుకొనినది; అపూర్వ సౌందర్య రేఖలను వెల్లడించుకొనినది. మహమ్మదీయు లెప్పుడును మన విద్యాలయములలో జొరబడలేదు. వారు మన గురుపీఠముల నధిష్ఠించలేదు మన విద్యా బుద్ధులను జెరుపలేదు ఆంగ్ల శకములో నిది యంతయు మారినది. ఆంగ్ల దొరలు మనలను బాలించు ప్రభువులే కాక, మన విద్యాలయముల కధికారులైరి. గురుపీఠముల నెక్కిరి. మన చేతులలోని తాళపత్ర గ్రంథముల నూడబెరికి వారి బొండు పుస్తకములను బెట్టిరి. అక్షరాభ్యాసము నుండియు వారే యుపదేశకులై మన పంచేంద్రియములనే కాక, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగు అంతఃకరణములను గూడ వశపరచుకొనిరి,

చిత్రచౌర్యము పూర్ణముగ సంఘటించినది. విద్యాధిక వర్గమనిన కేవల మాంగ్ల సంభవ జాతి యైనది. ఇయ్యది రాజకీయ దాస్యము యొక్క చరమ సిద్ధి,

కాల మెప్పుడు నొక రీతిగ నుండదు. భారత కళలను నాశనము చేసిన ఆంగ్ల జాతియందే కొందఱు మహానుభావు లుదయించి తమ దేశీయు లీ ప్రాచీనసభ్యత యెడల గావించిన అపకృతికి దుఃఖమును దెలిపిరి. అజంతా గుహల యందలి చిత్రకళా వైదగ్ధ్యమునకు దిగ్భ్రమ చెందిరి. ఎల్లోరా గుహలలోని చెక్కడపు పనికి అచ్చెరు వొందిరి ఆగ్రా ఫతేపురు సిక్రీల లోని సమాధుల దివ్య సౌందర్యమునకు విస్మయచిత్తులైరి దేశీయ శిల్పుల హస్తకౌశల మెన్ని రీతుల వికాసము చెందినదియు గనుగొనిరి. భారత కళా రహస్యము నుద్ఘాటించుచు గ్రంథములను వ్రాయ మొదలిడిరి. అప్పటి నుండియు దేశములో తిరిగి భారత శిల్ప పరిశోధనము తలయెత్తెను. భారత సంప్రదాయానుగుణ్యముగ చిత్రరచనలను గావించుట కుద్యమము బయల్వెడలెను. ఈ నూతన చిత్రరచనా విన్యాసమున అజంతా చిత్తరువుల భంగిమములు, రాజపుత్ర చిత్తరవుల సొగసులు, ఎల్లోరా శిలా విగ్రహముల ధ్యాననిరతి మొదలగు విలాసములన్నియు నేకీభూత మగుచున్నవి. ఈ నూతనోద్యమము భారత సంప్రదాయము ననుసరించుచున్నను, విదేశ సాంగత్యమును నిరాకరించుట లేదు. అటు జపాను చిత్రరీతుల యందలి తళుకులను గొన్ని తెచ్చుకొనినది. ఇటు యూరపియను అర్థగతులను బొందు పరచుకొనుచున్నది కాని తన స్వరూప లక్షణములను మాత్రము రక్షించి పోషించుకొనుచున్నది. సాంకర్యదోషము నొందకుండ ప్రాత క్రొత్తల కలియకచే నూతన వికాసమును బ్రదర్శించుచున్నది.

ఈ యుద్యమ మింకను శైశవావస్థయం దున్నది విద్యాధికుల యాదర మింకను ఈ దిక్కునకు బ్రసరించుట లేదు. పైగా వారి పరిహాసములకు గూడ బాల్పడుచున్నది ఆత్మవిస్మృతి నొందిన దేశములో జాతీయోద్యమ మీ యవస్థగుండ నడువక తప్పదు. ఆంగ్ల విద్యాధికులు ఉత్తర ప్రత్యుత్తరములను గూడ విదేశ భాషతో జరుపుకొనుచున్న దుస్థితి యందున్నప్పుడు, దేశీయ

శిల్ప మింకను వారి నానంద పరుపలేక పోవుటలో వింత లేదు. కావుననే జాతీయ విద్యాలయముల యావశ్యకత గలిగినది జాతీయ విద్యాలయములు దేశీయ శిల్ప శిక్షణమునకు అగ్రస్థాన మియ్యవలసి యుండును. శిల్ప శిక్షణము విద్యార్థులకు వృత్తులను గల్పించుటయేకాక, దేశీయులలో నత్యద్భుతమైన జాతీయ ప్రబోధమును గలుగజేయ గలుగును. చిత్రరచనలు కలిగించినంత చిత్తసంస్కారము సాహిత్యము కూడ జేయజాల దనిన అతిశయోక్తి కాదు. చిత్రములు ప్రేక్షకులలో రసోదయమును గలిగించుటయెకాక, వారి భావనల నతిసూక్ష్మముగ సంస్కరించి, జీవనము యొక్క సకల ప్రకరణములను సౌందర్యవంతముగ జేయును. భారత శిల్పవిదుడు తన గృహమును నాలుగు చిత్తరువులచే నలంకరించుకొనుటతో తృప్తి పొందడు. వాని రసాభినివేశము వాని గృహనిర్మాణమునందు, గృహోపకరణములందు, వేషభాషలయందు వ్యాపించి ప్రత్యేక రూపమును బొందుటకు జూచుచుండును. భారత శిల్ప సందర్శనముయొక్క జాతీయ సంస్కార మమోఘము. ఆంధ్ర జాతీయ కళా శాలవారు చిత్రవిద్యా పీఠమును నెలకొల్పి నప్పటినుండియు ఆంధ్ర మహాజను లలో గొంత శిల్పతత్వ ప్రచారమును ప్రారంభ మైనది. కీర్తిశేషులైన రామా రావుగారి చిత్ర ప్రదర్శనములు కూడ నీ యుద్యమమునకు గొంత బలము నొసగెను. ఆంధ్రులకు సహజమైన కళాభిజ్ఞత కలదు. అజంతా గుహాలలోని చిత్ర దీపమాలికలను వెలిగించినది ఆంధ్రుల హస్తములై యుండును. అమరావతి లోని పాలరాళ్ళను మలచిన హస్తములకు కళాకౌశలమున కేమి కొదువ? ఆంధ్ర మహాజనుల యభిమాన ప్రోత్సాహము లీ దిక్కునను బ్రసరించిన యెడల ఆంధ్రులలో గర్భితమై యున్న కళాకౌశలము ప్రకటితమై భారతవర్షము నందం తటను వాసి గనగలదు ఈ యుద్యమ మీ ప్రాంతములో బ్రారంభమై అయిదు సంవత్సరము లైనను సరిగ గాలేదు. ఇంత స్వల్ప కాలములో నది బొందిన విజయము చూచినయెడల దీని కెంతయో గొప్ప దశ రానున్నదను విశ్వాసము కుదిరి తీరును.

దేశీయ కళలు దేశీయుల తత్వమునకు సహజము లైనవి. దేశీయులు విదేశ కళలయం దారితేరుటకు బడు శ్రమలో బదియవ వంతు దేశీయ కళల నభ్యసించుటలో జూపిన యెడల, ఇందలి ఫల మధికముగ నుండును. భారతీయు డెవడైన ఆంగ్లేయ కవిగ బ్రఖ్యాతి గాంచ గలుగుట సాధ్యమా? ఎప్పుడో సకృత్తుగ నొక్కరు గాంచిన గాంచవచ్చును. అదియు సందేహాస్పదమె కాని మాతృభాషలో ఖ్యాతి గాంచుట సులభసాధ్యము అట్లే భారతీయులు పాశ్చాత్య రచనా పద్ధతి ననుకరించుట వలన నెప్పటికిని బయటకు రాజాలరు. అనుకరణ మెప్పటికిని అనుకరణమే. దేశీయుల ప్రకృతికి విరుద్ధములైన పద్ధతులందు దేశీయుల కెప్పటికిని పేరు ప్రతిష్ఠలు రాజాలవు పైగా వీరియెడల విదేశములలో నిరసనము కూడ నేర్పడును రవివర్మగారి పటములను జూచి యే పాశ్చాత్యుడైన హర్షించెనా? ఆంగ్లో-ఇండియను ఆర్టు యను గౌరవమే వాని కబ్బినది. అవనీంద్రనాథ ఠాకూరుగారి చిత్తరువులు యూరపియను కళాభిజ్ఞుల సన్మానమునకు బాత్రము లగుటకు గారణ మేమి? వీనిలో అనుకరణ మనునది లేదు; సాంకర్యము లేదు. భారతీయుల ఆత్మవస్తువు ప్రస్ఫుటముగ బ్రకాశించుచున్నది. దేశీయ రచనా పద్ధతియందు భారతీయుల జ్ఞానవిశేషము ద్యోతకమై విదేశీయుల యాదరమునకు గూడ బాత్ర మగును ఇట్టి మహదుద్యమమునకు బోషణ నొసగగలిగి నప్పుడే జాతీయ విద్యాలయములు సార్థకము లగును.

కృష్ణాపత్రిక
సెప్టెంబరు 25 వ తేది, 1926 సం॥

# జాతీయ విద్య

## II

ఇటీవల మఱుగుపడిన భరతవర్ష స్వరూపమును తిరిగి వెల్లడిచేయ జూచుచున్న ఉద్యమములలోకెల్ల భారతీయ శిల్పోద్ధరణ మగ్రస్థానము వహించుచున్నది రాజకీయ దాస్య ఫలితముగ హిందూదేశము తన చూపును గూడ గోలుపోయినది. ఆంగ్ల విద్యాధిక మండలికి సౌందర్యాసౌందర్య వివేచనమున పాశ్చాత్యుల లక్ష్యములే ప్రమాణము లైనవి. విద్యాధికులు ధరించు వేషములు, నిర్మించు గృహములు, వాడుకొను ఉపకరణములు, ఆడు ఆటలు, ప్రకటించు అభినయములు— సర్వము పాశ్చాత్యమయములు. దేశీయ శిల్పమనిన వీరి కేవగింపు. దేవాలయముల లోని దేవతా విగ్రహములు వీరి దృష్టిలో కేవలము అందచందములు లేని వికృత రూపములు. పూర్వకాలపు చిత్రపటములు పరిహాసాస్పదములు. మండువా భవంతులు పోయి బంగళాపంపిణీలు వచ్చినవి. పంచపాత్రలు, ఆబుకూరాలు. జారీచెంబులు పోయి, గ్లాసులు, టీకప్పు మాదిరులు వచ్చినవి. ద్వారబంధములపై పద్మములు చెక్క కూడదు. ధోవతులకు బోడసరపు అంచులు పనికిరావు. కలంకారీ అద్దకములు పోయి సీమ చీటీగుడ్డలు వెలసినవి. నాటకశాలల యందలి తెరపై గూడ గ్రీకు రోమను మూర్తు లెక్కినవి. తుదకు శిశువు లాడుకొను బొమ్మలు కూడ సీమ నుండియో. జర్మనీ నుండియో, దిగుమతి కావలెను. ఇయ్యది ఆర్థిక విషయము కాదు. విద్యాధికుల చూపులో, భావనలో, రసజ్ఞతలో, విపరీతములైన వికారములు కలుగుటచే భారత కళాలక్ష్మి స్పృశించిన ప్రతి వస్తువు, ప్రతి యలంకారము, విద్యాధికుల బుద్ధికి నిషిద్ధమైనది. మత సాంఘిక విషయములందు పూర్వాచార పరాయణుల మనుకొను వారికి గూడ దేశీయ శిల్ప మాదరణపాత్ర మగుట లేదు ప్రాత మంటపములను బడగొట్టి వాని స్థానమున ఇనుప గడ్డరులతో రైలుస్టేషనుల మాధిరి కట్టడములు కట్టించు

హిందూసంఘమునుండి, భక్తులు, జ్ఞానులు, విరాగులు, కవులు, గాయకులు శ్రేణులు దీర్చి బయలుదేరిరి. వారు సంస్కృత పేటికలను దెరచి అందలి యమూల్య రత్నములను దేశభాషల ద్వారా ప్రజలలో విరజిమ్మిరి. కవులు భారత భాగవత పురాణాదులను తెనిగించిరి గాయకులు వేదాంత రహస్యములను గీతములలో బాడదొడగిరి దేశభాష లొక్కపెట్టున విజృంభించెను. కావ్యములు, పాటలు, తత్వ గ్రంథములు, వీథి నాటకములు, శాస్త్ర విమర్శనలు వేలకొలది బయల్వెడలెను. కొండలపై వర్షించిన ఉదకములు నదీనదముల వెంబడి దేశమున బ్రవహించి సస్యవంతముగ జేయునట్లు, సంస్కృత పరిజ్ఞానము దేశభాషల గుండ దేశమంతట, బ్రతి సంఘమున, బ్రతి గ్రామమున, బ్రతి గృహమున, బ్రవహించి పవిత్రవంతము చేసెను. విప్రోత్తముని వేదాంత బోధన మాలదాసరి జిహ్వాగ్రములపై నృత్యము సేయువరకు నీ భాషోద్యమము తీవ్రముగ వ్యాపించుచునే యుండెను. "జ్ఞాన మొకరి సొత్తు కాదు. అయ్యది సార్వజనీనము," అని ప్రకృతి ముక్తకంఠముతో నుద్ఘోషించినది.

హిందూదేశము తిరిగి యిట్టి యుద్యమమునకు గడంగవలసి వచ్చినది దేశములో నేడు ఆంగ్ల విద్యాలయములు హెచ్చిన కొలదియు యూనివర్సిటీ లధికములైన కొలదియు, ఆంగ్ల గ్రంథ ప్రచారము విస్తరించిన కొలదియు, ఆంగ్లభాషె రాజ్యము గ్రామములపై గూడ దరుముకొని వచ్చుచున్న కొలదియు, దేశభాషల ప్రతిరోధము కూడ తీవ్రతర మగుచున్నది దేశభాష లాంగ్ల సంఘట్టనమున దగుల్కొని భగ్నమగుటకు బదులు క్రొత్త శక్తిని బహిర్గతము సేయుచున్నవి. ఆంగ్లభాషా ధురంధరులు తమ విదేశ పాండిత్యమునకు విర్రవీగి, తమ యంతటి జ్ఞానులు లేరని కొనియాడుకొనుచున్న సమయమున, రవీంద్రనాథుడు తన యనిర్వచనీయ కవితా శక్తిని దేశభాషయందు ప్రదర్శించి, ప్రపంచమున కంతకు కవికుల తిలకమయ్యెను యూరపియను భాషలెల్ల నేడు వంగభాషకు జేయెత్తి జోహారులు గావించుచున్నవి మన యూనివర్సిటీ లింకను దేశభాషల కెట్టి స్థాన మియ్యవలెనని ప్రశ్నించుకొనచు ఉండవచ్చును. ఆధునిక శాస్త్రములను దేశభాషలో జెప్పుట

యెట్లని అర్థించుకొనుచుండవచ్చును. కాని దేశభాషలు వీరి సమ్మతులకు, వీరి యామోదములకు, వేచియుండవు ఎవరు దేశభాషలను బూజించరో, వారే దేశమునకు వెలి యయ్యెదరు ఏ విద్యాలయము దేశీయ కవితకు పట్టము కట్టదో, అయ్యదియె ప్రకృతియొక్క శాపమునకు గురియగును. కానియెడల. యూనివర్సిటీలు దేశభాషలను బహిష్కరించినను, విద్యాధికులు సాంఘిక వ్యవహారములందు కూడ విదేశభాషనే ఆదరించుచున్నను, రాజసభ లన్నియు నాంగ్లమునకే రాజ్యము కట్టినను, ఆంధ్రములో నూతన సాహిత్య విజృంభణమును బురికొల్పుచున్న శక్తి యెక్కడనుండి వచ్చినది ? దేశభాష యనగా ప్రజాశక్తి దానిని తృణీకరించి యే రాజ్యము, ఏ సంఘము, ఏ సంస్థయు వర్ధిల్లజాలదు భారతవర్షము యొక్క భాగ్యవిధాత దేశభాషలను నూతన శక్తితో బూరించుచున్నాడు. వీరేశలింగము గారి గద్యరచనలు, లక్ష్మీనరసింహముగారి నవలలు, శతావధాన కవుల కవితా ధారలు, యువక కవుల రసభరిత పద్యావళులు, గ్రంథమాలలు, గురజాడ అప్పారావుగారి ముత్యాల సరములు బళ్లారి కృష్ణమాచార్యులుగారి నాటక ప్రదర్శనములు, గిడుగు రామమూర్తిగారి భాషాతత్వ పరిశోధనలు, ఆంధ్ర సాహిత్య పరిషత్తులు, వార్తా పత్రికలు, గ్రంథాలయములు మొదలగు భాషాసేవక ప్రయత్నము లెన్నియో బయల్వెడలుచున్నవి భాషకు గ్రొత్త జవము; కవితకు గ్రొత్త పోకడలు, కల్పనలకు గ్రొత్త రీతులు, గద్యకు గ్రొత్త శైలులు అలవడుచున్నవి.

ఆంధ్రభాష పూర్వమువలె కేవలము విద్వాంసుల వశమునందే యుండజాలదు కవిత పూర్వాలంకారికుల శృంఖలములచే గట్టుబడుట కొప్పుకొనదు. జ్ఞానమిక నే కొలది విద్యాధికుల గుప్తధనముగనో దాగియుండదు. నేటి సాహిత్య విజృంభణమున ముఖ్యముగ మూడు విశేషములు కన్పట్టుచున్నవి. గ్రాంథిక భాష కూడ గాలానుగుణ్యములైన మార్పుల నొందుచు, సాధ్యమైనంత వఱకు వాడుకభాసను సమీపించవలసిన అవసరము గమనింపబడుచున్నది. జ్ఞానము సర్వవ్యాపకము కావలె ననిన, మూడు నాలుగు వందల సంవత్సరముల వెనుకటి కవుల భాషాద్వారమున ప్రకటింప జూచుట నిరర్థకము వాడుకభాషలో

నుండు సరళత, సౌలభ్యము, సహజ వికాసము, వ్యాపన శీలము, ప్రాతబడిన పదజాలమునం దుండుట యసంభవము ఇయ్యది జ్ఞానయుగము.సకల వర్ణములు సమస్తకులములు అభ్యున్నతిని బొంద గోరుచున్నవి. విద్య సార్వజనీన మగుటకు బాట లేర్పడుచున్నవి. ఇట్టి నూతన సందర్భములో భాష మృతప్రాయమైన ప్రాచీన పక్కీనే నడుచుటకు వీలు లేదు. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి వంటి వైయ్యాకరణులు కూడ ప్రస్తుత కాలపరిణామమును, నూతన సాహిత్య విజృంభణమును గమనించి, "ఆంధ్ర భాషానుశాసనమ"ను క్రొత్త సూత్రావళిని నిరూపింప బూనుటయే యిందుకు నిదర్శనము. భాష కాలప్రవాహమున బడి క్రొత్త వికాసమును బొందుచున్నప్పుడు, దాని నరికట్ట జూచువారు, సముద్రమును నిస్తరంగముగ జేయజూచిన కెన్యూటు రాజు గతినే పొందెదరు,

భాష వెనుకటి కాలమున కెట్లు బంధింపబడి యుండుట కొప్పుకొనుట లేదో, అట్లే కవిత కూడ పూర్వకాలపు ప్రబంధరీతులకు దోసిలొగ్గి యుండుటకు సమ్మతింపదు. నేటి సాహిత్యములో రెండవ విశేష మిది. ఇయ్యది ఆంగ్లభాషా పరిచయముచే గలిగిన సంస్కార మనుట నిస్సంశయము. దేశభాషోద్యమము విదేశ భాషపై తిరుగుబాటు చేయుట ఆత్మోన్నతికి భంగకరమని కొందఱి ఆంగ్ల భాషాభిమానుల తలంపు. దేశభాషోద్యమము ఆంగ్లముపై తిరుగబాటు చేయుచున్న దనుకొనుట వట్టి పొరబాటు ఈ తిరుగుబాటంతయు ఆంగ్లముయొక్క నిరంకుశాధిపత్యముపైగాని, కేవలము విదేశభాషలపై గాదు. ఆంధ్రము ప్రాంతిక భాష యైనను, నేడు ప్రపంచజ్ఞానము నంతను తనయం దిముడ్చుకొన జూచుచున్నది. ఇటు సోదర దేశభాషలతో చెలిమి గరపుచు, నటు యూరపియను వాఙ్మయ మందలి ఆధునిక విజ్ఞానమును సముపార్జించుటకు తీవ్రమైన ఆవేదన నొందుచున్నది. గడచిన ఇరువది ముప్పది సంవత్సరములలో తెలుగుభాష యొక్క యభివృద్ధిని బరిశీలించిన యెడల, నెట్టి నూతన జ్ఞాన సంపాదనమునకు గడంగుచున్నదియు దెలియగలడు. భరతవర్షము సభ్యరాజ్యములతో సరిసమానముగ తులతూగుటకు ప్రబల ప్రయత్నము గావించుచున్న ఈ తరుణములో, దేశభాష

లెట్లు ప్రాంతబద్ధములై వికాసము నొందక యుండగలవు? ఆంగ్ల విద్యాధికులు తమ యాధిపత్యము పోవునను భీతిచే దేశభాషలపై నిట్టి నింద వేయుచున్నారే కాని మరియొకటి కాదు ఆంగ్లమును రాజకూటముల నుండియు, యూనివర్సిటీల నుండియు నెంత త్వరగా గెంటిన, అంత త్వరగ దేశభాషలు ప్రపంచ విజ్ఞానమును తమయందిముడ్చుకొనగల శక్తియు, ప్రయత్నమును, బయల్వెడలును. నేటి సాహిత్య విజృంభణము అట్టి విశ్వాసమును గలిగించుచున్నది. నేటి యువక కవుల పోకడ లన్నియు సత్పథములని చెప్ప సాహసింపము కాని వీరు కూపస్థ మండూకములు కారని వారి కృతులయందు వ్యక్తమగుచున్న సంస్కారోత్సాహము చెప్పకయె చెప్పుచున్నది.

భావ వివశత్వము నేటి సాహిత్యము యొక్క మూడవ విశేషము. ఆధునిక పాశ్చాత్య సంఘట్టనమున దగులొక్కనిన దేశభాషలు పూర్వపు భావనాశక్తిని నిరాకరించి, కేవలము నిస్సారములైన పుంతలను బట్టునని భయపడ వలసిన పని లేదు. భావ వివశత్వము భారతీయుల రక్తమునందినికి యున్నది, దేశభాషలను బూర్తిగా విడనాడి కేవలము విజాతీయ వ్యామోహమునందు బడిన ఆంగ్ల విద్యాధికుల పలుకులలో నట్టి నీరసము గన్పట్టునే కాని, నేటి దేశభాషా లేఖిని నిఖిల రసామృతమును చిందింప జూచుచునే యున్నది కొన్ని పోకడలు ఆంగ్లేయ కావ్యముల మాదిరుల ననుకరించుచున్న మాట సత్యము. ఆంగ్లేయ కవుల స్వభావోక్తులు, సాంసారిక క్రీడ, ప్రకృతి సౌందర్యాభివర్ణనము, మానవ చరిత్రా సమాలోచనము, మొదలగు రీతు లనుసరింప బడుచున్నను వారికి భారత సంప్రదాయానుగుణ్యముగ ఆధ్యాత్మిక పుష్టినొసగుచు రసాత్మకముగ జేయ గలుగుచున్నారు. ఈ కవితలో జాలవఱకు అనుభవసిద్ధి మృగ్య మనుటకు సందియము లేదు. భావలతికల యల్లికయు, పదజాలముల కూర్పు నెక్కువ యున్నమాట నిజము కాని వారిలో నొక యాకాంక్ష, ఒక యావేదన పుట్టలేదని చెప్పుటకు వీలు లేదు. భాషా మాధుర్యమును జవిచూపవలె ననెడి కోరిక, భావ సౌందర్యమును గనుగొనవలె ననెడి ఆవేదన, క్రొత్త రాగములను బాడవలె ననెడి

యభిలాష, ప్రజాశక్తి నుద్బోధించ వలెననెడి యుత్సాహము ఐహికాముష్మికముల సామరస్యమును వ్యక్త పరుప వలెననెడి యన్వయజ్ఞానము వారి కృతులయందు గోచరింపక పోవు.

రాజాదరణగాని, విద్యాధికుల మెప్పుగాని, లేని యీ దినములలో తెలుగు కవిత యింతమాత్రమైన దలయెత్త గలుగుట మన భాగ్య విశేషము కాక మరియేమి? యూనివర్సిటీల లోని శేముషీ దురంధరులు విద్యార్థుల కెంతవఱకును వర్డ్సువర్తు, షేక్స్పియరు, షెల్లీ, కవులను ప్రశంసించుచుందురే కాని, వానితో బాటుగ నైన, మన ప్రాచీన కవులయొక్కగాని, నవీన యువకవులయొక్కగాని కవితా విశేషముల నుండి సాదృశ్యములను జూపుచు మాతృభాషాభిరుచిని గలిగించిన పాపాన పోవుటలేదు ఆంధ్ర సెనేటర్లు తెలుగునకు వెలి తీర్పు చెప్పుటకో తెలియదు వారింకను ముహూర్తము కొఱకు మీన మేషములను లెక్కించుకొనుచున్నారు ఇక జాతీయ విద్యాలయములే యీ యుద్యమమునకు శరణ్యములు కావలెను. పాఠములను దేశభాషలో బోధించుచుంటి మని చెప్పిన జాలదు. కొన్ని తెలుగు ప్రబంధములను పాఠ్యములుగ చేసితి మనినను ప్రయోజనము లేదు జాతీయ విద్యాలయము లీ సాహిత్య విజృంభణమునకు గార్యస్థానము లగునట్లు చేయవలెను. ఆంధ్రభాష ప్రజాశక్తి నుద్బోధింపగల, ప్రపంచ జ్ఞానము నిముడ్చుకొనగల, దేశముయొక్క భవితవ్యమును వెల్లడింపగల ప్రబల సాధనమగునట్లు ఘోర తపస్సు నొనర్పగలిగి నప్పుడే జాతీయ విద్యాలయములు చరితార్థము లగును. జాతీయ విద్యాలయము లింకను యూనివర్సిటీ కళాశాలలకు పోటీగా బనిచేయ జూచుచున్నవియే కాని స్వతంత్ర సంస్థలు కావు, జాతీయ విద్యాలయములు సాహిత్య పరిషత్తులుగ మారి మాతృభాషను తిరిగి విద్యాదేవిగ ప్రతిష్ఠింప గల్గినప్పుడే యవి సజీవములై దేశమునకు శక్తిని, ముక్తిని ప్రసాదింప గలుగును.

కృష్ణా పత్రిక
ఆక్టోబరు 2వ తేది, 1926 సం॥

# బలి ! బలి !

గౌహతీలో కాంగ్రెస్ సమావేశము కాబోవుచున్న తరుణమున్న,డిల్లీ యందొక మహమ్మదీయ హంతకుడు శ్రద్ధానంద స్వామిని రివాల్వరుతో గాల్చి చంపెనను దారుణ వార్త మహాజ్వాలవలె దేశము నంతయు నలముకొనినది ఈ వార్తను విని దుఃఖించని భారతీయుడుండడు. శ్రద్ధానందస్వామి వంటి ప్రముఖుడు గతించి నందుకు దుఃఖముకలుగవచ్చును. కేవలము అట్టి దుఃఖముకాదు నేడు దేశము నంతను గగ్గోలు పెట్టుచున్నది. హిందూమహమ్మదీయ వైరము తుదకిట్టి దురంతమున బరిణమించెను గదా యని భారత గర్భమునుండి ప్రచండ వేదన యొకటి బడబానలము వలె ప్రజ్వలించుచున్నది ఇటీవల ఉత్తర హిందూస్థానమున ననేక స్థలములయందు హిందువులకును మహమ్మదీయులకును కొట్లాటలు జరిగెను కొందఱు ప్రాణములను సహితము గోలుపోయిరి. కొన్ని మసీదులకును,దేవాలయములకును నష్టము వాటిల్లినది కోహట్,కలకత్తా మొదలగు నగరములందు జరిగిన అల్లరుల వృత్తాంతములు మిగుల భయంకరములుగ నుండెను. కాని యవి యన్నియు నొక యెత్తు. ఒక యుద్రేక సమయములో జనులు మితిమీరి ప్రవర్తించుట సహజము. ప్రజలలో రోషానలము ప్రజ్వరిల్లి నప్పుడు యుక్తాయుక్త విచక్షణ యుండదు. ఒకవిధమైన రాక్షసత్వము జనుల నావేశించి సంహారకార్యములను బ్రేరేపించును. కాని అయ్యది తాత్కాలికము ఒక క్షణము భగ్గుమని మరియొక క్షణము చల్లబడును కాని నేడు ఉత్తర హిందూ స్థానమున ప్రబలుచున్న మహమ్మదీయ వైర మట్టి తాత్కాలిక ఉద్రేక ప్రేరితము కాదని శ్రద్ధానందస్వాములవారి హత్యవలన స్పష్టపడుచున్నది. కొంతకాలము నుండి నిప్పు రాజుచునే యున్నది.అప్పుడప్పుడు పొగలు, మంటలు నెగయుచుండెను. కాని ఇయ్యది యిట్టి కుమార్గముల వ్యాపించి, అరాచక పద్ధతిని గూఢహత్యలుగ బయల్వెడలునని ఎవరును దలంచియుండరు

శ్రద్ధానందస్వాములు గతించినందు కెక్కువ దుఃఖించవలసిన పనిలేదు వారు వృద్ధులు కొంతకాలము నుండియు రుగ్మతచే బాధపడుచుండిరి. యావజ్జీవితము దేశముకొరకు, ధర్మముకొరకు ధారపోసిన త్యాగధనులు. గురుకుల సంస్థాపనాచార్యులుగ వారి నామము ఆచంద్రతారార్కముగ వెలుగగలదు అట్టి మహనీయుని నిర్యాణము ఆనందదాయకము కాని శ్రద్ధానందస్వామికి నేడు వాటిల్లినది మృత్యువు కాదు హిందూ మహమ్మదీయ వైరమునకు శ్రద్ధానందుడు బలి యయ్యెను. ఘోరమైన బలి- భయంకరమైన బలి- దేశమునంతను గగ్గోలుపెట్టుచున్న బలి- భారతవర్షమున కింకను ఇక్కట్లు తప్పలేదు ఇట్టి వైరముల చేతనే పూర్వము తన సింహాసనమును మంట గలుపుకొనినది. ఇట్టి వైరముల చేతనే దేశము దాస్య బంధనముల జిక్కినది. ఎప్పటికైన, నీ యభాగ్య దేశమునకు మతవైరముల నుండి యీ కులవైషమ్యముల నుండి విముక్తి కలదా యని నేడు తల్లి శ్రద్ధానందస్వాముల కళేబరమును తన యంకమున బరుండబెట్టుకొని ఆక్రందించుచున్నది ఆ యాక్రందనము లిప్పడైన తనయుల హృదయమును గరగించునో లేదో! ఎంతకాలము పుత్రులు శుష్క వాదములలో జిక్కి పరిభవముల బాల్పడుచుందురో తెలియదు. గౌహతి యాత్రికులు చిత్ర చిత్రములుగ తమ వితర్కములను బ్రదర్శించుకొనుచు బ్రయాణము సేయుచుండిరి. ఎన్నికల కైపు ఇంకను దిగలేదు. మంత్రిత్వములను స్వీకరింపవలదా యను మీమాంసయే జాతీయసమస్య యని ఘోషించుచుండిరి. సంపూర్ణ స్వాతంత్ర్యము నిర్వచింపవలసిన తరుణము వచ్చినదని ఘీంకృతులు సలుపుచుండిరి. శాసనోల్లంఘన క్రీడను తిరిగి ప్రారంభింపుడని దంభోక్తులను బల్కుచున్నారు. ఇట్టి వితర్కములతో, ఇట్టి దురహంకారములతో, ఇట్టి దంభోక్తులతో, కాంగ్రెసుయాత్రికులు గౌహతీలో దిగుచుండిరి. కాని వారా యేకాంతస్థలమున నడుగిడుటతోడనే, మబ్బులేని ఆకసమునుండి పిడుగు బడినట్లుగ శ్రద్ధానంద స్వామియొక్క దుర్మరణవార్త ప్రతిధ్వనించెను. ఇది యీశ్వరాజ్ఞ! ఆ శుష్క వాదములు, ఆ క్రీడా ప్రహసనములు, ఆ బాల సంజల్పములు ఏమైనవో! మబ్బులు క్రమ్మినవి. గంభీరమైన శాంతిభార మావహించినది. భారత జాతియొక్క ఆక్రందన

స్వరములు మేఘ గంభీర నిర్ఘోషమువలె అంతరంగమున ప్రతిధ్వనించినవి. దేశముయొక్క యనూన తాప మా గాంధీమహాత్ముని మౌన వ్యాఖ్యయందు మూర్తీభవించెనా యనునట్లు యాత్రికు లెల్లరకు హృద్గతమైనది. ఈ దుర్మరణ సమ్ముఖమున, ఎన్నికల కోలాహలము కాదు, మంత్రుల నియామకము కాదు, స్వరాజ్యపద నిర్వచనములు కావు,శాసనోల్లంఘన ప్రతాపములు కావు. కాంగ్రెసు ప్రతినిధుల హృదంతరమును గలవరపరుప గలిగినది. భారత జాతీయైక్య మెట్లు? హిందూ మహమ్మదీయ సమ్మేళన మెట్లు? కులతత్వ పిశాచ నిబర్హణ మెట్లు? ఇదియ నేటి ప్రచండ సమస్య. శ్రద్ధానంద స్వాముల రుధిర ప్రవాహమున దేలియాడుచు భారతజాతి క్షతగాత్రియై విలపించుచుండ కాంగ్రెసు ప్రతినిధు లింకను వాగ్వాదములకు లోనై యుండగలరా! అసంభవము. కుతర్కముల నెల్ల బారద్రోలి, గాంధిమహాత్ముని మౌనవ్యాఖ్య ననుసరించి నిర్మాణ కార్యక్రమ మునకు గడంగిరేని, శ్రద్ధానంద స్వాముల బలిదానము జాతీయ శక్తివర్ధకమై స్వాతంత్ర్యప్రదము కాగలదు. రోషమున కిది తరుణము కాదు ప్రతీకార వికారములకు తావు లేదు. దేశమునం దైక్యము గూర్పజాలనందుకు లజ్జించుడు. జాతీయ నిర్మాణ కార్యమును వదలి బాహ్య వికారములకు లోబడినందుకు బరితపింపుడు- కౌన్సిళ్ళ వ్యామోహమున జిక్కి చిత్తవిక్షేపము నొందినందుకు దుఃఖింపుడు. ఇప్పుడైన దేశము యొక్క దౌర్బల్యమును, అనైక్యమును, అసహనమును, విద్వేషమును తలపోసి, కర్తవ్యాంశమునకు గడంగుడు. కులతత్వ పిశాచమును, మతవైరములను బారద్రోలి దేశైక్యమును గూర్చుటకు గౌహతీ కాంగ్రెసు ఎట్టి కార్యక్రమమును నిర్ణయించునో యని లోక మెదురు చూచుచున్నది. దైవమీ తరుణమున దోడ్పడును గాక!

కృష్ణా పత్రిక
డిశంబరు 25వ తేది, 1926 సం॥

# చేతి మగ్గములు

ఈ దేశమునందు వ్యవసాయము తరువాత, మిల్లులు లేని కాలములో, నేత పరిశ్రమయే ప్రధాన వృత్తిగ నుండుచుండెడిది. దూదిమిల్లులు బయలుదేరి, మిల్లుబట్టలు దిగుమతి కా నారంభించి నప్పటినుండియు, చేతి మగ్గములు వాని పోటీకి తాళలేక క్షీణింప మొదలిడెను యంత్రములపై తయారు కాజాలని సేలము కండువాల వంటి పట్టంచు బట్టలు, ఉప్పాడ ధోవతులవంటి జరీబట్టలు తప్ప జన సామాన్యము సర్వసాధారణముగ మిల్లుబట్టలనే కట్టుట కలవాటు పడిరి. ఎంత మందియో నేతపనివాండ్రు తమ చిరకాలాగతమైన కులవృత్తిని వదలివేసి ఏ కూలినాలియో చేసికొని బ్రతుకవలసిన దుర్దినములు సంభవించెను. మిల్లునూలు వచ్చి రాటములను బూర్తిగ ద్రోసివేసినట్లు మిల్లుబట్టల మూలమున చేతిమగ్గములను జాలవరకు మూలపడెను. లోకాభ్యుదయమునకు మిల్లులే పరమ సాధనములని నమ్ముచుండిన నవీన సంస్కారులెల్లరు చేమగ్గములను క్రీగంటనైన జూడకుండిరి. రాటముసంగతి అసలు వారి స్మృతిపథమునుండియే పూర్తిగ జారిపోయినది. బట్టల వర్తకులు చేతిమగ్గములపై పెట్టుబడి పెట్టుట మాని, మ్యాన్చెస్టరు మిల్లులకు ఏజంటులుగ నేర్పడి దిగుమతిదారులైరి. ధనాఢ్యులైన షాహుకారులు దూది మిల్లులను స్థాపించి మిల్లునూలును, మిల్లుబట్టలును ఉత్పత్తిచేయ సాగిరి. దేశము బయటనుండియు లోపలనుండియు మిల్లు లీవిధమున చేతిమగ్గములపై దాడివెడలిన పిమ్మట నివి యెంతకాలము నిలువగలవు? నేతపనివాండ్రు నీ పోటీనుండి తప్పించుకొనలేక, మగ్గములను వదలివేసిన వారు వదలివేయగ, మిగిలిన కొలది మందియు చేనూలును విసర్జించి, మిల్లునూలుతో నేత మొదలుపెట్టిరి. అరువది డెబ్బది సంవత్సరముల క్రిందటి వఱకు తాము చేనూలుతోనే బట్టలు నేయుచుంటి మను మాటనుగూడ మరచిరి. నూరు సంవత్సరముల క్రిందట చేనూలుతో మగ్గములపై తయారగుచుండిన సెల్లాలు లక్షలకొలది ఇంగ్లాండున కెగుమతి

చేయుచుండిన బందరురేవు నేడు సీమబట్టల దిగుమతిదారులకు నిలయమై వెలయు చున్నది. కాని దీని చుట్టుప్రక్కల నింకను, మల్లవోలు, కప్పలదొడ్డి రాయవరం, చింతగుంటపాలెము మొదలగు గ్రామములలో చేతిమగ్గములు కలవు. కాని వీని బ్రతుకైనను సందిగ్ధముగ నున్నదేకాని అపాయస్థితి తప్పినదని చెప్పుటకు వీలు లేదు. ఈ మగ్గము లిప్పుడు ఏ సింగపూరు లుంగీలనో, ఏ హైదరాబాదు చీరలనో, నేసికొని బ్రతుకుచున్నవి ఈ వ్యాపారమైనను స్థిరమని చెప్పుటకు వీలు లేదు రేపు జపానునుండియో జర్మనీనుండియో లుంగీలు, చీరెలు దిగుమతి కా నారంభించిన యెడల, వీని గతి యేమగును ? స్థానికముగ వీనికి పోషణ లేదు తుదకు ఆ నేతపనివాండ్రైనను తమకు గావలసిన బట్టను తాము నేసికొనక సీమబట్టల నుపయోగించుచున్నప్పుడు వానికి ఆదరణ యెక్కడనుండి వచ్చును? తమబట్ట తమకు బనికిరానప్పు డితరులకు మాత్ర మెట్లు బనికిరాగలదు? ఇంతకును ప్రజల రుచులు మారినవి సీమబట్టల నిగనిగపై వ్యామోహము జనించినది పట్టణస్థులతో బాటు పల్లెటూరి జనమును వ్యాపారస్థులతో బాటు పాటకపు జనమును పలుచని సీమబట్టల రుచిమరగిరి. ప్రజల రుచులు మిల్లుబట్టలపై తిరిగిన పిమ్మట నేతబట్ట కిక స్థానమెక్కడ ? పైనుండి యెంత సహాయము జేసినను లాభము లేదు. గవర్నమెంటు వారు చేతిమగ్గముల కొరకెంత కన్నీరు కార్చినను ప్రయోజనము లేదు. ఇరువది యైదు సంవత్సరముల క్రిందట హావెలు దొరగారీ చేతిమగ్గముల ప్రాశస్త్యమును గూర్చి బహురసవంతమైన గ్రంథమును వ్రాసెను. కాని మన విద్యావంతులు పెదవి విరచిరి. హిందూదేశములో గూడ మిల్లు లభివృద్ధి బొందుచున్నందుకు ఓర్వలేక, హావెలు యీ గ్రంథమును దురుద్దేశముతో వ్రాసెనని నిందించిరి. కాని దైవవశాత్తు 1905 లో స్వదేశోద్యమము ఉదయించెను. ప్రజలలో స్వదేశీ వస్త్రదీక్ష ప్రారంభమయ్యెను. ఆర్థికముగనే కాక, దేశీయ కళాకౌశల చిహ్నముగ గూడ చేతిమగ్గముల సంరక్షణ మావశ్యక మని బోధపడెను. ఫ్రాన్సు, ఇంగ్లాండు మొదలగు నవీన నాగరక దేశములలో గూడ చేతిమగ్గములు తిరిగి తలయెత్తు చున్నవను వార్త తెలియవచ్చెను. గవర్నమెంటులోని పారిశ్రామిక శాఖవారును చేతిమగ్గములను బ్రోత్సాహపరచుటకు ప్రత్యేకముగ నుద్యోగుల నేర్పాటు చేసిరి,

ఆ యుద్యోగియులు చేతిమగ్గములు గల గ్రామములకు బోయి మరమగ్గములను ప్రదర్శించి, చేతిమగ్గముల మీదనే ఎక్కువ బట్ట నుత్పత్తి చేయగల యుపాయములను జూపిరి. అప్పుడు నేతపనివాండ్రా సంస్కరణముల యెడల గొంత వైముఖ్యమును జూపిరి, కాని పిమ్మట క్రమక్రమముగ వాని యుపయోగమును గ్రహించిరి. ఇప్పుడన్ని గ్రామములలోను మరమగ్గము లాడుచున్నవి. కాని యింకను వాని యభివృద్ధికి జేయదగిన మార్గము లెన్నియో కలవు కండెల నెక్కువ సులభముగ జుట్టుటకు చిన్న యంత్రములను గల్పించవచ్చును. పడుగును సరిచేయుట కెక్కువ సులువు మార్గములు కలవు. చేనూలు నుపయోగించుటకు వెనుకాడువారు తమకు దేశములో తయారగు మిల్లునూలునైన వాడునట్లు జేయవచ్చును. కాని చేతిమగ్గములవారు మిల్లునూలుమీద నాధారపడి యున్నంత కాలము రాటములవలె తమ మగ్గములు కూడ నెప్పటికైనను మిల్లు పెనుభూతమునకు బలికాక తప్పదని వారెంత త్వరగా దెలిసికొనిన, అంత మేలు నేతపనివాండ్ర నంతగ నిందించిన లాభము లేదు. ప్రజల రుచులే వారికి ప్రమాణములు ప్రజలలో తిరిగి ఖద్దరునందే ఆసక్తి వ్యాపించినయెడల నేతగాండ్రును తమయాత్మరక్షణ కొరకు ఖద్దరు నేయుటకు దిగక తప్పదు. దేశముయొక్క ఆర్థిక స్థితిని ప్రజాక్షేమమును మిల్లుల యనర్థకములను, దూరదృష్టితో యోచించగల ప్రముఖులపైననే నేతపరిశ్రమ యొక్క భవిష్యత్తంతయు నాధారపడి యున్నది. పారిశ్రామిక శాఖ మంత్రుల యధీనమై తొమ్మిది సంవత్సరములైనది కాని వీరింతవరకు నేతపరిశ్రమను గూర్చి చేసిన ఆలోచన సున్న. రంగనాథ మొదలియారుగారు మంత్రిగ నుండినప్పుడు, రాటములను చేతిమగ్గములను ప్రోత్సాహపరచుటకు గవర్నమెంటులో ప్రత్యేక శాఖ నేర్పాటుజేయుటకై శాసనసభలో నొక తీర్మానము ప్రవేశపెట్టబడెను. మొదలియారు గారందుకు సమ్మతించి తద్విషయమై యొక విచారణ సంఘమును నియమించిరి. విచారణ సంఘమువారు గావించిన శిఫారస్సులలో నొకటిగూడ రాటమును గూర్చి యున్నట్లు కన్పట్టదు. 1927 నవంబరులో శాసనసభయందు ప్రతిపాదింపబడిన తీర్మానమునందు చేనూలుయొక్క ప్రాముఖ్యముగూడ ప్రస్తావింపబడినను

విచారణ సంఘమువారు దానిని బూ_ర్తిగ మరచి చేతిమగ్గములనుగూర్చి మాత్రమే ఆలోచించుటకు గారణము తెలియకున్నది విచారణ సంఘమువారా విషయము నాలోచించనప్పుడు గవర్నమెంటువారి మెమోరాండములో గూడ నది యుదా హరింపక పోవుటలో నాశ్చర్యము లేదు చేతిమగ్గముల నభివృద్ధిపరచుటకై విచారణ సంఘమువారు గావించిన శిఫారస్సులు కూడ గొంత విచిత్రముగ దోచక మానవు. 40 నంబరు దాటిన సన్నని నూలుపైనను, జరీపైనను దిగు మతి సుంకమును బూ_ర్తిగ దొలగించవలయునని విచారణ సంఘమువారు శిఫారస్సు జేసిరి నూలుధర తగ్గినయెడల, నేతపరిశ్రమ యభివృద్ధి పొందునని వీరి యభిప్రాయమైనట్లు గన్పట్టుచున్నది. సన్నని నూలు చాల దిగుమతి యగుచున్నమాట నిజమే కాని దీనిలో విశేషభాగము బొంబాయి, అహమ్మదా బాదు మిల్లులే యుపయోగించు కొనచున్నవి చేమగ్గము లుపయోగించుచున్న నూలులో నూటికి పదియవ వంతు మాత్రమే 40 నంబరు దాటిన సన్నని నూలు. ఈ విషయము విచారణ సంఘమువారికి దెలిసియే యుండును. సన్నని నూలుపై దిగుమతి సుంకమును తీసివేసిన యెడల, నిజముగ లాభము పొందునది బొంబాయి మిల్లులుగాని చేతిమగ్గము లెక్కువ నష్టపడును. బొంబాయి మిల్లులు సన్నని విదేశపు నూలుతో బట్టలు నేసి, చౌకధరలకు విక్రయింప గలిగినప్పుడు, చేతిమగ్గము లా పోటీనుండి యెట్లు రక్షించుకొన గలవు? 1927లో సన్నని నూలుపై డ్యూటీ హెచ్చింపబడినప్పుడు లాంకెషైరు మిల్లులవారు కోపోద్రేకులైరి. ఇప్పుడా డ్యూటీని బూ_ర్తిగ తొలగించుటకు మద్రాసు విచారణ సంఘమువారు గావించిన శిఫారస్సునకు వారెంతయు కృతజ్ఞు లయ్యెదరు. ఈ శిఫారస్సును గూర్చి డైరెక్టరు ఆఫ్ యిండస్ట్రీసుగా రాలోచించి రిపోర్టు చేయవలసినదని గవర్నమెంటువా రుత్తరువు చేసిరి డైరెక్టరు గారును అందుకు సమ్మతించెద రనుటకు సందియము లేదు దేశములోని వస్త్రపరిశ్రమను సంరక్షించుటకు విదేశపు దిగుమతులపై నిషేధపు సుంకములను విధించుట యవసరమని ఒక ప్రక్కను అందోళనము సేయుచుండ ఇంకొక వైపున మద్రాసు గవర్నమెంటు వారు చేతిమగ్గముల పేరిట విదేశపు నూలుపై డ్యూటీని బూ_ర్తిగ తొలగింప

గోరుట యెంత విపరీతముగ నుండునో పాఠక మహాశయులే యూహింప గలరు. నేతపరిశ్రమ నభివృద్ధి పరచుటకు, మధ్యదళారీలను తొలగించి సహకార సంఘముల ద్వారా నేతవ్యాపారమును జరుపవలయు ననునది విచారణ సంఘమువారు గావించిన శిఫారస్సులలో మరియొకటి చేతిమగ్గముల వంటి కుటీర పరిశ్రమలకు సహకార సంఘములు చాల యుపకారములుగ నుండుననుటకు సందియము లేదు. మధ్య షాహుకారులకును పెట్టుబడిదారులకును బోవుచున్న లాభము సరాసరి నేత పనివాండ్రకే చెందుట న్యాయము. కాని ఈ కాలములో కుటీర పరిశ్రమలపై పెట్టుబడి పెట్టు షాహుకారులే చాల యరుదుగ నున్నారు. మిల్లువ్యాపారములో నున్న సుఖము, నిలుకడ, సౌకర్యములు, లాభములు, చేతిపనులలో లేవు ఈ కారణముచేత నేడెన్నియో చేతిపనులు పెట్టుబడిదారులు లేకపోవుటచే నుత్సన్నమై పోయినవి సహకార సంఘములు తగినంత పెట్టుబడులతో తగినంత చాకచక్యముగ నిర్వహింపబడక పూర్వమే, ఇప్పుడున్న పెట్టుబడిదారులు వెడలిపోయిన యెడల, చేతిమగ్గముల దురవస్థ చెప్ప నలవికాదు. ప్రతి నేత పనివాడు నూలును సిలువ చేసికొనజాలడు. నేసిన వస్త్రమునకు ఎక్కువ ధర రాబట్టగల విక్రయ స్థానమునకు జేరవేయ జాలడు. ఈ పనుల నన్నిటిని వ్యాపారసరళిని గనిపెట్టి బాధ్యతతో నిర్వహింపగల పెట్టుబడిదారులు చాల యవసరము. వారైనను చేతిమగ్గముల ప్రస్తుత స్థితిలో నెక్కువ లాభములను వేసికొనజాలరు. పెట్టుబడిదారులలోను పోటీ గలదు. ఇప్పుడే వ్యాపారమునకును గుట్టు లేదు ఉత్పత్తిదారులలో గూడ నెక్కువ వేకువ కలిగినది. కొనువారైనను అంధులు కాదు. ఈ నూతన సందర్భముల మూలమున బ్రతి వ్యాపారమును ముఖ్యముగ కుటీరపరిశ్రమ లన్యోన్య సహాయముపై నాధారపడినగాని వర్ధిల్ల జాలకున్నవి. నేతపనివాండ్ర పరికరములను గాలానుగుణ్యముగ సంస్కరించుటకై నేతలోను నేతయంత్రములలోను బ్రత్యేక శిక్ష పొందినవారిని ఉద్యోగులుగ నియమించుట విచారణ సంఘమువారి శిఫారస్సులలో మరియొకటి. ఇప్పుడు గవర్నమెంటులో "టెక్స్టైలు ఎక్స్పర్టు" అను ఉద్యోగి కలడు కాని, వారి

మూలమున చేతిమగ్గముల కెంతవఱకు సహాయము కలిగినదో సందేహము. మన నేతపనివాండ్రు సహజముగ సంస్కరణ విముఖులు వారు తాతలనాటి పద్ధతులను బట్టుకొని ప్రేలాడుచుందురే కాని, క్రొత్త పద్ధతులవలన గలుగు లాభములను త్వరగ గమనింపరు. కావుననే పారిశ్రామిక శాఖవారీ విషయమై యెక్కువ శ్రద్ధ తీసికొనుట యవసరము. ఇప్పుడు మరమగ్గము లెల్లరిచేత నవలంబింప బడు చున్నను, కండెలను జుట్టుకొనుటలోను, పడుగులను సరిచేయుటలోను పూర్వ కాలపు పద్ధతులే యవలంబింప బడుచున్నవి సగము శ్రమతో రెండు మూడింతలు పని జరుపుటకు అవకాశము గలదు. అట్టి యంత్రములను చౌకగ తయారు చేసి పెదన వంటి గ్రామములలో ప్రదర్శించిన యెడల, నేతపనివాండ్రు వాని యుపయోగమును సులభముగ గ్రహించుట కవకాశము గలుగును. ఈ విషయ ములో గవర్నమెంటువారు చూపుచున్న ఉపేక్ష క్షంతవ్యము కాదు ఎక్కడనో ఒకచోట నేత పరిశ్రమాలయమును బెట్టినంత మాత్రమున లాభము లేదు. ఆ కళాకుశలురు గ్రామ గ్రామము తిరిగి నేతగాండ్ర యిండ్లయొద్ద తమ నేర్పును ప్రదర్శించి, నవీన పద్ధతులను ప్రచారము చేయుట యత్యవసరము. అంతియ కాని, నేతవాండ్రలో త్రాగుడు మొదలగు దురభ్యాసములు కలవని చెప్పి, తమ యుపేక్షను సమర్థించుకొన జూచుట మాత్రము ఉదారముగ లేదు. త్రాగుడొక్క నేతవాండ్రలోనే లేదు. పనివాండ్రందరిలో సమముగ వ్యాపించి యున్నది. ఉత్తమ జాతుల మనుకొను వారు కూడ దీనికి వశులగుచున్నారు. గవర్నమెంటువా రొక మూల కల్లుదుకాణములను సారాయి అంగళ్ళను పెట్టించి ఇంకొక ప్రక్కను పనివాండ్రలో త్రాగుబోతుతనము వృద్ధి యగుచున్నదని చింతించుటలో నర్థమేమి? సగము సగము సంస్కరణముల వలన ఇటు త్రాగబోతుతనమును పోజాలదు; అటు నేతపరిశ్రమయు నభివృద్ధి పొందజాలదు గవర్నమెంటువారికి నిజముగ చేతిమగ్గములపై నభిమాన మున్నయెడల తమ బట్టల సప్లయి యావత్తును మిల్లుల కియ్యకుండ చేతిమగ్గముల కేల ఇయ్యరాదు మన మంత్రులే సీమబట్టలను

ధరించి దొరల వేషములతో తిరుగుచు కుటీర పరిశ్రమలను బోషింపగోరుట కేవలము కపట నాటకముగాని మరియొకటి కాదు. నేతపనివాం డ్రింకను అజ్ఞానములో నుండుటచే, తమకు శత్రువు లెవరో, మిత్రులె రో, తెలిసికొన లేకున్నారు. ఇదెంత కాలము?

కృష్ణా పత్రిక

మార్చి 30 తేది, 1929 సం॥

# మహాత్ముని అవతార రహస్యము

I

బక్క మనిషి, పొట్టివాడు, దుర్బల శరీరుడు. భౌతిక విగ్రహ మెవ్విధమున చర్మచక్షువులకు ఆకర్షణీయముగ నుండదు కాని యా యల్పోపాధి యందేదియో యొక దివ్యజ్యోతి, ఒక యద్భుతశక్తి, ఒక పవిత్రభావము జ్వాజ్వల్యమానముగ ప్రకాశించి, ప్రపంచ దృష్టి నంతను నాకర్షించుచున్నది. సోదర భారతీయులే కాదు, ఖండాంతరులు సహితము, జాతీయ దురహంకార వశులైన పాశ్చాత్యులు కూడ నీతనిని లోకోత్తర పురుషునిగ భావించుచున్నారు. రవి యస్తమింపని అఖండ సామ్రాజ్యమునకు అధిపతులైన బ్రిటిషు రాజ్య తంత్రజ్ఞులును వీని విచిత్రగతులను దెలిసికొనజాలక నిశ్చేష్టులై వెలవెల బోవు చున్నారు. ఫ్రెంచి భావవిదులు, జర్మను తత్వశాస్త్రజ్ఞులు,రష్యను సామ్యవాదులు, అమెరికను స్వాతంత్ర్యప్రియులు వీరు వారననేల, వర్తమాన కాలమున విశాల దృష్టితో మానవధర్మ నిరూపణమును గావింప జూచుచున్న వైజ్ఞానికులలో నీ మహనీయుని ఆత్మకథను బఠించి విస్మయచిత్తులు కానివారు లేరు. కాని సోదర భారతీయులు వాక్కుతో ప్రశంసించుచున్నను, వాని జీవితమువలన నీ దేశమునకును, తద్వారమున లోకమున కంతకును, జేకూరు పూర్ణ ప్రయోజనమును స్వీకరింపగల భక్తి విశ్వాసములను జూపలేకుండుట శోచనీయము.

అవతార పురుషుల మహిమ సమకాలికుల కంతగ బోధపడని మాట నిజమే. శ్రీకృష్ణుని లీలలు యశోదమ్మకే తెలియలేదు. అర్జునుడు సహితము సంశయాత్ము డయ్యెను శ్రీరామచంద్రుని అవతార రహస్యము నే శబరియో తప్ప యితరులు చూడలేకపోయిరి బుద్ధభగవానుని కరుణాస్వరూపము

సమకాలికులకు అగోచర మయ్యెను. ఏసునాథుని ఈశ్వరరాజ్య సంస్థాపనా ప్రయత్నము రాజద్రోహ దోషముగ నిరూపింపబడెను ఉదార చరితుల కథ యంతయు నిట్టిదే సమకాలికుల దృష్టి పూర్వ సంప్రదాయముల నతిక్రమించి భావికాల గర్భమున దాగియున్న పరిణామమును తిలకింప జాలదు. ఎట్టి మేధావులైనను వర్తమాన పరిస్థితులనుండి తప్పించుకొని ప్రకృతియొక్క అంతరంగమునుండి నూతనముగ బయల్వెడలనున్న క్రొత్త సృష్టిని క్రొత్త రూపములను ఊహింప నేరరు ప్రచలితములై యున్న సంస్థలు, సంప్రదాయములు, సిద్ధాంతములు స్థిరములు కావని నమ్ముటకు మనస్సు సామాన్యముగ నొప్పుకొనదు పరంపరానుగతములైన నమ్మకములు, మతములు, ఆశయములు మనస్సును బంధించివైచి సంకుచిత మార్గమున సీడ్చుకొని పోవుచుండును. "బుద్ధిః కర్మానుసారిణి" యను ఆర్యోక్తి వ్యక్తివిషయములోనే కాక జాతి విషయములో గూడ సత్యము. కొందరు పూర్వాచారములకు దాసులు. కొందరు నవీన పరివర్తనములకు బానిసలు ఉభయుల బుద్ధులును సమముగ అస్వతంత్రములే. భూత వర్తమాన పాశములనుండి విముక్తులై భవిష్యత్తున ఉదయింపనున్న మానవ కల్యాణమును హృదయస్థము చేసికొని తదాగమనము కొరకు లోకమును సంసిద్ధపరుప గోరువారు చాల యరుదు వారే యవతార పురుషులు. నిజమైన లోకోద్ధారకులు.

మహాత్ముడు అట్టి యవతార పురుషుడని అట్టి లోకోద్ధారకుడని ఎట్లు నమ్మగలము? భక్తుడు కావచ్చును. త్యాగికావచ్చును. ధైర్యశాలి కావచ్చును. రాజకీయాందోళకుడు కావచ్చును. సంఘసంస్కర్త యైనను కావచ్చును. అంత మాత్రము చేత నీతడు అవతార పురుషుడను దివ్యనామమును బడయుటకు అధికార మెక్కడ? దానికి ప్రమాణ మేమి? పదిమంది కూడి అనినంత మాత్రమున అవతార పురుషుడు కాగలడా? నిజమే ఈ బిరుదము నొకరిచ్చుటకుగాని ఒకరు పుచ్చుకొనుటకుగాని అధికారము లేని మాట నిజము అవతార పురుషుడనిన నేమి

యని తర్క వితర్కములు చేయ నారంభించిన యెడల ఆ వివాదమున కంతముండ జాలదు శబ్దజాలము మహారణ్యము గమ్యము చేర్చలేని వట్టి విభ్రమణములకే కారణ మగును ఆ నామము వివాదగ్రస్తమై మహాత్ముని సుస్వరూపమును వెల్లడించుటకు బదులు మరుగుచేయుటకు గారణమగునెడల దానిని వదలివేసి వాని నొక మహాపురుషునిగనే భావించి యీ విషయమును బరిశీలించెదము చందనతరువు నే పేరుతో బిలిచినను దాని పరిమళము మారదు.

అవతార పురుషుడనుడు, మహాపురుష డనుడు, మహాత్ము డనుడు —ఏ పేరైన నేమి? కొవలసినది వాని స్వరూపము, వాని యాంతర్యము, వాని విశేషము. ఏ వస్తువుయొక్క విలువనైనను గట్టుట కొక ప్రమాణ మవసరము. ఒక పురుషుని స్వరూపమును నిర్ణయించుటకు గూడ నొక ప్రమాణము అవసరమని వేరుగ జెప్ప నక్కర లేదు అట్టి సర్వజన సమ్మతమైన ప్రమాణ మొకటి కలదా? పురుషుని రూపము ఆదికాలముననే, వేదమునందే ఒక రూపకాలంకారములో వర్ణింపబడి యున్నది. పురుషుల కెల్ల మూలపురుషుడగు విరాట్పురుషుడు సమస్త జాతులకు, సమస్త గుణకర్మలకు ఆధారభూతుడుగ చిత్రింపబడి యున్నాడు. వాని ముఖమునుండి బ్రాహ్మణు లుద్భవించిరి. బాహువులనుండి క్షత్రియు లుద్భవించిరి. ఊరువులనుండి వైశ్యు లుద్భవించిరి. పాదములనుండి శూద్రు లుద్భవించిరి. ఎట్టి పరిపూర్ణుడు! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య. శూద్ర గుణకర్మ లన్నియు విరాట్పురుషుని యందైక్యము చెందియున్నవి. ఈ గుణకర్మలలో నే యొకటి లేకపోయినను వాని పరిపూర్ణతకే లోపము వాటిల్లును. విరాట్పురుషుడు ఒక్క బ్రాహ్మణుడు కాదు, ఒక్క క్షత్రియుడు కాదు, ఒక్క వైశ్యుడు కాదు, ఒక్క శూద్రుడు కాదు. వీని కన్నిటికి అతీతుడై, అన్నిటిని తనయం దంతర్భుక్తము చేసికొనిన మహాప్రభువు అందుకనియే విరాట్పురుషుడు. వాని యవయవములలో నొకటి పవిత్రమై, ఇంకొకటి యపవిత్రము కాజాలదు ఏ యొక యవయవము లోపించినను, విరాట్పురుషుడు కురూపి యగును అతడు సర్వాంగసుందరుడు. ముఖము, బాహువులు ఊరువులు, పాదములు అన్నియు

పూర్ణముగ వికాసము చెంది చరమసిద్ధి నొందియున్నవి హిందూ ధర్మశాస్త్రకారు లీ విరాట్పురుషుని ప్రమాణముగ నంగీకరించి. లక్ష్యముగ నిడుకొని, హిందూ సంఘమును నిర్మించిరి.

చాతుర్వర్ణ్య సంభూతమైన హిందూ సంఘము విరాట్పురుషుని యొక్క ప్రతిబింబమే యని కొంచెము పరిశీలించిన తెలియగలదు నాలుగు వర్ణములు యథావిధిగ బ్రవర్తిల్లుచుండినంత కాలము హిందూ సంఘము బలిష్ఠమై మహోన్నత దశ ననుభవించుచుండెను. బ్రాహ్మణ వర్ణము జ్ఞానవిలసితమై సంఘము యొక్క ధర్మమును నిరూపించుచుండెను. క్షత్రియ వర్ణము కర్మనిష్ఠాగరిష్ఠమై ధర్మమును బరిపాలించుచుండెను వైశ్య వర్ణము ధన ధాన్యముల నుత్పత్తి చేసి సంఘమును బోషించుచుండెను. శూద్రవర్ణము దృఢశరీరము కలిగి కాయకష్టముతో సంఘమును నిలువ బెట్టుచుండెను. ఈ వర్ణములలో నే యొకటి లోపించినను సంఘమున కంతకు ముప్పు వాటిల్లక తప్పదు

ఎప్పుడు మహాభారత కాలమున క్షత్రియ వర్ణము నాశనమైనదో, అప్పటి నుండియే హిందూ సంఘముయొక్క క్షీణదశ యారంభించెను. ధర్మ నిర్వహణ మునకు ఆధారభూతమైన క్షత్రియ వర్ణము లోపించుటతోడనే బ్రాహ్మణ వర్ణము యొక్క జ్ఞానజ్యోతియు నారిపోయెను. ధర్మ నిర్వహణాధికారులగు క్షత్రియులు లేనప్పుడు, ధర్మనిరూపణము చేయగల బ్రాహ్మణులును కమతవృత్తి నవలంబించి అచలాయతనమున బంధించుకొనిరి. బౌద్ధయుగమున నీ యచలాయతనమును బ్రద్దలు కొట్టి, సంఘమును నూతన పథమున దీసికొని పోవుటకు బ్రయత్నములు జరిగినవి. కాని, సంఘమునకు స్థావరము చిక్కక యింకను క్రిందకు జార మొదలిడెను. మహమ్మదీయ యుగములో హిందూ సంఘము పరధర్మ సంఘట్టనమున దగుల్కొని, పునరుజ్జీవమును బొంద జూచెను. కబీరు, చైతన్య, నానక్, రామదాసు మొదలగు భక్తశిఖామణులు జ్ఞానధనమును సంస్కృత పేటికలనుండి వెలికిదీసి దేశభాషలలో జనసామాన్యమునకు బంచిపెట్టిరి. స్వధర్మ నిర్వహణ మునకు గురుగోవిందు, రాణాప్రతాప్, శివాజీ, కృష్ణదేవరాయలు మొదలగు వీరులు

బయల్వెడలి దేశమును క్షాత్రతేజముతో నింప సమకట్టిరి. కాని సంఘము మొత్తముమీద గదలలేదు ఆరిపోవుచుండిన దీపము ఒకమారు భగ్గుమని ప్రకాశించినట్లు వెలిగెనే కాని, ఈ నూతన శక్తిని ధారణ చేయగల ఆధారము సంఘములో లేకపోవుటచే, బ్రిటిషు దాడిని నిరోధింపజాలక, ఇంకను క్రుంగిపోయెను.

బ్రిటిషు యుగమున హిందూసంఘముయొక్క అస్తమయము సంపూర్ణము. అన్ని వర్ణములును స్వధర్మ భ్రష్టము లైనవి. బ్రాహ్మణులు తమ జ్ఞాన సంపత్తిని పరరాజ్య సేవ కర్పించి స్వధర్మ ద్రోహులైరి. క్షాత్ర మేదోవిధముగ శేషించియున్నను శిక్కులు, రాజపుత్రులు, జాటులు, మహారాష్ట్రులు మొదలగు వీరసంజాతులు తమదేహమును బరరాజ్యమునకు విక్రయించుకొని దేశద్రోహులైరి. వైశ్యులు దేశైశ్వర్యము నభివృద్ధిపరచుట మాని విదేశపు దోపిడిగాండ్రకు సహకారులై దేశలక్ష్మిని బరభూములకు సాగనంపిరి నాల్గవ వర్ణము మాత్రము ఇంకను భూదేవి నాశ్రయించుకొని ధాన్యలక్ష్మిని గొలుచుచుండుటచే భరత ఖండము భూతలమునుండి పూర్తిగ బరిమార్జితము గాక పేరునకైనను నిలచి యున్నది. ఎక్కడి విరాట్పురుషుడు? ఎక్కడి హిందూ సంఘము? శిరస్సు ఖండింపబడినది. బాహువులు భగ్నమైనవి. ఊరువులు తెగగొట్టబడినవి. పాదములు మాత్రము మిగిలియున్నవి. ఎట్టి చిత్రవధ!

ఇక భరతవర్ష మిట్టిధమున జీర్ణమై, భ్రష్టమై, ఖండములై పోవలసినదియా? భారతీయ చరిత్ర సజీవమైన జాతీయజీవనమునందు గాక కేవల పురాణగాథలలో స్మరింపబడ వలసినదియా? భరతవర్షమున కిక పునర్జన్మము లేదా? భయపడ వలదు. భారతాత్మ యెన్నటికిని నాశన మగునది కాదు. అయ్యది నశ్యమే అయినయెడల, ఈజిప్టు బాబిలోను మొదలగు పురాణ జాతులవలె వెనుకనే నాశన మయ్యేడిది. భారత సభ్యత మృత్యువును జయించిన ఆత్మ పదార్థము చెకుముకిరాతిని ఇనుముతో గొట్టినప్పుడెల్ల దానినుండి అగ్ని కణములు బయల్వెడలునట్లు, దేశము పరరాజ్య వశమైనను, విజాతీయ సభ్యత

దేశమునం దంతట నావరించి, హిందూ సంఘమును విచ్ఛిన్నము సేయ జూచు చున్నను, భరతఖండము యొక్క హృదయాంతరాళము నుండి ఆత్మశక్తి తరంగ తరంగములుగ ఉద్గమించుచునే యున్నది ఏ దేశమునం దింత దుర్గతిలో రాజా రామమోహన రాయలు, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి, మొదలగు మహాప్రవక్తలు ప్రభవించిరి? దేశముయొక్క శరీరము నిర్వీర్యమై పోయినను, ఆత్మ యింకను చైతన్యవంతమై యున్నదనుట కింతకంటె నిదర్శన మేమి కావలెను? భరతఖండము తిరిగి తన స్వస్థానమును జేరి స్వధర్మమును ప్రతిష్ఠించుటకై సర్వముఖముల ప్రయత్నములు జరుగు చున్నవి. భరతవర్షము ఆత్మవిస్మృతి చెందిన దేశమగుటచే పరరాజ్య వ్యామోహము ప్రజల నందరను చిక్కబట్టి యుండుటచే మోక్షసాధనము బహు కఠోరమై దీర్ఘతరమై యుండక తప్పదు ఎల్లరిలోను ముముక్షుత్వము, ముక్తి యెడల నిచ్ఛ యుదయించినది. దానిని సాధించుటకు ప్రబల ప్రయత్నము కూడ ప్రారంభమైనది. సిద్ధి యెప్పుడని ప్రశ్నింప బనిలేదు. స్వధర్మ నిర్వహణము కొరకు జేయు సాధనయందే నిజమైన సిద్ధి కలదు దేశము ఎంత బలిదానము గావించిన అంత సిద్ధి చేకూరును. సాధన వినా సాధ్యము లేదు.

నేడు దేశమునందు జరుగుచున్న ప్రయత్నములలో మహాత్ముని యందెక్కువగ నీ సాధనసంపత్తి వ్యక్తమగుచున్న దని కొంచెము తరచి చూచిన తెలియగలదు. మహాత్ముడు సనాతన ధర్మవాదియైనను పూర్వాచారము లకు బానిస కాదు, సంస్కర్తయైనను నవీన పరివర్తనములకు దోసిలొగ్గువాడు కాడు. హిందూ సంఘముయొక్క మూలతత్వమగు విరాట్పురుషుని విగ్రహము వానియందు ప్రత్యక్షమైనట్లు నేడే యితర ప్రవక్తయందును గనుపించుట లేదు కాని ప్రాచీన కాలమున హిందూ సంఘము వర్ణవిభాగముపై నాధారపడి యుండెను, చాతుర్వర్ణ్యముల విభజన మేర్పడినను, మొత్తముమీద హిందూ సంఘము విరాట్పురుషుని పూర్ణ విగ్రహముగ బ్రకాశించి బలిష్ఠమై యుండెను కాని ఆ విభజనము తారుమారై స్వధర్మము విలుప్త మగుటచే న్యయది నేడు హిందూ

సంఘమునకు ప్రతిబంధకమై దాస్యమున కుపకరించుచున్న దనుట నిశ్చయము. ఇప్పుడా విభాగపద్ధతి కూడదని దాని క్షీణదశయే చెప్పుచున్నది. వర్ణ విభాగ పద్ధతిని బునరుద్ధరించి పూర్వరీతిని హిందూ సంఘమును సంస్కరించుట యసంభవ మని ప్రపంచ పరిస్థితులు ఘోషించుచున్నవి. పరధర్మ సంఘట్టనము లేని పూర్వకాలములో హిందూ సభ్యత స్వతంత్రముగ వికసించుట కవకాశము గలిగియుండి నప్పుడా విభాగపద్ధతి సరిగనే నడచినది. ఎప్పుడు పరసభ్యతా సంఘర్షణము లోపలను బయటను గూడ తీవ్రమై క్షత్రియ సంఘము నాశన మైనదో, అప్పుడు దానితోబాటు తక్కిన వర్ణములు కూడ భంగపాటు చెంది, దేశము వెతలపాలైన సంగతి యెన్నటికిని మరపునకు రాజాలదు నేడు భరత వర్షము స్వాతంత్ర్య సిద్ధిని బడసినను బాహ్యప్రపంచముతో సంబంధమును బూర్తిగ విడగొట్టుకొనజాలదు. ఏ విరాట్పురుషుడు హిందూదేశ గర్భమున దాగియుండి దేశకాలములను నడుపుచున్నాడో ఆ విరాట్పురుషుడే నేడు ప్రపంచమంతను ఆడించుచున్నాడు వెనుకటి యనుభవమును గమనించినను, ప్రపంచ పరిస్థితులను గ్రహించినను, ప్రాచీన వర్ణవిభాగ పద్ధతిని బునరుద్ధరించుట యసాధ్యమని, పూర్వాచార పరాయణులు సహితము బయట కంగీకరించక పోయినను, వారి యనుష్ఠానముల మూలమున నైనను అంగీకరించుచునే యున్నారు.

ఆ వర్ణవిభాగ పద్ధతి కూడదనినంత మాత్రమున. హిందూ సంఘము తన లక్ష్యమును విడనాడునని తలంప వలదు. విరాట్పురుషుడే హిందూ సంఘము యొక్క లక్ష్యము. ప్రతివ్యక్తియందును ఆ విరాట్పురుషుని సర్వశక్తియు గర్భితమై యున్నది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ధర్మముల కన్నిటికిని విరాట్పురుష డాధారభూతుడై వానియందు సామరస్యము పొందినట్లే, ప్రతి వ్యక్తియు తనయందు దాగియున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ధర్మముల నేకోన్ముఖమునకు దెచ్చి వ్యష్టియందును సమష్టియందును విరాట్పురుషుని

ప్రతిబింబింప చేయుట కవకాశము గల్గును. అప్పుడు ధర్మముయొక్క లక్ష్యము ఎల్లరను బ్రాహ్మణులను జేయుట కాదు, ఎల్లరను క్షత్రియులను జేయుట కాదు ఎల్లరను వైశ్యులను జేయుట కాదు, ఎల్లరను శూద్రులను జేయుట కాదు, సంఘములో ప్రతియొక్కరును తనయందు చాతుర్వర్ణ్యముల నిముడ్చుకొని, విరాట్పురుషుని సమగ్రత్వమున కుదాహరణముగ నుండగల్గును అప్పుడు సంఘము ఏ యొక్క జాతిపైన నాధారపడి యుండ నవసరముండదు. వ్యక్తి యొక్క స్వభావమును బట్టి ఏ యొక గుణమో ప్రధానమై యుండినను, తక్కిన గుణములను లోపింప జేసికొనక, విరాట్పురుషుని సంపూర్ణ విగ్రహమును ధ్యేయముగ నుంచుకొని సమగ్రత్వమును బొందుటకు ప్రయత్నించుచుండును.

మహాత్ముని జూడుడు జాతముచే వైశ్యుడైనను, వానియందు విరాట్పురుషుని సమగ్రత్వము అభివ్యక్తమగుచున్నది. మహాత్ముడు బ్రాహ్మణుని జ్ఞాన వైరాగ్యములను, క్షత్రియుని క్షాత్ర తేజమును, వైశ్యుని ఆర్థికనీతిని, శూద్రుని స్వకాయకష్టమును గలిగి ఆదర్శపురుషుడై వెలయుచున్నాడు. వాని ధ్యేయమగు స్వరాజ్యము కేవలము రాజకీయము కాదు. స్వధర్మముపై స్థాపితమైన స్వతంత్ర జాతీయ నిర్మాణమే వాని స్వరాజ్యము. వాని వైరాగ్యసాధన ఏ బ్రాహ్మణునకు లక్ష్యముగ నుండదు? కాని తన జ్ఞానమును పరరాజ్య సేవ కర్పించి స్వధర్మమును గోలుపోయిన కుహనా బ్రాహ్మణుడు కాదు, మహాత్ముడు. వాని శౌర్య పరాక్రమము లే క్షత్రియునకు లక్ష్యముగ నుండకుండును? కాని పరధర్మ నిర్వహణమునకై దేహమును విక్రయించుకొను క్షత్రియద్రోహి కాదు మహాత్ముడు. వాని స్వదేశ దీక్షయు, ఖద్దరుత్పత్తియు నే వైశ్యునకు లక్ష్యములుగ నుండ కుండును? కాని దేశములోని ఆహార పదార్థములను బయటకు బంపివైచి, దేశమును దారిద్ర్యవంతముగ జేయు వైశ్యనామధారుడు కాదు మహాత్ముడు. మహాత్ముడు కష్టజీవి. ప్రతి దినమును రాటమును త్రిప్పి, తన దినభృతిని సంపాదించుకొనినగాని ఆహారమును భుజింపని సచ్ఛూద్రు డితడు. మహాత్మునియందు చాతుర్వర్ణ్యములే కాదు సమన్వయ మగుచున్నవి, చతురాశ్రమములగు బ్రహ్మ

చర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము వానియందు సమముగ మూర్తీభవించి ఇహపరములు రెండును సామరస్యము నొందుచున్నవి. వాని బ్రహ్మచర్యము, సాత్వికాహారము, ఉపవాసములు, మౌనవ్రతము, జపతపములు, సత్యాగ్రహము, అహింసాపథము, లోకసంగ్రహము, వాని యాధ్యాత్మిక సాధన సంపత్తిని వేనోళ్ళ చాటుచున్నవి. ఒక్కొక్క విషయములో మహాత్మునికంటె నధికులు కొంద రుండవచ్చును. కాని నాలుగు వర్ణాశ్రమ ధర్మములను తనయందు జీర్ణము చేసికొని నూతన యుగధర్మమునకు మార్గదర్శియై వెలయగల మహాపురుషుడు మరియొకరు లేరని చెప్పుటకు సాహసింప బనిలేదు.

కృష్ణా పత్రిక
ఏప్రిల్ 6వ తేది, 1929 సం॥

# సంఘ విప్లవము

నిషేకపు కమిటీవారు చేసిన శిఫారస్సులలో ముఖ్యమైనవి ఐదు అవి యివి:- 1. 15 సంవత్సరములు యీడురాని బాలికలకు గర్భాధానము చేయకూడదు. 2. 15 సంవత్సరముల లోపు వయస్సుగల భార్యతో భర్త కలిసినయెడల నది ఇండియను పీనలు కోడ్డు క్రింద నేరముగ నెంచవలెను. 3. భర్తకాని పురుషుడు 18 సంవత్సరముల లోపు బాలికతో గలిసిన యెడల నది బలవత్సంభోగమను నేరము క్రిందకు వచ్చునట్లు చేయవలెను. 4. బాల్య వివాహములను బాల్య గర్భాధానములను ఆచారమునుండి తప్పించుటకై 14 సంవత్సరముల లోపు బాలికల వివాహమును నిషేధించుట యవసరము. 5. 15 సంవత్సరముల లోపుగ నున్న బాలికను తన స్వాధీనము చేయవల సినదని భర్త దావా చేయుటకు హక్కు ఉండకూడదు. ఈ కమిటీవారు కేవలము గర్భాధానమున కుపయుక్తమైన వయస్సును నిర్ణయించుట కేర్పడినను, దమ శిఫారస్సులలో వివాహమునకు యోగ్యమైన వయస్సును గూడ నెందుకు సూచించిరని ప్రశ్నింప వచ్చును బాల్య వివాహములు గల సంఘములలో వివాహ నిషేకములు వేరు సంస్కారము లనుమాట నిజము. కాని ఒకదానిపై నొకటి యాధారపడి యుండుటచే, విడిగ నిషేకమును గూర్చి చట్టము చేయుట సాధ్యము కాదను తలంపుతో వివాహపు వయస్సును గూడ హెచ్చించుట యవసరమని సూచించిరి ఇట్టి గొప్ప రిపోర్టును బ్రకటించుచు, గవర్నమెంటు వారీ శిఫారస్సులను గూర్చి తమ యభిప్రాయములను బ్రకటింపక పోవుటకు గారణము తెలియకున్నది. ఈ బిల్లు మత సాంఘికాచారములకు సంబంధించిన దగుటచే తామీ విషయమున నెట్టి జోక్యమును గల్పించుకొనక, కేవలము తటస్థముగ నున్నట్లు కన్పడుటకై మౌనముద్రను వహించి యుందురు కాని గవర్నమెంటు వారిదివరకు ఇట్టి చట్టములను జేసియుండి రనుట లోకవిదితము.

సహగమనమును నిషేధించిరి. వితంతూద్వాహమును గూర్చి చట్టమును గావించిరి హిందువు మతాంతరుడైనను కుటుంబ ఆస్తిలో వారసత్వమును గోలుపోకుండ శాసనము చేసిరి. సివిలు మ్యారేజి చట్టమును నిర్మించిరి. ఈ చట్టములలో గొన్ని నిర్బంధములు కానిమాట నిజమే. అయినను అవి హిందువుల మతవిశ్వాసములకును, ప్రచలితాచారములకును భంగకరములని ఒప్పుకొనక తప్పదు వాని విషయములో గూడ బూర్వాచార పరాయణులు వలదు వలదని గర్జించిరి హిందూ మతమునకు ఉపద్రవము వాటిల్లునని విలపించిరి. గవర్న మెంటువారు తమ వాగ్దానమునకు వ్యతిరిక్తముగ మతాచారములలో జోక్యము కల్పించుకొనుచున్నందుకు బెదరించిరి. ఈ యాందోళనమంతయు ఐచ్ఛికమగు వితంతూద్వాహపు చట్టమును గూర్చియే కాదు; సహగమన విషయములో గూడ బూర్వాచార పరాయణు లపూర్వమైన ఆందోళనము చేసిరి. శ్రుతుల నేకరువు పెట్టిరి శ్రుతి స్మృతి ప్రమాణములను గుప్పిరి. పండిత పరిషత్తులు మహజర్లను బంపిరి. డెప్యుటేషన్లు పార్లమెంటు వరకు గూడ గొనిపోయిరి. కాని తదనంతరము ఇప్పుడే పండితుడును, ఏ పూర్వాచార పరాయణుడును, ఏ సనాతన ధర్మవాదియు హిందూ సంఘము, వేద ధర్మము, సహగమనము మీదనే నిలచియున్నవని వాదించుటకు బూనుకొనడు. ఒక కాలమున నట్టి యాచార మీ దేశములో ప్రబలెనా యను సంశయము కూడ నిప్పుడు కలుగును. శాస్త్రములు కూడ నా నిషేధమున కనుగుణ్యముగనే అన్వయింప బడుచున్నవి. ఈ దేశములోనే కాదు అన్ని దేశములలోను బూర్వాచార పరాయణులు నూతన సంస్కరణము గావింపబడి నప్పుడెల్ల, నిట్టి చిత్తవైకల్యమునే పొందుదురు. అమెరికాలో బానిస విక్రయమును నిషేధించుటకు బూనుకొనినప్పుడు, క్రైస్తవ మిషనరీ లడ్డుపడిరి. నరవిక్రయము శాస్త్రసమ్మతమే యని బైబిలు నుండి ప్రమాణముల నెత్తి చూపిరి. నిన్నగాక మొన్న, ఇంగ్లాండులో చనిపోయిన భార్యయొక్క చెల్లెలును వివాహము చేసికొనుట శాస్త్రవిరుద్ధమని పార్లమెంటునందు జరిగిన వివాదము పాఠకులకు దెలిసియే యుండును. టర్కీలో కమల్ పాషాగారు జనానా పద్ధతిని నిషేధించుచు చట్టము

చేసినప్పు డీ దేశములోని మౌళవీలు అది కొరాను ధర్మ విరుద్ధమని ప్రమాణ ముల నెత్తి బంగీకట్టి తుర్కీకి రవాణా చేసిరి. శాస్త్ర ప్రమాణముల కేమి కొదువ? వెనుక ఇటలీ దేశములో నొక వైజ్ఞానికుడు భూమి గుండ్రముగ నున్న దని ప్రకృతి పరిశోధన వలన కనుగొని ప్రకటించుటతోడనే రోములోని క్రైస్తవ స్వాములు రోషానల జ్వాలలను వెలిగ్రక్కిరి. ఈ భూమి బల్లపరుపుగ నున్నదని బైబిలు గ్రంథము చెప్పుచుండ ఈ వైజ్ఞానికు డిట్లు తిరుగుబాటు చేయుట ఈశ్వర ద్రోహమని నమ్మి, వానిని బొడిచి చంపివైచిరి. ఇట్టి యసహనము, మూఢ విశ్వాసము సర్వత్ర పూర్వాచార పరాయణుల సొమ్ము. సంఘ సంస్కరణ విముఖత్వ మీ యొక దేశములోనే ప్రబలుట లేదు.

కాని యిచ్చట ప్రభుత్వము విజాతీయ మగుటచే నితర దేశములలో లేని విపరీత పరిస్థితు లీ దేశమునందు కలుగుట సంభవించినది. పూర్వకాలమున హిందూ సంఘము కాలానుగుణ్యముగ మార్పుల నొందుచుండెను. ప్రాత యాచారములు పోయి క్రొత్తవి యుద్భవించినవి. వాని కనుగుణ్యముగ స్మృతు లును మారినవి. వ్యాఖ్యాతలును ఆయా సందర్భములను బట్టి శాస్త్రముల నన్వయించుచుండిరి. రాజులు వేరుగ చట్టములను జేయవలసిన అవసరము లేకుండెను. అప్పుడు సంఘమునకు బరసత్తాసంఘట్టనమును గూర్చి భీతి లేదు. స్వతంత్ర కార్య నిర్వహణము పట్ల సంఘము సజీవమై క్రమ వికాసము నొంద గలుగుచుండెను. కాని మహమ్మదీయ ప్రభుత్వము సంప్రాప్తించి నప్పటి నుండియు, హిందూ సంఘము ముడుచుకొనిపోయినది. ప్రభువులు అన్యమత స్థులు. వారి యాచారములు భిన్నములు. వారికి గల పలుకుబడి, అధికారము విశేషము. హిందూ సంఘ మట్టి స్థితిలో ఆత్మరక్షణము కొఱకు ఆచారములను కట్టుబాట్లను కఠినపరచుకొన జూచుట సహజము. ఏ యాచారమును సడలించిన, హిందూ సంఘము స్వధర్మమును భ్రష్టమొనర్చుకొని అన్యమతములో జీర్ణమై పోవునో యను భీతి ఆ కాలపు మతకర్తలకు, సంఘ ప్రవర్తకులకు, ఉండుట ఆశ్చర్యము కాదు. సంఘములో అట్టి బిగుదు, అట్టి బిగి, అట్టి కాఠిన్యము ఆ

కాలమునందు లేని యెడల హిందూ సంఘము మహమ్మదీయ సంఘాంతర్భూతమై పోయి యుండవచ్చునని ఊహించుటలో గొంత సత్యము గలదు మహమ్మదీయుల కాలములోనే హిందూ సంఘ ప్రవర్తకుల కట్టి భీతి యున్నప్పుడు, పాశ్చాత్య సభ్యతా వ్యామోహము నానా రూపములతో, విలాసములతో, నానాకర్షణలతో దేశము బయటను లోపలను ఆవరించుచున్నప్పుడు, బ్రిటిష్ ప్రభువులు దేశములోపల రాజకీయ పరిపాలకులుగనే కాక, విద్యాదాతలుగ, న్యాయనిర్ణేతలుగ, శాస్త్రకర్తలుగ బ్రవర్తించుచున్నప్పుడు, హిందూ సంఘము మరింత భయపడుటకు గారణ మగుచున్నది భీతి యనునది ప్రతి ప్రాణికి ఆత్మరక్షణ కొరకేర్పడిన చిత్తవృత్తి. కాని ఏ ప్రాణియైనను సర్వకాల సర్వావస్థల యందును భయగ్రస్తమై యున్నయెడల, నా ప్రాణి స్వతంత్ర కార్య నిర్వహణ శక్తిని గోలుపోయి తుదకు ఆత్మవినాశనము నొందకతప్పదు. హిందూ సంఘమునకు నేడిట్టి దుర్గతియే పట్టినది. ఎంత కాలము పరసభ్యతకు భీతిల్లి ద్వారము లన్నిటిని బంధించివేసి లోపలికి ముడుచుకొని జీవించి యుండ గలదు? హిందూ సంఘ మింతకాలము తనలో ముడుచుకొని పోవుటచే, జీర్ణశక్తిని గోలుపోయినది స్వల్ప సంచలనమును గూడ సహింప లేకున్నది. దేనినీ నాశనము చేయలేదు అంతకంటె దేనినీ సృష్టించ లేదు. స్వాతంత్ర్యాభిరుచియే నష్టమైనది. జాతి యంతయు నిర్వీర్యమై సర్వవిధముల నధోగతి పాలైనది ఇంద్రియ పటుత్వము తప్పినది. విలసనము లేని ప్రాణము, స్వతంత్ర చింతనా పటిమ లేని మేధస్సు, ఉండిన నేమి? ఊడిన నేమి? ఇట్టి సంఘమును ప్రకృతి యెంతకాలము సహించి యూరుకొనగలదు? ప్రకృతి శపించినది. అంతోటః సంఘమంతయు అచలాయతనమై పోయినది. స్వవృద్ధికి దోడ్పడుట కేర్పడిన ఆచారములు కంఠపాశము లైనవి జ్ఞాన నేత్రమును వికసింపజేయుట కుద్దేశింపబడిన శాస్త్రములు దృష్టిని నిరోధించు గంతలైనవి. ఏదైన సంచలనము గనుపడిన యెడల, అది కాలముచే ననివార్యముగ గలిగిన కదలికయే కాని, స్వతంత్రశక్తిచే నద్భూతమైనది కాదు. ఏమైన మార్పులు కలిగినయెడల, నవి బయటి పరిస్థితులచే గల్పింప బడినవేకాని స్వతంత్ర వివేచనచే సృష్టించుకొనినవి

కావు. తాతలనాటి అస్థికలను మూట కట్టి యుంచు పండితులు కలరేకాని, భావి పరిణామ రహస్యములను ఆవిష్కరణము చేయగల శాస్త్రజ్ఞులు లేరు. నేడింకను పీఠాధిపతులు కలరు. కాని సంఘమును నడుపుటకు బాధ్యతను స్వీకరింప గలవారు కాదు నడపలేక పోతిమను దిగులును వారికి లేదు. పూర్వాచార పరాయణులు పడు ఆందోళన మంతయు పూర్వాచారముయొక్క మరణవేదన తప్ప మరియొకటి కాదు దేశములో నీ విజాతీయ ప్రభుత్వమే లేకుండనుండిన యెడల సంఘమింత నిస్సహాయ స్థితి యందుండెడిది కాదు.

మహమ్మదీయ ప్రభుత్వము రాక పూర్వము హిందూ సంఘము ఎప్పటి కప్పుడు క్రొత్త క్రొత్త సంస్థలను, క్రొత్త యాచారములను, క్రొత్త క్రొత్త సాధన విధానములను సృష్టించుకొన గల్గుచుండెను. వారు ఆచారములను గల్పించిరి కాని, ఆచారములు వారిని బానిసలనుగ జేయలేదు. వారెప్పుడును సంఘ ద్వారములను బంధించి యెరుగరు. దేశ దేశములకు బోయి జ్ఞాన వితరణ మును గావించుచుండిరి. క్రొత్త శక్తిని స్వీకరించుచుండిరి. వారు బానిసలు కాదు, స్వతంత్రులు. వారు భీరులు కాదు, ధైర్య సాహసోపేతులు వారి లక్ష్యము అను కరణము కాదు, సృష్టి. సంఘమును శాసించగల ఆర్జవము, రక్షింపగల కార్య దక్షత, ఉన్నతికి దీసికొనిపోగల జ్ఞానసంపత్తి వారి ధనము. నిజముగబూర్వుల యెడల బూజ్యభావము గలదా ? ఉండెనేని వారివలె శాస్త్రకర్తలు కండు. విశాల దృష్టిలో గ్రొత్త యాచారములను, క్రొత్త సంస్థలను గల్పింపుడు. సంఘమును శాసించి నడుపగల ప్రజ్ఞ మీయొద్ద గలదా ? కలదేని ముందుకు వచ్చి బాధ్యత వహింపుడు. మీ యాచారములను మీరే యనుష్ఠింపలేకున్నారు మీ పుత్రులకే మీ వాదములపై విశ్వాసము లేదు. పరిస్థితు లన్నియు మీకు ప్రతికూలములు నేడు ప్రపంచమునం దెట్టి సంచలనము బయలుదేరినదో మీరు గ్రహింప లేకున్నారు. భరతవర్షము భూగోళములో నొక భాగము కాని, అది యొకటే బ్రహ్మసృష్టి కాదు మీ దేశము బయట ఎంతయో మానవజాతి కలదు. దానితో మీకు సంబంధము లేదు-సాగరమున గలిసిన నదీజలము వలె మీరు మీరు మునిగి పోవుచున్నారు.

నవీనుల ప్రపంచజ్ఞానమూ, మీకు దూరము. ప్రాచీనుల సృజన శక్తియూ, అంతకంటెను దూరము. మీకెట్లు శాసనాధికారము లభింపగలదు? ఇప్పుడు శాసన సభలలో జర్చింపబడు బిల్లులకంటె వివాహ నిబంధనలకంటె నతితీవ్రములైన ఎక్కువ గంభీరములైన, ఎక్కువ భయంకరములైన పరివర్తనములు త్వరలో రానున్నవి. మీ శాస్త్రములు, మీ ప్రమాణములు వాని నాపజాలవు. మీ తర్క మీమాంసలు మిమ్ములను రక్షింపజాలవు. భవిష్యత్తు మీమీద నాధారపడి యున్నదని తలంపకుడు- మీ రోజు లంతరించినవి. మీ బాధ్యతను మీరు నిర్వహింపజాలక, మీ యాధిపత్యమును గోలుపోతిరి- కాలము మీ చేతినుండి జారి పోయినది మీరు పదచ్యుతులైతిరి రానున్న కాలము నవీనులది. తరుణ వయస్కులు దాని వారసులు-హిందూ సంఘము జీవించవలెనని నముందుకు గదలక తప్పదు. జీర్ణ రూపమును విసర్జించి నూతనాకృతిని బొందక తీరదు- ప్రాత యుపాధులు పగిలిపోయినవి. నవశక్తిని, నవజీవనమును, భరించగల పటుత్వము వానికి లేదు- ఆ క్రొత్త రూపమునకై నే దన్వేషణము బయలుదేరినది- తాటాకు కట్టలనుండి కాదు- జీర్ణావయముల నుండి కాదు. ఆసలు ప్రకృతిగర్భము లోనికి జొరగల దృష్టి, మానవ పరిణామమును ధ్యానింపగల చింతనాపటిమ, సకల శృతి స్మృతులకు ఉనికిపట్టయిన ఆత్మజ్యోతిని సాక్షాత్కరింపగల జ్ఞానప్రతిభ, నూతన భారతజాతి సంస్థాపనమున నేకోన్ముఖము కానున్నవి. ఈ విప్లవ సూచన లన్నియు నందుకు.

కృష్ణా పత్రిక

ఆగష్టు 31వ తేది, 1929 సం॥

# పత్రికా సన్మానము

ఈ సన్మానము, దీర్ఘకాలము నుండి పనిచేయుచున్న వసు కారణమున కృష్ణాంధ్రపత్రికల పేరున జరుప బడుచున్నను, తెలుగు పత్రికలన్నిటి శ్రేయము నుద్దేశించి సంకల్పింపబడిన దని కార్యదర్శులు చెప్పి నందున నా యనంగీకారము నుపసంహరించుకొంటిని. ఇంతకు నీ సన్మానము కేవలము అభిమాన పూర్వకమైనదే కాని తెలుగు పత్రికల యభివృద్ధికి సంతృప్తి చెంది చేయబడుచున్నది కాదనుట నిస్సంశయము. తెలుగు పత్రికలలో గొంత వఱకు ఆంధ్ర పత్రిక తప్ప. యిక నేవియు జీవకళకలిగి ప్రవర్ధమానములుగ లేవని చెప్పుట యనవసరము. తెలుగు పత్రికల హైన్యస్థితికి ప్రజలు బాధ్యులు కారని మాత్రము చెప్పవలసి యున్నది. విద్యావంతులును. సంస్కారులును పత్రికా నిర్వహణమునకు బూనుకొనక పోవుటచేతనే పత్రికలకు దేశములో దగిన వ్యాప్తికాని పలుకుబడిగాని, లేకున్నవనుట నిజము. వైద్యశాస్త్రమునందు సుశిక్షితు లైన గాని డాక్టర్లు ప్రాక్టీసు చేయుటకు యోగ్యత కలుగదు. న్యాయవాదులును వారి శాస్త్రమునందు కొంత పాండిత్యమును తర్ఫీయతును బొందినగాని వారికి పట్టాలు పుట్టవు టీచర్లకు ఎల్ టీ శిక్షణము విధింపబడినది. కాని ఎడిటర్లగుటకు నెట్టి శిక్షణము అవసరము లేదు ఒక అచ్చుకూటము, ఒక బేలు కాగితము, ఒక ఊటకలము సమకూడిన చాలును, పత్రికాధిపత్యము సిద్ధించును. పత్రికా నిర్వ హణము చాల బాధ్యతతో గూడిన కార్యము. భాషాప్రభుత్వము, రచనా కౌశలము, భావోద్రేకము ఉన్న చాలవు. క్రమానుగతములైన సంప్రదాయములను, ధారా వాహికములైన మరియాదలను గుర్తింపగల చరిత్రజ్ఞానము, ప్రజల నిజ మనో రథములను నిగూఢ చిత్తవృత్తులను బరీక్షింపగల భావనాశక్తి, ప్రపంచ పరిణామ రీతులను బరికింపగల విశాల దృష్టి, దేశ భవితవ్యము నుపలక్షింప గల గంభీర విశ్వాసము, పత్రికాధిపతులు అలవరచుకొన దగిన లక్షణములు వీని యన్నిటి

కంటెను గావలసినది నిర్మలమైన సత్యనిరతి. ఈ లక్షణములు పత్రికా నిర్వాహకులతో జాలవఱకు గౌరవడి యుండుట చేతనే, తెలుగు పత్రికలు పొంద దగినంత గౌరవమును బొందుట లేదని చెప్పినందుకు సోదర పత్రికాధిపతులు మన్నించెదరు గాక!

పత్రికల యుపకృతితో బాటు, అపకృతిని గూడ దలచుకానినప్పుడు పత్రికావ్యాప్తి తగినంతగ లేకపోయినదని చింతించుట కవకాశ ముండదు. ఇక్కాలమున ప్రజావబోధనమునకును ప్రపంచ పరిజ్ఞానమునకును, సామాన్య విద్యా వ్యాపనమునకును, పత్రిక యొక సాధన మనుటకు సందియము లేదు. కాని ఛాయాతప న్యాయముగ, నీ మేళ్ల నంటి కొన్ని కీళ్లు కూడ గలవు. పత్రికా పఠనము మూలమున జ్ఞానప్రదమైన ఉద్గ్రంథావలోకనము క్రమముగ మరుగగు చున్నదని విజ్ఞులకు దెలియని విషయము కాదు. ప్రజలలో గ్రంథావలోకనమే చాల యరుదు. అక్షరాస్యులే కొలది నిమిషములైనను మేధావులును, జ్ఞాన సంపన్నులును రచించిన ఉత్తమ గ్రంథములను బఠింపక తాత్కాలిక వినోదమును గల్పించు పత్రికలను జదువు అభ్యాస మొకటి దేశమునందు వ్యాపించుచున్నది. కొందరు యువకులు బలము, పుష్టి, నిచ్చు భోజనమును మాని జిహ్వాచాపల్యమును బురికొల్పు కాఫీహోటల్సునే శరణ్యముగ జేసుకొని అజీర్ణవ్యాధులకు లోనగు చున్నట్లు, ఆత్మోన్నతికిని, చిత్త సంస్కారమునకును తోడ్పడు ఉద్గ్రంథ పఠనమునకు బ్రత్యామ్నాయముగ బుద్ధి చాపల్య కరములగు పత్రికలను పారాయణము చేయుచుండుటచే చిత్త విభ్రమణములకు లోనగుట సంభవించుచున్నది. పత్రికా పఠనము ప్రజలలో గొంత ప్రబోధమునకు సాయపడుచున్నను, స్వతంత్ర చింతనా పటిమను బురికొల్ప జాలక పర ప్రత్యయనేయ బుద్ధిని బలపరచుటకే యెక్కువగ నుపకరించుచున్నదని కూడ గొంచెము బరిశీలించిన తెలియగలదు. పత్రికల యభిప్రాయములు సహితము భ్రమ ప్రమాదములతో గూడిన వ్యక్తి గతాశయములే యని దెలిసికొనుటకు బదులు, అవి శిరసావహింపదగిన ప్రమాణ వాక్యములుగ జన సామాన్యము స్వీకరించుటకు దగు సందర్భములు కల్పింప

బడుచున్నవి. పత్రికలు ప్రజాభిప్రాయ వ్యక్తీకరణమునకు బూనుకొనుచున్నట్లొక యపోహ వ్యాపించి యున్నది. ప్రజాభిప్రాయ మనునది బాహ్యమున స్పష్టముగ నిర్ణీతమై యుండు భావము కాదు. పత్రికాధిపతి తనయొక్కయో, తన పక్షము యొక్కయో, తాత్కాలిక నిర్ణయము సర్వజనామోదము బడయునట్లు చేయుటకు దాని ప్రాశస్త్యమును స్వతంత్ర యుక్తులతో నిరూపించుటకు బదులు, దానిని ప్రజలపై రుద్ది, వారు నమ్ముచున్న సిద్ధాంత మదియే యను వ్యామోహమును గల్పించుట పత్రికా రచనా నైపుణ్యముగ నెంచబడుచున్నది. అర్చకుడు తన చేతితో చేసిన పసుపుముద్దను విఘ్నేశ్వరునిగ భావించి ధూప దీప నైవేద్యము లొసగునట్లు, పత్రికాధిపతులు స్వకీయాభిప్రాయములను ప్రజాభిప్రాయముగ బ్రతిష్ఠించి పత్రికలలో నూరేగించుట ప్రచారక ధర్మముగ విశ్వసింప బడుచున్నది. ఇది పత్రిక లవలంబించుచున్న "మెస్మరిజము" పద్ధతి. ఈ మెస్మరిజము మూలమున పత్రికా పాఠకులలో స్వతంత్రాలోచనా శక్తి కుంటువడక తప్పదు.

ఇంతియ కాదు. పత్రికలు సర్వసామాన్యముగ దేశములోని ఆయా పక్షముల నాశ్రయించుకొనియే ప్రవర్తిల్లుచున్న వనుట లోకవేద్యము. ఒక పక్షమునకే సంబంధించిన పత్రికయందు స్వపక్షమును బలపరచుటకై న్యాయవాదుల వలె సత్యమును మరుగుపరచి అబద్ధమును స్ఫురింపజేయు పద్ధతి యెక్కువగనో తక్కువగనో పత్రికాధిపతి యొక్క రచనా చమత్కృతిని బట్టి సహజముగ బ్రయోగ్యమగుచున్నది. ఈ పద్ధతిలో అర్ధోక్తులు, అతిశయోక్తులు, కొన్ని సందర్భములలో అసత్యోక్తులు కూడ బ్రయోగింప బడుటచే సత్యహాని కలుగకుండ నుండజాలదు పత్రికా ప్రపంచమంతయు వెదకిజూచిన గాంధిమహాత్ముని ఒక "యంగు ఇండియా" తప్ప యీ రాజనీతి నుండి తప్పించుకొన గలిగిన పత్రిక యింకొకటి కలదా యని సంశయింప వలసి వచ్చుచున్నది. పాశ్చాత్య దేశములలోని పత్రికా రాజములు మితిమీరి రాజ్య దురహంకారములను, జాతి ద్వేషములను బురికొల్పి గత యూరపియను మహా సంగ్రామమునకు గారణభూతము లయ్యెనని ఒక యాధునిక చరిత్రకారుడు వ్రాకుచ్చినప్పుడు పత్రికల

యపకృతి యెట్టిదో యూహించుకొనవచ్చును. మన దేశమునందు రాజకీయ పక్ష భేదములు కేవలము రాజకీయముగ నుండక, కుల కక్షలుగను, మత కలహములుగను, బరిణమించుటకు గొంతవఱకు దేశపరిస్థితులు కారణము లైనను, పత్రికలకు గూడ నీ దుస్థితికి గొంత బాధ్యత కలదని ఒప్పుకొనక తప్పదు ఉత్తర హిందూస్థానములో ఉర్దూ హిందీ పత్రికలే హిందూమహమ్మదీయ కలహములకు హేతుభూతములని గవర్నమెంటువారు ప్రకటించిన విషయములో గొంత సత్యము కలదు. మన ప్రాంతములలో కుల వైషమ్యములకు పత్రిక లెంతవఱకు గారణములో యోజించిన, పత్రికా ప్రచార మీ దేశమునకు గూడ నెందుకు సంక్రమించినదా యని దేశ శ్రేయోభిలాషులు సంతాపపడ వలసి యుండురు.

యూరపు అమెరికాలలో వలె పత్రికా ప్రకటన మీ దేశములో నింకను వర్తక వ్యాపారముగ బరిణమించి యుండలేదు. పత్రికా ప్రకటనము పెద్ద మూలధనముతో వ్యాపారసరళిని నడపిన, పత్రికకు స్థిరత్వము లేదు. కాని ఆ పద్ధతివలన పత్రికా స్వాతంత్ర్యమునకు భంగకరములగు సందర్భము లెన్నియో సంఘటించును. పత్రికలు ధనికులకు, షాహుకారులకు, పెట్టుబడిదారులకు, అమ్ముడుపోయిన యెడల నవి యెంతవఱకు ప్రజోపయోగకరము లగుటకు అవకాశము కలదో యోజింపుడు. పత్రికా సంపాదకుడు తన శుద్ధాంతఃకరణ ప్రవృత్తిని బట్టి వాఖ్యానము చేయుటకు వీలుండదు. పత్రిక యజమానులను, రాజపోషకులను రంజింపజేయు ఇచ్చకపు వ్రాతలను వ్రాయవలసి యుండును. ఇటీవల స్వదేశ సంస్థానాధీశుల చేతులలో బడిన పత్రికలు కొన్ని తమ తొల్లింటి స్వాతంత్ర్యమును గోలుపోయి, కూలికెట్టి వ్రాతలను బ్రకటించుచున్నవియు లోక మెరుగనిది కాదు వంగదేశములో గొన్ని బంగాళీ పత్రికలు గవర్నమెంటు సబ్సిడీకి లోబడి యాత్మగౌరవమును నష్ట మొనర్చుకొనినవి. వివిధ సంఘములవారు వారి వారి ప్రత్యేక ప్రయోజనముల కొఱకు వేరు వేరు పత్రికలను బెట్టుకొనిన బెట్టుకొందురు గాక! కాని బయట ప్రజల పేరున నడుపునట్లు ప్రకటించుచు, రహస్యముగ ఏ ధనాఢ్యులకో, ఏ జమీందారులకో ఏ సంస్థానాధీశులకో

అమ్ముడుపోవుట మాత్రము విచారకరము. అట్టి పరిస్థితు లీ దేశమునకు గూడ క్రమముగ సంక్రమింప నారంభించుటచే నీ విషయమును సూచించ వలసి వచ్చుచున్నది. స్వతంత్రులైన పత్రికాధిపతుల చేతులలో నున్నప్పుడే, స్వాతంత్ర్య భంగకరములగు సందర్భము లెన్నియో సంఘటించుచుండును. ఒకమారు పత్రికా కార్యాలయమునకు వచ్చి అక్కడకు జేరు ఉత్తర ప్రత్యుత్తరములను బరీక్షించిన వీని యాంతర్యము తెలియగలదు. "నా లేఖను బ్రకటించనందున నా పేరును చందాదాతుల పట్టికనుండి కొట్టివేయుడు" అను ఉత్తరములు చాల తరచుగ వచ్చుచుండును. "మా సంఘమునకు బ్రతికూలములైన జాబులను బ్రకటించుచున్నందున మా సాంఘికులచే మీ పత్రికను బహిష్కరింప జేసెద" మని బెదరించుచు వ్రాయువారు కలరు. ధనాధిక్యత చేతనో, స్వసంఘాభిమానము చేతనో పలుకుబడి గల ఒక ప్రముఖుని చర్యలను ఖండించవలసిన అవసర మున్నను, అట్లు చేసిన పత్రికకు బ్రజలలో బలుకుబడి పోయి, చందాదారులు తగ్గదరేమో యని బెదరు ఒకవైపు, ఏ విలేఖకుని వ్యాసమో ప్రకటనార్హము గాకపోయినను దానిని ముద్రించకపోయిన వాని యొవరట ఖొప్పనేయో యను జంకు ఇంకొక ప్రక్క, లోపల నిష్టము లేకపోయినను బయటకు ఒక యధికారినో, ఒక ప్రముఖునో, ఒక ధనికునో, బ్రశంసించుచు వ్రాసి మెప్పు బడయవలయునను స్తోత్రాభిలాష యింకొక దిక్కున, ఎంత రోషముతో, ఎంత మోటుగ దిట్టుచు వ్రాసిన ప్రజలు తమ ధైర్య సాహసములను అంత మెచ్చుకొనెదరను కీర్తికాంక్ష ఇంకొక చక్కని, స్వాభిమానము చేతనో, స్వపక్షమును సమర్థించుటయందో, విపక్షమును ఖండించుటలోనో కేవల మనాలోచితముగ శమ దమములను వీడి భావోద్రేకమునకు లోనగు చిత్తవికారము ఒక వంకను, పత్రికాధిపతులను బాధించుచుండు విషయము లని వారిలో గొంతమందికైనను అనుభవైకవేద్యములు.

ఇదంతయు నిట్లుండ, పత్రికలలోని అడ్వర్టయిజుమెంటులు కూడ బత్రికాధిపతులను బాధించు విషయములలో నొకటి. పత్రికలు ఏ యర్థాకలితోనైన బ్రతుకుటకు ప్రకటనలే ఆధారములను సంగతి యెల్లరెరిగిన విషయము.

వర్తక వ్యాపారములందు ప్రకటనము నవీన విధానములలో నొకటి ప్రజల దృష్టి నెటులైన నాకర్షించి తమ వస్తువులను గొనునట్లు చేయుటయే వాని లక్ష్యము. ఇందునిమిత్తము ప్రకటనదారులు తమ వస్తువుల ప్రాశస్త్యమును వర్ణించుటకు గావ్యచతురత నంతను జూపెదరు. ఎట్టి యతిశయోక్తులను వ్రాయుటకైనను జంకరు. కృత్రిమములైన యోగ్యతాపత్రములను బ్రకటించుటకు వెనుదీయరు ముఖ్యముగ నీ దేశములో నే పరిశ్రమయు అభివృద్ధిలో లేకపోయినను ఔషధముల వ్యాపార మతిశయించినది వీనిలో నేవి మోసమో, ఏవి గుణము గలవియో, పత్రికాధిపతులు విచక్షణ చేయలేరు. కాని ఈ ప్రకటనలు చాలవరకు కేవలము ప్రజలను భ్రమింప జేయుటకు అతిశయోక్తులతో వర్ణింపబడునను సంగతి తెలియనిది కాదు. కొన్ని సందర్భములలో వీని భాష జుగుప్సాకరముగ నుండుటయే కద్దు. కవులు గ్రంథకర్తల వంటి సంస్కారులే యెట్టి మోమోటమియు లేక తమ రచనలను గూర్చి అతిశయోక్తులతో వర్ణించి ప్రకటించుకొనుచున్నప్పుడు ఔషధాలవారు దేవాదిదేవుల పేర్లతో, పురాణేతిహాసాలంకారములతో, చిత్ర విచిత్ర రీతుల వర్ణించి, ప్రజల విశ్వాసము నాకర్షింప గడంగుటలో నాశ్చర్యము లేదు. గాంధిమహాత్ముని "యంగు ఇండియా"లో వలె నీ యడ్వర్టయిజుమెంటులను బూర్తిగ విసర్జించుటయే సర్వోత్తమమైన పద్ధతి. కాని యీ పద్ధతి నవలంబించిన పత్రిక లన్నియు మూలబడక తప్పవు ఈ ప్రకటనలలో నే గ్రంథములు పఠనార్హములో, ఏ కంపెనీలు మోసములో, ఏ మందులు కృత్రిమములో, విచక్షణ చేయుట కష్టసాధ్యము ఇట్లనుటచే నీ విషయములో బత్రికాధిపతుల కెట్టి బాధ్యతయు లేదని గాదు. పత్రికల యపకృతులలో, అడ్వర్టయిజుమెంటుల బాధ యొకటి యని సూచించుటకే యీ విషయము తెలుపబడినది ఇక రవీంద్రుని వంటి రసభోగి పత్రికలను క్రీగంటనైన జూడ డనిన ఆశ్చర్యపడవలసిన పని లేదు.

ఈ యపచారము లనివార్యములు కావు పత్రికాధిపతులు తమ బాధ్యతను గుర్తించిన కొలదీ. అధికారులును, సంస్కారులును, పత్రికా నిర్వాహణమునకు

బూనకొనినకొలదీ దేశములోని రాజకీయ సాంఘిక పరిస్థితులు పరిష్కృతములై ప్రజాశక్తి జాగరితమైనకొలదీ, పత్రికల పలుకుబడి, వశీకరణశక్తి, స్వాతంత్ర్య దీప్తి హెచ్చునేకాని తగ్గనేరవు. ప్రస్తుతము దేశమునందు ప్రతికూల పరిస్థితు లధికముగ నున్నందున తక్కిన సంస్థల వలెనే పత్రికా సంస్థయు గొంత వికృత రూపమును దాల్చి యున్నది స్వాతంత్ర్యమే పత్రికలకు ప్రాణము. స్వాతంత్ర్య సంస్థాపనమే పత్రికల లక్ష్యము. ప్రతి వ్యక్తియందు, ప్రతి సంఘమునందు, ప్రతి జాతియందు స్వాతంత్ర్య బీజములను వెదజల్ల నారంభించి నపుడు, అరంభ దశలో సమన్వయము కుదరక దేశసంక్షోభము కలుగుట సహజము. దేశమునందు నిద్రాణములై యున్న శక్తు లొక్కమారుగ విజృంభించుటతోడనే ప్రతి వ్యక్తియు తన హక్కులను ప్రతిష్ఠింప గోరును. ప్రతి సంఘము ఉన్నత స్థానము నాక్ర మింప జూచును. ప్రతి జాతియు తన సంపూర్ణ శక్తిని ప్రకటింప నభిలషించును. అంతట ప్రాత బాటలకు కట్టుబడిన పూర్వాచార పరాయణు లీ సంచలనమును జూచి భీతిల్లుట సహజము. వారి నిరోధమే కులకక్షలకు సంఘ వైషమ్యములకు గారణ మగును. ప్రభుత్వాధికారులును ఆగ్రహ వివశులై కఠిన శాసనములకు గడంగెదరు. దీనికి ఫలితముగ రాజద్రోహము, విప్లవకరములైన ఉద్యమములును, బయల్వెడలును వెనుకటి పూజలు, విధేయతలు, గౌరవములు నిలువనేరవు. క్రొత్త భావములు ఝంఝూమారుతముల వలె వీచి భయంకర రూపము దాల్చును. ప్రాత కట్టడములు కూలిపోవును. వెనుకటి యధికారములు భగ్నము లగును. ఎక్కడ జూచినను అశాంతి, అసంతృప్తి, అసహనము, వ్యాకులత, ఉద్వేగము బహిర్గతము లగును. సంఘములో నెక్కడను స్థిరత్వమును స్తిమితతయు నున్నట్లు కన్పట్టదు. ఏ ప్రతిఘాతమునకో నిద్రాభంగము చెంది బెదరిన మనుజుడు ఇటు ఆటు పరుగిడునట్లు సంఘ మొక్కమారుగ జాగరిత మగుటచే అధికార ధిక్కారము, శాసనాతిక్రమణము, విద్రోహము, విద్వేషము, మొదలగు సంక్షోభ తరంగములు బయల్వెడలుట సహజము. ప్రాతక్రొత్తల కలయిక, తూర్పు పడమరల రాపిడి, వ్యష్టి సమిష్టుల సంఘర్షణ, పాలక పాల్యుల వైరు ధ్యము, దేశమున అపూర్వమైన అల్లకల్లోలమును గలిగించుచున్నవి. దేశ మంతయు

నడుగంట గదలిపోవుచున్నది. భరతఖండములో గదలని ప్రాంతము లేదు. పరివర్తనము నొందని జీవన ప్రకరణము లేదు. సర్వవిషయముల యందును తీక్ష్ణ ప్రచండ సమస్య లెదుర్కొనుచున్నవి ఆత్మవిస్మృతి పొందిన దేశమగుటచే నీ సమస్య లత్యంత గహనము లగుచున్నవి. ఒక వైపున దేశముయొక్క చిరంతన సభ్యతాస్వరూపము నన్వేషించ వలసి యున్నది. ఇంకొక ప్రక్కను భారత జాతీయ సమ్మేళనమును నిరూపించి, తత్సిద్ధికి సాధన విధానములను గనుగొన వలసి యున్నది. అనైక్యము నుండి యైక్యము, వైషమ్యముల నుండి సామరస్యము, అశక్తత నుండి సంఘటనాశక్తి, అంధత్వము నుండి జ్ఞానప్రతిభ. అభివ్యక్తము సేయుట యెట్లు? రవీంద్రుని వంటి కవిపుంగవులు, అరవిందుని వంటి జ్ఞానయోగులు, గాంధిమహాత్ముని వంటి కర్మవీరులు, జగదీశచంద్ర బోసుని వంటి ప్రకృతివైజ్ఞానికులు ఈ జాతీయ సాగర మథనమునకు బూనుకొనినారు. భారత సామ్రాజ్య లక్ష్మి రేపో మాపో తన నిండు కళలతో ప్రత్యక్ష మగుచున్నది! ఆ మహోదయము ఒక్క భారతవర్షమునకే కాక జగత్తున కంతకును గల్యాణ దాయకమై వెలయ గలదు. ఇది కవుల వాసంతిక స్వప్నము కాదు. పత్రికల అతిశయోక్తియు గాదు. ఇది కేవలము ప్రకృతి పొందుచున్న నూతన విలసనము—ఈశ్వర విధానోద్దిష్టమైన విశ్వ పరిణామము. కానియెడల నీ కదలికకు, ఈ కలహములకు, ఈ విద్రోహములకు, ఈ యావేదనలకు, అర్థము లేదు, ప్రయోజనము లేదు, సాఫల్యము లేదు. ఉషఃకాలము ముందు చీకట్లు దట్టమగును. వర్షపాతము ముందు గాలిదుమారము రేగును బీజోత్పత్తి ముందు గడ్డ విరుగును. ఫలసిద్ధి ముందు కుసుమదళములు వాడి రాలిపోవును. శిశూదయము ముందు తల్లి ప్రసవవేదన నొందును. అట్లే నూతన భారత జాతీయావతరణమునకై నేడు దేశములోని ప్రతి సంఘము ఆవేదన నొందుచున్నది. ఆ యావేదనయే రాజ్యాంగమునందు స్వరాజ్యాందోళనము. ఆ యావేదనయే సంఘమునందు వర్ణవైషమ్యము ఆ యావేదనయే మతముల యంతఃకలహము. ఆ యావేదనయే

పత్రికల యపకృతి వసంతఋతు సమాగమున చెట్ల యాకులు రాలిపోవునట్టి యపచారము లన్నియు రాలిపోగలవు. ఆత్మజ్ఞాన విలసితమైన, సృజనశక్తిభరితమైన, వివిధ కళాలంకృతమైన, సర్వాంగ సుందరమైన, జగత్కల్యాణ దాయకమైన, ఏక భారత జాతీయ సంస్థాపనమను అతీతధ్యేయమే సన్నిహిత క్లిష్ట పరిస్థితులందు వ్యక్తమగుచున్న ప్రతి స్పర్థయందును, ప్రతి యపచారమునందును, ప్రతి తిరుగుబాటునందును, అంతర్గతముగ, అట్టడుగున, స్పందించుచున్న ప్రాణశక్తి యని హృదయస్థము చేసికొనిన, నీ వార్తాపత్రిక లీ సంకటావస్థనుండి బయల్పడి, ప్రజాపళిని ఆనంద వారినిధి నోలలోడించు భారత జాతీయ కల్యాణ మహోత్సవాహ్వాన పత్రికలై వెలయగలవు. ఈ సన్మానము తెలుగు పత్రికల కట్టి యాశీర్వాద బలము నొసగు గాక!

సీ॥ మ్రోగుచున్నది విశ్వమోహన లోక క
 ల్యాణ తంత్రీముక్త గానరవము
కదలుచున్నవి దేశగర్భ గర్భిత జీవ
 నోదార ఖనులెల్ల పొదు కదలి
ధ్వనియించె గగనంబు ధాత్రీజన స్వర్ణ
 యుగ సమాహ్వాన యోగ మనుచు
ఓలగం బున్నవి ఉర్వి నేలెడు తప
 శ్శక్తి సంతతు లెల్ల సంభ్రమమున
ఈ లయాకృతిలోన దా నే మహస్సు
వెడలునో చూడగల్గు సంవిత్వ గరిమ
తెచ్చుకో లేరు కాబోలు తెలుగువారు
అలముకొన్నట్టి యోగ మాయాత్మఁ జేసి!

కృష్ణా పత్రిక
సెప్టెంబరు 7వ తేది, 1929 సం॥

# ఇంగ్లాండులో ఇండియా బియ్యము

గత యూరపియను మహా సంగ్రామానంతరము, ప్రపంచము యొక్క ఆర్థిక పరిస్థితులు తారుమారైనవి ముఖ్యముగ బ్రిటిషు వర్తక వ్యాపారము ఎదు గంటినవి. యూరపు ఖండములోని బంగార మంతయు అమెరికా చేరినది. దీనికి ఫలితముగ అమెరికను పరిశ్రమ అపూర్వరీతిని విజృంభించి, పూర్వము ఇంగ్లాండు హస్తగతమై యుండిన పణ్యస్థలములు అమెరికా వశమైనవి. యూరపియనుదేశము లన్నియు యుద్ధకార్యముల యందు నిమగ్నములై యుండిన సమయమున, జపాను తన పరిశ్రమల నభివృద్ధి పరచుకొని ఇండియా చీనా దేశములను తన సరుకులతో నింపివేయ నారంభించినది. జర్మనీనుండి యుద్ధపరికరముల యెగుమతి కాకూడదని శాంతిసభలో నిర్ణయ మగుటచే, జర్మనీలోని ఆయుధాగారము లన్నియు పరిశ్రమాలయములుగ మారి, జర్మను ఎగుమతి వ్యాపార మధికమైనది. రష్యాలో జారుసర్కారు పోయి కూలీల ప్రభుత్వ మేర్పడుటచే, ఫ్రాన్సు ఇంగ్లాండు ప్రభుత్వములవారు రష్యా నాంక్షచేసిరి కాని, ఆ దేశముతో దా మిదివరకు జేయుచుండిన వ్యాపారము నంతను గోలుపోయిరి. యుద్ధనష్టము క్రింద జర్మనీ ఏటేటను ఫ్రాన్సుకు గావలసిన బొగ్గునంతను సప్లయి చేయవలయునని సంధిలో బరిష్కార మగుటచే, అంతకు బూర్వము ఫ్రాన్సు ఇంగ్లాండునుండి దిగుమతి చేసికొనుచుండిన బొగ్గును దెప్పించుకొనుట మానినది. గత యుద్ధములో ఇంగ్లాండు అమెరికానుండి విశేషఋణము చేసి, ఫ్రాన్సు ఇటలీలకు పెట్టుబడి పెట్టెను. కాని ఫ్రాన్సు ఇటలీ ప్రభుత్వములవారు ఇంగ్లాండునుండి తాము పుచ్చుకొనిన ఋణమును దీర్చలేని స్థితిలో నున్నారు. అమెరికావారు మాత్రము ఇంగ్లాండునుండి వారి బాకీని వడ్డీతోకూడ వసూలు చేసికొనుచున్నారు ఆస్ట్రేలియా, కెనడా, న్యూజీలెండుల వంటి బ్రిటిషుకాలనీలు పూర్వమువలె ఇంగ్లాండుపై నాధారపడక, స్వతంత్రమైన ఆర్థికనీతి నవలంబింప మొదలిడెను. ఈ సందర్భములను స్థూలముగ జూచినను అవి ఇంగ్లాండునకు ప్రతికూలము లని తోచగలదు.

ఇంగ్లాండున కింకను యుద్ధభీతి తొలగలేదు. అమెరికాతో పంతము వేసికొని నౌకాదళముపై విశేషధనమును వెచ్చించుచున్నది ప్రభుత్వ ఋణభార మధిక మగుటచే, తీరుమానము నిమిత్తము పన్నులను రెండింతలు మూడింత లెక్కువ చేయవలసి వచ్చెను ఇంగ్లాండులో రాబడిపన్ను నూటికి ఏబదివఱకు, హెచ్చెను కాని రాబడి మాత్రము తగ్గెను. ఫ్యాక్టరీలు పూర్వమువలె బనిచేయుట లేదు. సగము దూదిమిల్లులు మూతబడినవి. సగము బొగ్గుగనులు మూసికొని పోయినవి. పనివాండ్రకు బనులు లేవు సుమా రిరువది లక్షలమంది పనివాండ్రు నిరాధారు లగుటచే, వారిని బోషించు భారము గవర్నమెంటుపై బడినది. గత యుద్ధానంతరము బ్రిటిషు సామ్రాజ్యమునకు గ్రొత్త దేశములు చేరి, సామ్రాజ్య వైశాల్యము కొన్ని లక్షల మైళ్ల అతిశయించిన దను సంతోషమేకాని అసలు ఇంగ్లాండులోనే నిర్వ్యాపారస్థితి నానాటికి హెచ్చి, వారి రాజకీయ ధురంధరులను గలవర పరచుచున్నది

ఇట్టి సంకట సమయమున, బ్రిటిషువారు ''ఎంపైరు మార్కెటింగు బోర్డు'' అను ఒక సంఘము నేర్పాటు చేసిరి. జీవనాధారము లేని బ్రిటిషు ప్రజలకు జీవనాధారము గల్పించుటయే ఈ సంఘమువారి ముఖ్యోద్దేశము. ఈ యుద్దేశమును సఫలపరచుటకు వారవలంబింపని పద్ధతి లేదు. ఇంగ్లాండులోని యంత్రశాలలకు దగిన పని యుండినగాని పాటకపు జనమునకు దగిన పనులుండవు. ఆ యంత్రాగారములలో తయారగు వస్తుసామగ్రికి విడుదల యుండినగాని, యంత్రాగారములు పూర్తిగ ఆడజాలవు కాని బ్రిటిషు సరకులు విడుదల యగుట యెట్లు ? ఐర్లాండుకు స్వరాజ్యము లభించినది. పూర్వమువలె వారు ఇంగ్లీషు వర్తకుల నాదరించరు. ఈజిప్టు యింకను వారి పలుకుబడిక్రింద నున్నను ఈజిప్షియను ప్రజలు బ్రిటిషు వస్తు బహిష్కారమును బూర్తిగ నవలంబించిరి. బ్రిటిషు వలసదేశములలో ఇంగ్లాండు తల్లిదేశమను అభిమానము తరుగుచున్నది. రష్యా వెలిలోనున్న దేశము. టర్కీ జర్మనీతో వ్యాపార సంబంధము నేర్పరచు కొనినది. చీనాలోని అంగళ్ళు జపాను అమెరికాల వశము లైనవి. ఇక ఇంగ్లాండు

నకు దిక్కు ఎక్కడ? "ఎంపైరు మార్కెటింగు బోర్డు" వారు అష్టదిక్పాలురను బిలిపించి మాట్లాడిరి. భరతవర్షమే మీకు శరణ్యమని వారందరేకగ్రీవముగ నుడివిరి.

అవును! భరతవర్షము వారికి బాహ్యాక్రాంతమైన దేశము. ముప్పది కోట్ల ప్రజ గల దేశము -రత్నగర్భ- పంటవంంతి. వారికి సర్వవిధముల భాగ్య భోగ్యముల నొసంగు కామధేనువు. వారీ దేశమును బాలించుచున్నది కేవలము. వారి యుద్యోగముల కొరకు గాదు ప్రపంచములో నే దేశమునందు లేని అధిక వేతనముల నిచ్చుటి తెల్ల యుద్యోగులు పుచ్చుకొనుచున్న మాట వాస్తవము. కాని మొత్తముమీద నీ దేశములో నున్న బ్రిటిషు ఉద్యోగుల సంఖ్య బహుస్వల్పము. సివిలు, మిలిటరీ యుద్యోగులును తెల్లని సైనికులును. గలసి ఒక లక్షకు లోపు కేవలము వీరిని, వీరి సంసారములను బోషించుటకే కాదు వారీ దేశమును భుక్తపరచుకొనినది. ఇంగ్లాండు వర్తకుల దేశము. వాణిజ్యము వారి పురుషార్థము. ప్రపంచములో ఇండియావలె వారి వాణిజ్యమున కుపకరించు దేశము మరియొకటి లేదు. వారి పరిశ్రమలకు ముడివస్తువులు కావలెనా? హిందూ దేశము వారికి దూది, నార, వేరుశనగ, చర్మములు మొదలగు ముడివస్తువుల నెన్నిటినో ఇయ్యగలదు. బ్రిటిషు షాహుకారుల వడ్డీవ్యాపారమునకు దగిన దేశము కావలెనా? ఇండియా గవర్నమెంటు హామీమీద నీ దేశములో రైళ్ళమీద, గనుల మీద, ప్లాంటేషనులమీద, ఋణములమీద, స్టీమర్లమీద నెంత పెట్టుబడినైనను బెట్టుట కాస్కారము కలదు. వారి కర్మాగారములలో తయారైన యంత్రపరికరములు, వస్త్రములు, నాజూకు సామాగ్రి అమ్ముడగుటకు దగిన అంగడి కావలెనా? యంత్రపరిశ్రమ లెరుగని ముప్పది కోట్ల ప్రజలు వారి నాజూకు వస్తువులను గొని వారిని సంతోషపెట్ట గలరు. ఇంగ్లాండునకును, ఇండియాకును గల సంబంధము వాణిజ్య సంబంధము ఇంగ్లాండు ఒక పెద్ద మిల్లు, గొప్ప బ్యాంకు, ధళ్ళురత్నకళిగిన ధుకాణధారు, ఇండ్డియా ఛార్థి మార్కెట్టు, మంచి

పెట్టుబడి, నమ్మకమైన ఖాతాదారు. ఈ యార్థిక సంబంధమును రక్షించి పోషించుటయందే వారి రాజనీతి యంతయు సార్థకత చెందుచున్నది.

ఈ రహస్యమును మనోగతము చేసికొని నప్పుడే, ''ఎంపైరు మార్కెటింగు బోర్డు'' యొక్క విశేషము అవగాహనము కాగలదు. తక్కిన దేశము లన్నియు నేదో విధముగ బ్రిటిషు వ్యాపార విజృంభణమునకు అవరోధము కల్పించుచుండుటచే, వారి దృష్టి యంతయు నేడు హిందూదేశముపై కేంద్రీకరించుట సహజము. హిందూదేశము వారి పాలిట పాడి యావనుటకును సందియము లేదు. కాని ఎంత మంచి పాడి యావైనను, దానికి మేత పెట్టనిది పాలియ్యజాలదు. లేగదూడ పాలు త్రాగకుండ దాని మూతిని బిగియగట్ట వచ్చును. కాని ఆవు తన తిండిని మించి యెట్లు పాలియ్యగలదు? భూతదయతో గాదు, కేవలము స్వార్థముకొఱకు, ఎక్కువ పాలను బిండుకొనుట కైనను, పశువుకు తవుడు, పిండి పెట్టవలసి యుండును. భారతప్రజలు బ్రిటిషు సరుకుల నెక్కువగ గొనవలెనినిన వారికి ముందుగ గొనగలశక్తి నొసగవలెను. ధాన్యపుధరలు హెచ్చినగాని, భూస్వాముల చేతులలో డబ్బు ఆడదు వారి చేతులలో డబ్బు ఆడినగాని వారిచేత ఇనుప నాగేళ్ళు, మోటారుకార్లు, మ్యాన్చస్టరు మిల్లులు, ఎలెక్ట్రిక్కు పరికరములు, సినిమా ఫిల్ములు, చిల్లర నాజూకు సరుకులు, మందులు, అద్దాలు, ఆటవస్తువులు మొదలగు బ్రిటిషు సరుకులను గొనజాలరు. వీనిని వీరు గొనినగాని ఇంగ్లాండులోని యంత్రాగారము లాడవు. అవి యాడినగాని వారి పాటకపు జనమునకు పను లుండనేరవు. "ఎంపైరు మార్కెటింగు బోర్డు" అనగా ఇది. ఇదేయని లేబరు మంత్రులు కూడ ధృఢపరచిన సంగతి పాఠక మహాశయులకు దెలిసియే యున్నది. ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేటుగారు చెప్పిన మాటలను జ్ఞప్తికి దెచ్చుకొనడు:- ''హిందూ దేశమును మన మోటారు ట్రాక్టర్లతోను మన ఇనుప నాగేళ్ళతోను గప్పివేయ వలెను. అప్పుడుగాని పనివాండ్రకు పనిపాటలు కుదరవు'' అండరుసెక్రటరీ గారేమి చెప్పిరి:- ''మాన్చస్టరు మిల్లులలో తయారగు సరుకులో మువ్పాతిక

సరుకు హిందూదేశము కొఱకు తయారగుచున్నది. వారీ సరుకునంతను గొనగల్గునట్లు చేయుట యవసరము. అప్పుడుగాని మనమిల్లులకు బూర్తిపని యుండదు.'' ఈ పలుకుల నాలకించిన పిమ్మట, బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుల యూహ లెట్టివైనవి తెలిసికొనుటకు శ్రమపడ నవసరము లేదు. ఇప్పుడు ''మార్కెటింగు బోర్డు''వారు ఈ పనికే బూనుకొనిరి. ఇండియాలో ధాన్యపు ధరను లేవకొట్టుటకై సర్వవిధముల బ్రయత్నించుచున్నారు. ఇంగ్లాండులోనే ఇండియాలోని వరిపంటను గూర్చి ప్రకటనలను బ్రారంభించిరి. ఇండియాలో పండు బియ్యము వంటిది ప్రపంచములో నెక్కడను లేదని బ్రిటిషు పత్రికలలో బ్రకటించుచున్నారు ఈ నమూనా ప్రకటనను గమనింపుడు-

"వరి పండే చాల దేశములలో ఆ దేశస్థులకు గావలసినంత వరినే పండించుకొనుచున్నారు. కాని ఇండియాలో లక్షలకొలది యెకరములలో వరి పండుచున్నది. ఆ దేశముయొక్క అవసరములను మించి పండుచున్నది ఇప్పుడు ప్రపంచములో నన్ని దేశములకంటెను ఇండియానుండియే యెక్కువ బియ్యము యెగుమతి యగుచున్నది. ఇండియాలో వరి స్వభావసిద్ధముగ బండును. వరిపంటకు అచ్చటి నేల, శీతోష్ణస్థితులు బహు అనుకూలములు. వర్షాధారము చేతనే పొలములు నీటిచే నిండి, పుష్కలముగ బండును అక్కడ ఎండ లధిక మగుటచే నెట్టి యంత్రసహాయము అవసరము లేకయే వరి యెండి తడియారును. ఈ కారణములచేత నా భూములలో బండు ధాన్యము అతిప్రశస్తమైనది అట్టి మేలైన రకము అంత చవుకగ నెక్కడను దొరకదు."

ఏమి, ఇండియాయొక్క యవసరములను మించి యిక్కడ వరి పండుచున్నదట! ఈ ''ఎంపైరు మార్కెటింగు బోర్డు" వారు ఏ లెక్కలను బట్టి యిట్టి ప్రకటనను గావించిరో తెలియదు. ఈ దేశములో 7కోట్ల మందికి ఒంటిపూట భోజన మను సంగతి జగద్విదితము. ఆ ఒంటిపూట భోజన మైనను గంజి మెతుకులు. పాటకపు జనములలో నధిక సంఖ్యాకులకు కడుపునిండ

కూడులేని సంగతి యిచ్చటి తెల్ల యధికారులకైనను దెలియని సంగతి కాదు. ఇట్టి సందర్భములలో, ఆహార పదార్థములను దేశమునుండి రవాణా చేయనిచ్చుటయే యన్యాయము. ఇంగ్లాండునుండి ఆహార పదార్థములు బయటకు బోకుండ ఆకట్టబడుచున్నవి. కాని ఈ దేశములో నొక మూల నదులు పొంగి పొలములు నాశనమైనను, పాటకపు జనము తిండిలేక అల్లాడుచున్నను, కాటకములపై కాటకములు వచ్చి ప్రజాక్షయమగుచున్నను, కొలది భూస్వాముల లాభమునిమిత్తము వారిద్వారా తమ వస్తువుల విడుదలకొఱకు ఆహార పదార్థము లింకను యెక్కువగ రవాణా యగుటకు ప్రచారము సాగించుట యెట్టిదో పాఠకులే గ్రహింపగలరు ఇండియాబియ్యముతో నెట్టి పాకములను జేయవచ్చునో వానినిగూర్చి "రిసీపీ" లను గూడ నచ్చొత్తించి ప్రకటించుచున్నారు. బియ్యపు కుడుములను జేయు పద్ధతిని గూర్చి వీరు ప్రచురించిన "రిసీపీ"ని నిదర్శనముగ జూడుడు:—

"మూడున్నర ఔన్సుల తెల్లబియ్యము. ఒక కోడిగ్రుడ్డు. ఒక పైంటు పాలు. కొంచెము చాకలేటు పౌడరు- ముందు బియ్యము మెత్తపడు వరకు పాలలో నుడికించుడు. ఉడికినది గట్టిపడనిమ్ము- తరువాత పంచదార సువాసనద్రవ్యములు గలుపుము- ఒక ప్లేటులో ఒడ్డించి ఆరబెట్టుము- చల్లబడిన పిమ్మట ముద్దలు చేయుము- గ్రుడ్డుసొన ఆ ముద్దలపై బోయుము- రొట్టెముక్కలను సన్నగ గత్తిరించి ఆ ముద్దలచుట్టు నతికించుము- పైన పంచదార చల్లుము. ఈ కుడుములకు పాట్నాబియ్యము చాల ప్రశస్తము."

ఈ ప్రకారముగ రిసిపీలను వర్ణించుచు లండనులోని హోటల్సులో ప్రకటించుచున్నారు. ఇండియాబియ్యమును గొనినయెడల, హిందూదేశము లోని భూస్వాములకు బ్రిటిషువారిపై విశ్వాసముకూడ గలుగునట! ప్రకటన పద్ధతులలో బాశ్చాత్యులకు పెట్టినది పేరు ఇండియానుండి బియ్యము నెగుమతి చేయించి,

దానికి ప్రత్యామ్నాయముగ వారి మల్లులను, మోటార్లను, యంత్రములను దిగుమతి చేయుటకు వారెట్టి పన్నుగడల బన్నుచున్నదియు నిందుమూలమున విశదమగుచున్నది.

కృష్ణా పత్రిక
సెప్టెంబరు 21 వ తేది, 1929 సం॥

# సంస్కర్తల దౌర్బల్యము

శారదాబిల్లు అసెంబ్లీలో ఆమోదము నొందినందుకు సంతోషము, విచారము కూడ గలుగుచున్నది. ఇంత కాలమునకైనను, బాల్యవివాహములు నిషేధింపబడినవి కదా యని సంతోషము. రాజ్యాంగము మూలముననగాని ఈ సంస్కరణము సిద్ధింపజాలక పోయెనుగదా యని విచారము సంఘసంస్కరణము, ముఖ్యముగ వివాహమువంటి సంస్కారము ప్రజలు స్వతంత్రముగ జేయదగినదే కాని. రాజ్యాంగద్వారమున, నిర్బంధ శాసనముగ, శిక్షాస్మృతి నిబంధనగ జేయ జూచుట మాత్రము సంఘదౌర్బల్య సూచకమేకాని, సంస్కరణ విజయముగ నెంచదగదు. దేశమునందు నలుబది సంవత్సరముల క్రిందటనే కాంగ్రెసుతోబాటు సంఘ సంస్కరణోద్యమము బయల్వెడలినది. రాజకీయ సభల కనుబంధములుగ సంస్కరణ సభలును జరుగుచుండినవి. స్త్రీపునర్వివాహ విషయములో నెక్కువ వాదప్రతివాదములు జరుగుచుండెనుగాని రజస్వలా వివాహములను గూర్చి యెక్కువ చర్చలేకయే తీర్మానములు చేయబడుచుండెను. దివాన్ బహద్దరు రఘునాథరావుగారు రజస్వలావివాహములను గూర్చి చేసిన ప్రచారము నెవరు మఱువగలరు? మహాదేవు గోవింద రెనడీ, సర్ చంద్రవర్కారు, నటరాజన్ ప్రభృతులు ఈ విషయములో గావించిన ప్రబోధమును జరిత్రప్రసిద్ధము. కాని యీ ప్రచారము, ఈ ప్రబోధము, సభావేదికలందును పత్రికలోను గాలక్షేప మగుచుండెనేగాని, సంఘములోపల, గృహాంతరాళములందు ఎట్టి సంచలనమును గలిగించలేదు. ఇందుకు బూర్వాచార పరాయణులు బాధ్యులు కారు. సభలలో మంచె నెక్కి బాల్యవివాహములను గ్రుక్క తిరుగకుండ ఖండించుచుండిన సంస్కరణ వాదుల కపట నాటకమే యీ నిర్జీవమునకు గారణము. సంస్కరణాభిలాషులైన విద్యావంతులును, సంపన్న గృహస్థులును, తమ వాక్శూరత్వములో గొంత భాగమునైనను క్రియయందు చూపుచుండిన యెడల, నీ సంస్కరణ మిప్పటికి రాజదండ ప్రయోగావసరము లేకయే సదాచార మయ్యెడిది.

సంఘములో నిప్పుడు ఆంగ్ల విద్యాధికులే పెద్దలుగ, మాననీయులుగ నెంచ బడుచున్నారు. వీరి సంఖ్య స్వల్ప మనుటకు సందియము లేదు. కాని వీరి పలుకు బడి సంఖ్యపై నాధారపడి యుండలేదు ప్రస్తుత కాలపరిస్థితుల వలన ఆంగ్ల విద్యాధికులే రాజపూజితు లగుటయేకాక, లోకపూజ్యులుగ గూడ భావింపబడు చున్నారు. పూర్వకాలములో వలె సంఘప్రవర్తకులు కాగలిగిన పండితు లిప్పుడు లేరు. ఏ కారణముననైన నేమి, ఈ కాలపు పండితులు మ్యూజియములలోని చెదలు తినిపోయిన జీర్ణ తాళపత్రములనుబోలి ఆదరణపాత్రు లగుచున్నారే కాని, అధికారము వహించగల ధర్మనిర్ణేతలు, సంఘనియంతలు గారు పీఠాధిపతులు సంస్థానాధీశుల వలె భాగ్యభోగ్యముల మరిగి, తమ తొల్లిటి జ్ఞానప్రతిభను గోలు పోయి, కేవలము అలంకార విగ్రహములుగ మారిరి పురోహిత వర్గము కేవలము పరాన్నభుక్కులుగ బరిణమించుటచే స్వకులస్థుల చేతనే ఎంత నీచముగ జూడబడు చున్నదియు లోక మెరుగనిది కాదు. ఏ న్యాయవాదియు నెంత శిష్టాచార సంపన్నుడై నను, తన కుమార్తెను పౌరోహిత్యము చేయు యువకున కిచ్చుట కొప్పుకొనడు. ఎంత శ్రోత్రియ పండితుడైనను, తన కుమారుడు గ్రాడ్యుయేటగుటకు గోరునే కాని, పంచాంగము పట్టుట కిచ్ఛగింపడు. ఇది కేవలము ఆర్థిక సందర్భమువలన నేర్పడిన వ్యవస్థయే కాదు. ఈ కాలములో దేశమునందు ఆంగ్ల పట్టభద్రునకు గల గౌరవము, పూజ్యత, కేవల శ్రోత్రియులకు లేదని ఎల్లరెరిగిన విషయము. పండితులలో ఆత్మస్వాతంత్ర్యము కొఱవడినది. పురోహితులకు ఆత్మగరిమ లేదు పీఠాధిపతులకు భిక్షలు మాత్రము మిగిలినవి. ఈ మూడు తెగలవారును కూపస్థ మండూకములు. చరిత్రజ్ఞానము శూన్యము. స్వతంత్ర చింతనాపటిమ అంతకంటెను మృగ్యము. వీ రెంతవఱకును సంఘము నాశ్రయించుకొని బ్రతుకుటయేకాని, సంఘము తమ నాశ్రయించుకొనునట్లు చేయగల అధికారమున్న ప్రభుశక్తిని గోలు పోయిరి. వారియందు జీవకళ యంతరించినది బ్రహ్మవర్చస్సు అంతకుముందే అస్తమించినది. ఇంగువ గట్టిన గుడ్డలలోవలె బూర్వకాలపు వాసన యొకింత వారి యం దంటు కొని యున్నదేకాని, అట్టి గంధము వారినుండి సహజముగ బుట్టినది కాదు అస్తమయ కాంతుఁలకంటెను గూడ, అల్లుకొని వచ్చుచున్న చిరుచీకట్లే

యొక్కవగ వారి నావహించుచున్నవి. వారు దేశరంగమునుండి మెల్లగ నిష్క్ర మించుచున్న పాత్రలు. కాలపురుషుడు వారి మృత్యుగీతములను బాడుచున్నాడు.

ఆంగ్ల విద్యాధికులే నవీన పాత్రలు. వీరి నాణెమే నేడు చలామణి యగు చున్నది. వీరు ప్రస్తుత రాజకీయ ఆర్థిక పరిస్థితుల సృష్టి యగుటచే, నీ కాలము నకు దగినట్లు ప్రవర్తింపగలరు. వీరి వేషభాషలు నవీనములు. వీరి వృత్తులు. చర్యలు ఆధునికములు. వీరి రుచులు, తలంపులు నేటివి. వీరే నేటి స్కూళ్ళ యందు గురువులు, విద్యాధికారులు వీరే యిప్పటి న్యాయస్థానముల యందలి న్యాయవాదులు, న్యాయమూర్తులు వీరే యిక్కాలపు సర్కారుకూటముల యందలి ఉద్యోగులు, శాసనకర్తలు వర్తక వాణిజ్యములును క్రమముగ వీరి వశమగు చున్నవి. బుర్రలో విద్య పోయినది, కోర్టులో తీర్పు చెప్పునది, కూటములలో శాసనములను జేయునది, రాజ్యాంగసంస్థలను బాలించునది, వేషభాషలకు, నడవడులకు, ఆచారములకు, మార్గము చూపెట్టునది. ఆంగ్లవిద్యాధికులైనప్పుడు ఇక సంఘము వీరినుండి యెట్లు తప్పించుకొనగలదు ? సంఘములో నేడెట్టి సంచలనము, ఎట్టి మార్పు, ఎట్టి యాందోళనమా బయలుదేరినను, వీరి మీదుగనే బయలుదేరుచున్నది. వీరి నెట్టి వ్యామోహము లావహించినను, వీరెట్టి యప చారమునకు లోనగుచున్నను, వీరు నేడెట్టి తప్పటడుగులు వేయుచున్నను, వీరు తమ పూర్వపిత్రార్జితము నెంత గోలుపోయినను, వీరే ఈ కాలమునకు వారసులు. వీరే భవిష్యత్తునకును నియంతలు అని ఒప్పుకొనక తప్పదు. దేశమునం దిప్పు డెట్టి ధర్మగ్లాని సంభవించినను బాధ్యత ఆంగ్లవిద్యాధికులదికాని శ్రోత్రియులది కాదు. వీరు నేడు ఏ పేరుతో నూరేగినను, ఏ బావుటాక్రింద జేరినను బ్రహ్మ సామాజికులు కానిండు, దివ్యజ్ఞాన సాంఘికులు కానిండు, ఆర్యసామాజికులు కానిండు, రామకృష్ణ వివేకానంద మతస్థులు కానిండు, సనాతనులు కానిండు — ఇంకను ఏ యే మతాలుగ బయలుదేరినను, నవ్య భారతదేశము యొక్క బాగో గులకు నవీన విద్యాధికులే ఉత్తరవాదులై భవిష్యత్సంతతివారికి సంజాయిషీ చెప్పవలసి యుండును. విద్యాధికులు నిజముగ తమ బాధ్యతను గుర్తెరిగియుండిన యెడల, ఆత్మపరీక్షతో తమ జీవితములను నడుపుకొనుచుండిన యెడల, తమ

నడవడులే అశేషజనమునకు మార్గదర్శకము లగుచున్న వను జ్ఞాన ముదయించి యుండినయెడల, సంస్కరణోద్యమ మింత వెతల పాలయ్యేడిది కాదు. బాల్య వివాహమును నిషేధించుటకు పరప్రభుత్వము నాశ్రయించి, శిక్షాస్మృతి సాహాయ్యమును బడయవలసినంత దుర్గతి పట్టెడిది కాదు. సంస్కరణాభి లాషులైన న్యాయవాదులు, మునసబులు, జడ్జీలు, డిప్యూటికలెక్టర్లు, టీచర్లు, ప్రొఫె సర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, ఎడిటర్లు, దేశభక్తులు, దేశోద్ధారకులు ఎందరెందరో గలరు. వీరిలో సగముమంది యైన తమ వాదము నాచరణలో బెట్టి సంఘమునకు, దేశమునకు మార్గదర్శకు లైనయెడల నేడు రావుసాహెబు శారదాగారీ నిర్బంధపు చట్టమును జేయవలసి వచ్చెడిది కాదు. పండితుల ప్రబల నిరోధముచే వీరింత కాలము బాల్యవివాహముల నాపలేక పోయిరని చెప్పుటలో నర్థము లేదు ఇప్పుడు దేశములో బరిపాటియైన నవీన సంస్కారము లన్నియు బండితుల సానుభూతితో గావింపబడెనా ? సముద్ర యానమును బండితు లెప్పుడొప్పుకొనిరి ? అయినను నేడు పందలకొలది విప్రోత్తములు ఖండాంతరములు సేవించి వచ్చుచున్నారు. నేడు సముద్రయానము ఒక సమస్యకాదు. అది పరిపాటియై పోయినది ఎప్పుడు సంఘములోని పెద్దలు దేశక్షేమము నభిలషించి, సంస్కరణావశ్యకతను అనుష్ఠాన పూర్వకముగ నిరూపించెదరో, అది సదాచారమై ప్రజలచే గతాను గతికముగ నవలంబింపబడును. ఇప్పుడు సోషల్ గేదరింగులలోనే కాక, కాస్మ పాలిటను డిన్నర్లలో దృష్టిదోషము లేక వర్ణాంతరులతో భోజనము చేయుట పరిపాటియైనది - ఎందుచేత ? శ్రోత్రియు లంగీకరించుటచేత గాదు. పలువురు పెద్దలు, పెద్ద కుటుంబములవా రామార్గమును త్రొక్కుటచేతనే, అయ్యది "త్రైల పక్వము" క్రింద జమయై యనుకరణీయ మగుచున్నది - ఇట్లే కడచిన ముప్పది సంవత్సరములలోను సంస్కరణవాదులు బాల్యవివాహములను మాని, రజస్వలా వివాహములను ఆచరింప నారంభించినయెడల, సంఘము ఆరంభమున గొంత ప్రతిరోధము గల్పించినను, క్రమక్రమముగ నా ప్రతిరోధము తగ్గి, బాల్య వివాహములు అనాదరణీయము లయ్యేడివి - రాజదండ ప్రయోగముతో సంస్క రణమును, ప్రవేశపెట్టుట ఏ సంఘమునకును, ఏదేశమునకును, గౌరవప్రదము

కాదు. సంస్కర్తలే తమ స్వకీయానుష్ఠాన బలముచే, రజస్వలా వివాహములను సంఘములో ప్రవర్తింపజేసిన యెడల, దేశమున కెక్కువ గౌరవ ముండెడిది. సంఘమునకును ఎక్కువ బలము చేకూరెడిది. కాని సంస్కరణవాదు లింతకాలము ఉపేక్ష వహించిరి. కార్యదక్షతను గనుపరుపలేక పోయిరి. వీరపథమును ద్రొక్కుటకు వెనుదీసిరి. నేడు శాసనాధికారమును బురస్కరించుకొని యీ చట్టమును నిర్ణయించిరి. తమ చేతగానితనము నొప్పుకొనినందుకైనను వంద్యులు. రాజశాసనముచే నైన నీ సంస్కరణము ప్రవర్తింపజేయ గోరినందుకు దేశీయుల కృతజ్ఞతకు బాత్రులు ప్రస్తుతము సంస్కరణ విముఖులీ నిబంధనకు గినియ వచ్చును. ఈ నిబంధన తమకు బాధింపకుండ జేసికొనుటకు మాయోపాయములను బన్నవచ్చును. కాని యీ పరివర్తనముల వెనుక ఒక మహాశక్తి యొకటి యున్నదని ఆస్తికు లెల్లరు విశ్వసింపదగిన సత్యము. ఆ మహాశక్తియే నేడు దేశదేశముల నల్లల్లాడించుచున్నది.

కాని బాల్యవివాహ నిషేధము సనాతనధర్మ విధ్వంసకరమని మాత్రము వాదించకుడు. సనాతన ధర్మ మంత దుర్బలమైనది కాదు. సనాతనధర్మమే యొక సాంఘికాచారమునకును, ఏ యొక మతసంప్రదాయమునకును, ఏ యొక సామాజికనీతికిని గట్టుబడునది కాదు శ్రుతులు విభిన్నములు, స్మృతులు విభిన్నములు. సనాతనధర్మములు మారుచుండును. మతాచారములు, సాంఘిక వ్యవస్థలు, పరివర్తనము నొందుచుండును. సనాతన ధర్మము మాత్రము మారునది కాదు. అయ్యది నిత్యము. శరీరము మారినను ఆత్మ మారదు. అయ్యది జాహ్నవివలె అనాదినుండి నేటివరకు ఏకధారగ, అవిచ్ఛిన్నముగ, అంతస్స్రోతస్సుగ భారతజాతియందు ప్రవహించుచునే యున్నది. బాల్యవివాహాచారమే సనాతన ధర్మమునకు మూలమైనయెడల, నది యేనాడో నామరూపము లేకుండ యీ భూతములనుండి పరిమార్జితమై పోయెడిది- బాల్యవివాహముల నెరుగని ఆర్య ఋషుల ముఖవినిస్సృతమైన వైదిక ధర్మమా శారదాబిల్లుచే విధ్వంసకమగుచున్నది? సత్యభామ, రుక్మిణి మొదలగు వీరవనితలను బెండ్లాడిన

శ్రీకృష్ణుని గీతాధర్మమా బాల్యవివాహ నిషేధక శాసనముచే బగాస్తమగునది? తమ యపూర్వ క్షాత్రతేజముచే భారతేతిహాసమును ప్రకాశవంతముగ జేసిన భారతవీరుల, రాజపుత్రశూరుల, ప్రౌఢ వివాహములా సనాతనధర్మమును నాశనము చేయునది? ఎంత వెఱ్ఱి! ఇట్టి యల్ప సంకల్పములచే సనాతన ధర్మమును బరిహసింపకుడు. ఎంతకాలము భారతజాతియందు విషయభోగము తృణీకరింపగల ఇంద్రియ నిగ్రహము, సామ్రాజ్యములను ధిక్కరింపగల ఆత్మశక్తి పరదాస్య శృంఖలములను బూర్ణముగ జూర్ణము చేయగల స్వాతంత్ర్య నిరతి, బ్రహ్మానందమును గ్రోలగల రసపిపాస, లోకదుఃఖ నివృత్తికై పరితపింపగల సర్వభూతానురక్తి విశ్వపరిధులను సహిత మతిక్రమింపగల అతీంద్రియ దృష్టి వర్ధిల్లుచుండునో, అంతకాలము సనాతన ధర్మము చిరస్థాయియై ప్రకాశించ గలదు.

కృష్ణా పత్రిక
సెప్టెంబరు 28వ తేది, 1929 సం॥

# కళా పోషణము

సుప్రసిద్ధ కళాకోవిదుడగు సర్ విలియం రోధెన్స్టీను మహాశయుడు ఒక లండనుపత్రికా ప్రతినిధితో శిల్పమును గూర్చి ప్రశంసించుచు, శిల్పులు సాంఘిక జీవన విలసనమునకు గారణభూతులను విషయమును గడు హృదయంగమముగ వివరించెను. ఈ సత్యము ప్రజలేకాక, ప్రభువులు కూడ ముఖ్యముగ గమనింపదగినది. శిల్పులు కేవలము వినోదములను గల్పించు ఆలంకారికులు కాదు. వారు దేశముయొక్క అంతరాత్మను ప్రబోధింపగల గురువులు; జాతియొక్క ఆశాజ్యోతిని వెలిగింపగల జ్ఞానులు; ప్రజలక్రియాశక్తిని ప్రజ్వలింప జేయగల నిర్మాతలు; సంఘమును భావసమృద్ధముగ బూరింపగల రసజ్ఞులు శిల్పుల సేవను స్వీకరింపలేని సంఘము జీవచ్ఛవమైనట్లుగ నెంచవలసి యుండును. స్వస్వరూపమును దెలిసికొన గోరని. భవితవ్యమును దర్శింప నొల్లని, ఆవేదన నివేదనలు లేని జాతి శిల్పుల సాహాయ్యమును స్వీకరింపక, చైతన్య రహితమై పడియుండును. కళాభిజ్ఞుల సేవను గోలుపోయిన పిమ్మటనే, భారతవర్షము అధఃపతితమై, ప్రపంచములో తల యెత్తుకొనుటకు గూడ నాస్కారము లేకుండ పోయినది.

భరతవర్షము యొక్క ప్రాచీన వైభవ మంతయు శిల్పము నాశ్రయించుకొనియే విరాజిల్లుచుండె నని భారతేతిహాసమును గొంచెము బరిశీలించిన తెలియగలదు. హిందూ బౌద్ధ మహమ్మదీయ యుగములయందు శిల్పులు రాజ్యముల కీర్తిసంపదకు, ప్రజల ధర్మపోషణమునకు, దేశముయొక్క భాగ్యభోగ్యముల కెంత తోడ్పడినదియు చరిత్ర వేయినోళ్ళ చాటుచున్నది. ఆ కాలమున శిల్పుల సాహాయ్యము బడయని జీవన ప్రకరణము లేదు. జాతీయ జీవన మంతయు లోపల బయటగూడ శిల్పమయమై పోయినది. ప్రజలు నివసించు గృహములు, స్త్రీలు ధరించు వస్త్రములు, పిల్లల ఆటవస్తువులు, ఇంటిలో నుపయోగించు

పాత్రలు, భక్తు లర్చించు విగ్రహములు, కర్మకారులు నిర్మించు పరికరములు, వీరుల శస్త్రాస్త్రములు— ఆటలు, పాటలు, నోములు, వ్రతములు, వివాహములు, వేయేల సకల కర్మలు కళాశోభితములై సౌందర్యమును వెలిగ్రక్కు చుండెడివి. జానపదులు వాడుకొనెడి కుర్చీపీట మొదలుకొని రాజు లధిష్ఠించు మయూర సింహాసనము వరకు కళాలక్ష్మి తన సిరులను వెదజల్లుచుండెడిది. ప్రతి గ్రామమునను దేవాలయము కళానిలయమై ప్రజలయందు కళోపాసన నుద్బోధించుచుండెడిది. "రాజుల సొమ్ము రాళ్ళ పాలు" అను సామెత బయటకు నిరసన వాక్యముగ గన్పట్టినను, రాజులా కాలమున శిల్పుల నెంత యాదరణ చేయుచుండినదియు వ్యక్తీకరించుచున్నది. ఢిల్లీ పాదుషాలు మూలమూలల నుండియు శిల్పుల నాకర్షించి, వారిని దమ యాస్థానమున నెట్టు గౌరవించుచుండినదియు, చరిత్ర పాఠకులకు దెలియనిది కాదు. అక్బరు, షాజహాన్, జహంగీరు చక్రవర్తులు వారము వారము చిత్రపటములను బరీక్షించి, రచయితలను బహూకరించుచుండిన సంగతి చరిత్రప్రసిద్ధము. రాజులు తమ కార్య నిర్వహణమునందు కళాపోషణమునకు గూడ ప్రాముఖ్యము నొసగుటను బట్టియే, నా రాజధర్మము యొక్క వ్యాప్తి బోధపడ గలదు. యథా రాజా తథా ప్రజా యను ఆర్యోక్తి ననుసరించి, తదనుగుణ్యముగ సామంతరాజులు, ఉమ్రాలు, ధనాఢ్యులు చిత్రకళల నాదరించుచుండెడి వారు. మొగలు కళాసంప్రదాయ మీ కారణముచే జగద్విఖ్యాతి గాంచినది రెంబ్రాంట్టు, రైనాల్డును. వంటి యూరపియను చిత్రకళా విశారదులు సహితము మొగలు చిత్రరువుల ననుకరించిరి. మేరియ థర్సియా రాణి ఆస్ట్రియాలో తన రాజమందిరమును మొగలు చిత్రరువులచే నలంకరించిన సంగతి లోక ప్రసిద్ధము. ఇట్టి సర్వజనాదరణము నేటి కాలమున లేకపోవుటకు గారణ మేమి ?

ఈస్టు ఇండియా కాలము నుండియు, ప్రభువులు కేవలము వర్తకులయ్యు, భారత శిల్పముయొక్క ప్రాశస్త్యమును గ్రహించకపోలేదు. వారి దేశము నుండి

అసంఖ్యాకములైన శిల్పద్రవ్యము లెన్నియో సంగ్రహించి, తమ మ్యూజియ ములను నింపిన సంగతి పాఠకులకు దెలియనిది కాదు. తాము జయించిన దేశము, ఆఫ్రికా ఆస్ట్రేలియాల వంటి అనాగరిక దేశము కాక, మహోన్నతమైన సభ్యత గలదియని లోకమునకు జాటు నిమిత్తమే యీ సంగ్రహమునకు బూనుకొనిరి. ఇటీవల కర్జను ప్రభువు ఈ దేశమునందలి శిథిలావశేషములై యున్న నిర్మాణ ములను సంరక్షించుటకు జేసిన చట్టమును బురికొల్పినది కూడ నిదియే యుద్దేశము వారికి నిజమైన భారత కళాభిమానమే యుండినయెడల, నూతన ఢిల్లీనిర్మాణమును ఇంజనీర్లకు అప్పగించి యుండరు. కర్జను ప్రభువు కాలమున హావెలు వంటి ప్రాచ్య కళాకోవిదుడు దేశీయ శిల్పమునెడ గవర్నమెంటు చూపుచుండిన అనాదరణను గూర్చి ముక్తకంఠముతో నుద్ఘోషించెను. దేశమునందు నలుగడల గట్టబడిన డి పి డబ్లియు వారి కట్టడము లెంత యందవికారములై దేశీయుల కళాభిజ్ఞత నెట్లు చంపివేయుచున్నదియు తెల్పిన హావెలు మహాశయుని వ్రాతలు పూర్తిగ నిరర్థక ములు కాలేదు. వారి కృషిఫలితముగనే ఇటీవల లండనులోని ఇండియా ఆఫీసు భవనమును భారత చిత్ర శిల్పవిశారదులచే నలంకరణము గావించుట కంగీకరించ బడినది. నూతన ఢిల్లీనగర నిర్మాణము దేశీయ సంప్రదాయ విరుద్ధమైనను, వైస్రాయిగారి భవనమును చిత్రశోభితముగ జేయుటకు భారత శిల్పుల సాహా య్యము స్వీకరింప బడినది. యూరపియనులైనను ఇప్పుడిప్పుడు దేశములోని కళల నాదరించుటకు గడంగుచుండిరి కాని మన విద్యాధికులలో మాత్ర మింకను కళావబోధము గలుగలేదు. అజంతా, ఎల్లోరాలలోని దివ్యనిర్మాణములను దర్శించి ఆనందించుటకు ఏటేట వందల కొలది ఖండాంతర నివాసులు వచ్చిపోవుచున్నారు. కాని మన విద్యాధికులలో నూటికొక్కరైనను వాని జూచుటకు గోరిక కలవారు కూడ కాకపోవుటకంటె విచారనిరమైన విషయ మేమి కలదు? పైగ దేశీయ కళల యెడల నిరసనభావము కూడ వారియందు మిక్కుటముగ ప్రబలియున్నది. వారి చూపులకు అజంతా చిత్తరువులు పిచ్చిగీతలు, దేవతా విగ్రహములు వికృత రూపములు. వారి కన్నే పూర్తిగ జెడినది వారియందు కళాభిరుచి యంతరించి నది. పాశ్చాత్య శిల్పములనైనను ఆనందించగల రసజ్ఞత వీరికి లేదు. పాశ్చాత్య

లెవరును ఆదరించని, వారు సహితమేవగించు కొను అడ్వర్టయిజుమెంటు బొమ్మ లను, చీప్ రిప్రింటులను సమకూర్చి వానితో తమ గృహముల నలంకరించుకొనుట యెంత లజ్జాకరమో వారింకను గ్రహించుట లేదు. నేటి పత్రికా సంపాదకులు సహితము ఎట్టి కళావిచక్షణయు లేకుండ, చెత్తబొమ్మల నన్నిటిని బ్రచురించి, తాము కళాపోషణము గావించుచున్నట్లు లోకమును భ్రమింప జేయుచున్నారు. ఈవిషయమై తగు విచక్షణ. పరిశీలన, అభిరుచి విద్యాధికులలో నుదయించక పోవుటయే యీ దురవస్థకు గారణము

కీర్తిశేషులైన హవెలు వంటి కళాభిజ్ఞుల ప్రబోధముచే దేశములో గ్రొత్తగ చిత్రకళోద్యమము బయల్వెడలిన మాట సత్యము. కాని ఈ యుద్యమమును గూర్చి విపరీతములైన అపోహలు విద్యాధికులలో వ్యాపించియున్నవి. కొందరపక్వ విమర్శకులు బయలుదేరి ఈయుద్యమమును సమ్యగదృష్టితో జూడలేక, బెంగాలు ఆర్టు, బొంబాయి ఆర్టు, ఆంధ్ర ఆర్టు అను లేనిపోనిపేరులు పెట్టి చిత్ర కారుల మధ్య స్పర్ధల నంకురింప జేయుచున్నారు ఇది యెంతయు శోచనీయము. దేశములో పలుభాగములందు శిల్పసంబంధమైన ప్రయత్నములు సాగుచున్న మాట నిశ్చయము. వంగదేశములో అవనీంద్రనాథఠాకూరు, లక్నోలో అసత్ కుమారు హల్దారు, ఢిల్లీలో ఉకీలు సోదరులు. లాహోరులో చౌకతాయి, గుజరాతులో కెనాయి దేశాయి. మైసూరులో వేంకటప్ప ప్రభృతులు నూతన చిత్రకళకు మార్గదర్శకు లైరి. మన ఆంధ్రభూమిలో నీ గౌరవమునకు కీర్తి శేషులైన దామెర్ల రామారావు గారు అర్హులనుట నిస్సంశయము. ఈ శిల్పుల రచనలయందు ఈషద్భేదము లుండుట సహజము. కాని వాని యట్టడుగున దేశీయ కళాసంప్ర దాయము విలసిల్లుచున్నదని ఒప్పుకొనక తప్పదు.

కేవలము తాతలనాటి సంప్రదాయమే యథాతథముగ ననుకరించుట కే స్వతంత్ర కళాభిజ్ఞుడును ఒప్పుకొనడు. దేశములో నేడు దేశీయ సంప్రదాయము పేరున వెలువడుచున్న శిల్పవిన్యాసము నందు కేవలము అజంతా రీతులు కాని, రాజపుత్ర వైఖరులు కాని, మొగలుపద్ధతులు కాని అనుకరింపబడుట లేదు. వీని

యందు యూరపియను ఛాయలు కొంతవరకు ప్రతిబింబించుచున్న మాట సత్యము. జపాను పోకడలుకూడ నచ్చటచ్చట గన్పట్టుచున్నవి ఇంతమాత్రముచే కళా సాంకర్య మేర్పడుచున్నట్లు భయపడవలసిన పని లేదు. కాని కేవలము పాశ్చాత్యుల ఫోటోగ్రాఫిక్కు పద్ధతుల ననుకరించువారు కొందరింకను గలరు. వీరి మూలముననే దేశమునకు గొంత చేటు మూడుచున్నది. వీరి రచనలు దేశీయ సంప్రదాయ విరుద్ధములే. కాక, ఆంగ్లో-ఇండియను మాదిరి హైబ్రిడ్డు ఆర్టు ఒకటి బయలుదేరి, విద్యార్థికుల నాకర్షించు టెంతయు విచారకరము. కేవలము దేశములో తయారగుచున్నది యంతయు దేశీయముగ నెంచదగదు. కేవలము ప్రాతపద్ధతులను బట్టుకొని వ్రేలాడుటయు గాదు నేడు భరతవర్షము నెదుట ప్రపంచ మంతయు విస్తృతమై నూతన సమ్మేళనమున కాహ్వానించుచున్నది భరతవర్షము కూడ దన స్వధర్మమును గోలుపోకుండ ఈ మహా సమ్మేళనమున జేరవలసి యున్నది. ఆంధ్రదేశములో నీ యాహ్వానమును ముందుగ నందుకొనిన వారిలో కీర్తిశేషులైన దామెర్ల రామారావుగా రగ్రేసరులు ఈ వారమున జరుగు రామరాయ వార్షికోత్సవ సందర్భమున వారి దివ్య విగ్రహమును సంస్మరించి ధన్యుల మయ్యెదము గాక!

కృష్ణా పత్రిక
ఫిబ్రవరి 2 వ తేది, 1935 సం॥

# అబలా విజయము

స్థానిక శాసన సభకు సంబంధించి, ఈనెల 9వతేదీని మద్రాసులో జరిగిన ఎన్నికయందు శ్రీమతి అచంట రుక్మిణమ్మగారికి గలిగిన విజయ మపూర్వము రుక్మిణమ్మగారికి 7,397 వోట్లును, ప్రత్యర్థియగు జస్టిసు ప్రముఖునకు 1,643 వోట్లును వచ్చినవి వోటుచేసిన వారిలో నూటికి 93మంది కాంగ్రెసుకు వోటు చేసిరి కాంగ్రెసుకు దేశములో నెంత పలుకుబడి యున్నదియు నిర్ణయించుటకు నింతకంటె ప్రబల నిదర్శన మేమి కావలెను? ఒక్క మద్రాసు నగరమే ప్రమాణము కాదందురా? అనంతపురం జిల్లాలో జరిగిన ఎన్నికలలో గూడ జస్టిసుపక్ష మపజయము నొందుటకు గారణ మేమి? చిత్తూరు జిల్లాలో రామలింగారెడ్డి గారిని ప్రతిఘటింపగల జస్టిసు క్యాండిడేటు ఏల లభించక పోవలెను? అసెంబ్లీ ఎన్నికలలో జస్టిసుపార్టీకి నూటికి నూరు అపజయము వాటిల్లినప్పుడు, అసెంబ్లీ యెన్నికలు ఒక ప్రమాణము కాదనిరి. స్థానిక సభలకు సంబంధించిన ఎన్నికలు రానిమ్ము. జస్టిసుయొక్క తడాఖా చూపించెద మని బొబ్బిలివారు బొబ్బలు పెట్టిరి ఇప్పుడీ మూడు స్థానములలోను జరిగిన ఎన్నికలు అసెంబ్లీవి కావు. ఇవి కేవలము స్థానిక శాసనసభకు సంబంధించినవి. కాంగ్రెసు అభిమానములో సిటీ, మఫసిల్, పట్టణము, పల్లెలు ఒక్కటే యని నిస్సందేహముగ ఋజువైనది. ఇప్పుడు జస్టిసు పార్టీవారి సమాధాన మేమి? వెనుక షణ్ముఖంచెట్టిగా రోడినప్పుడు, జస్టిసుపార్టీలో గొందరు విద్రోహులు చెలరేగిరని సమాధానము చెప్పిరి. ఇటీవల జస్టిసుపార్టీని సర్వవిధముల బలపరచుటకు సంస్కారములు జరుపబడెను గదా! ముత్తయ్యచెట్టి వంటి విద్రోహిని బయటకు గెంటివేసిరి అంతఃకలహమును బాపుకొనిరి జస్టిసు డెమక్రాటుల నెటులనో సమాధాన పరచుకొని తమలో గలుపుకొనిరి జస్టి సంతయు నేడు తిరిగి ఒక్క చెక్కుచెదరని పార్టీయైనదని ప్రకటించిరి ధానికి

నిదర్శనముగ శాసనసభలో బొబ్బిలిపై తెచ్చిన అవిశ్వాస తీర్మానము నోడించితి మనిరి. ఇక జస్టిసుపార్టీ విజయపథము త్రొక్కినదని ఫీంకృతులు సలిపిరి. ఆ ఫీంకృతుల ప్రతిధ్వను లింకను చెవులలో గింగురు మనచుండగనే చిత్తూరు మద్రాసు అనంతపురము ఎన్నికలు వచ్చి, యథార్థమును లోకమునకు జాటినవి. ఇప్పుడేమి సమాధానము? చిత్తూరులో జస్టిసుపార్టీకి దగిన క్యాండిడేటు దొరకని దర్గతి పట్టిన పట్టుగాక! కాని పట్టణము మాట యేమి? పట్టణము జస్టిసువారి కోట యని గదా ఇంతకాలము చాటినది? వెనుక ఎస్. శ్రీనివాసయ్యంగారు జస్టిసుపార్టీపై దాడి వెడలి పట్టణములోని నాలుగు సీట్లను జయించినప్పుడు, అది యంతయు వైష్ణవమాయ యనిరి. ఇప్పుడెవరి మాయ? ప్రత్యర్థియగు ఎస్. జి రంగరామానుజము గారు అనామకుడు కాదు. జస్టిసు ప్రముఖులలో నొకరు. కేవలను డాక్టరు నటేశ మొదలియారుగారి కుడిభుజము. ఇటీవల మద్రాసు కార్పరేషను మేయరుపదవి యెన్నిక సందర్భములో జస్టిసుపార్టీవారు మొదలి యారుగారికి గావించిన అపచారమునకు ప్రాయశ్చిత్తార్థముగ వారిని కౌన్సిలులో డెప్యూటి ప్రెసిడెంటు పదవి కెన్నుకొని వారి సంపూర్ణ విశ్వాసమునకు పాత్రులైన సంగతి పాఠకలోకమునకు దెలిసియే యున్నది. రంగరామానుజం గారు పార్టీ క్యాండిడేటుగ నిలువబడెనేకాని వ్యక్తిగ నిలువబడి యుండలేదు. వీరికి పార్టీవారు చేసిన హంగే యిందుకు తార్కాణము. వెనుకటి అపజయము నంతను గూడదీసికొనుటకు, జస్టిసు వారవలంబించని ఉపాయము లేదు. మంత్రులు సహితము కాన్వసరు లైరి. సత్యమూర్తిగారిచే నోడింపబడిన పిమ్మట మౌనముద్ర వహించిన రామస్వామి మొదలియారు గారు కూడ తమ యనర్గళ వాగ్ధారను తిరిగి ప్రవహింప జేసినారు. పాత్రోగారు జస్టిసుపతాకను లేవదీసినారు. జస్టిసువారి బలమంతయు ప్రదర్శింపబడినది. అధికారుల ప్రాపకము చూపబడినది. జమిందారుల ధనసాహాయ్యమునకు గొదువ లేదు జస్టిసు సమదర్శిని పత్రికలు జస్టిసుపార్టీయొక్క ఆధిక్యతను జాటినవి. బహిరంగ సభలు జరిపిరి. ఊరేగింపులను సాగించిరి. పాటలు పాడిరి. ప్లాకార్డుల నంటించిరి. కాంగ్రెసుపై తూర్పారపట్టిరి. జస్టిసు చేయబోవు మహత్కార్యముల నన్నిటిని

ఇంద్రజాలికుల రీతి చిన్నెవన్నెలతో వర్ణించిరి బ్రాహ్మణేతర భేదములను బెంచిరి. ఆంధ్ర ద్రావిడ స్పర్థల నంకురింప జేసిరి. మొదలియారు కక్షను స్థాపించిరి. జస్టిసుపార్టీ మూలమున నెన్ని యుద్యోగములు బ్రాహ్మణేతరుల పాలిట బడెనో వాని లెక్కలను చూపిరి కాంగ్రెసుకు వోటిచ్చుట యనగా కమ్యునలు జి.ఓ.ను నిరర్థకపరచుట యనిరి జస్టిసుపార్టీవారి యంబుల పొదిలో నెన్ని బాణములు కలవో వానినన్నిటిని బ్రయోగించిరి మినిస్ట్రీరియలు పార్టీ దీనితో లేచుటో, పడుటో యను సారాంశమును దేల్చిరి ఇంతకంటె వారు చేయగలిగిన దేదియు లేదు ఇంత చేసినను, జస్టిసు పార్టీకి చుక్క యెదురైనది. నక్షత్రము బాగుండ లేదు. అపజయము, సంపూర్ణమైన అపజయము సంప్రాప్తించినది. కాంగెసుకున్న బలమేమి? అధికారుల ప్రాపకమా, లేదు జమీందారుల ధనసహాయమా, లేదు. కులకక్షల ప్రేరణమా లేదు. ఉద్యోగుల మోహమా, లేదు జిల్లాబోర్డులను తికమకలను జేయు శక్తియా, లేదు మ్యునిసిపాలిటీలకు కమిషనరుల నియమించు బెదరింపులా, లేవు దేవాలయ ధర్మాదాయాధికారులను బ్రయోగించగల కుతంత్రములా, లేవు. కాంగ్రెసు శాసన సభల నాశ్రయించుకొని బ్రతికిన ఉపజీవియా, కాదు అధికారుల పొత్తులగుడ్డలలో బెరిగిన అనదయా, కాదు. కాంగ్రెసు వట్టి ప్రజాశక్తియొక్క స్వతంత్ర సంఘటనము- స్వరాజ్య సంకల్పము యొక్క ప్రతిభావిశేషము- సమగ్ర జాతీయ భావముయొక్క రసస్ఫూర్తి- త్యాగశీలముయొక్క లీలావిలాసము- స్వాతంత్ర్యదేవి యొక్క ఉపాసనా బలము జస్టిసుపార్టీకిని కాంగెసుకును గల సంబంధము వెలుగునీడలకు గల తారతమ్యము వంటిది, స్వాతంత్ర్య పారతంత్ర్యములకు గల స్పర్ధ వంటిది,స్వరాజ్య పరరాజ్యములకు గల వైరము వంటిది. కాంగ్రెసు ఈ సమరములోనికి దిగినది. కాంగెసు కాదు, కాంగ్రెసుపేరున ప్రజలే తమ సహజశక్తిని బదర్శింప సమకట్టిరి ప్రజలలో అవబోధము గలిగిన పిమ్మట వారి నాపగలిగిన దెవరు? ప్రభువుల నిగ్రహాను గ్రహములు కాని, ఉద్యోగముల భయమోహములు కాని, ధనాఢ్యుల కాంచన ప్రలోభములు కాని, ప్రజలను మోసపుచ్చజాలవు ప్రజాసంకల్పము అమోఘము.

జమీందారు లెల్ల రేకమైనను వారొక్క అంగుళము ముందుకు సాగలేరు. దేశము ప్రజలది కాని ప్రభువులది కాదు, రయతులది కాని జమీందారులదికాదు, స్వాతంత్ర్యపీరులది కాని ఉద్యోగ వాంఛాపరులది కాదు. అనంతపురం జిల్లాలో నూటికి 63మంది వోటర్లు కాంగ్రెసుకు జోహారు లొసంగిరి. చిత్తూరులో నూటికి 98మంది వోటర్లు కాంగ్రెసుప్రక్కను నిలువబడిరి. మద్రాసులో నూటికి 80మంది వోటర్లు కాంగ్రెసుభక్తిని ప్రదర్శించిరి. దేశము కాంగ్రెసుదేయని చాటుటకు ఇంకను సంశయమా? జస్టిసు తుదకు శూన్యతను వెల్లడి చేసికొనినది. కాని ఈ సమరములో జస్టిసుపార్టీకి ఒక గౌరవము మాత్రము కలిగినది. జస్టిసు తుదకు ఆచంట రుక్మిణమ్మ గారివంటి వీరమాత హస్తములలో తన అసువులను విడుచుట మహద్భాగ్యము కాక మరియేమి? కాంగ్రెసు స్త్రీల నభ్యర్థులనుగ నిలబెట్టలేదను అపవాదము నేటితో తొలగినది. కాంగ్రెసు స్త్రీల సేవ నెట్లు మరచి యుండగలదు? సత్యాగ్రహ సమయములో భారత రమణులు ప్రదర్శించిన ధైర్యసాహసములు లోకప్రసిద్ధములు. ప్రపంచచరిత్రలో స్త్రీసాహసమును గూర్చిన ఉదంతము లెన్నియో కలవు. కాని స్వాతంత్ర్య సమరమునం దింతమంది స్త్రీలిట్టి నిర్వ్యాక పరాక్రమమును ప్రదర్శించినది ఈ భారతావనినిగాక, మరియొక దేశమున కాదు. వేదారణ్యములో ఆనాడు రుక్మిణీదేవి స్వరాజ్య పతాకను జేభూని, సత్యయోధులను నడుపుచుండిన దృశ్యము అత్యద్భుతము. స్వాతంత్ర్యదేవి ఆ రూపమున ప్రత్యక్షమైనట్లు గోచరించినది. ఆమెలో స్త్రీయొక్క శక్తిస్వరూపము ఆనాడు లోకమునకు బహిర్గతమైనది. ఈనాటి ఎన్నికయందే కాదు, ఆనాడే రుక్మిణీదేవిలో అబలకు విజయము చేకూరినది.

కృష్ణా పత్రిక
ఏప్రిల్ 13వ తేది, 1935 సం॥

# దేశీయ శిల్ప ప్రదర్శనశాల

అఖిల భారత గ్రామసేవా సంఘము పక్షమున వార్ధాలో నొక మ్యూజి యమును స్థాపించుటకు గాంధిమహాత్ముడు తలపెట్టినాడు. ఈ ప్రదర్శనశాల తుట్టతుద కే రూపము దాల్చునో యెవరికిని దెలియదు. గ్రామములలో నింకను శేషించియున్న చేతిపనుల మాదిరులన్నియు నిందు ప్రదర్శించుటయే మహాత్ముని యుద్దేశమైనట్లు కొన్ని సూచనలు కలవు. ఈ మ్యూజియము యొక్క పతక మింతవరకును బ్రకటింప బడలేదు విశ్వభారతియందు శిల్పాచార్యులుగ నున్న సురేంద్రనాథకారు గారు దీని పతకమున నిరూపించుటకు గోరబడినట్లు మాత్రము ప్రకటించబడినది. సురేంద్రనాథకారు గారి యభిమానవిద్య శిల్పము- నాట్య కళయందు విశేషముగ నభిరుచి గల్గిన కళాభిజ్ఞు డీతడు. విశ్వభారతియం దిటీవల స్థాపించబడిన చేతిపనుల శాఖ వీరి యాజమాన్యముననే నడుప బడు చున్నది. విశ్వభారతిలో తయారగుచున్న చేతిపనులను బట్టి, వీరికి దైనికావ సరములగు గృహోపకరణములను గూడ, కేవలమార్థిక దృష్టితోగాక, శిల్పిదృష్టితో సుందరమయములుగ జేయుటయే ప్రధాన లక్ష్యమని చెప్పగలము. విశ్వభారతిలో తయారగు కాలిచెప్పులు, పుస్తకముల అట్టలు, డబ్బుసంచులు. సందుకా పెట్టెలు, బట్టల అద్దకములు, ఆటవస్తువులు మొదలగు చేతిపనులు సొంపులొలుకు అలం కారములని చెప్పదగునే కాని, సామాన్యముగ అక్కరలను దీర్చు ఉపకరణము లుగ నుండవు. ఇది ప్రాచీన సంప్రదాయ సిద్ధమైన లక్షణమేకాని, విశ్వభారతి వారు క్రొత్తగ దెచ్చిపెట్టిన విశేషము గాదు. వీరి చేతిపనులలో నెట్టి నూతనత్వ మున్నను, అందలి కళాపుష్టి సంప్రదాయసిద్ధమై భారత శిల్పనిర్మాణ చాతుర్యము నకు నిదర్శనముగ నున్నదనుటకు సందియములేదు. పూర్వకాలమున మన దేశములో శిల్పులకును కర్మకారులకును విశేషభేదము లేదు. దేవాలయ విమాన ములను నిర్మించువారే సామాన్య గృహస్థుల యిండ్లనుగూడ గట్టుచుండిరి దేవతా

విగ్రహములను బోతబోయు హస్తములే గృహపాత్రలను గూడ మలపుచుం డెడివి. రాజప్రాసాదములను చిత్రములతో నలంకరించు ముచ్చివాండ్రే బాల బాలిక లాడుకొను క్రీడావస్తువులను చిత్రించుచుండిరి రాజాదరణమునకు బాత్రులైన సిద్ధహస్తులు కొందరు రాచనగరులలో నుండినను, భారతదేశ సంపదను బెంపొందించి పోషించుచుండినది, గ్రామములోని కర్మకారులే యనుట నిస్సంశయము ఆ కాలపు కర్మకారులు కేవలము నిరక్షరకుక్షులు కారు వంశ పారంపర్యముగ సంక్రమించిన అశిక్షిత పటుత్వమే కాక, వారివారి శాస్త్రములకు సంబంధించిన గ్రంథముల పరిచయముకూడ వారి కుండెడిది. నేటికిని ముఖ్యముగ దక్షిణదేశములో శిల్పసంబంధములైన శాస్త్ర గ్రంథములు కర్మకారుల యిండ్లలోనే లభించుచున్నవి ఈ కర్మకారులకు సంస్కృతజ్ఞానము లేకపోయినను, శిల్పసంప్రదాయము వారి రక్తమునం దినికి యుండుటచే నా గ్రంథములను పండితుల సహాయ్యముతో సులభముగ నన్వయము చేసికొన గలుగుచుండెడి వారు. వానికి టీకలు దేశభాషలలో గూడ ననువదింపబడి యుండినట్లు నిదర్శనములు కలవు ఆవిధముగ శిల్పాచార్యులు లక్షణ గ్రంథములందు వెల్లడించిన సూత్రములను గ్రామములోని కర్మకారులు తమ చేతిపనులయందు అనుష్ఠించి, శిల్ప సంప్రదాయమును బోషించుచుండిరి.

ప్రస్తుత కాలములో వలె ఆర్టిస్టుకును క్రాఫ్ట్సుకును మధ్య అఖాత మేర్పడి యుండలేదు. ఏ సౌందర్యగరిమను మహాశిల్పులు తమ కల్పనలయందు జాటుచుండిరో, దానినే లక్ష్యముగ నుంచుకొని కర్మకారులు తమ హస్తనైపుణ్యమును బ్రదర్శించి, హిందూగృహమును శోభాయమానముగ జేయుచుండిరి. శిల్ప సౌందర్యమును జూపని భవనముగాని గృహోపకరణము గాని ఆ కాలమున నుండెడిది కాదు. పద్మము చెక్కని ద్వారమును బ్రతిష్ఠించెడివారు కాదు. ముగ్గు పెట్టని వాకిలి త్రొక్కెడివారు కాదు. అంచులేని బట్టను ధరించెడివారు కాదు పిల్ల లాడుకొను ఆటవస్తువులు మొదలుకొని, గృహిణు లుపయోగించు పాత్ర లన్నియు చిత్రవిచిత్ర రూపముల అలంకారములతో శోభిల్లుచుండెడివి ఈ సౌందర్యము నుపభోగించుటలో సంపన్నులకు బేదలకు నెట్టి భేదమును లేదు.

బీదలు వాడుకొను మట్టికుండలు కూడ శిల్పచాతుర్యమును ప్రదర్శింపుచుండెను. వారి యుడుపులపై గూడ చిలుకలు హంసలు నృత్యము సలుపుచుండెడివి. తుదకు ఆడవిజాతులు అల్లు చాపలు, బుట్టలు మొదలగునవి కూడ రమ్యముగ నుండెడివి. శిల్పసౌందర్యము ఆ కాలమున వాయువు వలె సర్వత్ర వ్యాపించి యుండెడిది. కాని, నేటివలె నే డ్రాయింగురూములోనో, లేక పిక్చరు గ్యాలరీలలోనో ప్రత్యేకముగ బంధింపబడి యుండెడిది కాదు. జీవితమును సర్వాంగ సుందరముగ జేయుటయే శిల్పముయొక్క లక్ష్యము. ఎట్లు వ్యాస వాల్మీక్యాది మహాకవుల యితిహాసములు పాటలలో పద్యములలో పాటకపు జనమునందును వ్యాపించియుండెనో, అట్లే శిల్పాచార్యుల నిర్మాణ వైఖరులు గ్రామములలో నన్నితెగల యందును భిన్న ప్రకారముల విలసిల్లుచుండెడివి. ఆ కాలమున వేరు మ్యూజియములకు, ఎగ్జిబిషనులకు అవసరము లేదు. గ్రామము నందలి దేవాలయమే హిందూశిల్ప చాతుర్యమునకు పాత్రమై భక్తకోటి చిత్తములను బల్లవింప జేసెడిది. అందలి చెక్కడపు పనులేగాక, అలంకారములు, వాహనములు, గాన నృత్యములు, నాటకములు- సర్వము కళాసంపదను అశేష జనమునకు బంచిపెట్టెడిది. వేయేల, శిల్పమునకు దేవాలయమే కేంద్రస్థానము. కళాలక్ష్మికి దేవతావిగ్రహమే నిలయము. వివిధ గ్రామములలో వారము వారము జరుగు సంతలే నానావస్తు ప్రదర్శనశాలలై యలరుచుండెడివి. కర్మకారుల హస్తనైపుణ్యము ప్రకాశింప జేయని వస్తువెచ్చటను గానరాకుండెడిది. హిందువులు సహజముగ సౌందర్యోపాసకులు అని యిటీవల ఒక ఆంగ్లేయ యాత్రికుడు ప్రశంసించి యుండెను. ఇది యెంతయు నిస్సంశయము.

కాని ఆ కాలము గతించినది. ఈ కాలపు యంత్రదాడికి చేతిపను లుత్పన్న ములై పోవుటయేకాక, దేశీయుల యభిరుచులే పూర్తిగ జెడిపోయినవి. పద్మములేని ద్వారము, అంచులేని బట్ట, పూజలు లేని పాత్ర, యీ కాలపు వారి దృష్టికి సున్నిత ములైన పిమ్మట, కళాలక్ష్మికి స్థానమెచ్చట? బుద్ధియొక్క దారులే మారిపోయినవి. ధర్మార్థ కామములకు విరోధము కూడ నేర్పడినది. ప్రతి విషయము కేవలము

ఆర్థికదృష్టితో బరిశీలింప బడుచున్న కాల మిది. కామము వీరి దృష్టిలో తుచ్ఛము, ధర్మము కేవలము పారలౌకికము. అర్థ మొక్కటే ఆరాధ్యము. శిల్ప మే కొలది భాగ్యవంతులకో భోగ్యవస్తు వైనది. ధర్మము ఏ కొలది ఛాందసులకో గుప్త మంత్ర మైనది. అర్థము మాత్రము సర్వత్ర రాజ్యము చేయుచున్నది. వస్తువు సుందరముగ నున్నదా లేదా యను ప్రశ్న లేదు. అందెట్టి ధర్మ ప్రబోధమైన గలదా లేదా యను మీమాంస లేదు. దాని యుపయోగ మేమి? అనునదియే చర్చనీయాంశము. కేవలము యుటిలిటీ-ప్రయోజనము. గృహ నిర్మాణమునకు గురువులు ఇంజనీర్లు వారు కట్టు ఆఫీసు బిల్డింగులు, రైలుస్టేషన్లు ఈ కాలపు విద్యావంతులకు ధనికులకు మాదిరి భవనములు. అందు కళా సంపదకాని, ధర్మ ప్రబోధము కాని ఉండ నవసరము లేదు పశ్చిమ దేశములనుండి దిగుమతి యగు గ్లాసులు, టీకప్పులు మన పాత్రలకు మాదిరులైన పిమ్మట, మన శిల్పసంప్రదాయమున కింకను గౌరవ మెచ్చట? ఈ కాలమున ఆర్థిక సంఘటనమే సర్వత్ర వ్యాపించి యుండుటచే, మన గ్రామములలోని కర్మకారులు సహితము పూర్వ సంప్రదాయములను విస్మరించి, నవీనుల యభిరుచులకు దగినట్లుగ అందవికారములైన వస్తుసామగ్రి నుత్పత్తి చేయవలసిన అవసరము గలిగినది. కర్మకారులకు బూర్వముండిన స్వాతంత్ర్య గౌరవములు నేడు లేవు. వారు కేవలము యజమానులకు బానిసలు. వారి నే విధముగను శిల్పులనుటకు ఆస్కారము లేకుండ పోయినది. వారంతట వారే కూలీలని బిలుచుకొనవలసిన దుస్థితి పట్టినది. వారు వేజి- ఎర్నర్సు- కూలిడబ్బుల కోసము శరీరమును విక్రయించుకొను పాటకపు జనము. వారు చేయు పనులయందు వారి యింగిత జ్ఞానము గాని. వారి సహజ హస్తనైపుణ్యము గాని వ్యక్తము కాదు. యజమానిచ్చు ప్లానులను బట్టి బజారులో సులభముగా విక్రయమగు విదేశ వస్తువుల మాదిరులను బట్టి, తయారుచేయుటయే వారి వృత్తి. ఇక యంత్రాలయములలో బనిచేయువారి సంగతి వేరుగ జెప్పనక్కరలేదు వారు స్వతంత్రులైన మానవులు కారు. వారు యంత్రములకు దోసిలొగ్గు మిల్లుహాండ్సు. వారికి హెచ్చుకూలి నిప్పించుటయే మన లేబరునాయకుల కర్తవ్యము. వారి రసజ్ఞత పూర్తిగ శుష్కించిపోయినను, వారి చిరకళానుగత

మైన హస్తనైపుణ్యము విశ్శేషముగ నశించినను, వారు చింతపడరు వారికి హెచ్చు కూలిడబ్బుల నిప్పించి తాము ధన్యులమైనట్లుగ నెంచుకొనవలసిన స్థితి యేర్పడినది.

ఈ సందర్భములను దలచుకొనినప్పుడు పూర్వకాలపు చేతిపనుల నుద్ధరించుట సాధ్యమా యను విషయము సంశయాస్పద మగుటలో నాశ్చర్యము లేదు. పూర్వకాలపు చేతిపను లీ కాలపువారికి రుచించనప్పుడు, వానిని తిరిగి బ్రతికించు టెట్లనునది సమస్య కాకతప్పదు. ఈ సమస్య నిజముగ ఆర్థికము గాదు. విదేశములనుండి దిగుమతియగు వస్తువులకు బదులు దేశములో తయారగు వస్తువులనే ప్రచారములోనికి దెచ్చుట కాదు. ఈ కాలపువారి యభిరుచులలోనే ముందుగ మార్పు కలుగవలసి యున్నది ధర్మార్థ కామ మోక్షములకు నేడేర్పడిన వియోగము పోయి వాని యైక్యమును తిరిగి స్థాపించవలసిన అవసరము గలదు. చేతిపనులలో పూర్వకాలపు మాదిరులే యెట్టి మార్పు లేకుండ నుండవలెనని, చెప్పువారము కాము. అనుకరణ మెన్నటికిని సృష్టి కాదు. కేవలము ప్రాతవానిని అనుకరించినను, లేక విజాతీయముల ననుకరించినను ప్రయోజనము శూన్యము. కాని ప్రాచీన సంప్రదాయానుసారముగ క్రొత్త సృష్టి చేయవలసి యున్నది. కర్మకారులు ప్రయోగించు పరికరములలో జాల మార్పు అవసరమను మాట నిశ్చయము. పూర్వకాలపు పనిముట్లతో నీ కాలమున బని సాగించుట దుస్తరము. కాని నేఁడు దేశమంతయు విదేశపు పనిముట్లతో నిండిపోయినది. వడ్రంగుల సామానులు, కంసాలుల పనిముట్లు, కమ్మరుల సుత్తులు, కలంకారీ పనివాండ్ర రంగులు – సమస్తము విదేశములనుండి దిగుమతి యగుచున్నవి. చేతిపనులకు, తుదకు అల్లికలకు, కుట్టుపనులకు– అన్నిటికి డిజైన్లు, ప్యాటర్న్లు, విదేశముల నుండి దిగుమతి యగుచున్నవి. ఇవన్నియు ప్రతికూల సందర్భములు. గ్రామ సౌభాగ్యమును బోషింపదలచుకొన్న వారీ సందర్భముల నెల్ల నెదుర్కొనవలసి యున్నది. నేడు మహాత్ముడు స్థాపించబోవునది కేవలము మ్యూజియము వలె

ప్రదర్శనశాలగ నుండిన లాభములేదు అది యొక ప్రయోగశాలగ నుండినగాని విశేష ప్రయోజన ముండదు గాంధి మహాత్ముడు దరిద్ర నారాయణోపాసకు డగుటచే, వాని దృష్టిలో ప్రస్తుతము ఆర్థిక సహాయ్యమే ప్రాముఖ్యము వహించుటలో నాశ్చర్యము లేదు. ఈ లోపమును గ్రహించియే రవీంద్రనాథ ఠాకూరు ఈ ద్యూటియమును కేవలము కార్ఖానావలె గాక, చిత్రశాలగ జేయవలెనని కూడ సందేశము బంపినాడు. నేడు దేశము నావరించినది ఆర్థిక దారిద్ర్యము కంటెను హెచ్చుగ జ్ఞానదారిద్ర్యమని రవీంద్రుని చెప్పిన మాటలయందు సత్యము గలదు. మన విద్యార్థికులలో నిప్పుడిప్పుడు స్వదేశాభిమానము విజృంభించుచున్నను అది చాలవరకు ఆర్థికమే కాని, స్వదేశధర్మ సంబంధమైనది కాదు. ఈ కారణముచే గ్రామపరిశ్రమలతో బాటు, కుటీరములను కళానిలయములుగ మార్చు చిత్రరువులను, అలంకారములను, దేవతా ప్రతిమలను గూడ నుద్ధరించవలసి యుండునని రవీంద్రుడు మహాత్మునకు హితవు గరపుచున్నాడు. ఆత్మను రసవంతముగా జేసినగాని చేతిపనుల కీ కాలములో స్థానము లేనిమాట నిశ్చయము. అందుకనియే భారత శిల్ప ప్రబోధముయొక్క యావశ్యకతను గూర్చియే రవీంద్రుడు హెచ్చరించుచున్నాడు. విద్యార్థికులను దయార్ద్ర హృదయులనుగ జేసి, తన్మూలమున చేతిపనుల నుద్ధరించవలెనని మహాత్ముని ఆశయము. ఇందే యీ యుభయ నాయకులకు గల భేదము. రవీంద్రునిది కళా సంప్రదాయము. చేతిపనులు సహజముగ ఆత్మవిలసనము లగుటచే వాని నాదరించవలయునని రవీంద్రుని హెచ్చరిక. చేతిపనులు క్షుత్పీడితులకు అన్నమిడుటచే వాని నాదరించుట ధర్మమని మహాత్ముని సందేశము. ఈ రెండు సందేశములు సమన్వయము లైనగాని గ్రామ సౌభాగ్యము సుస్థిర మార్గమును ద్రొక్కజాలదు. ఎప్పుడు చేతిపనుల నాదరించుట, పరోపకార బుద్ధిచేతనేకాక, సౌందర్యోపాసన కొరకుకూడ నగునో,- అప్పుడే ధర్మార్థ కామములకు ఏకవాక్యత యేర్పడి, మానవుని చిరంతన కళ్యాణము సిద్ధించును.. అందుకనియే మన ప్రాచీనులు

శిల్పమును ధర్మార్ధ కామప్రదమని ఉద్ఘోషించిరి. మహాత్ముని శిష్యులగు జే. సి. కుమారప్ప గారును రవీంద్రుని శిష్యులగు సురేంద్రనాధకారు గారును గలసి. ఏర్పాటు చేయబోవు మ్యూజియము నిజముగ లక్ష్మీ సరస్వతులకు ఏకనిలయమై తనరార గలదు.

# స్త్రీ బానిస వ్యాపారము

నేడింకను పాశ్చాత్య దేశములలో బానిసవ్యాపారము సాగుచున్నదని తెలిపిన నమ్మువారుండరు. ఈ బానిసవ్యాపారము పూర్వకాలములో నుండిన రీతిని లేనిమాట నిజము ఆ కాలములో నైనను స్వజాతీయులను బానిసలనుగ నుంచుకొను పద్ధతి ప్రబలి యుండలేదు. వెనుకటి రోజులలో హిందూరాజులు యవనస్త్రీలను ఇంటి బానిలనుగ నుంచుకొనుచుండినట్లు సంస్కృత వాఙ్మయములో నెక్కడజూచి నను గన్పట్టును రోమనులు యుద్ధములో ఓడించినవారిని, వారి స్త్రీలను, బానిసల మగ జేయుచుండిన సంగతి చరిత్రప్రసిద్ధము. గ్రీకులవంటి నాగరకులే రోమను ప్రభు వుల గృహములలో బానిసలుగ నుండుచు వచ్చిరి. ఇక ఆఫ్రికను నీగ్రోల సంగతి వేరుగ జెప్పనక్కర లేదు. నీగ్రోబానిస వ్యాపారము అమెరికాలో చిరకాలము సాగిపోయినది ప్రప్రథమమున అమెరికాకు వలసపోయిన శ్వేతజాతీయులు కొలది మందే యగుటచే, అడవులను ఛేదించుటకు, తోటలను వేయుటకు, గ్రామములను నిర్మించుటకు బాటకపు జన మత్యవసర మగుటచే, వారు ఓడలకొలది నీగ్రోలను ఆఫ్రికానుండి దిగుమతి చేసికొనుచుండిరి, పశువులను బేరము చేసినట్లు తెల్ల భూస్వాము లా రోజులలో నీగ్రోలను వారి బలమును బట్టి, వయస్సును బట్టి, బేరములాడి, గొనుచుండెడివారు. ఆ యజమానులు పశువులచేత బని చేయించుకొను చుండునట్లు, నీగ్రోలచేత బని చేయించుకొనెడివారు. వారొక మానవ మాత్రులుగ నెంచబడ లేదు. వారి శరీరములు కేవలము వారి యజమానుల సొత్తు. కాని కొంత కాలమునకు అమెరికాలోనే ఈ బానిస వ్యాపారముపై తిరుగుబాటు బయలు దేరి నది. అమెరికాలో ఉత్తరమువారికి దక్షిణమువారి కీ విషయమై హోరాహోరీని యుద్ధములు కూడ సాగెను. తుదకీ వ్యాపారము పూర్తిగ నణచబడెను. బానిస వ్యాపారము నేరములలో నొకటిగ శిక్షాస్మృతియందు చేర్చబడెను. ఆ కాలములో అమెరికాయందు కూడ గొందరు సనాతన ధర్మవాదులు లేకపోలేదు. బానిస

వ్యాపారము ధర్మసమ్మతమని కొంతమంది క్రైస్తవమతగురువులు బైబిలు గ్రంథమునుండి ప్రమాణ వాక్యములను గూడ నెత్తిచూపిరి. కాని ఈ మతాచారములకన్నిటికిని అతీతమైన మానవసోదర ధర్మము విజయము నొందెను, అప్పటి నుండియు బానిస వ్యాపారము సభ్యజాతులచే గడు హీనముగ నెంచబడ నారంభించినది. కాని యూరపు అమెరికా దేశములలో నీ వ్యాపారము ప్రత్యక్షముగ సాగకపోయినను. తెల్లవారి స్వాధీనములైయున్న ఆఫ్రికను వలసదేశములలో "లేబరు" పేరున నీ వ్యాపారము నిరాఘాటముగ సాగుచుండిన సంగతి లోక విదితము బెల్జియను కాంగోలో రబ్బరుతోటలందు ఆఫ్రికను కూలీలు పశువులకంటె నెక్కువ హీనముగ హింసింప బడుచుండినట్లు, పత్రిక లెన్నియో దారుణ వృత్తాంతములను బ్రకటించి యుండినవి. ఆఫ్రికాలో నల్లవారింకను, శ్వేతజాతీయులతో సమాన ప్రతిపత్తిని బొందక, కేవలము బానిసపద వాచ్యులు కాకపోయినను, ఫలితములో నిట్టి నైచ్యమునకే పాత్రులగుచున్న విషయము పాఠక లోకమునకు దెలిసియే యున్నది. నల్లజాతులకు ఇంకను మానవులందరకు గల జన్మహక్కులు కలవను విషయము సిద్ధాంతములో గొంతవర కంగీకరింప బడినను ఆచరణలో సమ్మతింపబడుట లేదు. ఈ తారతమ్యము కేవలము వర్ణద్వేష ప్రేరితమని చెప్పుటకు వీలు లేదు. సాంఘికముగ నల్లజాతుల కొక విధమైన న్యూనత కల్పించబడుచున్న మాట నిజము. కాని అది యొక ప్రబల కారణము కాదు. రాజకీయార్థికస్వార్థములే యెక్కువగ నీ విభేదములను గల్పించుకొని తద్వారా సఫలత నొందుచున్నవి. నల్లజాతులలో ఆత్మగౌరవము, స్వాతంత్ర్యకాంక్ష, సమాన ప్రతిపత్తి ప్రబలిన కొలదియు నీ భేదములు తగ్గుట కవకాశములు కలవు. స్వతంత్రులైన జపాను దేశీయులు శ్వేతజాతీయులచే ఆదరణపాత్రు లగుచున్నారే కాని, తెల్లవారు కారను గారణమున నిరసింపబడుట లేదు. తురుష్కులు మొన్నటి వరకు హీనముగనే చూడ బడుచుండిరి. కాని టర్కీ రిపబ్లిక్కును స్థాపించుకొని, రాజకీయార్థిక విషయములయందు స్వతంత్రమైన వెంటనే, గౌరవస్థానము

నందుచున్నది. అమెరికావారు ఫిలిప్పైను దీవులకు స్వాతంత్ర్య మొసగక తప్పినది కాదు ప్రపంచవృత్తమును సమగ్రదృష్టితో జూచినయెడల, ఒకజాతి కంటె నింకొకజాతి అధికమైనదని తలంచు రోజులు క్రమముగ నంతరించుచున్నవను విషయము హృద్గత మగును. జాతిద్వేష మనునది చిరకాల గ్రస్తమైన దగుటచే, దాని వాసనలు వెంటనే వదలక పోవచ్చును. అవి చిత్రవిచిత్ర మార్గముల గుండ వ్యక్త మగుచుండవచ్చును కాని వాని రోజులు ముగిసినవని రాజకీయ నిర్మాతలు, సంఘప్రవర్తకులు ఎంత త్వరగ దెలిసికొనిన లోకమున కంత మేలు.

ఇప్పుడు యూరపులో జరుగుచున్న స్త్రీవ్యాపారము పూర్వపు బానిస వ్యాపారము వంటిది కాదు. వెనుకటిరోజులలో నీ వ్యాపారము ప్రధానముగ "లేబరు" కొరకు సాగుచుండెడిది. ఆ లేబరు కొరకైనను, స్వజాతీయులను విక్రయించుకొను ఆచారము లేదు లేబరే ప్రధాన మగుటచే స్త్రీలకంటె పురుషులే యెక్కువగ విక్రయింపబడెడివారు ఇప్పుడు సాగుచున్న వ్యాపారము లేబరుకొరకు గాదు విజాతీయులలో గాదు పురుషుల విక్రయమును గాదు పడుపువృత్తి కొరకు స్వజాతి స్త్రీలనే విక్రయించుకొను పద్ధతి పశ్చిమ ఖండములో నెక్కువగ సాగుచున్నది. దీని నాపుటకు అన్ని ప్రభుత్వములవారును కఠిన శాసనములను జేసిరి నానారాజ్య సభవారికి సంబంధించిన అంతర్జాతీయ సంఘములే యీ విషయమై యూరపు అమెరికాలలో తీవ్రమైన ఆందోళనము సలిపి. ప్రజాభిప్రాయమును, చట్టముల రూపమున ఉన్ముఖ మొనర్చినవి ఈ యాందోళనమును కొంతవరకు జాతీయాహంకారము ప్రేరేపించక పోలేదు యూరపియను దేశములనుండి. తెల్లజాతి బాలికలను పడుపువృత్తి కొరకు గొందరు వ్యాపారస్థులు ఆశియాఖండమునకు రవాణా చేయ మొదలిడిరి. అలెగ్జాండ్రియా, బొంబాయి, సింగపూరు, రంగూను, హాంకాంగు మొదలగు రేవులలో గొన్ని వీథులు కేవలము తెల్ల సానులచేతనే ఆక్రమింప బడుచుండెను. కొందరు షాహుకారులు తెల్లసానులను దిగుమతి చేసి, పెద్ద పెద్ద మేడలను వారికొరకు ప్రత్యేకముగ నద్దెకు దీసికొని, పడుపువృత్తినే ఒక వ్యాపారముగ జేసికొను దుర్మార్గమునకు గడంగిరి. ప్రభుత్వముల చట్టము లెవ్వియు వ్యాపారము

నడ్డగించక పోవుటచే, నిది కొంతకాలము స్వేచ్ఛగ బహిరంగముగ సాగుచు వచ్చెను. ఈ వ్యాపారస్థులు తెల్లబాలికల నెట్లు వారి దేశములనుండి లేవదీసి ఎగుమతిచేయ గలుగుచుండిరో యెవరికిని దెలియదు. పడుపువృత్తినే కులవృత్తిగ నెంచుకొను వేశ్యజాతి వంటిది పాశ్చాత్య దేశములలో నెక్కడను లేదు. బొంబాయి మొదలగు రేవులలో దిగుమతియగు బాలికలు సంసారము చేయుచుండిన కుటుంబ ముల నుండియే ఆకర్షింప బడుచుండి రనుటకు సందియము లేదు. ఆ బాలికలు దరి ద్రము చేతనో, వృత్తులు కనబడకనో, లేక మోసములకు బలియయ్యో, ఈ వ్యాపా రస్థుల చేతులలో జిక్కుచుండెడివారు. ఈ వ్యాపారస్థులలో గూడ జాల తెగలు కలవు. ఈ అమాయకపు బాలికలను రిక్రూటు చేయువారు కొందరు. ఈ రిక్రూటర్ల యొద్ద నీ బాలికలను గొని, బొంబాయిరేవుకు ఎగుమతిచేయు ఏజంట్లు కొందరు. ఈ యెగుమతిదారుల నుండి కొని, వైటులేనులో ప్రదర్శించి ధనమార్జించువారు కొందరు. ఈ విధముగ యజమానుల మార్పులతో, నీ బానిస వ్యాపార మే అర్ధశతాబ్దమో విచ్చలవిడిగ సాగినది. కాని బొంబాయివంటి పట్టణములో, నల్లవారి మధ్య, శ్వేతయువతులు కులటలుగ తిరుగుచుండుట, యూరపియను జాతివారి గౌరవ ప్రతిష్ఠలకు భంగకరమను విషయము వారి నెక్కువగ బాధించినది. ప్యారిసు, వియ్యన్నా మొదలగు యూరపియను పట్టణములలో నేమియైనను, ఆశియా దేశములకు తెల్లకులటలను రవాణాచేయు పద్ధతి నాపుట యవసరమని యూరపియను పత్రికలేకాక, యూరపియను రాజ్యాంగవేత్తలు కూడ ఆందోళన చేయసాగిరి. ఈ యాందోళనకు జాల ప్రభుత్వములు తలయొగ్గినవి. ప్రతి దేశములోను "మోరల్ పోలీసు" ఏర్పాటు చేయబడెను. వారు రైలు, స్టీమరులలో. ప్రయాణము చేయు ప్రతి శ్వేతబాలికను బరీక్షించి, ఏమాత్ర మనుమాన మున్నను, ఆమెను తిరిగి స్వదేశమునకు జేర్చెదరు. పట్టణములలో "ప్రాథల్సు ఆక్టు" ను ప్రయోగించుటచే బహిరంగముగ నీ కులటవ్యాపారమును గొనసాగించుట కవకాశము పోయినది. అయినను డబ్బురుచి మరిగిన ఈ వ్యాపారస్థులు మారు వేషములతో నీ బానిస వ్యాపారము నింకను నిగూఢ మార్గముల సాగించుచున్నట్లు తెలియుచున్నది. ప్రయాణోద్దేశమును యుక్తియుక్తముగ దెలుపజాలని బాలికల

ప్రయాణము ఆపివేయబడును గాని, ఏదో సహేతుకమైన ప్రయోజనమును దెలిపినవారి ప్రయాణము నడ్డగించుటకు వీలుండదు. కొందరు వ్యాపారస్థులు ''నాట్య ప్రదర్శకులు'' అను పేరుతో గొందరు బాలికలను జేరదీసి, ఏ కుప్పిగంతులనో నేర్పి, బొంబాయిఎంటి పట్టణములలో జేర్చుట ఒక పద్ధతి. టైపిస్టులను పేరుతో గొందరను పేరునకు ఫర్మలలో జేర్పించి చాటుమాటున నీ వ్యాపారము సాగించుటయు గలదు. ''సినీమా స్టార్సు'' అను మిషతో వీరిని సమకూర్చుటయు జరుగుచున్నవి. సంఘములో నీ వ్యాపారము నెడల, సహజమైన విముఖత ఏర్పడవలెనుగాని లేనియెడల, చట్టముల నేదో విధమున తప్పించుకొని, నిగూఢ మార్గముల నీ వ్యాపారమును సాగించుట కవకాశము గలదు

ఇప్పుడీ రవాణావ్యాపారము, ఆశియాఖండమునకు గంటె దక్షిణఅమెరికా కెక్కువగ సాగుచున్నట్లు తెలియుచున్నది దక్షిణ అమెరికావారు పూర్తిగ శ్వేత జాతీయులు కాదు. వారు దక్షిణ అమెరికాలోని ఆదిమనివాసులకు స్పెనిష జాతీయులకు గలిగిన సంకర జాతివారు. రంగులో గూడ వారిది నలుపే. ఏ కారణము చేతనో వారి శరీరమునకు దెలుపెక్కలేదు వారికి శ్వేత బాలికలపై గల మోహము హెచ్చు తమలో శ్వేత బాలికలను జేర్చుకొనుటవలన గొంత కాలమునకు దమ రంగు తెలుపుకాగలదను నమ్మక ముండవచ్చును. కాని ఇందునిమిత్తమై తెల్ల బాలికలను వివాహము చేసికొనిన యెడల, నెట్టి చిక్కును ఉండదు. కాని వారికి గావలసినది తెల్లజాతి ఉంపుడుకత్తెలు. ఈ వ్యాపారము చేయువారికి దక్షిణ అమెరికా మంచి అనువైన దేశము.కాని ఇంగ్లాండు నుండికాని, ఫ్రాన్సునుండి కాని ఆస్ట్రియానుండికాని తెల్లపడుచుల నా దేశమునకు జేర్చుటెట్లు? ఇందుకొరకే వ్యాపారస్థు లెన్ని యెత్తులనో వేయవలసి వచ్చుచున్నది. ఏ బాలికయు బుద్ధి పూర్వకముగ బడుపువృత్తికొరకు రవాణా యగుట కొప్పుకొన జాలదు. వ్యాపారస్థుల ఏజెంట్లు వీరిని ఏదో మిషమీద ఆకర్షించవలసి యుండును. యూరపులో నిర్వ్యాపార సమస్య కూడ నొకటి యుండుటచే, నీ యేజంట్ల ప్రయత్నములు, ఫలించుట కవకాశము కల్గినది టైపిస్టులనుగ జేసెద మనియో, ఫర్మలలో ఆఫీసులలో గుమాస్తాలనుగ నియమించెద మనియో, సినిమా స్టార్సునుగ

జేర్పించెద మనియో — మొదలగు మిషలతో నీ యమాయకపు బాలికల నాకర్షించి దక్షిణ అమెరికాకు రవాణా చేయుచున్నట్లు యూరపియను పత్రికలు వెల్లడించుచున్నవి సామాన్యముగ నీ ఏజెంట్లు ఈ బాలికలు ప్రయాణము చేయు చున్నప్పుడు వెంబడి ఉండరు. తాము పట్టుబడి పోవుదుమను భయముతో వారు వెనుకనే నిలచిపోదురు. ఆ బాలికలకు దెలియకుండగనే ఇంకొకడు ఆ రైలులోనో స్టీమరులోనో ప్రయాణము సేయును. ఆ బాలికలు స్వతంత్రముగనే, విడివిడిగ, ప్రయాణము సేయుచున్నట్లు ఏర్పాట్లు జరుగును. కాని వారు గమ్యస్థానము చేరుట తోడనే, క్రొత్త యజమాని వారినందుకొని మిగిలిన వ్యాపారము నంతను యథేచ్ఛగ సాగించును దక్షిణ అమెరికాలో నీ వ్యాపారము నిరోధించు ప్రయత్నము లున్నట్లు తోచదు. దక్షిణ అమెరికా ప్రభుత్వములన్నియు రిపబ్లి కులయ్యు, నిరంకుశ పద్ధతులే అవలంబింపడుచున్నవి. అన్ని తగాయిదాలును, తుదకు ఎన్నికలు కూడ తుపాకులతోనే పరిష్కార మగుచుండును. ఈ తెల్ల బానిస వ్యాపారము మూలమున నా దేశములో హత్యలు కూడ ప్రబలుచున్నవని అమెరికను పత్రికలు వ్రాయుచున్నవి ఈ తెల్లబాలికలను వశపరచుకొనుటకు, ధనముకంటెను,బలాత్కారమె యెక్కువగ వినియోగపడుచున్నది. ఈ యిరువదవ శతాబ్దములో ప్రత్యక్షముగ నీ వ్యాపారము సాగుటెంతయు విచారకరము. ఎంద రమాయకపు బాలికలో యీ విధమున బరభూములకు రవాణా చేయబడుచున్నారు. గవర్నమెంటు చట్టములుకాని మోరలు పోలీసువారి నిఘాకాని, ఈ వ్యాపారము నాపలేకున్నవి.

తెల్లబానిస వ్యాపారము నటుంచుడు మన దేశములో గూడ నీ కులట వ్యాపారము మిక్కుటముగ సాగుచున్నదని ముఖ్యముగ ఉత్తర హిందూస్థానము నందలి పట్టణములను బరీక్షించిన తెలియగలదు. ఈ దేశములో మోరల్ పోలీసు లేదు ప్యూరిటనుల అజమాయిషీ అంతకంటెను లేదు. బ్రాథెల్సు అక్టుకు గురి కాకుండ ఈ వ్యాపారమును సాగించు పద్ధతులు చాల ప్రబలముగ నున్నవి. ఫ్యాక్టరీ కూలీల పేరుతో గొంతవరకు, సినిమా స్టారులను పేరుతో గొంతవరకు,

బీడీలవంటి కుటీర పరిశ్రమల పేరుతో గొంతవరకు, నీ కులటలను జేర్చి సంఘమును విధ్వంస మొనర్చుచున్నారు. బ్రాథల్సు ఆక్టు వీరి నేమియు జేయలేకున్నది. ఈ కులటల పేర్లు, ఫ్యాక్టరీ కూలీల పట్టికలలోనో, లేక సినిమాస్టూడియో జాబితాల లోనో చేర్చి యుండుటచే, అధికారులు వారి నిండ్లనుండి వెడలగొట్టుట కవకాశము లేదు. యూరపులో మాయా వేషములతో పడుచుల నాకర్షించుచుండవచ్చును. గాని మన దేశములో "కిడ్నేపింగులే" అధికముగ జరుగుచున్నవి. పంజాబు, యు. పి. కలకత్తా ప్రాంతములలో ప్రతిదినము బాలికల కిడ్నేపింగు వార్తలు విన వచ్చుచునే యుండెను. కొందరు రౌడీలు బాలికల నెత్తుకొనిపోయి, దూర ప్రాంత ములలో నీ కులటవ్యాపారస్థులకు విక్రయించుచుందురు దరిద్రదేవత యొకటి దేశమును బీల్చి పిప్పిచేయుచున్నది. ఎందరో బీదతల్లులు తమ శిశువులను బోషిం చుకొనలేక, కులటలకు విక్రయించు ఆచారము నగరరాజములందేకాక, చిన్న పట్టణములలో గూడ ప్రబలుచున్నది. కులటలు తమ వృద్ధాప్యములో జీవనోపాధిని గల్పించుకొను నిమిత్తము, బీద తల్లులనుండి ఆడ శిశువులను గొని, పెంచి, వారికి వయస్సు వచ్చిన పిమ్మట పడుపువృత్తిలోనికి దింపెదరు. కులటలకు సామాన్యముగ బిడ్డ లుండరు. ప్రకృతి వారిని సాధారణముగ వంధ్యలుగనే ఉంచును. వారు తల్లులైనయెడల, పిల్లలను గూడ దమ వృత్తుల లోనికి దింపెదరని ప్రకృతికి దెలియును. ఈ యుద్దేశముతో వారిని రుగ్మతల పాలుచేసి సంతాన విహీనురాండ్రనుగ జేయును. కాని ఈ కులటలు ప్రకృతిని గూడ మోసగింప గలుగుచున్నారు. తాము కనకపోయినను, బీద బాలికలను జేరదీసి, నరమాంస విక్రయ తుల్యమైన కులటవ్యాపారమున దింపుచున్నారు. వ్యభిచార వృత్తిలో దింపునిమిత్తమే స్త్రీయ శిశువులను బెంచరాదను నిషేధము గవర్న మెంటు చట్టములలో గలదు. కాని ఏ కులటయు ఈ నేరము నొప్పుకొనదు. శిశువును సంసారిణిగ జేయుటకే కొనుచున్నానని తెల్పును కాని ఒక కులట ఒక శిశువును బెంచుకొనుచున్న దనుటలోనే, దురుద్దేశము నూహించవలసి యుండును. దేశములో నిట్టి శిశువిక్రయము విపరీతముగ సాగుచున్నది. పాశ్చాత్య దేశముల లోని "వైటు స్లేవు ట్రాఫిక్కు" కంటె నిది యెక్కువ ఘోరమైనది. విదేశ ములకు రవాణాయగు బాలికలు మైనర్లు గాదు వారు సర్వసామాన్యముగ పదు

నెనిమిదేండ్లు దాటిన పడుచులు వారు ఏజెంట్ల మోసములకు బాల్పడి యుండవచ్చును. అది మోసమని తెలిసిన పిమ్మటనైనను తప్పించుకొని వచ్చుటకు గొన్ని యవకాశములు కలవు హిందూదేశము లోని శిశువిక్రయ మట్టిది కాదు. వీరు పసిగందులైనప్పుడే వేశ్యల చేతులలో బడుచున్నారు. వారికి వయస్సు వచ్చుసరికి, వారి తల్లిదండ్రు లెవరో తెలియదు; ఏ కులస్థులో తెలియదు. వారు పూర్తిగ వారిని బెంచిన కులటల వశములో నుండక తప్పదు. పాశ్చాత్య దేశములలో కులటల వశమునుండి తప్పించుకొనిన వారు తిరిగి సంఘములో జేరుట కవకాశము కలదు. వారు తుదకు ఏ నర్సులుగనో, జనానా మిషనుగనో, తర్ఫీయతునొంది, గౌరవముగ జీవించవచ్చును. వారిని సన్మార్గములోనికి ద్రిప్పుటకు శరణాలయము లెన్నియో కలవు

ఈ దేశములో నట్టి సౌకర్యము లేమియు లేవు ఒకమారు పతితయైన స్త్రీ శాశ్వతముగ నరకకూపములో నుండవలసినదే కాని, ఆమెకు తరణోపాయము లేదు. కులటల పోషణలో నుండు మైనరు బాలికలనైనను ఆదరించి, ఉద్ధరించు శరణాలయములు లేవు. హిందూసంఘ మీ విధమున నెందరు సోదరీమణులనో సంఘము బయటకు గెంటి, శాశ్వతముగ పడుపువృత్తిలోనికి బంధించివైచుచున్నది. మహమ్మదీయ సంఘములో నిట్టి కఠిన కుల విభాగములు లేకపోవుటచే, చెడిపోయిన స్త్రీలు తమ శిశువులనైనను తిరిగి సంఘములో జేర్చుటకు ప్రయత్నించ గలుగుచున్నారు. ఇట్టి యవకాశము మహమ్మదీయ సంఘము గల్పించుటచే, లక్నో, కాశీ, కాన్పూరు, కలకత్తా, లాహోరు, కిరాచీ మొదలగు పట్టణములలో హిందూ కులటల బిడ్డలను గూడ మహమ్మదీయ మతములోనికి గలుపుగొని, వారి సంఘములో జేర్చుకొనుచున్నారు. ఇట్లే క్రైస్తవులు కూడ నీ కులటల బిడ్డలను తమ "అనాథాశ్రమము"ల లోనికి దీసికొని క్రైస్తవ మతమిప్పించుచున్నారు ఈ దురదృష్టపు బిడ్డలకు క్రైస్తవ మహమ్మదీయ సంఘము లేదో విధమున త్రోవ చూపుచున్నవి. కాని పాములకుగూడ బాలుపోయు హిందూ సంఘము ఈ బిడ్డలను కులముపేరిట నధోగతిపాలు చేసి, తన కృత్రిమ గౌరవమును బోషించుకొనుచున్నది. హిందూసంఘము నిర్దోషులైన శిశువులయెడల కొంతకాలమింత నిర్దయతో

ఇట్టి నిర్దాక్షిణ్యముతో ప్రవర్తించుచుండిన యెడల, అంత్యదినములు సమీపించు చున్నవని చెప్పుటకు సాహసింప బని లేదు. హిందూసంఘము పాశ్చాత్య సంఘమువలె విషయ భోగముల కాశించునది కాదని సభావేదిక నెక్కి మహోప న్యాసముల నిచ్చుచుందుమేకాని, హిందూసంఘము బయట కెంత మందిని గెంటి వేయుచున్నదియు దెలిసికొనలేకున్నాము. స్త్రీలను, శిశువులను సంస్కరించి పోషించలేని సంఘము భూతలమున జీవించుట కెట్టి హక్కును లేదు.

కృష్ణా పత్రిక
జూన్ 29వ తేది, 1935 సం॥

# శిక్కు—ముస్లిం తగాయిదా

కడచిన వారమునుండియు లాహోరు పట్టణము అట్టుడికి పోవుచున్నది. వీథులలో రాత్రింబవళ్ళు పోలీసు గస్తీ తిరుగుచున్నారు షాహిద్గంజి ప్రాంతమున మిలిటరీ పటాలములు వచ్చి విడిదిచేసి యున్నవి. రాత్రి 8-30 గంటలకు మొదలుకొని, ఉదయము 5-30 వరకు ఎవరును ఇండ్లు వదలి బయటకు రాకూడదని గవర్నమెంటువా రుత్తరువు చేసిరి. వీథులలో గుంపులు చేరకుండ జాగ్రత్త పుచ్చుకొన బడుచున్నది. షాపులను తెరవకుండ ఎవరైనను వర్తకులను బెదిరించిన యెడల వారు వెంటనే అరెస్టు చేయబడుచున్నారు. లాహోరు పట్టణములోనే కాదు, చుట్టుప్రక్కల ప్రాంతములం దంతట మిలిటరీ బందోబస్తు చేయబడుచున్నది. గవర్నమెంటువారు సకాలమున నింత మెలకువతో బందోబస్తు చేయకుండ నుండినయెడల, నిప్పటికి ఒక లాహోరేకాక, దాదాపుగ పంజాబంతయు రక్తమయ మయ్యేడిదనుటకు సందియము లేదు. ఇది కేవలము మత సంబంధమైన తగాయిదా యగుటచే గవర్నమెంటువారి సందర్భములో జాల మెలకువతో మెలగవలసిన బాధ్యత కలిగినది. వారటు శిక్కులనుగాని, ఇటు మహమ్మదీయులనుగాని వెనుక వేసికొని వచ్చుటకు వీలులేదు. ఉభయ సంఘములకు పంజాబులో ప్రాముఖ్యత కలదు. ఇరు సంఘముల వారిపై ఇండియను సైన్యము చాలవర కాధారపడి యున్నది. ఉభయులు గవర్నమెంటువారికి విశ్వాసపాత్రులు. శాంతిభద్రతలకు భంగము కలుగనంతవరకు ఉభయ సంఘముల హక్కులను స్వాతంత్ర్యములను గాపాడుట వారి ధర్మము. కాని న్యాయతః స్థిరపరుపబడిన హక్కులను గాపాడుటకును, శాంతిపోషణమునకును బరస్పర వైరుద్ధ్యము సంఘటించినప్పుడు గవర్నమెంటువారు తమ కర్తవ్యమును నిర్ణయించుట బహు కష్టసాధ్యము.

లాహోరులో నేడు గవర్నమెంటువారి కట్టి చిక్కు తటస్థించినది. లాహోరులో, షాహిద్గంజి యొద్ద నొక పాడుపడిన మసీదు గలదు. దాని ప్రక్కనే

శిక్కుల గురుద్వారము కలదు కడచిన 170 సంవత్సరముల నుండియు నా మసీదున్న స్థలము శిక్కుల గురుద్వారమువారి భుక్తములో నున్నది. అయినను మహమ్మదీయులా పాడుబడిన మసీదును తమ పరము చేయవలసినదిగ ఆందోళన చేయసాగిరి. ఈ విషయమైన తగాయిదా 1853లోనే అంకురించినది. తుదకిది కోర్టులకు గూడ నెక్కినది. 1930లో నా మసీదు గురుద్వారమునకు జెందినట్లుగనే తీర్పు చెప్పబడెను. అప్పటినుండియు కక్ష మరింత తీవ్రమైనది ఆ మసీదు వాడుకలోలేక, పాడుపడి యున్నప్పుడు, పైగ దానినిగూర్చిన హక్కులు శిక్కులవని కోర్టులు తీర్పు చెప్పినప్పుడు, మహమ్మదీయులు తమ యాందోళనమును వదలుకొనిన చిక్కు కలిగెడిది కాదు. ఆ మసీదు కోర్టులలో తమదిగ తీర్పయినను శిక్కులు దాని జోలికి బోకుండ ఊరకుండిన యెడల, మహమ్మదీయులలోను ఎక్కువ కలవరము కలిగెడిది కాదు. కాని కక్షలు ప్రబలినప్పుడు శాంతమార్గములు తోచవు. ఆ మసీదు తమదిగ భాయపడినప్పుడు దానిని బడగొట్టుటకు దమ కెందుకు సంపూర్ణాధికారము లేదని శిక్కులు ప్రశ్నించిరి. హక్కులెట్లున్నను, తమ మత సంబంధమైన మసీదును మతాంతరులు పడగొట్టుటకు తా మంగీకరింపజాలమని మహమ్మదీయులు పట్టుపట్టిరి ఈ రెండు సంవత్సరముల నుండియు నీ కక్ష రాజుచునే యున్నది. ఈ యుభయ సంఘములకును రాజీ కుదుర్చుటకు గవర్నమెంటధికారు లీ రెండు సంవత్సరముల నుండియు ప్రయత్నించుచునే యుండిరి. రాయబారములు సాగుచునే యుండెను. శిక్కులు హిందువులు కాక పోయినను, హిందువులు శిక్కుల పక్షమునే అవలంబించినట్లు కన్పట్టుచున్నది. షాహిద్గంజి మసీదు శిక్కుల గురుద్వారపు ఆవరణలో నున్నట్లే లాహోరులో నొక భాగమున మసీదు ఆవరణలో నొక హిందూ దేవాలయము గలదు. మహమ్మదీయు లా హిందూ దేవాలయమును హిందువుల పరము చేసినయెడల శిక్కులు షహిద్గంజి మసీదును మహమ్మదీయుల పరము చేయుటకును రాయబారములు జరిగినవి. మతోద్రేకములు పెరిగినప్పుడు, రాజీప్రయత్నములు సామాన్యముగ ఫలించవు. గవర్నమెంటువారు మతవిషయములలో తాటస్థ్యము వహించవలసి యుండుటచే వారు జోక్యము కల్పించుకొనుటయు ననుచితము,

కాని యీ సందర్భములో గవర్నమెంటువారు కేవల ముపేక్ష వహించు టకును వీలులేదు కోర్టులలో స్థిరపరుపబడిన శిక్కుల హక్కులను గాపాడవల సిన బాధ్యత గవర్నమెంటువారికి లేదా యని ప్రశ్నించవచ్చును. మసీదును బడ గొట్టుట వలన మహమ్మదీయులలో రోషానలము ప్రజ్వలించి, అశాంతి విప్లవము కలుగు సూచనలున్నప్పుడు, కోర్టుల తీర్పు లెట్లున్నను, శిక్కులా మసీదును బడగొట్టకుండ జేయుట గవర్నమెంటువారి కర్తవ్యము కాదా యని కూడ ప్రశ్నించవచ్చును. ఇది బహు సూక్ష్మధర్మము. శిక్కుల కడ్డము వచ్చిరా, గవర్నమెంటువారు తమ కోర్టుల యధికారములను తామే భగ్నపరచి నట్లగును. మహమ్మదీయులు తిరుగుబాటు చేయకుండ. వారి నాటంకపరచిరా, మతము పేరట నెట్టి దుండగములైనను జరిగి పంజాబు యొక్క శాంతిభద్రతలకే భంగము కలుగవచ్చును. ముందు గొయ్యి వెనుక నుయ్యి ఉన్నట్లయినది గవర్న మెంటువారి అవస్థ. వారు ఉభయసంఘముల నాయకులను బిలిపించి, రాజీ చేయ జూచిరి. కాని, సంఘ బాహుళ్యము మీద నీ రాజీ ప్రయత్నములు ఆమోదింప బడినట్లు లేదు. వృద్ధులలో గొంత సహన ముండవచ్చును గాని, యువకుల రక్తము వేంద్రముగ నుండుట సహజము. ఆ మసీదు తమదైనప్పుడు తా మెందుకు దానిని బడగొట్టకూడదని శిక్కు యువకులును, దానిని బడగొట్టిన యెడల, తాము శిక్కు గురుద్వారమును నేలమట్ట మొనర్చెదమని మహమ్మదీయ యువకులును బెదిరింప సాగిరి ఉభయ సంఘముల నాయకులును, ఒక విధముగ నిర్వీర్యులైరని చెప్పవచ్చును.

ఇట్టి సందర్భములో గవర్నమెంటువారు శిక్కులు తొందరపడకుండ జేయుటకు సర్వవిధముల ప్రయత్నించు చుండిరి. ఉభయ పక్షములలో మతో ద్రేకము ప్రజ్వలించినప్పుడు ఏ స్వల్పకారణమైనను, ఆ యగ్నిని మరింత రగు ల్గొల్పును. అకస్మాత్తుగ నొక శిక్కు నెవరో బాకుతో బొడిచి చంపిరి ఆ వార్త నలుదెసల ప్రాకుటతోడనే శిక్కులలో రోషానలము మిన్ను ముట్టెను అదివరకు గవర్నమెంటుకు దెలియ పరచకుండ తామా మసీదును బడగొట్టమని శిక్కులు హామీ యిచ్చియుండిరి. గురుద్వార కమిటీవారు 8వ తేది సభలోగాని ఏ నిర్ణయము

నకు రాజాలమని ప్రకటించిరి. కాని అయిదవ తేదీనుండియు శిక్కులు గురుద్వారములోను, బయట మహమ్మదీయులును గుంపులు గుంపులుగ గుమికూడుచుండిరి. గత శుక్రవారము మహమ్మదీయులు నమాజు చేసికొనిన పిమ్మట సుమారు మూడు వేలమంది గురుద్వారమునకు ఊరేగుచు బోయిరి. గురుద్వారము లోపల సుమారు వెయ్యిమంది శిక్కు పురుషులును, రెండువందల మంది శిక్కుస్త్రీలును, కృపాణములను ధరించి,గురుద్వార రక్షణార్థము నిలపబడిరి. ఇంతలోపల పోలీసు రాకుండ నుండినయెడల, ఎట్టి ఘోర రక్తపాతము జరిగెడిదో యూహించుట కష్టము. కాని జిల్లామ్యాజిస్ట్రేటు పోలీసు దండుతో నా స్థలమునకు దుమికి, ఆ గుంపులను చెల్లాచెదరు చేసెను ఆ అయిదవ తేదీనాటి నుండియు పట్టణమంతయు ఉడికి పోవుచున్నట్లుండెను. ఆరు జిల్లాలలోని రిజర్వు పోలీసును దెచ్చి, గురుద్వారము చుట్టును గాపలా పెట్టిరి. తెల్ల పటాలములు దాపుననే ఉంచబడెను. అర్మర్డు కార్లు పట్టణమునందంతట గాపలా కాయుచుండెను. ఏమి చేసినను ప్రజలలో నుద్రేకము చల్లారలేదు. అక్కడక్కడ శిక్కులు, మహమ్మదీయులు విడివిడిగ తలపడుచునే యుండిరి. కొట్లను మూయించుటకు ప్రయత్నములు సాగుచునే యుండెను. గాయములు పడినవారు ఆసుపత్రులకు గొనిపోబడుచుండిరి. కొట్లను పికెట్టు చేసినవారిని అరెస్టు చేయుచుండిరి. బయటనుండి, మహమ్మదీయుల గుంపులుగాని శిక్కుల జతలుగాని పట్టణము ప్రవేశించకుండ మార్గములు బంధించబడెను.

7వ తేదీ రాత్రియంతయు గురుద్వారములో శిక్కులు, సభ చేయుచునే యుండిరి. కాని యువకుల ప్రోద్బలముచే, 8వ తేదీ తెల్లవారకట్ట రెండు గంటలకు ఆ మసీదును బడగొట్టుటకు తీర్మానించుకొనిరి. ఆ తీర్మానమును వెంటనే అమలులో బెట్టెదరని ఎవరును అనుకొనలేదు. తీర్మానము అయిన వెంటనే ఆ చిరుచీకట్లలోనే మసీదును బడకొట్టుట కారంభించిరి. ఈ వార్త విద్యుల్లతవలె ఊరంతయు బ్రాకిపోయినది. పోలీసువారు లాటీ ప్రయోగించుచున్నను మహమ్మదీయులు గుంపులు గుంపులుగా మూగి గురుద్వారము చు

ముట్టడించిరి పోలీసువారు కొంతబలము నుపయోగించినగాని ఆ గుంపులు వెను కకు మరలలేదు కొత్వాలులో మహమ్మదీయులు సభచేసి, రోషానలమును వెళ్ళగక్కిరి. అల్లాహో అక్బరు ధ్వానములు చెలరేగెను. జనము మతావేశముతో నుద్రేకులైరి "మనకు ప్రాణముకంటె సన్నిహితమైన, ప్రియమైన మసీదును శిక్కులు నాశనము చేసిరి. అమృతసరములోని శిక్కు దేవాలయమును నాశనము చేసినయెడల శిక్కులకు గలుగు కలవరముకంటె, ఇప్పుడు మహమ్మదీయుల కెక్కువ కలవరము కలుగుచున్న"దని మౌలానా జఫరాలీఖాన్‌గారు జనమును హెచ్చరించుచుండిరి పోలీసు లాటీని బ్రయోగించినగాని ఆ జన మచ్చటనుండి వెడలలేదు. ఆ యుదయముననే, అక్బరుద్వారము యొద్ద నొక్క కాన్‌స్టెబిలు చాకుతో పొడవబడెను. ఆ పొడిచిన మహమ్మదీయుడు వెంటనే అరెస్టు చేయ బడెను. ఇద్దరు హిందువులు క్షతగాత్రులైరి. ఎవరైన ఇండ్లకు నిప్పు ముట్టించు చున్నట్లుగాని, హత్యలను చేయుటకు బ్రయత్నించుచున్నట్లుగాని, అనుమాన మున్నయెడల వారిపై తుపాకులను బ్రేల్చుటకు పోలీసు కధికార మీయబడినది. ఇట్టి ప్రచండ శాసనముచే, లాహోరులో గొంతవరకు శాంతి భద్రతలు గాపాడబడుచున్నవి పత్రికలు కూడ నీ మతోద్రేకము రెచ్చకొట్టకుండ, శాంతిభద్రతలకు దోడ్పడుచున్నట్లు గవర్నమెంటు వారే ప్రకటించిరి. ఈ సందర్భములో ప్రజలును, ప్రభుత్వమును అన్యోన్యము తోడ్పడినగాని, ఈ యుపద్రవము తొలగనేరదు. ఈ తగాయిదా స్థానికమైనను, ఇందలి సారాంశము మాత్రము దేశమున కంతకు సంబంధించినది. శిక్కులు ఆ మసీదును బడగొట్టు టలో గొంత తొందరపాటును జూపిన మాట నిశ్చయము. కాని శిక్కులు తమ లీగలు హక్కులను స్థిరపరచుకొనుటకు సర్వ స్వాతంత్ర్యము గలదు. ఆ స్వాతంత్ర్యమును గాపాడుట గవర్నమెంటువారి ప్రధాన బాధ్యతలలో ఒకటి. లేని యెడల, ఈదేశములో మత స్వాతంత్ర్య మనునదియె యుండదు. లీగలుహక్కు లనునవి కూడ వట్టి బూటకము లగును మతావేశము పేరట లీగలు హక్కులను బలిపరుప జూచుట కేవల మక్రమమని చెప్ప సాహసించుచున్నాము. మహమ్మ దీయులు తమకెట్టి హక్కులు కలవో మతాంతరులకు గూడ నట్టి హక్కులు

కలవని ఎంత త్వరగ గమనించిన, దేశమునకేకాక, వారికి గూడ నంత శ్రేయస్కరము. దురహంకారములను, వైరములను జంపవలసిన మతము వానిని బెంచుచుండుటవలన, మతమునకు తీరని కళంకము వాటిల్లుచున్నది.

ఇంతకును ఆ మసీదునుగూర్చి మహమ్మదీయులింత పట్టుదల చూపుటకు కారణ మేమియో తెలియకున్నది. ఆ మసీదు వాడుకలో నున్నదా, కాదు. అది పాడుపడిన మందిరము చరిత్రప్రసిద్ధ మైనదా కాదు. ఏ చరిత్రపురుషునకును సంబంధించి యుండలేదు. దాని హక్కులా, కోర్టులలో శిక్కులవని స్థిరపడినవి. ఇట్టి సందర్భములలో నా మసీదును బడగొట్టినంత మాత్రమున మహమ్మదీయ మతగౌరవమున కెట్టి భంగమును వాటిల్లదు. మహమ్మదీయ ప్రజలకును ఎట్టి నష్టమును గలుగదు. పూర్వకాలమున హిందూ దేవాలయము లెన్నియో, మసీదులుగ జేయబడినవి. వానిని తిరిగి హిందువుల కిచ్చివేయుటకు మహమ్మదీయు లంగీకరించెదరా? 175 ఏండ్లనుండియు శిక్కుల భుక్తములో నున్న ఆ మందిరము మహమ్మదీయు లాశించుటయు నట్టిదే యగును. ఈ విషయమును ఉభయ సంఘములును గలసి, గవర్నమెంటువారి మధ్యవర్తిత్వముననో, లేక ఏ పంచాయతీ మూలముననో శాంతముగ బరిష్కరించుకొన దగునుగాని, మతోద్రేకమును బెంచుకొని, ప్రాణవిత్తములకు భంగమును గల్పించుట మాత్రము విచారకరము. ఇదివరకే, హిందూదేశము మతకలహములకు ఆకరమైనదను అపవాదము ప్రబలి యున్నది. ఇప్పుడీ తగాయిదా మూలమున నీ యపవాదము మరింత బలపడును. శిక్కులు కూడ దేశభక్తులు. కేవల కక్షకొరకు వారు మూర్ఖత్వముతో బ్రవర్తించుట యుక్తము గాదు. శిక్కులును, మహమ్మదీయులును సోదరభావముతో మెలంగినగాని, పంజాబునకు శాంతిభద్రతలు చేకూరవు. జలియనువాలాబాగులో నుభయుల వీరరక్తమును గలసి ప్రవహించినది. ఆ రక్తముతో బునీతమైన కలయిక చిరస్థాయియై యుండునని ఆశించితిమి. ఇప్పటికైనను విషమించిన దేమియు లేదు. లాహోరులో శాంతిభద్రతలు మిలిటరీవారి సహాయముతో నపేక్షించ వలసివచ్చుట దేశీయుల కెంతయు లజ్జాకరమని భావించి, సఖ్యమును, సామరస్యమును ఒనగూర్చుకొనెదరు గాక!

కృష్ణా పత్రిక
జులై 13 వ తేదీ, 1935 సం॥

# వర్ణ ద్వేషము

ప్రపంచమునం దిప్పుడు, రాకపోకల సౌకర్యము లెక్కువగ నభివృద్ధి చెంది, ద్వీప ద్వీపాంతరముల మధ్య వర్తక వ్యాపారములతో బాటు, అన్యోన్య సభ్యతా పరిచయము, వైజ్ఞానికాదాన ప్రదానము, సాంఘిక సంపర్కము సర. విధముల ప్రబలుచున్నను, జాతిద్వేషము మాత్రము అంతరించక పోవుట ఆశ్చర్యము, నేడెక్కడ జూచినను నానారాజ్య సభలు, ఇంటర్నేషనల్ లేబరు కాన్ఫరెన్సుల్వు వరల్డ్సు రేసెసు కాంగ్రెసులు, రెలిజియసు పార్లమెంటులు, వరల్డు ఎక్జిబిషన్లు చెల రేగుచున్న ఇక్కాలమున, ఇంకను నలుపు తెలుపు రంగులనుబట్టి ద్వేషము రగులు చుండుట లజ్జాకరముకాక మరేమి? వర్తమాన కాలమున అర్థపురుషుడే యెక్కువగ లోకము నంతను శాసించుచుండుటచే రాజ్యరాజ్యముల మధ్య ఆర్థికస్పర్థలు ప్రబలుటలో నాశ్చర్యము లేదు. ఇప్పుడు కొన్ని దేశములలో నీ జాతిద్వేషమును బురికొల్పుచున్నది ఆర్థికస్పర్థయేయని కొంచెము పరిశీలించిన తెలియగలదు. ముఖ్యముగ బ్రిటిషు కాలనీలలో భారతీయుల యెడల జూపబడుచున్న న్యూనతకు ఇదియే ప్రధాన కారణము. నల్ల కూలీలు తెల్ల కూలీలకు పోటీపడుచున్నారను గారణమున, నల్లవారి కా వలసదేశములలో గొన్ని యాటంకములు గల్పించ బడుచున్నవి కాని నల్లరంగుపై వారికి నిరసనభావము లేకపోలేదు. అయినను ఆర్థిక కారణము గూడ దానికి దోడగుటచే, దాని నొక నెపముగ జేసికొనుట కాధార మగుచున్నది. అదియుగాక, వలస దేశములలోని తెల్లవారొక విధముగ సంకరజాతి వారేకాని, విశుద్ధమైన తెల్లజాతివారు కాదు. ఈ కాలనీలకు నానా దేశముల నుండియు వలస వచ్చుచుందురు. వారొక్క జాతివారు కాదు, ఒక్క గోత్రమువారు కాదు. ఒక సంప్రదాయమువారు కాదు. ముఖ్యముగ దక్షిణా ఫ్రికాలోని బోయర్లు రంగులో భారతీయుల కంటె నెక్కువ వన్నె కలవారు కాదు. వారిలో జాల కల్తీ కలిసినట్లు వారి నల్లరంగు చెప్పకయే చెప్పుచుండును. అయినను వారిలో నేదో మూల శ్వేతజాతీయుల రక్తబిందువులు సంక్రమించి యుండుటచే,

తాము భారతీయులకంటె నధికుల మను అహంకారము ప్రబలుచున్నది. అమెరికాలో గూడ నీ వర్ణద్వేషము విపరీతముగ నున్నదని. అచ్చటి నీగ్రోల యెడల జూపబడుచుండు లించింగుల వంటి అపచారములే ప్రబల నిదర్శనములు. ప్రపంచమంతయు నొక్క క్రైస్తవమతము నవలంబించిన యెడల. మానవైక్యము సులభ సాధ్యమగునని మిషనరీలు సామాన్యముగ బోధింపుచుందురు. కాని. యునైటెడు స్టేట్సులో నీగ్రోజాతివారు క్రైస్తవులు. తెల్లవారిలో కంటె కూడ వీరిలో క్రైస్తవ భక్తి ప్రపత్తు లెక్కువ యని వారి భజన సాధనలను బరికించిన వారికి దెలియని విషయము గాదు. వారి ఆచార వ్యవహారము లన్నియు తెల్లవారి సంప్రదాయానుగుణ్యముగ మారిపోయినవి. అయినను వారు తెల్లవారి చర్చిలకు రాకూడదు. తెల్లవారి పాఠశాలలలో వారి పిల్లలకు ప్రవేశము లేదు. తెల్లవారి హోటల్సుపై వారి ఛాయ పడరాదు. వారెక్కు ట్రాములు వారు నడుచు వీథులు వేరు. వారితో వివాహములు నిషిద్ధములు. దీని కంతకును గారణము వారి నలుపు రంగు. నీగ్రోలు మతమును మార్చుకొన గలిగిరి. భాషా వేషములను ఆహార విహారములను ఆచార ప్రచారములను మార్చుకొన గలిగిరి. కాని దేవుడిచ్చిన నల్ల రంగును మాత్రము మార్చుకొనలేక పోయిరి. దానికి ఫలితముగ వారు తెల్లవారి ద్వేషమునకు బాత్రులు కావలసి వచుచున్నది.

కాని ఇంగ్లాండువారి సంప్రదాయము మాత్ర మిందుకు భిన్నమని ఇంత కాలము తలంచుచుంటిమి. వారి కాలనీలలో సాంకర్య దోష ముండుటచే, విశుద్ధమైన బ్రిటిషు సంప్రదాయము అచ్చట ప్రవర్తిల్లక పోవచ్చును. అమెరికాలో నీగ్రోలు గొంతకాలము బానిసలై యుండుటచేత, ఆ పూర్వకర్మయొక్క వాసన యింకను వారి జాతీయ స్మృతియందు అంకితమై యుండి జాతిద్వేష రూపమున వ్యక్త మగుచుండ వచ్చును. ఇండియావంటి పరాధీన దేశములలో ప్రభువుల దర్జాను నిలువబెట్టుకొన వలసిన అవసర ముండుటచే రాజనీతికొరకు దేశీయులకు గొంత న్యూనత చూపబడుటలో విశేషము లేకపోవచ్చును. కాని ఇంగ్లాండులో, పార్లమెంటులకు మాతృభూమియైన బ్రిటనులో, ఉదార సంప్రదాయములకు బ్రసిద్ధి కెక్కిన బ్రిటిషు ద్వీపములలో నల్లవారి నింకను ఈసడించుచున్నారని వినుటకు వింత

కలుగుచున్నది. ఇండియాలో జాతిభేదమును బాటించు చట్టములు చేయకూడదను నిబంధన ఇండియాబిల్లులో నొక మూల చేర్చబడుచుండ బ్రిటిషు ప్రభువుల దేశమునందే నల్లవారిని నిషేధించు వ్యవస్థలు కలవని తెలుసుకొనినప్పు డాశ్చర్యము విచారము కలుగక మానదు. ఇట్టిజాతిభేదము గమనింపబడుచున్నట్టిటీ వల కొన్ని నిదర్శనములు వెల్లడియైనవి. రెండు వారముల క్రిందట రాయిటరు సంజయుడే ఒక దుఃఖకరమైన వార్తను బ్రకటించినాడు. లండను యూనివర్సిటీ లో శిక్షణము గరచుచున్న ఇద్దరు విద్యార్థులు లండను బయటనున్న ఒక కొలనులో ఈదుటకు బోయినప్పుడు వారు నల్లవారను గారణమున ఆటంక పరుప బడినట్లు రాయిటరు ప్రకటించినాడు. ఆ విద్యార్థులలో నొకరగు మహమ్మదాలీ గారీ వృత్తాంతము నిట్లు వర్ణించుచున్నాడు:-

"నే నింగ్లాండులో రెండున్నర సంవత్సరముల నుండి నివసించు చున్నాను. లండను చుట్టునున్న కొలనులలో నేనెన్నియో పర్యాయములు స్నానము చేసియుంటిని అప్పుడప్పుడు నా సోదర విద్యార్థి అహమ్మదు కూడ నావెంట నుండెడివాడు కాని మేమెప్పుడును గత శనివారమునాడు పొందిన పరిభవమును బొంది యెరుగము. మేమా సాయంకాలము లండనుకు దక్షిణముగ నున్న "లెగూను స్విమ్మింగు పూల్"కు వెళ్ళియుంటిమి. దానికి ఆవరణ కలదు. ఆ యావరణలో టెన్నిసు కోర్టులు మొదలగు ఆటపాటలకు దగు ఏర్పాట్లు కలవు రైల్వే కంపెనీ వారు అచ్చటికి బోవుటకేకాక, అచ్చటి కొలనులో స్నానము చేయుటకుగూడ గలిపి టిక్కెట్లిచ్చెదరు మేమట్టి కంబైన్డు టికెట్టును గొని అచ్చటకు బోతిమి. కాని అచ్చటి కాపలాదారులు మమ్ములను 'లోపలకు బ్రవేశము లేదు.' అని ఆటంక పరచిరి. మేము కారణమేమి యని ప్రశ్నించితిమి. 'మీరువిదేశీయులు' అని జవాబు చెప్పిరి. 'మేము ఇండియా నుండి వచ్చిన' బ్రిటిషు సబ్జెక్ట్సుము అని ఎంత చెప్పినను వారు వినలేదు. అంతట లండనుకు వచ్చి, ఆ కొలనుకు మ్యానేజరు

అయిన లిగ్గో గారిని సంజాయిషీ అడుగగా వారిట్లు సమాధానము చెప్పిరి – 'నేను మిగుల విచారపడుచున్నాను కాని సర్వ సామాన్యముగ మేము నల్లవారిని (రంగుగల వారిని) ఆ కొలనులో నీదనీయము ఏ జాతివారిని అగౌరవ పరచ వలెననెడి యుద్దేశము మాకు లేదు కాని మేము సామాన్యముగ ఈ కొలనుకు సంబంధించేగాక, ఇతర లండను కొలనుల విషయములో గూడ ఈ రూలును బాటించుచున్నాము.' మేము పిమ్మట సెక్రటరీ ఆఫ్ స్టేటు గారికి భారతీయులకు గలిగిన అవమానమును గూర్చి నివేదించుకొన్నాము.''

ఇండియామంత్రి గారీ విషయములో జోక్యము గల్పించుకొనగలరని మేము తలచము. వారును విచారమును దెలిపి మిన్నకుందురు ఈ యొక్క నిదర్శనమే కాదు. జాతిద్వేష సూచకములైన నిదర్శనము లింకను ఎన్నియో కలవని హేమేంద్ర ప్రసాద ఘోషుగారు వ్రాయుచున్నారు వర్ణభేదమును బాటించుట దక్షిణాఫ్రికాలో బరిపాటియైనట్లు బ్రిటిషు సామ్రాజ్యములో మరెచ్చటను లేదు. 1934లో దక్షిణాఫ్రికా యందు పోస్టాఫీసులను నల్లవారికని తెల్లవారికని రెండు భాగములుగ జీల్చినప్పుడు, ఒక్క భారతీయుడా యక్రమ విభాగమును గూర్చి లాకోర్టు కెక్కినాడు అప్పుడు జస్టిసు రేయర్సుగారీ విభేదమును గూర్చి యిట్లు తీర్పు చెప్పిరీ:– ''లా'' దృష్టికి అందరు సమానులే యను వాదమును నిశ్శేషముగ నంగీకరించుటకు వీలు లేదు. ఆఫ్రికను యూనియనులో తెలుపు నలుపు అను భేదము సాంఘిక జీవనమునం దంతట మూలసూత్రముగ వ్యాపించి యున్నది. ఆసుపత్రులలో, శ్మశానములో, స్నానపు రేవులలో, క్రీడా రంగము లలో, ట్రాంకారులలో, సర్వత్ర ఈ భేదము గమనింప బడుచున్నప్పుడు, పోస్టా ఫీసులలో గూడ నీ విభాగము చేయుట దోషము గాదు.

ఇట్టి తీర్పును మార్పించుటకు బ్రిటిషు ప్రభుత్వమువా రేమియు జేయలేక పోయిరి. పైగ వారి దేశమునందే యీ వ్యత్యాసము ప్రత్యక్షమగుచున్నప్పుడు, తమ కాలనీలలోని అపచారములను రూపుమాపుటకు వారికెట్టి ధర్మబలము చేకూర గలదు? ఒక ఆంగ్లేయ విలేఖకుడే యిందుకొక నిదర్శన మిచ్చుచున్నాడు

లండనులో ఒక స్విస్సు హోటలు కలదు. అందు భారత విద్యార్థులు సుమారిరువది మంది నివసించుచుండిరి. వీరిలో ముగ్గురు భారత నారీమణులు. హోటలు భవనమును మరమ్మత్తు చేయవలసి యుండునను నెపముతో నా విద్యార్థుల నందరిని గదులను ఖాళీ చేసి వెడలి పొమ్మనిరి. వీరితో బాటు ఒక చీనా విద్యార్థి కూడ వెడలవలసి వచ్చెను. భారత విద్యార్థులను గనిపెట్టుకొని యుండుటకు ఇండియా గవర్నమెంటువారు నియమించిన సర్. బి ఎన్. మిత్రుగారు పరిశీలన చేయగా ఆ హోటలులో నల్లవారిని జేర్చుకొన కూడదను నియమమును జేసికొనినట్లు తెలిసినది ఇట్టి నిదర్శనము లింకను ఎన్నియో కలవు. కారకాగారు వర్ణభేదమును గూర్చి ఒక మారిట్లు వ్రాసిరి.-

ప్రకృతిలో వర్ణ వైచిత్ర్యము ఆనందదాయకము. కాని మానవులలో నది పరిభవముల కెల్ల మూలకారణ మగుచున్నది. వర్ణద్వేషము వంటి దుస్సహమైన చిత్తవికారము మరియొకటి లేదు ఈ ద్వేషమును జూపించువాని బుద్ధి వక్రమగుటయే కాక, ఈ ద్వేషమునకు గురియగు మానవుని శీలమును గూడ నాశనము చేయును. వర్ణద్వేష మీ లోకమును నరకకూపముగ మార్చివేయుచున్నది. ప్రపంచమం దంతట కోట్లకొలది నల్లవారున్నచోటెల్ల ఈ ద్వేషము ప్రబలుచున్నది. దీని కంతకును గారణము శ్వేతజాతీయుల యాధిపత్యము. వారికి నల్లవారిని ఎక్స్ప్లాయిటు చేయవలె ననెడి దురాకాంక్ష యున్నంత కాలము ఈ వర్ణద్వేష మంతరించజాలదు."

ఈ దురాకాంక్షయే నేడు ఇటలీని అబీసీనియాపై దుముకుటకు బురికొల్పుచున్నది. అబీసీనియా రాజు ఇటలీకేదో యపచారము చేసెనను విషయమును గూర్చి కంటె, 'ఆ దేశపు నల్లవారు అనాగరకులు, బార్బేరియనులు, వారెన్నటికిని తెల్లవారితో సమానులు కాజాలరు, వారికి నానారాజ్య సభలో స్థానముండ తగదు,' అను ద్వేషపూరితములైన మాటలే, ముస్సొలినీ సర్వాధికారి నోటనుండి వెలువడుచున్నవి. నల్లవారి దేశములపై తెల్లజాతులవారికి సహజమైన హక్కు కలదను

భావము శ్వేతజాతుల యందెల్లెడల వ్యాపించి యున్నది ఈ మస్సొలీనీ వాక్యములు నల్లజాతులలో నెట్టి రోషానలమును ప్రజ్వలింప జేయుచున్నదియు తెల్లవారు గ్రహించుట లేదు పైగ, స్వీడెను, డెన్మార్కు, హాలెండు మొదలగు దేశములవారు అబ్సీనియాకు ఆయుధములను బంపకూడదని కూడ తీర్మానించుకొనిరి తెల్లజాతులు ఇటలీపై నట్టి యభిమానమును జూపుచున్నప్పుడు, నల్లవారిలో అబ్సీనియాపై సానుభూతి కలుగుట సహజము కాదా! అప్పుడే ఆఫ్రికను జాతులలో నట్టి కలవరము బయలుదేరుచున్నట్లు వార్తలు ప్రకటించబడుచున్నవి. ఈజిప్టు ప్రభుత్వమువారు ఇటలీ కెపరును ఒంటెల నమ్మరాదని నిషేధించిరి. దక్షిణాఫ్రికాలో కాఫిర్లు మస్సొలీనీ విగ్రహమును తగులబెట్టిరి ఆఫ్రికను లందరు నొక జాతివారు కాదు. వారు మాట్లాడునది ఒక భాష కాదు మతభేదములు, ఆచార వ్యత్యాసములు ఎన్నియో కలవు అయినను నల్ల జాతీయాభిమాన మనునది ఒకటి తెల్లవారికి ప్రతీకారముగ బయలుదేరుచున్నది. ముందుముందీ రోషానలము ఎట్టి దారుణరూపము దాల్చునో తెలియదు ఫ్రాంకు క్రాసువెయితు అను ఒక అమెరికను నీగ్రో నాయకుడీ వర్ణద్వేషమును బురస్కరించుకొని ఇట్లు గర్జించినాడు:- "In a world of wolves, the Negro movement must develop claws of its own'' ఈ రోషము సర్వత్ర వ్యాపించుచున్నది. ట్యూనిసులోని నల్లజాతులు తిరుగుబాటు చేయుదురేమో యను భీతితో ఫ్రెంచి గవర్నమెంటువా రచ్చట జాగ్రత్త పడుచున్నట్లు ప్రకటించబడినది. జపానువారు కూడ అబ్సీనియా యెడల సానుభూతిని జూపుటయే కాక, అభిమాన పురస్సరముగ ఆయుధములను సప్లయి చేయుచున్నట్లు తెలియుచున్నది. ఇటలీ నేడు తలపెట్టిన అపచారమున కిది యంతయు ప్రతిఫలము. అబ్సీనియా యింతకును మహమ్మదీయ దేశము గాదు. అబ్సీనియను రాజు క్రైస్తవుడు. జనులలో సగముమంది క్రైస్తవులైపోయిరి. అయినను ఈ వర్ణద్వేషము మతాభిమానమునుగూడ మ్రింగివేసి, లోకమును దగ్ధపటలము చేయ జూచుచున్నది. తెల్లజాతులందరిలోను ఈ జాతిద్వేషము తక్కువగ నున్నది బ్రిటిషువారిలోనే అని అంగీకరించక తప్పదు. ఇంగ్లాండులో నచ్చటచ్చట మొలకలెత్తుచున్న ద్వేష బీజములను

బెరికివేసి, వర్ణద్వేష రహితమైన విశుద్ధ మానవతత్వమును వెల్లడి చేయవలసిన బాధ్యత బ్రిటిషువారిపై గలదు. బ్రిటిషు సామ్రాజ్యము ఒక తెల్లవారిదే కాదు. నల్లజాతివారు కూడ నందు భాగస్వాములు. బ్రిటిషు సామ్రాజ్యములో నున్నంత మంది నల్లవారే యితర రాజ్యమునందును లేరు. కావుననే ఈశ్వర విధానములో నీవిషయమున ముందంగ వేయవలసిన బాధ్యత బ్రిటిషు జాతివారిపై బడినది. లోకము నుద్ధరించ గలిగినది రాజ్యాంగ తంత్రములు కావు, పారిశ్రామికోద్యమములు కావు. మత ప్రచారములును గావు విశ్వమానవ సౌభ్రాతృత్వ మొక్కటే తరణోపాయము

కృష్ణా పత్రిక
అగష్టు 3వ తేది, 1935 సం॥

# హిందూ ధర్మముపై తిరుగుబాటు

మహారాష్ట్ర హరిజన నాయకుడగు డాక్టరు అంబెడ్కారు హిందూ సంఘముపై నొక పెద్ద బాంబు విసరినాడు. హిందూ సంఘాభిమాను లెల్లరు దీని అదురుడుకు భీతిల్లక తప్పదు. హరిజనులను అంత్యజులనుగను, అస్పృశ్యులనుగను జూచుచున్నంత కాలము, హరిజనులకు హిందూ సంఘములో నెట్టి స్థానము లేదను నమ్మకము గాఢముగ నాటుకొనుటచేత, డాక్టరు అంబెడ్కారుగా రీ తిరుగుబాటు నుపక్రమించి రనుటకు సందియము లేదు. ఏ సంఘము తమను సర్వవిధముల మతాచారములలో, సాంఘిక మర్యాదలలో, ఆర్థిక వ్యవస్థలలో, గడు హీనముగను, క్రూరముగను జూచుచున్నదో ఆ సంఘముపై వారి కభిమాన ముండుట యసంభవము. హరిజనులలో ప్రబోధము కలుగునంతవరకు, వారి నైచ్యస్థితి వారికి గోచరించ లేదు. దాస్యము వారికి సహజ ధర్మముగనే గన్పట్టినది తమ నణచియుంచిన పై వర్ణముల యెడల భయభక్తులు కలిగి యుండెడివారు. కాని యీ తామసిక స్థితి చిరకాలము నిలుచునది కాదు మానవకోటి యంతయు గదలి పోవుచున్న రోజులివి. భూగర్భము నందే మహావేదన బయలుదేరినది. అజ్ఞాత భూతములు వెలుతురులోనికి వచ్చుచున్నవి. ఏ దేశముగాని, ఏ జాతిగాని, మరియొక దేశమునకు, మరియొక జాతికి దోసిలొగ్గి, సంతృప్తిపడు కాల మంతరించినది. ఇంత కాలము మట్టిలో దాగియున్న ప్రాణులు, పాటకపు జనము, భూమిని పెకలించుకొని బయటపడి, సోదర మానవులుగ బరిగణింప బడుటకు రణదుందుభిని మ్రోగించుచున్నారు. స్వాతంత్ర్యము. సౌందర్యము, సామ్యము, అను భావములు నవశక్తి భరితములై మహా సేనానుల వలె, దశదిశలు పిక్కటిల్లునటుల శంఖమును బూరించుచున్నవి. ఈ సామ్య సమరముముందు ఏ ప్రాచీనాచారమును, ఏ మతవ్యవస్థయు, ఏ సాంఘిక పద్ధతియు, ఏ యార్థిక నియమమును నిలువజాలవు. ఇది అమోఘమైన వర్తమాన యుగధర్మ మని దైవజ్ఞులు, మత ప్రవర్తకులు,

సామాజిక నియన్తలు, రాజ్యాంగ నిర్ణేతలు ఎంత త్వరగ గ్రహించిన, లోకమున కంత మేలు దీనిని మనోగతము చేసికొనుటకు వెనుకాడెదరా, లోకమున భూకంపముల కంటె, అగ్నిపర్వతోత్పాతముల కంటె, మహాప్రళయముల కంటె, భయంకరములైన విప్లవములు, పరివర్తనములు, సంభవించి తీరును.

గాంధిమహాత్ముడు త్రికాలజ్ఞుడగుటచే, హిందూ సంఘము చిరకాలము నుండియు సుమారు అయిదారు కోట్ల సోదర ప్రాణులను మానవ నామమునకు గూడ అర్హము కాకుండు రీతిని, చెప్పరాని, చూడరాని ముట్టరాని, వారినిగ జేసిన మహాపాతకమును ప్రాయశ్చిత్త పూర్వకముగ తొలగించి, హిందూ సంఘమును సంరక్షించుటకు బద్ధకంకణుడైనాడు అస్పృశ్యతా నివారణముపైననే హిందూ సంఘముయొక్క భవితవ్యము ఆధారపడి యున్నదని కాలమే చెప్పగలదు. తక్కిన సంస్కరణము లొక యెత్తు, ఈ సంస్కరణ మింకొక యెత్తు ఇయ్యది హిందూ సంఘమునకు జెందిన స్త్రీపురుష లెల్లరకు సుమారు ఇరువదియైదు. కోట్ల మహాజనులకు సంబంధించిన విషయము ప్రకృతి యే దోషమునైనను సహించి యూరకొనున; గాని మానవుని పశువుకంటెను హీనముగ జూచు ఏ వ్యవస్థను సహించి యూరుకొనదు ప్రకృతి క్షమాశీల, తొందరపడదు. సంస్కరణమునకు దగు కాలవిలంబనము నిచ్చును. సంఘ ప్రవర్తకుల నెన్నిమారులో మందలించి జూచును కాని ఈ సహనమునకు గూడ నొక మేర కలదు. అది తప్పిన క్షమారూపిణియైన ప్రకృతి క్రోధమూర్తియై సంహారమునకు గడంగును. ప్రకృతియొక్క సంహారము చిత్ర విచిత్రగతుల త్రొక్కును. ఏ సంఘమునుండి యీ విషవృక్షమును సకాలమున బెల్లగించి వేయరో, ఆ సంఘము సర్వవిధముల విషపూరితము అగును. ఏ దుస్థితి ఒక తెగకు దెచ్చిపెట్టునో, అ దుస్థితియే ఆ సంఘమున కంతకు, ఆ దేశమున కంతకు వాటిల్లును. ప్రకృతి ఆ సంఘము నెత్తినణచి, అందుండి బయల్వెడలు ప్రతి స్వాతంత్ర్యోద్యమమును భగ్నపరచును. నేడు భారతదేశమును ప్రపంచములోకెల్ల బరాధీనభూమిగ, దాస్యజాతిగ, గౌరవమున కనర్హముగ, జేసివైచినది. కులవైషమ్యములను, జాతి

వైరములను, సర్వత్ర ప్రేరేపించినది. ఈ దుర్గతి యంతయు అస్పృశ్యతయొక్క పాపఫలితము. గాంధిమహాత్ముడు పది సంవత్సరములు కాంగ్రెసు ఉద్యమమును ప్రచండముగ నడిపి విఫల మనోరథు డైనాడు. ఏ యుత్సాహము బయలుదేరినను, అయ్యది స్థిరముగ నిలువజాలక మరుసటి క్షణమే తాటాకు మంటవలె జల్లారి పోవుచుండెను. అనైక్యము, అవిశ్వాసము, విద్రోహము అన్నివైపుల అంకురించి, స్వాతంత్ర్య సమరమును సాగనీయకుండ అడుగడునను అడ్డుపడుచుండెను స్వరాజ్యోద్యమము భగ్నపరచినది పోలీసు లాటీలు కావు, ప్రభుత్వమువారి ప్రచండ శాసనములు కావు, సత్యాగ్రహము యొక్క లోపమును గాదు హిందూ సంఘముయొక్క సహజ దౌర్బల్యమే ఈ యపజయమునకు గారణము. అస్పృశ్యత యను వేరుపురుగు హిందూ మహావృక్షమును లోలోపలనుండి డొల్ల చేసివైచినది. బయట కీ సంఘము ఎన్ని తుపానులనో యెదుర్కొని, తన స్థావరత్వమును నిలువ ద్రొక్కుకొనిన మహా వటవృక్షము వలె గన్పట్టుచున్నది. కాని లోపలనుండి యీ వేరుపురుగు దారువుయొక్క కండనంతను దినివేయు చుండెనని గ్రహించకపోతిమి తక్కిన సాంఘిక సంస్కరణముల వలెనే, ఈ అస్పృశ్యతా నివారణముకూడ నొక స్వల్పమైన బాహ్యసంస్కరణమని భ్రమపడితిమి. అస్పృశ్యతా నివారణ మనగా, హిందూ సంఘముయొక్క తల్లివేరును తినివేయుచున్న కీటకమును నాశనము చేయుట యని అవగతము చేసికొనలేక పోవుటచే, హిందూసంఘము నుద్ధరించుటకు చేసిన ప్రయత్నము లన్నియు నిరంతరము భగ్నములగుచున్నవి. ఆయువుపట్టులో రోగము ప్రవేశించిన పిమ్మట, తక్కినచోట్ల నెట్టి చికిత్స చేసినను ప్రయోజనము లేదు. ఈ కారణముచేతనే గాంధిమహాత్ముడీ హరిజనోద్యమమును అపూర్వమైన సంస్కరణరాజమని వాక్రుచ్చినాడు. ఈ మహోద్యమము, ఎట్టి పరివర్తనములకు భీతిల్లని సనాతనవాదులను సహితము దద్దరిల్లచేయుటను బట్టియే, దీని ఆధిక్యతయు వ్యాప్తియు తేటతెల్లమగుచున్నది.

అస్పృశ్యత మూలమున హిందూసంఘము నానాటికి ఎట్లు క్షీణించి పోవు చున్నదియు గ్రహింపజాలక, దానిని శృతి సదాచార ప్రమాణములచే బోషింప

జూచుచున్న సనాతనుల వాదమువలన నెట్టి హాని కలుగుచున్నదియు నిప్పుడు అంబెడ్కారుగారి తిరుగుబాటైనను వారికి తేటపరచునుకాక! ఇదివరకే, ఉత్తర హిందూస్థానములో నిమ్నజాతుల వారెందరో మహమ్మదీయ మతమును స్వీకరించు చుండిరి. దక్షిణ దేశమున క్రైస్తవమతము ఎన్ని పల్లెలనో తన పొట్టను పెట్టుకొన్నది. ఈ సందర్భములు సనాతనవాదులను మేల్కొల్ప లేకపోవుట విచారకరము. గాంధిమహాత్ముడీ మందలింపులకు ప్రబుద్ధుడై. అస్పృశ్యతను రూపుమాపుటకు ఇక జాగు చేయవలదని, అందు నిమిత్తము తన ప్రాణమును గూడ నొడ్డినాడు గాంధిమహాత్ముని ఉచ్చాటన మంత్రముతో నీ దురాచార పిశాచము పలాయన మగుటకు త్రోవ పట్టినది. కాని అంబెడ్కారు గారి కింకను విశ్వాసము కుదరలేదు. సనాతనవాదుల ఘోషలే వారి చెవులలో నింకను ప్రతిధ్వనించుటచే గాబోలు హరిజనులు మతాంతరు లగుటతప్ప,గత్యంతరము లేదని ప్రకటించినాడు. ఈమధ్య మళయాళ దేశములలో గొన్ని హరిజన పల్లెలు బౌద్ధధర్మమును స్వీకరించినట్లు ప్రకటించబడినది. అంబెడ్కారుగారికి ఏ మతము శరణ్యము కానున్నదియు ఎవరికిని దెలియదు. క్రైస్తవ మతమందు క్రైస్తవ నీగ్రోల విషాదగాథలు వారు వినియే యుందురు. మహమ్మదీయ మతమనెదరా, ఎట్టి యసహనము, ఆ మతము పెంచుచున్నదియు పంజాబు కథలు చెప్పుచున్నవి. కావలసినది మత సంస్కరణముగాని అన్య మతావలంబనము గాదు. ఈ యస్పృశ్యత ఎంత ప్రాచీనమైనను, దీనిని వెంటనే నిర్మూలన మొనర్ప దగునే కాని, మందగతిని సవరింప జూచుటవలన ప్రయోజనము లేదు. కాలముచేయు సవరణలకు, తీవ్రమైన పురుషప్రయత్నము తోడ్పడవలయును. అది తగినంత తీవ్రముగ లేకపోవుట చేతనే అంబెడ్కారుగారీ మహాప్రస్థానమును ప్రారంభించిరి.

కృష్ణాపత్రిక

అక్టోబరు 19 వ తేదీ, 935 సం॥

# శిలావిగ్రహ ప్రతిష్ఠ

ఈ యాదివారమునాడు రాజమహేంద్రవరమున శ్రీ వీరేశలింగం పంతులుగారి శిలావిగ్రహము ప్రతిష్ఠింప బడుచున్నదని తెలుపుట కెంతయు నానందభరితుల మగుచున్నాము. ఈ విగ్రహమును జెక్కినది సుప్రసిద్ధ శిల్పులగు నాగప్పగారు దీనిని బ్రతిష్ఠించుచున్నది మాడర్నురివ్యూ పత్రికాధిపతులును. జగద్విఖ్యాతులున, అగు రామానంద చటోపాధ్యాయులు ఈ పవిత్ర కార్యమును మనకెక్కువ సన్నిహితులైన న్యాపతి సుబ్బారావు పంతులు, రఘుపతి వేంకటరత్నంనాయడుగార్ల వంటి ఏ యాంధ్రభీష్ముల చేతనైనను జరిపించిన ఎక్కువగ నానందించెడివారము.మర్త్యులకు విగ్రహప్రతిష్ఠ మన ఆర్య సంప్రదాయము గాదు. దేవతాబింబములను తప్ప తక్కిన వానిని నిర్మించ కూడదనియే భారత శిల్ప లక్షణకారులగు శుక్రాచార్యుని మతము. దేవతలు కేవలము చిద్రూపులు. వారి విగ్రహములు భావవ్యంజకము లైన ప్రతీకములు (Symbols) కాని. శారీరక ప్రతిమలు మాత్రము కావు బౌద్ధ, పౌరాణిక కాలములలో అవతార పురుషుల బింబములు నిర్మింప బడుచుండినను, అవి వారి భౌతిక శరీరముల ప్రతిబింబములు కాక, దివ్యలీలా భూములై విలసిల్లుచుండెడివి. ఇటీవల లభించిన భాసుని ప్రతిమా నాటకమును బట్టి పూర్వకాలమున ఊరివెలుపల రుద్రభూములయందు గతించిన రాజుల ప్రతిమలు వారి సమాధులపై బ్రతిష్ఠింప బడుచుండిన ట్లూహించవచ్చును. కాని అవి సమాధుల విశేషమును దెలుపు జ్ఞాపక చిహ్నములే కాని, వారి గౌరవార్థము కొరకు గాని మూర్తిధ్యానము కొరకుగాని నిర్మింపబడునవి కావని వేరుగ జెప్ప నక్కరలేదు. భారతీయులు మహాపురుషుల జ్ఞాపకార్థము వారి పేరిట ప్రజోపయోగకరములగు ఏ తటాకములనో, ఏ వనములనో, ఏ సత్త్రవులనో నిర్మించుట యాఛారముగ వచ్చుచుండెను.

దాక్షుష రూపముల ప్రతికృతులను శాశ్వత మొనర్చి ధ్యేయములనుగ జేసికొనుట కేవలము పాశ్చాత్య సంప్రదాయము పాశ్చాత్య ప్రభావ మీ దేశమున వ్యాపించిన కొలదియు నగర వీథులందు శిలావిగ్రహములు వెలయ నారంభించినవి. ప్రప్రథమమున మన ఆంగ్లప్రభువుల విగ్రహములను నెలకొల్ప మొదలుపెట్టితిమి. అనంతరము మనదేశప్రముఖుల విగ్రహములన గూడ ప్రతిష్ఠింప సాహసించితిమి. శిలావిగ్రహమే ప్రబలమైన స్మారక చిహ్నముగ నెంచుకొనుచున్న రోజులివి. యావజ్జీవితమును దేశమునకు ధారపోసిన మహానుభావులకు ఒక శిలావిగ్రహము నైనను ప్రతిష్ఠించక పోవుట గొప్ప లోపముగ నెంచుచున్నాము. వీరేశలింగం పంతులుగారి వంటి అసమాన కర్మవీరున కిట్టి సార్మక చిహ్నమును వారి, కర్మ క్షేత్రమగు రాజమహేంద్రవరము నందైనను నెలకొల్ప లేకపోవుటకు ఆంధ్రుల సహజ మాంద్యముతప్ప, వేరు కారణము లేదు. పంతులుగారు పరమపదించి పదునారు సంవత్సరము లైనది. ఇంత కాలమున కైనను ఆంధ్రులు మేల్కొని తమ ఋణమును దీర్చుకొనగలుగుట శుభప్రదము. దీనిని బట్టియైనను పంతులుగారి జీవితము ఆంధ్రుల విస్మృతిపథమున నెన్నటికిని బడనేరదను విషయము తేటతెల్ల మగుచున్నది. ఆధునిక ఆంధ్రమండలములో నే యొకరైనను చరిత్రపురుషుడు కలడా యని ఎవరైన ప్రశ్నించిన, ముందుగ పంతులుగారి పేరు నుచ్చరించక తప్పదు. వీరేశలింగముగారి జీవితము విశ్వతోముఖమైనది నే డాంధ్రులను గలవరపరచుచున్న సకలోద్యమములకు ఆయనయే మూలపురుషుడని ఒప్పుకొన వలసియుండును ఆంధ్ర వాఙ్మయమునకు నూతన పరివర్తన దశను సమకూర్చి నది వీరేశలింగం పంతులుగారు. సంఘ దురాచార దుర్గములను నిర్మూలింప సమకట్టిన ప్రథమ యోధాగ్రేసురుడు వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర చరిత్ర పరిశోధనకు అగ్రదూతయై ఆంధ్ర ప్రబోధమునకు దారి చూపినది వీరేశలింగం పంతులుగారు దైవభక్తిని నీతిబోధకముగజేసి, మానవ సేవయందు ఈశ్వర కారుణ్యమును జవిజూపినది వీరేశలింగం పంతులుగారు.

పంతులుగారి పేరు సార్థకనామము. వారి జీవితము వీరరస ప్రధానము. కార్యదీక్ష వానియందు మూర్తీభవించి నూతన తేజస్సుతో వెలుగొందినది,

ఆంధ్రులలో మేధాసంపత్తి కలదు, భక్త్యుత్సాహములు కలవు, ఔదార్య సాహసములు కలవు. కాని పట్టుదల, కర్మపరతంత్రత, చాల స్వల్పము. కడచిన ఏబది అరువది సంవత్సరముల దేశచరిత్ర పరిశీలించి చూచినయెడల, ఆంధ్రులలో కర్మవీరుడను బిరుదమున కర్హుడైన మహనీయుడు వీరేశలింగం పంతులుగారొక్కరే కానవచ్చెదరు వీరి సమకాలములోగాని, ఇటీవల గాని అట్టి నిరంతర కార్యదీక్షాపరుడు మరియొకడు లేడనిన అతిశయోక్తి కాదు. వీరేశలింగం పంతులుగారి కాలములో కంటె నిప్పుడనేక విషయములయందు గ్రొత్త సందర్భము లేర్పడినవి దృక్కోణములు మారినవి వివేచనా పటిమయు గ్రొత్త రూపమున వ్యక్తమగుచున్నది. ఆదర్శములు, సిద్ధాంతములు పరివర్తనము నొందినవి. కాని పట్టుదలలో, కార్య దీక్షలో, త్యాగ సాహసములలో, ఆత్మ గరిమలో వారిని మించినవారు కొదుగదా, వారితో సరిసమానులైనను నేడు గానరారు. వారిది విశ్రాంతి యెరుగని కార్య దీక్ష, మొక్కవోవని ధైర్యము, ఎన్నటికిని వేండ్రము తగ్గని ఉత్సాహము, లాభ నష్టములు గణించని త్యాగము — ఇవి యపూర్వములు.

ఆంధ్రమండలముననే కాదు, భారతవర్షము నందంతటిలోను, ఇట్టి కర్మవీరులు ముప్పురు నలుగురు కంటె నెక్కువమంది లేరని నిస్సంశయముగ జెప్పగలము. కొందరు వీరిని ఆంధ్ర విద్యాసాగరులని వర్ణించెదరు. ఈశ్వరచంద్ర విద్యాసాగరులు భారత ప్రసిద్ధులలో నొకరనుటకు సందియము లేదు. కాని కార్య శూరత్వము నందు విద్యాసాగరులను గూడ పంతులుగారు మించిరని చెప్పుటకు జంకవలసిన పని లేదు. విద్యార్థులకు సహితము లోకువగ నుండు ఒక సామాన్య తెలుగు పండితుడు ముప్పది సంవత్సరములు ఆంధ్రదేశమున కంతకు ప్రచండ శాసనుడై, తన పేరు ఇటు ప్రజలకు అటు అధికారులకు సింహస్వప్నము వలె ప్రకాశించి, చరిత్రప్రసిద్ధిని బడయుటకు గారణ మేమి? పంతులుగారితో సరిసమానముగా వాద ప్రతివాదములను సలుపగల పండితులా? లేక పోలేదు. వారి వలె కవిత్వమును చెప్పగల కవులా? లేకపోలేదు బాల వితంతువుల పరితాపముల నార్ప సమకట్టిన దీనబంధువులా? కలరు. ఆస్తిక మతమును బరిశుద్ధ మొనర్చుటకు బూనిన భక్తులును ఉండిరి. కాని పంతులుగారి యందుండిన "డైనమిక్కు

ఎనర్జీ" అమోఘమైన క్రియాశక్తి ఆంధ్రులలోనే కాదు, ఆధునిక భారతీయులలో అపరూపమై పోయినది. గాంధిమహాత్ము డవతరించిన పిమ్మట, కర్మయోగ మన నేమో తిరిగి ప్రత్యక్షమైనవి. కాని, వీరేశలింగం పంతులుగారే దీనికి మార్గదర్శి యని కొంచెము పరిశీలించిన బోధపడును.

పంతులుగారు రుద్రాంశ సంభూతుడు, ఖడ్గవాది. శత్రుసైన్య నివహములు పెరిగిన కొలదియు,వారి ధైర్యహాహాసములు విజృంభించుచుండెను. కష్టపరంపరలు వాయుసంక్షుభిత మహాసాగరము వలె ఘూర్ణిల్లుచుండిన కొలదియు వారి పట్టుదల కార్యదీక్ష ఇనుమడించుచుండెను అపజయములు,ఆశాభంగములు, వాని పట్టుదలను, సడలింపలేదు. వార్ధక్యము వారి కార్యోత్సాహమును జల్లపరుప లేకపోయెను. వారెప్పుడును ఉచ్చరించువది "ఆక్షను ఆక్షను, ఆక్షను" (Action) అను మంత్రము తప్ప మరియొకటి లేదు. వానిని కర్మిష్ఠి యనినను అనవచ్చును. "ప్యూరిటను"గ భావించినను భావించవచ్చును. కాని వారి కర్మ భక్తియందు ప్రభవించిన దగుటచే నది సేవగ బరిణమించినది వారి నీతి త్యాగసంకలిత మగుటచే, నది అనుష్ఠానముగ ఫలించినది. వీరు కార్లయిలు మహాశయునకు బూర్వమే పుట్టియుండిన యెడల పంతులుగారి నామము వారి "హీరోస్, అండు హీరోవర్షిప్పు"అను గ్రంథములోని కెక్కెడిదని నిస్సంశయముగ జెప్పగలము. పంతులుగారి ఉపాస్యము సర్వశక్తిమానుడును క్రియాస్వరూపుడును అగు అగ్ని దేవుడు. నూతన సృష్టికి బురోగామియైన సంహారక్రీడయే వారి యారాధన. వారి మేల్కొలుపులు ప్రళయ మేఘములవలె గర్జించి ఘోర తమోనిద్రయందు నిమగ్నమై యుండిన దేశమును జాగరిత మొనర్చినవి.వారి యుద్యమములు భూకంపముల వలె మందబుద్ధులను అలసులను సహితము దద్దరిల్ల జేయగల్గెను. వారి నిర్నిద్రమైన సంకల్ప మమోఘము.అయ్యది సాధింపని కార్యము లేదు. అది నివారింపలేని అంతరాయము లేదు. ఈ ప్రళయాగ్నియే పంతులుగారి జీవితము నంతను లోపలను బయటను గూడ విద్యుచ్ఛక్తివలె వ్యాపించి, అసమాన కర్మ వీరునిగ జేసివైచెను.

తమ జీవితమునందలి మాయా మర్మముల నన్నిటిని కల్ల కపటము లేక పంతులుగారే తమ స్వీయచరిత్రయం దుద్ఘాటించిరి. వారిని గూర్చిన ఉదంతములు, ఉపాఖ్యానములు దేశమునం దంతటను వ్యాపించి చిరస్మరణీయము లైనవి. వానిలో నొక యుదంతమును వారి యాత్మగరిమకు నిదర్శనముగ జూపి, ఈ ప్రశంసను విరమించెదము. వీరు రాజమహేంద్రవరమున పబ్లికు చందాలతో పుర మందిరమును నిర్మించుటకు సంకల్పించి, సుమారేడువందల రూపాయల వరకు వసూలు చేసిరి. కాని అందుకు వలసిన ధనమంతయు సమకూరకపోవుటచే, ఆ కార్యము వెంటనే కొనసాగక, చాల కాలయాపనము జరిగెను. అంతట పంతులు గారీ ధనమును పులుసులో వేసికొనిరని దాతలలో గొందరు గుసగుసలాడుకొను చుండినట్లు వారి చెవిని బడుటతోడనే, తాము వసూలు చేసిన ఏడువందల రూపా యలను దాతలకు అణాపైసలతో తిరిగి పంచివేసి, తన స్వంతధనముతో పుర మందిరమును నిర్మించి కృతార్థుడయ్యెను. ఈ యొక్క నిదర్శనము చాలును పంతులుగారి ఆత్మగరిమయు, పట్టుదలయు ఎంత అమోఘము లైనవియు దెలుసు కొనుటకు. రాజమహేంద్రవరమున నెలకొల్పబడుచున్న వారి శిలావిగ్రహము కేవల గౌరవ ప్రదర్శనముగాక, దేవతా ప్రతీకమువలె కర్మయోగ ప్రబోధకమై ఆంధ్రుల జీవితమును నిరంతరము చైతన్యవంతముగ జేయుచుండును గాక !

కృష్ణా పత్రిక
నవంబరు 16 వ తేది, 1935 సం॥

# పేరంటము

కాళ్ళగజ్జెలు, అందియలు గల్లుగల్లున మ్రోయ పరికిణీ అంచులు నేల జీరాడ.ముద్దులొల్కు మోముతో తీయదనాలు వెదజల్లు పాటలతో పరుగుపరుగున వచ్చిన ఈ చిన్నికన్నె యెవరు? తొక్కుపల్కులు తప్పటడుగులు ఇప్పుడిప్పుడే చాలించి, పేరంటానికి బయలుదేరే యీడు వచ్చిన ఈ కన్నె ముత్తైదువ మా బందరు పౌరుల పిలుపుకు సంబరపడి దీవెనల నందుకొన ఏతెంచినది. నవ్యసాహిత్య పరిషత్తుకు బాలారిష్టాలు గడిచి అరేండ్లు నిండినవి. తెలుగునాడు నాలుగు మూలల జనముద్దుగ తిరిగి, ఫలాని పిల్ల కాపద్దా అనిపించుకొని, మాట, మన్నన, నడక, నాగరికత నేర్చుకొని పేరంటమునకు వచ్చిన ఈ పడుచుకు, సాహితీప్రియులు, రసజ్ఞులు, కవిబాంధవులు నిండోలగమున దీర్చియుండ, మా బందరుపౌరులు వేడుకతీర పసుపు, కుంకుమలిచ్చి, కానుకలొసగి, అచిరకాలములో నీ కన్నె పట్టమహిషి యగుగాక యని దీవించెదరు కాక !

బందరు చరిత్రప్రసిద్ధమైన పురాతన పట్టణము. ఒక కాలమున ఆంధ్ర దేశపు వర్తకమున కంతటికి కూడలైన ఓడరేవిది. గోలకొండ నవాబులకిది సుబా. ఇచ్చటి కలంకారి కళాకౌశలము ప్రపంచమందంతట పేరు మ్రోసినది. అనాదిగ నున్న భారతీయ సంస్కృతికి ఇస్లామిక సంస్కారము చిన్నెవన్నెలు పెట్టుటయే కాక, తెలుగు దేశమున కెల్ల మొట్టమొదట అంగ్రీజు కాలేజి యిక్కడనే వెలయుటచే ముప్పిరైన ఒక నవ్య సంస్కారము ఇచ్చట ప్రారంభమైనది. కాని పాశ్చాత్య సంస్కార వ్యామోహము పైచేయి కాకుండ, ధారావాహికముగ వచ్చుచుండిన భారతీయ సంస్కార స్రవంతిని రక్షించుకొను జాగరూకత కూడ నిచటివారికి అప్పుడే కలిగినది. కాని వెంటనే సంతోషించు అల్పసంతుష్టి లేదిక్కడ. ఏ విద్య నైనను ఇచ్చట గీటురాతిమీద ఒరిసి పరీక్షించు కఠిన విమర్శకులు మా బందరు పౌరులు. ప్రతిదానికి పెదవి విరచుట వారికి మామూలైపోయినది. భక్తి విశ్వాసాల

కంటె మా పట్టణానికి బుద్ధిపాలెక్కువ. తెలుగు దేశపు రుచుల కన్నిటికి బందరు తనదే మేలుబంతి యని గర్వించుకొనును ఇక్కడ నెగ్గిన ప్రపంచములో నెక్కడను తిరుగుండదు. బందరుముద్రకు అట్టి చలామణి కలదు.

వెనుకటి కాలములో శ్రీనాథకవిదీ బందరు దగ్గరనున్న కల్పటమే కాపురమని చెప్పెదరు. తరువాత ఆంధ్రనాయక శతకము చెప్పిన కాసుల పురుషోత్తముడు ఈ ప్రాంతస్థుడే. దక్షిణాపథ మందంతట పేర్పడిన క్షేత్రయ్య, నారాయణతీర్థులు ఈ గడ్డలో బుట్టి పెరిగిన వారే. పదకవిత్వములో వాసిగన్న వీరరాఘవ కవికి మా దేవరకోట సంస్థానము ఆశ్రయము. భరతవిద్యా పారంగతులైన కూచిపూడి భాగవతు లీ సంస్థానమువారి యాదరణ పోషణల క్రిందనే వర్ధిల్లుచుండిరి. నూజివీటి అప్పరాయఁ నాశ్రయించిన కవిపండితు లంద రీ కృష్ణాతీర్థవాసులు ఇచ్చటి కళాశాలల మూలమున కోరాడవారు, వేదాలవారు, కాశీనాథుని వారు విద్వత్కవులెందరో సంస్కృతాంధ్ర వాఙ్మయములకు పట్టము గట్టిరి. తెలుగు వచననాటకము లాడు నాట్యరంగము లిచ్చట చాల వెలసినవి. నాదెళ్ళ పురుషోత్తమకవివర్యు డిచ్చట కవిత్వాది కళల కు తేజము గల్పించెను. గరికిపర్తి కోటయ్యదేవర గారిచటివారికే కాక తెలుగు వారందరకు గానరసజ్ఞత గల్పించినాడు వాగ్గేయకారకులైన హరినాగభూషణంగారు బందరు సంగీతగౌరవాన్ని నేటికిని దశదిశల వెదజల్లుచున్నారు కీర్తిశేషులైన కోపల్లి హనుమంతరాయలు ఆంధ్రజాతీయ ప్రతిభకు నిదర్శనముగ నొక కళా మందిరమును నిర్మించి చరితార్థులైన పుణ్యక్షేత్ర మిది.

శ్రీ శతావధాని వెంకట శాస్త్రిలవారు పదమూడు సంవత్సరాలు మా అదృష్టమువల్ల ఇచ్చట ఉండుట తటస్థించినది. అవల రాజమహేంద్రవరాన్నుంచి వీరేశలింగం పంతులు విశ్వతోముఖమైన గద్యప్రవాహాన్ని పాడించి ఆంధ్రజాతికి క్రొత్త ప్రాణము పోయుచుండ, వెంకటకవి యిచ్చటనుండి అనర్గళమైన పద్య ప్రవాహమును వెల్లివిరియించిరి. నశించిపోయిన కవిగౌరవాన్ని తిరిగి ప్రతిష్ఠించి పూర్వకవుల గాథలు జ్ఞప్తికి తెచ్చినారు. కవిత్వానికి నిఘంటువులు వల్లించ నక్కరలేదని, సులభము సుపరిచితము అయిన శబ్దజాలము చేతనే భారతాదులలో

వలె ఉదాత్తత చెడకుండ ప్రసన్న గంభీరమైన కావ్యసృష్టి చేయవచ్చునని నిరూపించినారు. శిష్టవ్యవహారమునకు సన్నిహితముగ నుండు భాషనే వారు గ్రహించి స్వభావోక్తి సుందరములు, లోకానుసారులు అయిన కవితామార్గములు చూపించినారు. కేవల పండితులకు ఆటపట్టయిన రాజాస్థానాలను ముట్టడించి కవితాసరస్వతికి రాజులచే పల్లకీ లెత్తించినారు. ఆ మహోత్సవములో పామరులకు కూడ పాలు పంచియిచ్చినారు. తెలుగుదేశము నాలుగుమూలల సంచరించి అపూర్వమైన పద్యపఠనా ధోరణిచేత ప్రజలను సమ్మోహింపజేసి, కవిత్వమనిన చెవులు కోసుకొనేటట్లు జేసినారు. వారి నిరంకుశచర్యలు వారనుభవించిన వైభవము, కవితావృత్తికి గౌరవము కలిగించినవి.

ఇదంతయు బందరుబడాయిని చెప్పుట కొరకు కాదు.నవ్య సాహితీ పోషణ కొరకు బందరులో జరిగిన కృషిని ఒకమారు జ్ఞాపకము చేసుకొనుట అవసరము. ఆంగ్లసాహిత్య పరిచయముచేత యుగధర్మముచేత బయలుదేరిన ఉత్సాహము కవిత్వరూపమున బయలుదేరుటకు కారణమైన ఉద్బోధమే కాక క్రొత్త భావాలను ధారాళముగ చెప్పుకొనుటకు ఉచితమైన భాషనుకూడ వెంకటకవిగారు సమకూర్చిపెట్టిరి. పాత రస్తాలనుండి తప్పించి కవితారథమును కొత్తబాటలను నడపుటకు అవసరమైన సాహసాన్ని ధీరత్వాన్ని వారు ప్రసాదించినారు. నవకవుల గ్రంథాలను చదివి ఆనందించుటకు క్రొత్త రసిక లోకాన్ని గూడ సమకూర్చి పెట్టిరి. ఆ కవికులగురువు సంచారము చేత చవిటిపఱ్ఱల బందరు బృందావనమై పోయినది. నేడిచటికి చేరిన కవికోకిలలను కవిభృంగములను ఈ బృందావనము సాదరముగ సగౌరవముగ సస్నేహముగ స్వాగత మడుగుచున్నది.

సర్వజనసేవ్యయై యిట్లు సులభదర్శన యైన భాషాదేవికి అప్పరాయకవి ముత్యాలసరములు గ్రుచ్చి కానుకలు పెట్టినాడు. హృదయమును జీల్చుకొని వెడలు క్రొత్త పాటలతో మంగళగానము చేసినాడు. ప్రాతబడిపోయిన దేశీయ

కవితలకు తిరిగి గుళ్ళు గోపురములు కట్టినాడు. క్రొత్త క్రొత్త భావములను కండగల తేట తెలుగుమాటలతో పొదవినాడు గ్రంథాల చెరతప్పించి కవిత్వా నికి ఆబాలగోపాలము నోళ్ళే యిల్లుచేసినాడు హృదయాన్ని రంజింపచేసి చమత్కారము కలిగించుటయే ప్రయోజనముగా నుండెడి కవిత్వాన్ని జాతి ప్రబోధానికి, వికాసానికి సాధనము చేసినాడు.

అప్పరాయ కవితోపాటు ఉత్తరాంధ్రమున ఇంకొక మహాశక్తి నవ్య సాహిత్యలతకు అనుకూలవాతమై పుట్టి వీచ నారంభించినది. భాషాదేవి గుడి చుట్టును పండితులు ఎత్తుగా పెట్టిన గోడలు దాని ధాకకు కూల నారంభించినవి. భాషాదేవిగుడి గడియలు వీడిపోయి తలుపులు తెరచికొన్నవి. అంశలు తొలగి పోయినవి వాత్సల్య పూర్ణమగు ఆ తల్లిఅంకమున పామరులకు గూడ చోటు దొరికినది. తన ఉత్తర వయస్సంతయు ధారపోసి యీ మహాకార్యములను సాధించిన భాషాగాంధి రామమూర్తిపంతులు తన కనులయెదుట నవనవలాడుచు క్షణక్షణము ఏపుగ ఎదిగివచ్చుచు కొనలు సాగుచున్న భాషాలతను చూచుచు మురిసిపోవుటను నేడు కనుల పండువుగ చూచుచున్నాము.

ఈ మహామహుల కృషివల్ల కవిత్వానికి రాజాశ్రయముగూడ పోయి ప్రజలే ఏడుగడలైనారు. కవులకింక ప్రజారాధనమే పని. పూర్వకవులు రాజా రాధన చేసిరని మన మనుకొనుటయేకాని నిజానికి వారును ప్రజారాధనమే చేసినారు. ఆ ప్రజ రసికప్రజ. ఆ రసికలోకానికి రాజాస్థానములే ఆకరముగ నుండెడివి. అందువల్ల కవిత్వము చమత్కారకారియై వినోదప్రాయమై ఊరు కున్నది. ఈ దోషము ఆ రాజులకుగాని కవులకుగాని అంటగట్టుటకంటె అది ఆ కాలధర్మమని భావించుట న్యాయమేమో! ప్రజాతంత్రమునకు పట్టము కట్టుచున్న ఈ రోజులలో సాహితీపరులు ప్రజారాధనము చేయుట న్యాయమే గాని అది నెపముగ సాహిత్యసౌధము ఎత్తుతగ్గించి క్రమముగ నేలమట్టము చేయ వలసి వచ్చునేమో ఆలోచించ వలయును. కవులు క్రిందికి దిగుటకంటె ప్రజలను పైకెత్తుటలోనే విశేషమున్నది. కవులు ఏ గాలికి ఆ తెర పట్టరు. ప్రజలకు చేయి

అందిచ్చి వారి హృదయాన్ని సంస్కరించి ఆనంద పర్యాయమైన రసమును సాధించుటయే వారి కర్తవ్యము.

ఆ భారము నేడు సాహితీ ప్రియులమీద బడినది. వారు కథలు చెప్పుదురో, కల్యాణములు చేయుదురో, పాటలు పాడుదురో, నాటకములు రచించెదరో, వారి యిష్టము. ప్రజల హృదయ కవాటములు దెరచుకొని వారికొరకు వేచియున్నవి. వానిని సంస్కరించి సౌందర్యబోధము కల్గించి లోకయాత్రను రసమయముగ చేయుట వారి ధర్మము. సినీమాలు మొదలైన క్రొత్తసాధనాలు అందుబాటులోనికి వచ్చినవి. శృంగార గ్రంథములపై ఆంక్షలు తొలగింపుడని కోరుచున్నాము. నాటకప్రదర్శములకు అభ్యంతరము లుండకూడదని అడుగుచున్నాము. ప్రభుత్వము ఇంకను ఏ కారణముచే ఉపేక్ష చేయుచున్నదో తెలియదుగాని నేడో రేపో ఈ యడ్డంకులు తీరకతప్పదు. కావున మంచికిగాని చెడ్డకుగాని ఎంతైన అవకాశము సిద్ధముగ నున్నది. సర్వవిధములైన దాస్యములలో మునిగియున్న మన జాతికి పరమార్థమును తెలియజెప్పి తరింపజేయగల భారము నవ్య సాహిత్య పరిషత్తుది.

మొదటినుండియు సాహిత్య విషయములో కృషిచేయుచు యువకులు పెద్దలుగా సంచరించుచున్న పూజ్యులు శ్రీ డాక్టరు బుర్రా శేషగిరిరావు పంతులు గారు ఈ సభాకలాపమును నిర్వహించుటకు పూనుకొనుట సంతోషము. భావుకులు, ఉత్సాహశీలురు, మనకెల్ల మాన్యులు అయిన శ్రీ గోపాలరెడ్డిగారు ఈ సభకు మంగళాచరణము చేయుట మన భాగ్యము. వారు అమాత్యులేకాక స్వయంకవులై యుండుటవల్ల సాహిత్యానికి సాచివ్యము జేయగలరు. రాజ్యాంగమును రసవంతము చేయగలరు. ఈ రెండునాళ్ళు ఈ సదస్యమున కేతెంచిన సాహిత్యోపాసకు లెల్లరు కావ్యగోష్ఠిలో, ఆటపాటలలో, సత్కాలక్షేపములలో తెలుగునాటి రుచులను గ్రోలుచు, పేరంటమునకు వచ్చిన ఈ నవ్యసాహిత్య కన్యను సాదరముగ దీవించి పంపెదరుగాక!

కృష్ణా పత్రిక

ఫిబ్రవరి 12వ తేది, 1938 సం॥

# కేశవచంద్రుడు

నానకు, కబీరు, చైతన్యుడు. రామదాసు మొదలగు భక్తవరేణ్యుల శ్రేణిలో జేరిన సాధుసత్తముడీ కేశవచంద్రుడు. అయినను అటు బ్రహ్మసమాజము కాని, ఇటు హిందూ మహాసంఘము గాని వీనిని సరిగ జీర్ణము చేసికొనలేక పోయినది. ఆ కాలముయొక్క విపర్యాస మది.

బ్రహ్మసమాజము హేతువాద నిబద్ధమై పోవుటయు, హిందూ మహా సంఘము నిర్జీవమైన అచలాయతనముగ బరిణమించుటయు, వీనిని నిరాక రించుటకు గల కారణములు కేశవచంద్రుని వంటి భక్తియోగిని,సంస్కర్త్రి గ్రేసరుని ఈ రెండు వ్యవస్థ లెట్లు స్వీకరింప గలవు?

ఆంగ్ల విద్యాధిక మండలి ఆనాడు రెండు ప్రబల సంఘట్టనల మధ్య జిక్కుకొనినది. ఒకటి— హక్సులే, టిన్డల్, స్పెన్సరు, డార్వీను, బ్రాడ్లా వంటి యూరపియను వైజ్ఞానికుల "రేషనలిజము"యొక్క అజ్ఞేయవాదము; రెండు— పాశ్చాత్య క్రైస్తవ మిషనరీల దాడి. ఈ రెంటి సంఘర్షణ నుండి నూతన ధర్మజిజ్ఞాస బ్రహ్మసమాజ రూపమున బయల్వెడలుటచే, నందు ఆ రెంటి యొక్క ఛాయలు— హేతువాదమ, నీతివాదము ప్రబలముగ నాటుకొనినవి.

కేశవచంద్రుడు ప్రప్రథమమున నీ సంఘర్షణమున దగుల్కొని, బ్రాహ్మ సామాజికు డైనను,వాని భక్తితత్వము ఆ సంకుచిత సంప్రదాయమున బంధింపబడి యుండుటకు సమ్మతింపక, దాని కతీతమైన అపూర్వ భక్తిసామ్రాజ్యమును సృష్టించుకొనెను. ఇయ్యది ఆంగ్ల మానసపుత్రుల కగ్రాహ్యమైన విషయము. ఇక వారు వీనిని వెన్నంటి యెట్లుండగలరు?

బ్రహ్మసమాజము వివిధ మతములకు సామాన్యములైన సాధారణ ధర్మ లక్షణములను బురస్కరించుకొని, ఒక సార్వజనీన మతమును బ్రతిపాదింప సమకట్టెను. ఎల్. సి. ఎమ్. పద్ధతివలన వచ్చు "యూనిటీ" దీని లక్ష్యము. కాని ఈ "యూనిటీ" సన్నాయి లేని మూకశ్రుతి వంటిది. ఈ యథావాత్మక మైన, కళావిహీనమైన, హేతువాద నిబద్ధమైన సార్వజనీనత భక్తిరసోన్మాదుడగు కేశవచంద్రుని సంతృప్తిపరుప జాలక పోవుటలో నాశ్చర్యము లేదు.

ప్రతి మతము సత్యాసత్యముల కలయిక యని బ్రహ్మసామాజికుల యభిప్రాయము. కేశవచంద్రుని యభిప్రాయము దీనికి భిన్నము చిరకాలాను గతములై, అసంఖ్యాకులకు తరతరముల శాంతిబలానందముల నొనగూర్ప గలుగుచుండిన మతము లన్నియు సత్యములనియే వాని విశ్వాసము. అంతియ కాదు వివిధ మతముల సాదృశ్యములలో కంటె,వాని విశిష్ట లక్షణములందే ఆయా మతముల జవసత్వములు, సాధన సంపత్తి, దివ్యానుభవములు ఇమిడియున్నట్లు వానికి హృద్గత మైనది. ప్రతి మతములోను గొంత విసర్జించి, కొంత స్వీకరించి, మతైక్యతను గూర్చుట కాదు కేశవచంద్రుడు కోరినది. అనంతమైన అఖండ సత్యము, ఆ యా దేశముల ఆ యా జాతుల ఆ యా కాలముల స్వభావ నియమితములైన ప్రకృతుల కనుగుణముగ భిన్న భిన్న మతములందు ఖండ ఖండములుగ ప్రతిబింబించి, ఆత్మోన్నతి హేతువగుచు, సంపూర్ణత కొరకు విశ్వరంగమున సంగమించుచున్నదను మహాసత్యము కేశవచంద్రుని దివ్య చక్షువునకు గోచరించెను.

ఈ మహా సత్య సాక్షాత్కారమునకే కేశవచంద్రుడు "నవవిధాన" మను నామకరణ మిడి, అందు భిన్న మతముల దివ్యకళల నన్నిటిని వాని సహజ రూపముల వెలుగొందించి, ధారావాహికమైన బ్రహ్మజ్ఞాన మహాస్రవంతి యొక్క గభీరతను, విపులతను, మాధుర్యమును లోకమునకు బ్రదర్శించినాడు. ఒక్కొక్క కాలమున, ఒక్కొక్క జాతికి ఈశ్వర విధానము ఒక్కొక

ప్రవక్తముఖతః ప్రతిధ్వనించినది. ఋషిముఖ వినిస్సృతమైన వేదము, బుద్ధదేవ దత్తమైన త్రిపిటకము, యేసునాధుని నూతన నిబంధన, మహమ్మదు, యొక్క కొరాను, శిక్కు గురువుల ఖాల్సా, చైతన్య మహాప్రభుని రాధాతత్త్వము— ఈ విజ్ఞాన పరంపరలకు అంతెక్కడ? కేశవచంద్రునకు హృద్గతమైనది భిన్న మతముల లోని వట్టి "యూనిటీ" కాదు. ఈశ్వరవిధాన పరంపరల లోని "ప్రొగ్రెసివ్ కన్టిన్యూయిటీ''— వికాసక్రమము.

బ్రహ్మజ్ఞాన మహాస్రవంతి నానాటికి అతిగంభీరమై, విపులమై, ఉత్తుంగ తరంగితమై, అనంతమున లీనమగుటకు బ్రవహించుచున్నది ఇంకను ముందుకు సాగుచునే యున్నది. యుగ యుగాంతరముల నుండి మహాప్రవక్తల ముఖతః ముఖరిత మగుచుండిన దివ్యవాణి నేడు స్తంభించి పోయెనా? ఇక ఈశ్వరుని సర్వవ్యాపకత్వ మెక్కడ? నేడా దివ్యవాణియే క్రొత్త స్వరమున పైస్థాయిలో, విశ్వశ్రుతితో మేళవించి, కేశవచంద్రుని జీవనముఖతః "నవవిధాన'' రూపమున శబ్దాయమాన మగుచున్నది. ఇయ్యది కేశవచంద్రుని ఆత్మగతమైన విశ్వాసము. ఈ విశ్వాసమునే కేశవచంద్రుడు శతముఖముల చాటినాడు.

కేశవచంద్రుని ''నవవిధానము'' ఒక సిద్ధాంతము గాదు. ఒక సంప్రదాయ మంతకంటెను గాదు. సర్వమతముల విశ్వసంగమ ద్వారమున వెల్లడి అయిన ఈశ్వర సంకల్పము— Divine Dispensation. ఈ దివ్య సంకల్పమును లోకమునకు జాటుటకు బ్రత్యేకముగ బంపపడిన సందేశహరుడీ కేశవచంద్రుడు- నూతన ప్రవక్త.

ఈ నవవిధాన ప్రాచుర్యము నిమిత్తము కేశవచంద్రుడు ముందొక గోష్ఠిని బ్రతిష్ఠించినాడు. గోష్ఠియందు శిష్యులను హిందూ, బౌద్ధ, క్రైస్తవ, ఇస్లాము మొదలగు భిన్న మతములను తరచి చూచిన తత్త్వవిదులనుగ నొనర్చి వారిచే ఆయా మతములలో నీ యీశ్వరవిధానము ద్యోతక మగునట్లు క్రొత్త భాష్యములను వ్రాయించినాడు, కేశవచంద్రుడు ఈ గోష్ఠికి అధ్యక్షుడు— వాని

పరిభాషలో నిది దర్బారు తాను దర్బారు సాహేబు ఇయ్యది Parliament of Religions వంటి కాన్ఫరెన్సు కాదు. వివిధ మతముల లోని దివ్యాను భవములను పుంజీభూత మొనర్చి, సాధుసంగ ప్రయోజనము నుద్ఘాటించు బ్రహ్మ విద్యా పీఠము.

కేశవచంద్రుని నవవిధానమున ప్రధానమైనది కేవలము వివిధ మత గ్రంథముల పరిచయము గాదు. భిన్నతత్వ సమీక్షయు గాదు. ఆయా మత ప్రవక్తల సాక్షాత్కారమే కేశవచంద్రుడు సాధించినది. యాజ్ఞవల్క్యుడు, నారదుడు, వ్యాసుడు, రామచంద్రుడు, గౌతముడు, మోసె. యేసు, మహమ్మదు, గౌరాంగుడు — మొదలగు అవతార పురుషులు అమృతశరీరులై కేశవచంద్రుని దివ్యచక్షువునకు బ్రత్యక్షమైరి. నానా భక్త పరివేష్టితమైన బ్రహ్మసాయుజ్యము కేశవచంద్రుని వైకుంఠము. ఎట్టి దివ్య సాక్షాత్కారము !

కేశవచంద్రుడు కర్మలను బరిత్యజించిన "ఐకానక్లాస్టిక్" భంజకుడు కాదు. కాని క్రొత్త కర్మలను సృష్టించిన నిర్మాత. ప్రాచీన కర్మలు కళాభ్రష్టము లగుటచే, వాని యుత్తేజక శక్తి లోపించినది. అవి కేవలము నిర్జీవములైన యంత్రముల తిరుగుళ్ళవలె శుష్కము లైపోయినవి కాని ఆత్మోన్నతికి మతకర్మ లత్యంత మవసరములని కేశవచంద్రుని విశ్వాసము. కాని అవి చిత్తశుద్ధి సాధకములై యుండవలెను మనస్సు నుద్బోధించి, అతీంద్రియమును బ్రత్యక్ష మొనర్పగల, జ్ఞానచక్షువును తెరపించి అమృతధామమును జూపగల, హృదయమును భక్తిరస సిక్తముగ జేయగల సంస్కారములై వెలుగొంద వలెను. కేశవచంద్రుడు కళాస్రష్ట యగుటచే, ఆత్మోన్నతి సాధకములైన కర్మలను, యాత్రలను, తీర్థములను, వ్రతములను, సంస్కారములను గల్పించ గలిగినాడు.

మతసాధకులకు అవసరములైన పరికరము లన్నియు సృష్టింపబడినవి "నవవిధాన" చిహ్నముగ నొక ధ్వజమును నిర్మించినాడు. ప్రవక్తలకు

సంబంధించిన తీర్థములను గల్పించినాడు. నాట్యములతో గూడిన భజనలు, దీప ధూపములతో గూడిన పూజలు, అభ్యంగనాదులతో గూడిన వ్రతములు, క్రొత్త రూపకల్పనలతో గూడిన సంస్కారములు-సర్వమత సాధనలను మానసికముగనే కాక, ఇంద్రియములకు గూడ ప్రత్యక్ష మొనర్పగల చిహ్నములతో కర్మ కలాపమును సృష్టించి మతకర్త యను నామమున కధికారి కాగల్గినాడు.

ఈ మతకర్మ లెపుడో సెలవురోజులలో జరుపుకొను కాలక్షేపముల వలె గాక, నిత్యదైనిక జీవనమున కనుబంధములుగ షోడశ సంస్కారముల రూపమున విధించినాడు. వాని నూతన సంహిత, జీవనవేదము, బ్రహ్మగీతో పనిషత్తు – అంతయు నూతనము. యోగశాస్త్ర విహితముగ, శమదమాది షట్కసంపత్తికి సాధనమార్గములు నిరూపించ బడినవి. జీవనమును నిత్య వసంతోత్సవముగ, నవనవోన్మేషముగ నొనర్చుటకు గావలసిన సామగ్రి యంతయు నమర్చబడినది.

కేశవచంద్రుని ప్రత్యేకాంతరంగిక సాధన లింతకంటెను గంభీరములు. ఒక నిదర్శనము మాత్రము స్థాలీపులాక న్యాయముగ నిందు సూచింపబడినది. కేశవచంద్రు డొకనాడు భజనలో సుఖాసీనుడై యుండెను. తంబురలు మ్రోగుచుండెను. సారంగుల నుండి శబ్ద మాధుర్యము వెల్లువలై పారుచుండెను. తాళముల ధ్వనులకు భక్తబృందములు నర్తించుచుండెను. కీర్తనల భావశబలతకు హృదయములు పల్లవించుచుండెను. సర్వము నాదమయము. ఆ నాదసాగరమున నిమగ్నుడై యుండిన కేశవచంద్రుని హృదయమున నేదియో యొక వాణి శబ్దించినట్లయ్యెను. "నీవు గానలోలుడ వగుచుంటివా, కేశవా!" అను ప్రశ్న వాని హృదయమును గలచివైచెను. నాటిరాత్రి శిష్యులెల్లరు నిద్రించుచుండ, కేశవచంద్రుడు లేచి, తన మందిరమున నుండిన సంగీతవాద్యము లన్నిటిని ముక్కలు చేసివైచెను. ఇది లోకులకు వెర్రివాని చేష్టవలె గన్పించవచ్చును. కాని అయ్యది సాధకుని ప్రాయశ్చిత్త సంస్కారము. సంగీతము కొన్ని సమయములలో ఆత్మోన్నతి సాధక మగుటకు బదులు తెలియకుండగనే ఇంద్రియ

లౌల్యమున బడవేయును. సాధుసత్తము లప్రమత్తులై జాగరూకతను జూపవలసిన సందర్భములలో నిది యొకటి. అందుకనియే మతసాధన ''అసిధారా వ్రతము'' వంటిదని పెద్దలు చెప్పిరి.

కేశవచంద్రుని ఆంతరంగిక జీవనమున ఇట్టి విశేషము లెన్నియో కలవు. కాని ఆ సాధనమర్మముల దెలిసికొనగోరు జిజ్ఞాసువు లరుదు. మనము సామాన్యముగ మతకర్తల బాహ్య జీవితాంశములను సిద్ధాంతములను పరామర్శించు కొనుచు వివాదగ్రస్తుల మయ్యెదము. కాని భక్త భగవానుల మధ్య ఏకాంతమున జరుగు ఆదాన ప్రదాన లీలలను దెలిసిగొన గోరువారికే వారి ధర్మస్వరూపము హృద్గతము గాగలదు.

నేడు ఈ మహనీయుని శతవార్షిక జయంత్యుత్సవము భరతవర్షమునం దంతట సలుపబడుచున్నది. భరతవర్షము సాధుపుంగవుల కర్మభూమి. లోకోద్ధరణము కొరకు ఎందరు మహానుభావులో అవతరించి ధర్మప్రబోధమును గావించి పోయిరి. ఎవరి జీవితములు చరితార్థము లయ్యెనో లోకమెట్లు నిర్ణయింప గలదు? లోకముచే బరిహసింపబడిన వారు కొందరు; కేవలము హింసింపబడిన వారు కొందరు. కాని వారే కాలాంతరమున గురువులై లోకమును శాసింపుచుండిరి. ఈశ్వర విధానములు దురవగాహములు.

కృష్ణా పత్రిక
నవంబరు 26 వ తేదీ. 1938 సం॥

# తల్లి పిలుపు

శ్రీహరి కరుణా కటాక్ష వీక్షణాలంకార! అర్థిజన కుముద చంద్రోదయ! ఆశ్రిత విద్వజ్జనాధారా! సంగీతవిద్యా నారదా! సాహిత్యవిద్యా చతుర్ముఖా! సత్యభాషా హరిశ్చంద్రా! సాహస విక్రమార్క! సంగ్రామ ధనంజయా! జయ విజయీభవ!

అంటూ, వంది మాగధులు కైవారములు చేసి, తెలుగు వీరులను హెచ్చరించి యుద్ధరంగానికి పిలిచేవారు. జైత్రయాత్రలకు అనుకూలమైన ఆ శరదాగమంలో తెలుగు నేలంతా యీ సమరాహ్వానంతో ఘూర్ణిల్లిపోయేది. కమ్మవీరులు, తెలుగు నాయకులు, రెడ్డి దళవాయులు, వెలమ సరదార్లు, బ్రాహ్మణ దండనాథులు- వారు వీరేమిటి, ఆయుధం పట్టనేర్చిన తెలుగుబిడ్డ లందఱూ శ్రవణపేయమైన ఆ పిలుపు వినిపించగనే, వివశులై, కృషి వాణిజ్య పాశుపాల్యాది స్వస్వ వృత్తులు వదలివైచి, అటకలమీది ఆయుధాలు దింపి చికిలి చేయించి, కవచ శిరస్త్రాణ తూణీరములు ధరించి తల్లుల దీవనలు, ప్రియురాండ్ర పరిష్వంగముల నందుకొని బిడ్డలశిరములు మూర్కొని ముద్దాడి, వీరగంధాలు పూసి, వీరకంకణాలు తాల్చి వాహనారూఢులై, బారులు తీర్చి, వ్యూహములు పన్నుకొని, భూమి దద్దరిల్లేటట్లు శత్రుభూముల పైకి ఎత్తిపోయేవారు. దక్షిణాపథం నాల్గు హద్దులలోను, తెలుగు జెండాలు, ఆకాశగంగా తరంగాయాతములైన నభోవాయువులచే రెపరెప లాడుతూ తలలాడించిన ఆ పుణ్యదినాలు గతించిపోయినవి. ఆంధ్ర సామ్రాజ్య మహావైభవం, ఆంధ్ర సాహస కథానిధానంతో పాటు కాలగర్భాన పూడిపోయి తిరిగి త్రవ్వి యెత్తవలసినదయింది. శతాబ్దులు దొర్లిపోయినవి శకాంతరాలు గడచినవి. తుట్టతుదకు హూణశకంలో భరతఖండ మంతటా ఆవరించిన ఆంగ్ల రాజనీతి సమ్మోహన ప్రభావంచేత తెలుగుభూమికి కూడ పూర్ణ విస్మృతి ఆవహించి, నిష్పందమైన 'శవశాంతి' లభించినది. నాటికి నేడు మళ్ళా

మన తరంలో 'గాంధి'భాస్కరోదయోచ్చాటితములై, ఆ సమ్మోహనపు దెరలు విచ్చిపోయినవి. ఆ శవశాంతిలో నుంచి కలవరింతలు బయలుదేరినవి. ఆ నిద్ర మత్తు పూర్తిగ వదలకుండానే భారతభూమి అంతా ఒక్కసారి లేచి నిలుచున్నది. సబర్మతీ తీరమునుంచి వినవచ్చిన వేణునాదం ఆలకిస్తూ మెలుకువ వచ్చిన వారం దఱూ ఎట్లా నిలుచున్న వారట్లాగే, స్త్రీలు, బాలురు, వృద్ధులు సత్యసంగరం లోకి దూకారు.

తెలుగుతల్లి తిరిగీ ఆనాడు చూచుకొన్నది కన్నులార తన బిడ్డల సాహసం. తొల్లింటి తెలుగువీరుల చరిత్రలు మళ్ళా ఒక్కమారు కన్నుల గట్టినట్లు కనుపించి నవి. లాభ నష్ట పరిగణనం, సుఖ దుఃఖ విచారణం లేకుండా వెనుకముందులు చూడకుండా, శాంతవిక్రములై సత్యస్థిరులై జైళ్ళు నింపిన ఆ పడుచువాండ్రు, ఆ వృద్ధులు, ఆంధ్ర పౌరుష క్షీర వారాశిలో మరల నొక్క క్రొత్త దీవి వెలయించి చూపిరి. పూర్ణ గర్భిణులనక, పిల్లల తల్లులనక, క్రొత్త కాపురమనక తమ భర్త లను వెన్నంటి కారాగారములకు బరువులెత్తిన మా తెలుగు పేరంటాండ్రు మాతృ భూమిని చరితార్థను కావించిరి. ఆ మహా సమరోత్సాహంలో పండిత పామర భేదములు లేవు. కలిమి లేముల వ్యత్యాసములు లేవు. బ్రాహ్మణాబ్రాహ్మణ వైరములు లేవు. ఆచండాల ద్విజపర్యతం దేశారాధన చింత తప్ప అన్యచింత లేకుండా చెట్టపట్టాలు పట్టి ఒక్క అడుగుమీద జైళ్ళకు నడచి, ఏకభాండాశనులై బంతికూడు గుడిచిన ఆ పుణ్యాహములు దలచుకొన్న ఎవని మేను పులకరింపదు? ఎవరి నోరు సాధువాదము చేయదు?శాంతము తప్ప వేఱు ఆయుధము లేదు. దేశ భక్తి తప్ప వేఱు కవచము లేదు. సత్యము తప్ప వేఱు మంత్రము లేదు. అది యేమి సాహసమో! అది యెక్కడి సహనమో! లవణాధ్యాయం లోని ఆ సయో ధ్యత, లాటీల పర్వంలోని ఆ యహమహమిక గాంచి తెలుగుధాత్రి తాను వీర ప్రసూత ననుకొన్నది. తరియైనపుడు తన బిడ్డలు వెనుకబడరనే ధైర్యంతో ఆంధ్రదేశము సాటి దేశములలో తలయెత్తి తిరుగ నేర్చినది. ఆంధ్రుల ఉత్సాహ క్రియాశక్తులు తెప్పయై భారతభూమిని తరింప జేయగలవన్న వన్నెయు వాసియు

ఆంధ్రులు గడించుకొన్నారు. ఆ సత్యసమరాగ్నిలో చెక్కు-చెమర్పకుండా పరీక్ష నిచ్చిన ఆంధ్ర సంజాతులు మాతృదేశపు టానతిని పూలదండవలె శిరమున ధరింతురన్నచో వింత యేమి ?

ఇదిగో నేడు మరల పరీక్షాసమయం వచ్చినది. నిన్న మొన్న గడించు కొన్న ఖ్యాతిని దక్కించుకొనే అదను మళ్ళా వచ్చిపడింది. భారతభూమి తన ముప్పదియైదు కోట్ల సంతానములో తల యెగగట్ట నేర్చిన మూడున్నర కోట్ల ప్రజలను చేరబిలిచి, 'మేము తల్లిమాట కడుగుదాటము' అని బాస చేయుడని కోరుతూ వుంది 'తల్లికి ద్రోహం చేయము' అని చేతిలో చేయి వేసి చెప్పమం టున్నది. మీ రింతకుమున్ను చేసిన ప్రతిజ్ఞలు నిలుపుకొనండి' అని అడుగుతూ వున్నది. ఈమెయే మీ తల్లి అని ఏకకంఠముతో పలకమంటున్నది. అంటే సత్యసమరం తటస్థించినపుడు. ఆనాడు మీ ధన మాన ప్రాణములను అర్పించం డని కోరింది తల్లి మీ రక్తసంతర్పణం యాచించింది ఆనాడు మీ ప్రాణభిక్ష వేడింది ఆ దినములలో. తల్లి ఆనాడు యజ్ఞపావక మూర్తితో సాక్షాత్కరించి మీ సర్వస్వం తనలో హోమం చేయండని హెచ్చరించింది. ఆ మహా కాళికావ తారం చాలించి, ఆ భయంకర మూర్తిని ఉపసంహరించుకొని, తల్లి నేడు పట్టెడు పసుపుతో ప్రసన్న మూర్తితో సాక్షాత్కరించింది. మీరు చేసిన త్యాగం, మీరు చూపిన సాహసం, మీరు రాల్చిన రక్తం తల్లికొరకే అని మళ్ళా సాక్ష్యం చెప్పవలసి వచ్చింది. మీ భక్తి అవ్యాజమని, మీ సాహసం స్వార్థచింతాదూర మని, మీరు రాల్చిన స్వీయ రక్తాంజలి మాతృప్రీత్యర్థమే నని ఋజువు చేసుకో వలసి వచ్చింది. అచ్చెరువు గూర్చిన ఆనాటి మీ చేతలు వమ్మైపోకుండా రక్షిం చుకోవలసిన తరుణ మిది. ఆనాడు సత్యాయుధ ధారణం చేసిన వీరులే కాదు; వారి సాహసం చూచి బళిబళి యన్నవారు, వారి త్యాగానికి లోలోపల ఉప్పొంగి పోయిన వారు, తమ అసమర్థతకు వగచిన వారు, వారిని దీవించి సాగనంపిన వారు, నిరాయుధులై నిలిచి దండప్రహారణములకు తలయొగ్గి తురగ ఖురాఘాత ములచే నొచ్చి ధూళిధూసరితులై మాతృనామ స్మరణం చేస్తూ దొర్లుచున

ఆ భక్తుల నుపచరించి సేదదీర్చుటకు గూడ నోచుకొనమైతిమి గదా యని పరితపించిన వారు, పూలదండలతో కర్పూర హారతులతో వారి నెదుర్కొన్న వారు, ఆ దేశారాధకులను ప్రతిఘటించవలసి వచ్చెనే యని లోలో కుమిలి పోయిన వారు, వీరు వారననేల, వయసువచ్చి చదువను వ్రాయను నేర్చిన వారెల్ల, 'వారు అన్నికష్టములు అనుభవించినది మాకొరకే' యని చాటి చెప్పవల సిన యవసర మిది.

'యావద్భారత భూమికి నే నొక్కడనే ప్రతినిధి' నని యెలుగెత్తి చెప్పిన ఆ వృద్ధ తపస్వి వాక్కులలోని సత్యమును తార్కాణము చేయుట కదను వచ్చిన దిపుడు. ఎవరెన్ని భేదములు పన్నినను, ఎన్ని తంత్రములు చేసినను, ఎట్టి యాసలు చూపినను, భారత స్వాతంత్ర్య రథము కాంగ్రెసురస్తా నుండి తొలగదని ప్రత్యక్షం చేయుట కిదియే తరుణము. కాంగ్రెసుసాధనం ద్వారానే భారతజాతి తన స్వతంత్రమును సాధించుకొంటుందని చాటుట కిదే సమయం. కాంగ్రెసు యొక్క ప్రజారంజకత్వమును, భారతజాతి యొక్క ప్రజారంజకత్వమును, భారతజాతి యొక్క ఐకమత్యమును, స్వాతంత్ర్య సంపాదన దీక్షను, మూడున్నర కోట్లమంది ఏకవాక్కుతో ఘోషించుట కిదియే తఱి. దేశారాధకుల అపూర్వ సేవానిరతికి భారతజాతి కృతజ్ఞత చూపదగిన యీ యవకాశమును జాఱిపోనిచ్చునా ? దీనికొకరి పేరంట మక్కఱ లేదు. ఒకరి ప్రేష్యముతో బనిలేదు. ఈ మాత్రపు బనికి వంది మాగధుల కైవారములు, వైతాళికుల మేలుకొలుపులు గావలయునా ? ఇచ్చట పిలుచు నదెవరు ? పలికెడి దెవరు ? ఇది యేమి వీరవ్రత ధారణమా ? దాన కంకణ బంధనమా ? తల్లి యాజ్ఞాపించుచున్నది; బిడ్డలు అనువర్తించుచున్నారు. వాత్సల్యము పిలుచు చున్నది; భక్తి పలుకుచున్నది. అవమానము చేతులుసాచుచున్నది; అభిమానము ఆదుకొనుచున్నది. దేశహితము వేడుచున్నది; ఆత్మశ్రేయము పెట్టుచున్నది. దాతవు నీవే, భోక్తవు నీవే ఓహో ! ఎంత చక్కని దానమిది !

దాతనే ప్రతిగృహీతను జేయుచున్న ఈ ద్రవ్యమెంత మహనీయమో!

యాచ్నా దైన్యమును దానగర్వమును పరిహరించుచు, దాతకు చరితార్థతను దానమునకు సాద్గుణ్యమును చేకూర్చు ఈ ద్రవ్యమునకు వినియోగ మెచ్చట? ఈ విచిత్ర దానకర్మ సౌలభ్యంకొఱకు తల్లి పసుపుపెట్టె రూపు తాల్చినది. ఈ పసుపుపెట్టియే మాతృముఖమైన కాంగ్రెసు. తన బిడ్డలు తెచ్చియిచ్చు ఉపహారము లందుకొనుటకు విశ్వరూపిణియైన తల్లి పుత్రసౌలభ్యం కొఱకు తాల్చిన మంగళ రూపమే పసుపుపెట్టె. పసుపుపెట్టె పేరిట శోభనాకారముతో తల్లి సాక్షాత్కరించి ఏకాంతసేవ నను గ్రహిస్తున్నది. ఇంతకు మున్నెన్నడు తన్ను తలచి యెఱుగని వారిని, తన్ను ధ్యానించనివారిని, తనకు దూరమైనవారిని, తనకు విముఖులైన వారిని – అందఱిని చేరబిలుచుచున్నది. తప్పుదారులు త్రొక్కుచున్న తన సంతానముపై ఆ తల్లికెంత దయ. బిడ్డలు తన్ను మఱచిపోయిరని అ తల్లి ఎంత యార్తి చెందుచున్నదో, తన్ను ధ్యానించి సమ్ముఖము కల్పించుకొనుటకు వెఱచు చున్న భీరుసంతానము కొరకు ఎంతటి సౌమ్యరూపము దాల్చినదో చూడుడా తల్లి! తనకు దూరమై పోవుచున్న ఆ బిడ్డ లొక్కొక్కరికే ఏకాంత మొసగి మైనిమిరి, చిర వియోగవ్యథలు తీఱిపోవ, నిండు కౌగిట నద్దుకొని, అభయ మొసగి, పూజోపహార మందుకొని, దీవించి పంపుటకు ఆయత్తయై వచ్చిన ఆ మాతృ మూర్తిని కన్నుల కఱవుదీర దర్శించి ధన్యులు కండు. ఆ వాత్సల్యమూర్తి నిండుకౌగిట కఱగి, ఆ ప్రేమమయి విశాలాంకమున సేదదేఱి, అ ప్రజామయ జీవన శీతల స్పర్శచే పులకరించి పూతాత్ములు కండు.

అల్లదిగో! ఉత్కళ సంజాతుల కప్పుడే ఆ తల్లి దర్శనమిచ్చి వారి సేవలందుకొని, దీవించి పంపినది. వంగప్రజలు శక్తివంచన చేయక కలమాత్ర మా తల్లి పాదకమలముల నర్చించిరి. విదేహభూప్రజలుగూడ మాతృ పాదార్చ కులలో అగ్రగణ్యత సముపార్జించు కొనుచున్నారు. తక్కుగల వారందఱును మేముమేమని ఉన్నయంతలో లోపము చేయక తల్లిని సేవింప నాయత్తు లగు చున్నారు. మన పొరుగుననున్న తమిళులు మనకంటె మిన్నగా తల్లిదీవన లందుకొన జూచుచున్నారు. నిన్నమొన్నటి ఉత్కళుల కంటె మనము వెనుక

పడుదుమా? మనము నిత్యము పరిహసించు తమిళ సోదరులను మనకంటె మిగిలిపో నిత్తుమా? ఇన్నినాళ్ళు తల్లికెక్కుడు గూర్తుమని సంబరపడుచున్న తెలుగుబిడ్డలు, ఈ యల్పసేవా సమయమున, సాటివారికి తీసిపోదురనుట కల్ల. దక్షిణాపథ మంతయు ఏకచ్ఛత్రము క్రిందకు తెచ్చిన ఆంధ్రప్రజ, నేడు సాటి వారు గర్భాలయము లోనికి చనుచుండ, తాము మాతృదేవాలయ ప్రాంగణమున నిలిచియుందు రనుట కానిమాట. ఇతరచింతలు మాని, అన్యభేదములు మఱచి, తెలుగులందఱు ఒక్కదారిని నడచి, నా యనుంగు బిడ్డలగుట సమర్థించుకొనుడని మాతృదేవత పిలుచుచున్నది. రండు! ఆ పసుపుపెట్టెలలో మాతృమూర్తిని దర్శించి పూజాపుష్పములను సమర్పించి వత్తము రండు!

కృష్ణా పత్రిక
ఫిబ్రవరి 6వ తేదీ, 1937 సం॥

# రథోత్సవము

ఎప్పుడో వచ్చుననుకొనుచున్న ఫిబ్రవరి ద్వితీయపక్ష మెంతలో వచ్చినది! మనవంతు చివరకు గదా యనుకొనుచుండ అప్పుడే రానే వచ్చినది. జగద్ధాత్రియగు భారత వసుంధరాదేవి రథమప్పుడే ఒక్కొక్క రాష్ట్రముననే సేవలందుకొని దక్షిణాపథము దారిపట్టినది. అతిరథ శ్రేష్ఠుడైన జవహరిలాలు సభాపతి శంఖారావ మదిగో! వినవచ్చుచున్నది. ఏరీ ఆంధ్రులు? ఆంధ్రప్రభ యింకను బయలుదేర లేదా? యని ప్రశ్నించుచున్నాడు. నెలరోజుల క్రిందటివరకు, మనము తొందరలేదు గదాయని, పెండ్లికొడుకులనే నిశ్చయించుకొన లేదు. వారా వీరా యని వితర్కించుకొను చుంటిమి. వరుల కుల రూప వయోగుణ నిర్ణయమున మొన్న మొన్నటివరకు నింకను మనసులు కుదరక వెనుకముం దాడుచుంటిమి. వరణములో వచ్చిన కుమ్ములాట లింకను సమసిపోవనే లేదు. కొన్నిచోట్ల మనము వరించిన వారు, మాకు వలదు మొర్రో యనుచుండగనే బలాత్కారముగా దీక్షాకంకణములు తొడిగి పసుపుబట్టలు ధరింప జేసితిమి. మంగళ వాద్య ఘోషములతో తంతు నడప నారంభించితిమి.

కాని పదియేడేండ్ల నుండి శాసనసభను గుత్తకు గైకొన్నట్లు అవిచ్ఛిన్న ముగా ననుభవించుకున్న జస్టిసుపక్షముతో డీకొనుట యన్న సామాన్యము కాదు. ఇంతకాలము నుండి ప్రభుత్వయంత్రమును హస్తగతము చేసికొని దమ చిత్తము వచ్చినట్లు త్రిప్పుచు, తమ పదవుల కెన్నటికి భంగము రాకుండ కట్టుదిట్టములు చేసికొనిరి వారు. జిల్లాబోర్డులను, మునిసిపాలిటీలను చేజిక్కించుకొని, స్వప్రయో జన సిద్ధికొరకు వానిని యథేచ్ఛముగా నుపయోగించుకొనుచు నీతి నియమములను ఉజ్జగించి పరిపాలన సాగించుచున్న జస్టిసు ముఖ్యప్రధానులు మొదటినుండియు ఆంధ్రులే యగుటకూడ మన దురదృష్టము.. ప్రభుత్వ - మర్యాదలు, ప్రజాజీవన

పద్ధతులు కలుషితము లైనను సరే లక్ష్యము చేయక, తమ పార్టీచుట్టును కోటలు గట్టుకొనుటకు స్వాధికార దుర్వినియోగ మొనర్చుటకు జంకని పోటుబంటులు జస్టిసు నాయకులు. కాంగ్రెసు కారాగారములలో మాతృనామము జపించుచు నవయుచుండ, వీరు అవిచ్ఛిన్నముగా పరిపాలనము కొనసాగించుకొనిరని అసూయపడదు కాంగ్రెసు. కాంగ్రెసు వాలంటీరులను లాఠీలతో చావమోదు పోలీసురాజ్యపు దినములలో వీరు తమలో తాము కనులు గీటుకొనుచు చేతులడ్డము చేసికొని నవ్వుకొనుచుండి నందులకు, రామరామ యని అడ్డపడనందులకు వీరిని కాంగ్రెసు నిందింపదు. కాంగ్రెసుఖైదీలకు మజ్జిగనీళ్ళిప్పించు ఔదార్యముగాని న్యాయబుద్ధిగాని వీరికి లేకపోయెనే యని దుఃఖింపదు. వీరు తమ పదవులను సుస్థిరము లొనర్చుకొనుచు ఇళ్ళు చక్కబెట్టుకొను చున్నందులకు గూడ కాంగ్రెసు వగపు జెందదు. మరి యేమన:- వీరి పరిపాలనకాలములో ప్రజాహిత జీవనమునకు దిక్కు లేకుండపోయెనే యనియు, ప్రజాజీవనము నీతిబాహ్యమై అపవిత్రమై దుర్గంధిలమై కుళ్ళుకంపు కొట్టు దుర్గతి పట్టెనేయనియు కాంగ్రెసే కాదు, దేశ హితమును గోరువారెల్లరు దుఃఖింపదగినది. గాంధిమహర్షి కడుపు చల్లగా, మహాయజ్ఞ మారభించి, స్వార్థచింతా విముఖులును, సేవావ్రతులును, సత్య పరాక్రములు నగు స్త్రీపురుషులను కొన్ని వేలమందిని శిక్షించి మన కొసగుటచే బతికిపోతిమి కాని, లేనిచో ఈ జస్టిసుహయాముతో ఆంధ్రజాతి కడుపే కైలాసమను మత మవలంబించి పతితమై నిరభిమానమై నిరయమున గూలిపోవలసినదే.

ఇంతదూర మెందులకు చెప్పవలసి వచ్చినదనగా, నదురు బెదురు, వెనుక ముందు, జంకు గొంకు, పాపము, పుణ్యము, గురువు దైవము లేని యిట్టి జస్టిసు దుర్గమును భేదింపవలసిన భారము మనపై పడినది. భారతదేశమున మఱి యే రాష్ట్రమునను యింత పచ్చి పాపము ప్రబద్ధలుకాలేదు. ప్రతిపక్షుల యీ బలమే మనల నంతగా బలహీనులను చేసి జయము విషయమున సంశయగ్ర

స్థులను జేసినది. మన మెదుర్కొనవలసిన పార్టీయొక్క శీలసంపద యిటులుండ, మనల నెదుర్కొనిన వ్యక్తుల బలాబలము లెటులున్నవో విచారింతము. నీతి చాణక్యుడని పేరుబడిన రామారాయణింగారి నాటనుంచి కూడ జస్టిసుపార్టీకి మన ఆంధ్ర జమీనుదారులు బురుజులై నిలిచిరి. అట్టి వీరు ఒక్కొక్కజిల్లా నొక్కొక్కరు గుత్తకు గొని యేలుకొనుచుండిరి. అమితమైన ద్రవ్యబలము, నధికారబలమును గల యీ జమీనుదారులు వోటర్ల లిస్టులు తమ యిచ్చవచ్చిన రీతి మార్పించుకొని, తమ కనుకూలముగ ఎస్సెంబ్లి స్థానములు ప్రదేశములు నిర్ణయించుకుని ఇతరులకు కాలు పెట్టుటకు చోటులేకుండ చేసి తమచుట్టును ముళ్ళతీగలతో కంచెను వేయించుకొని కూరుచుండిరి.

చెన్నరాష్ట్రి మంతయు తన కన్నుసన్నల మెలపుకొనుచు, తానాడిన దాటగా, పాడినది పాటగా స్వైరవిహార మొనర్చుచున్న బొబ్బిలి మహారాజులుం గారు విశాఖపట్టణపు జిల్లా ఆకట్టుకొనిరి. కృష్ణా గుంటూరు మండలములు మీర్జా పుర చల్లపల్లి జమీందారులు తమ వంతు వైచికొనిరి. మొదటి నుంచియు చెన్న రాష్ట్రిపు రాజకీయ చక్రమును దమ యిష్టము వచ్చినట్లు త్రిప్పుచున్న వెంకటగిరి మహారాజులు నెల్లూరు మండమున నితరుల నడుగు పెట్టనీయరు చెన్నపట్టణము ప్రభుత్వదుర్గమే కదా ఇక రాయలసీమ మొదటనుంచియు మనతో కలసిరాక ఎడమొగము పెడమొగముగా సంచరించుచు దూరముగా విసరివేసినట్లు కొంచెము పెడగా నుంటున్నది గాదా. ఇక మిగిలినది గోదావరీ మండలము. ఈ పేర్కొన్న మహారాజు లందరికంటె మేటి, అఘటన ఘటనాసమర్థుడు నగు పీఠికాపురా ధీశ్వరుడు, 'ఇక నేమున్నది! మించిపోవుచున్న' దని యెంచి ఒక్కసారిగా తన మహాబల సంపదతో చెన్నరాష్ట్రిముపై ప్రళయ సముద్రమువలె మూడు దిన పత్రికలతో విరుచుకొని పడెను. వారి స్వస్థలమగు నుభయ గోదావరులు తమ వంతునకు రావలయునని వారు హద్దులు పెట్టుకొని కూరుచుండిరి. ఈ భద్ర దంతావళముల మధ్య, మహోద్ధతములగు నీ వృషభరాజముల మధ్య బక్కలేగ వలె నున్న కాంగ్రెసున కిక చోటెక్కడ అని భయపడితిమి?

కాని యెంతలో నెంత మార్పు చూచుచున్నాము! పట్టుమని ఇరువది

దినములు గడచినవో లేదో అప్పుడే పురుషుల భాగ్యచక్రము లెట్లు తలక్రిందయి పోయినవి! ఒక్కొక్కనాటి కొక్కొక్క మెట్టు చొప్పున కాంగ్రెసు గంగాభవాని పైకిపొంగి వచ్చుచు ఆంధ్రదేశము నాలుగు మూలలను ముంచి యెత్తుచు సర్వ కలుషములను కడిగివేయుచున్నది. మరుభూమిలో తియ్యని నీటిజలలూరుచున్నవి. మండు వేసగిలో సజల జలదములు క్రమ్ముకొని వచ్చుచున్నవి తెలుగు పల్లెలు తెలుగు పట్టణములు కాంగ్రెసు ఆవేశముతో నూగిపోవుచున్నవి. ఆంధ్రు లొక్క సారిగా తమ రెండుకోట్ల గళములతో కాంగ్రెసు నామసంకీర్తనము చేయుచున్నారు. ఏ మారుమూల పల్లెకు పోయినను కాంగ్రెసు త్రివర్ణ పతాకమే కంట బడుచున్నది. ప్రతి గ్రామమును కాంగ్రెసు సేవామందిరముగా మారిపోయి నది. శత్రుభీకరము భక్తాభయప్రదము నైన కాంగ్రెసు ఆంధ్ర హృదయమును ప్రహ్లాదుని గావించినది. ఈ యద్భుత పరిణామమును గాంచిన ప్రతిపక్షులకంటె కాంగ్రెసుకే ఎక్కుడు అక్కజము జనించుచున్నది. కాంగ్రెసు పేరులో ఇంద్రజాల మున్నదన్నాడు, జవాహరిలాలు సభాపతి నిజమే, ఇంద్రజాలమే యున్నది.

ఈ మహాప్రవాహము పొంగి పొరలి ఆంధ్రదేశము దశదిశలను చుట్టబెట్టు కొని వచ్చుచుండ నింకను జమీందారు లెక్కడ! ఇంకను జస్టిసుపార్టీ యెక్కడ! యిటు విశాఖపట్టణము నుండి, అటు చెట్టినాడునుండి చెన్నపట్టణమువఱకు అంచె లంచెలుగా సైన్యములు నడిపించి ఫోర్టు సెంటుజార్జి కోటను ముట్టడించి తమ ధన రాసులచే మంత్రిపీఠములను నిర్మించుకొన జూచిన మన జమీందారుల యాస లన్నియు నడియాసలై, వారి స్వప్ననిర్మిత హర్మ్యములు కూలిపోవుచున్నవి. కాంగ్రెసు ప్రజాహృదయమున సుప్రతిష్ఠితమై పీటవెట్టుకొని కూరుచుండియుండ, వీరు బయటినుంచి ఎన్ని యస్త్రములు ప్రయోగించి యేమి ప్రయోజనము. ఇతరు లకు దుష్ప్రవేశముగా వీరు తమచుట్టును నిర్మించుకొన్న కోటలే వీరికి బంధ నాగారములై, ప్రజాహృదయములు వీరికి దురారాధ్యములై పోయినవి. ప్రజలకు తమకు మధ్య వీరు నిర్మించుకొన్న అపచార ప్రాకారములే నేడు వారికి మీరరానివై దిగ్భ్రమ కూర్చుచున్నవి. ఈ పదునైదునేండ్ల అధికార కాలమున వారు నాటిన

దుష్కర్మబీజములే అత్యుత్కటములై విషఫలములుగా పరిపాకము చెంది కట్టి కుడుపుచున్నవి. వారి తంత్రములు పనిచేయుట లేదు. వారి హస్తగతమై యున్న యే అధికారమును జూచి కాంగ్రెసు మొదట సంశయించినదో అదియే వారికి కాలిబందమై గుదిబండయై పోయినది. వారి మోటార్లు సహస్ర కంఠములతో ఘోషించుచు ఊపిరాడకుండ పెట్రోలు పీల్చుకొని పరవళ్ళు త్రొక్కుచునే యున్నవి. వారిపత్రికలు దినదినము వన్నెచిన్నెలు పెట్టి కాంగ్రెసును పడదిట్టు చునే యున్నవి. కాని అన్నియు అరణ్య రోదనములై పోవుచున్నవి. ప్రజలు కాంగ్రెసు దివ్యాంజనము ధరించిన పిమ్మట నీ మాయమర్మములు, ఈ మసి పూసిన మారేడుకాయలు, ఈ బట్టలో పేలాలు ఏమి పనిచేయును? కాంగ్రెసు 'శేముషీతరణి సాంగత్యముచే' జస్టిసు తిమిరము పటాపంచలై విరిసి పోవు చున్నది. కాంగ్రెసు సుప్తసింహము వంటిది. అది నిద్ర మేల్కొనిన పిమ్మట దానియెదుట నెవరు నిలువగలరు? ఆవులించిన దాని యాననమునందు 'కబళిత గజరక్త సుందరమై' సంజ జాబిల్లి రేకవలె కానవచ్చు కోర పెకలించుట యెవరికి సాధ్యమగును? శ్రీరామచంద్ర స్వరూపమగు ప్రజామూర్తిని సేవించుటకు కాంగ్రెసు అంజనానందనుడై లేచి నిలిచిన పిమ్మట నిక వీరి కుప్పిగంతు లెవరికి కావలయును?

నిజమునకు ప్రజాబలము కాక కాంగ్రెసుకు వేఱుబల మేమున్నది? చిరా ర్జితమగు సేవాధనము కాక వేఱుధన మేమున్నది? బొబ్బిలిపులిని బొబ్బిలికోట లోనే యోడించుటకు పందెము చఱచిన వి. వి. గిరి ఎచట నున్నాడు? ఏబదివేల రైల్వే పనివాండ్ర దుఃఖభారమును మూపున దాల్చి ఢిల్లీ హౌరాల మధ్య తిరుగుచు వారి సేవయందే బొబ్బిలిప్రభుని అపజయము కూడ సాధించుచున్నాడు ఓహో! ఇది యేమి నిష్కామకర్మ. జైలులో నున్న అభ్యర్థులను అసెంబ్లీపీఠము లెక్కించు కాంగ్రెసు అద్భుత ప్రభావమునకిది యేమి లెక్క! ఈ పోరాటము ప్రజలది గాని కాంగ్రెసు వ్యక్తులది కాదు. ఈ విజయము ప్రజలది కాని గొట్టిపాటి బ్రహ్మయ్యది, అత్మూరి గోవిందాచార్యులుది, సాంబమూర్తిది కాదు. ఈ గోచిపాతరాయళ్ళు

కుబేరవిభవులగు జమీందారుల నెదుర్కొన్నది, ప్రజాబలమును నమ్ముకొనియే. కావుననే ప్రజలు గ్రామ గ్రామమున చందాలు వైచుకొని ఈ తమ ప్రతినిధు లందఱికి ప్రచార సౌకర్యములు చేకూర్చి విజయము సాధించి పెట్టుచున్నారు. వోట్ల పండుగ వచ్చుచున్నదని తమ తమ గ్రామముల నలంకరించుకొని కాంగ్రెసుకు కానుకల నర్పించుట కాయత్త పడుచున్నారు. ముంతెడు కల్లునకు మూడు పావలాల డబ్బులకు అమ్ముడుపోవు వోటు నేటితో పరమ పవిత్రమైన పూజా పుష్పముగా పరిణమించి ప్రజాహృదయము నందలి అవ్యాజ కాంగ్రెసుభక్తికి చిహ్నము కానున్నది.

ప్రథమమున ఒరిస్సాలో మ్రోగిన, కాంగ్రెసు విజయదుందుభి వరుసగా బెంగాలు, బీహారు, అస్సాము, పంజాబులందు మ్రోగి వాయవ్యదిశలో బోరు కలిగి, యు పి నజ్ఞాత లూగించి, సీ పీ. ని సేవాయత్త మొనర్చి, బొంబాయి సింధురాష్ట్రములకు హెచ్చరిక చేసి అదుగో! మన యాంధ్రమండలము లందు శతగుణితముగా ఘోషించుటకు వచ్చుచున్నది. నాయనలారా! లెండు, సేవాంజలి ధరింపుడు! అమ్మలారా! పూల పళ్లెరములతో కర్పూర నీరాజనములతో నాయత్తము కండు. దేవీసేవార్థము ఒక్కొక్క గ్రామమువారే బండ్లపై ప్రభలు కట్టుకొని, తరతరముగా బారులు దీర్చి కాంగ్రెసుభజనలు గావించుకొనుచు తరలి రండు.

అదిగో! కింకిణీ సమలంకృతమైన త్రివర్ణ పతాకాంచలములు దవ్వుల గాన్పించుచు చేర బిలుచుచున్నవి. అదిగో దేవి స్వర్ణరథ నేమిధ్వానము, సమీపించుచున్నది అదిగో! రథమధ్యమున శాంతితేజముతో వెలుగుచున్న ఆ తల్లి దివ్యమంగళ స్వరూపము. రమ్మా, కృష్ణవేణీ! రమ్మా! రావే పినాకినీ! గౌతమీ! ఆలసించెదవు సుమా! ఏమే తుంగభద్రా! జాగు సేయకుము. దేవిరథము దాటిపోవుచున్నది. 'ఏదీ! ఆంధ్రప్రభ' యని ఆ విశ్వజనని దరహాస సుందర వదనయై అడుగుచున్నది. రండు. పావన త్రిలింగ రక్షితమై, పుణ్యనదీ మాతృకా పాలిత

మైన మహాంధ్ర జనతా మహీయస్నేహాంజలి సమర్పింపుడు. జయ భారతజననీ! జయ ఉదయాస్తాచల సేతు శీతనగ పరివేష్టిత పుణ్య వసుంధరా! జయ! జయ! ప్రజామయీ జయ కాంగ్రెసుపీఠవాసినీ! జయ వాత్సల్యమయీ! జయ ప్రసన్న మూర్తీ! జయ అస్మచ్చిత్తాబ్జగేహా!

కృష్ణా పత్రిక
ఫిబ్రవరి 13వ తేది, 1937 సం॥

# సూర్యనారాయణ రావుగారి నిర్యాణము

వల్లూరి సూర్యనారాయణ రావుగారి యాకస్మిక మరణమున కెంతయు దుఃఖించుచున్నాము. వీరాంధ్రలోకమునకు చిరపరచితులు. ముఖ్యముగ మా పత్రికాపాఠకులకు వారి రచనలు మిగుల ప్రియములు. సూర్యనారాయణ రావు గారు వృత్తియందు ఒక సామాన్యుడైన అడ్వకేటు అయినను, వారియందు అసామాన్యములైన లక్షణములు కలవని వారి నెరింగినవారికి దెలియనిది కాదు. లాయర్లలో దేశహితైషు లెందరో కలరను మాట నిజము. కొంతకాలము క్రిందటి వరకు మన రాజకీయవేత్తలు చాలవరకు ఈ లాయర్ల వర్గమునుండియే బయలు దేరుచుండిన మాటయు వాస్తవము. కాని సూర్యనారాయణ రావుగారి దేశసేవ వారి వృత్తికి అనుబంధముగ జేసికొనినది కాదు. వారు తమ వృత్తినే దేశోపకార కముగ జేసికొనిన మహానుభావులు. వారు తమ వృత్తిద్వారా ద్రవ్యార్జనము చేసికొనక పోలేదు. కాని వారి ద్రవ్యార్జనాసక్తి కంటెను, సత్కార్యోత్సాహము అధికము. వారు తమ న్యాయవాదము నెట్లు దేశారాధన కుపయోగించిరో తెలిసి కొనిన వారి సత్కార్యోత్సాహ మెట్టిదో బోధపడగలదు. దేవాదాయపు చట్టము చేయబడక పూర్వము దేవాదాయ సత్పరిపాలనమునకు వారు గావించిన కృషి ఆంధ్రుల ఆధునిక చరిత్రయందు సుస్థిరముగ నంకితమై యుండగలదు ధర్మా దాయ విషయములలో వారొక మహాయోధుని వలె బోరాడిరనిన అతిశయోక్తి కాదు. కొంతకాలము వారిపేరు అర్చకులకు, ధర్మకర్తలకు భయమున గొలుపుచుండెడిది. ఏ దేవాదాయమైనను సక్రమముగ నిర్వర్తింపబడుట లేదని వారికి దెలిసిన జాలును, వారు వెంటనే అచ్చట ప్రవాలి, స్థానికులైన ప్లీడర్లను ప్రోత్సాహపరచి, దావాలు వేయించెడి వారు వారి మూలమున ఎన్ని ధర్మాదాయములో ఉద్ధరింప

బడినవి. వారి విషయము నొక మహోద్యమముగ జేసి వైచిరనుట నిక్కము. వారు దేనిని సాధించినను, సాధించక పోయినను, వారి జీవితమును సఫలపరచుట కీ యొక్క యుద్యమము చాలును.

వారీ యుద్యమము నుపక్రమించినది దేవాలయముల యెడల వారికి భక్తి యుండి కాదు. సూర్యనారాయణ రావుగారి సంస్కరణ పరాయణత బహు తీవ్ర మైనది. మతాచారముల యెడల వారి కత్యంత నిరసనభావము గలదు. దేవాల యములు, విగ్రహారాధన మనిన వారికి తలనొప్పి. వారు శుద్ధ నిరీశ్వరవాదులు. ఆముష్మికము నందు వారికెట్టి విశ్వాసమును లేదు. అయినను వారీ దేవాదాయ విషయమున నట్టి అభినివేశము నెందుకు జూపిరని మీరు ప్రశ్నించవచ్చును. దీనికి రెండు కారణములు కలవు. ఏ విషయములో నైనను, అన్యాయము, మోసము అనిన వారు సహించెడివారు కారు. న్యాయము స్థాపన మగువరకు కత్తి కట్టి పోరాడ వలసినదే. అసత్యముతో రాజీమాటలు పనికిరావు. వారి సత్యపరా క్రమము అద్భుతము. ధర్మము కొరకు తన స్వంతధనము నైనను వెచ్చించి, తన పంతము వగ్గించుకొనగల దీక్షాపరులు వారు. బహు నిక్కచ్చి మనిషి. కల్లా కప టము ఎరుగరు. వట్టి నిర్మొగమాటి. వారికి హృదయము లేదా యని యనుపించు నంతటి ఖడ్గవాది. ధర్మాదాయ విషయములో వారు పోరాడినది కేవలము సత్యము కొరకు, సక్రమ కార్య నిర్వహణము కొరకు. ఆ ధర్మాదాయము దేవాలయమునకు సంబంధించినది కానిమ్ము, లేక మసీదుకు సంబంధించినది కానిమ్ము. దానిని స్వార్థ పరుల భుక్తములోనుండి తప్పించి దాతల సంకల్పమును నెరవేర్చుట తప్ప వారికి మరియొక యుద్దేశము లేదు. దీనికి తోడుగ మరియొక ఆలోచన కూడ గలదు. ఈ దేవాదాయములను కేవలము నిష్ప్రయోజనకరములైన ఉత్సవాదుల కొరకు గాక, న్యాయశాస్త్రము ఒప్పుకొనునంతవరకు వానికి సంబంధించి ప్రయోజనకర ములైన సత్కార్యములకు వినియోగించుట కవకాశమును గల్పించుటకు గూడ వారుద్దేశించిరి. ధర్మాదాయము గల ప్రతి దేవాలయములోను, గొంత ధనముతో ప్రజలలో విద్యావ్యాప్తిని, నీతిని, వైరాగ్యమును గలిగించుటకు, సంస్కృత

పాఠశాలనో, పురాణ పఠనాది సత్కాలక్షేపములనో, గ్రంథాలయమునో, ఏర్పాటు చేయించుటకు జాల పాటుపడుచుండిరి. దేవాలయములు మూఢవిశ్వాస దుర్గములు కదా యని వాని నిర్మూలనమున కుద్యమింపలేదు. ప్రజల కవి విశ్వాసపాత్రము లైనప్పుడు వానిని సాధ్యమైనంత వరకు సక్రమ మార్గముల సంస్కరించి, నీతిదాయకముగ చేయవలయు ననియే వారి లక్ష్యము.

వారు చనిపోవువరకును గూడ నీ ధర్మాదాయ విషయములో వారికి గల పట్టుదలను వదలుకొన లేదు. మాడపాటి వేంకటేశ్వర రావు పంతులుగారి విల్లు ప్రకారము వారి దానములు సక్రమముగ నిర్వర్తింప బడుటకు వారెట్లు పోరాడు చుండినదియు వారి మిత్రులకు దెలిసిన విషయము. వారిటీవల రుగ్మతలకు బాలైరి. శరీరము శుష్కించిపోయెను. ఒకచోటున నుండి ఇంకొక చోటునకు గదలుటకు గూడ ఓపిక లేకపోవుచుండెను కాని వారి సంకల్ప మమోఘము. ఆ కార్యము నందెందరో వారిని వంచించిరి. ఎదరో బలాఢ్యు లెదురైరి. అల్లాడి వంటి ఘనుడు కూడ ప్రతికక్షి అయ్యెను. కాని సూర్యనారాయణ రావుగారు వెనుదీయలేదు. న్యాయస్థాపనము కొరకు కోర్టుపై కోర్టున కెక్కుచుండెను వేంకటేశ్వర రావుగారి దానముల నపహరించుటకు వీరెవరు? ఏమైన కానిమ్ము ధర్మము సొంతముగ జయము గాంచువరకు వీరావేశముతో బోరాడుచుండెను ఆనాడు హైకోర్టులో తాను కొనయూపిరితో నుండియు, న్యాయమూర్తుల సమ్ముఖమున నిలువబడి, స్వయముగ వాదించుచుండినప్పుడు, న్యాయమూర్తులు కూడ దిగ్భ్రమ చెందిరి. వారి విషయములో నొక అడ్వకేటువలె ప్రవర్తించలేదు. కేవలము ఒక ధర్మ వీరుని వలె, ఒక సత్యసంధుని వలె నిప్పులు గ్రక్కుచు మాట్లాడిరి. ఈ కార్యము ఇంకను సొంతము కాలేదు. ప్రివీ కౌన్సిలులో బూర్ణ న్యాయము సిద్ధించువరకు ఈ యుద్ధము విరమించ కూడదనియే వారి ప్రతిజ్ఞ. మద్రాసు హైకోర్టు చేసిన అన్యాయనుపై ప్రివీ కౌన్సిలుకు అప్పీలు చేయుటకు సంకల్పించెను. తమకు 71 సంవత్సరములు వచ్చుటచే మరణ మాసన్నమైనదని వారికి దెలియును. తాము గతించుటవలన, ఆ ధర్మకార్యమునకు హాని కలుగకూడదని వారి నిశ్చయము.

అందుకొరకు, అప్పీలు నిమిత్తము తన స్వంతధనమును ధరావతుగ బెట్టెను. తాను చనిపోవులోపల, ప్రివీ కౌన్సిలుకు అప్పీలు పడినట్లు వినవలెనని వారి యాత్మ కోరుచుండెను ధర్మకార్యములందు వారికి గల పట్టుదల అట్టిది. ప్రతి కక్షులు సహితమీ విషయములో వారికి ఋణమిల్లక తప్పదు న్యాయవాదు లందరకు సూర్యనారాయణ రావుగారి జీవితము అనేక విషయములలో మార్గ దర్శకమై వెలయగలదు న్యాయవాద వృత్తిని ధర్మతత్పరతగ రూపాంతరము పొందించినవారు చాల యరుదు. సూర్యనారాయణ రావుగారి జీవిత మీ విషయములో చరితార్థ మైనదనుట నిశ్చయము.

వీరి జీవితములో మరియొక విశేషమున్నది. వీరు తమ వృత్తిలో నెక్కువ సంపాదించినవారు కాదు కేవలము పొదుపరితనము చేతనే, ఒక లక్షరూపాయల వరకు కూడబెట్ట గలిగిరి. చాలమందికి ఈ పొదుపరితనము లోభిత్వము వలె గన్పట్టుచుండెడిది. లక్షధికారి అయినందుకు, మేడలు మిద్దెలు కట్టుకొని, మోటా ర్లలో ఎందుకూరేగ లేదని చాలమంది ప్రశ్నించిరి. ద్రవ్యముపై గల మోహము చేతనే, వారు నిరాడంబరమైన జీవితమును గడుపుచుండిరని లోక మనుకొను చుండెడిది. కాని ఈ యపోహ తొలగుట కెంతకాలమో పట్టలేదు వారు రిటైరైన పిమ్మట ,వారు చేసిన దానములు వారి మిత్రులకు గూడ విస్మయమును గల్పించెను. వారి యాస్తిలో నే స్వల్పాంశమును గూడ కుటుంబమునకుంచక, డెబ్బది వేలకు పైగ ధర్మకార్యములకు దానము చేయుట ఆశ్చర్యము. చూచుచు జూచుచు తమ ఆస్తిని దానము చేయగల సాహసు లెంత మంది గలరు? మరణాంతము వరకు నుండి, విల్లులో గొంత దానము వ్రాసిపోవు దానశీలురు కొందరుందురు. సూర్యనారాయణ రావుగారట్టి జాతిలోని వారు కారు. బ్రతికి యున్నప్పుడే దానము చేసి, దాని ఫలితమును గనులార చూచి ఆనందించుకొనుటయే వారి అభిమతము. బ్రతికి యున్నప్పుడు, శేషజీవిత మింకను ఉండగా, చేయు దానమే నిజమైన త్యాగ మనిపించుకొనునని వారి వాదము. సూర్యనారాయణ రావుగారి ధాన పరాక్రమము వారి జన్మాదారభ్య అలవడిన గుణవిశేషము. వారికి చిన్న

తనమున బొందిన విద్యార్థి వేతనమును గూడ వారు బీద విద్యార్థులకు సహాయార్థముపయోగించు చుండిరను అంశమును దెలిసికొనిన, పరోపకారము వారియందు సహజసిద్ధమని బోధపడును. వారి సహాయముతో విద్యాధికులై, ఉన్నతోద్యోగులైన వారెందరో గలరు. వారి సహాయమును బడసిన ధర్మసంస్థలును జాల కలవు. బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాల, బెజవాడలోని ఆయుర్వేద వైద్య పాఠశాల, కొవ్వూరు లోని గీర్వాణ విద్యాలయము మొదలగు సంస్థలు వారి పేరును ఎన్నటికిని మరువ జాలవు.

సూర్యనారాయణ రావుగారి "స్వీయచరిత్రము'' ను జదివినయెడల, కేవల ఘనకార్యములందుకాక, సామాన్య సందర్భములలో సహితము మానవుని ధర్మ నిరతి ఎట్లు పరీక్షింపబడు నదియు వెల్లడి యగును. బహిరంగ రంగముపై దుమికి ప్రజల కరతాళ ధ్వనుల నాకర్షించు పెద్ద లెందరో యుందురు. మేధాశక్తి సంపత్తిచే ప్రాముఖ్యము వహించిన వారెందరో యుందురు. కాని జీవితము నంతను నిరాడంబరముగ ధర్మకార్య నిర్వహణము కొరకు నివేదించుచు సత్యవ్రతులు కాగలవారు చాల యరుదు. సూర్యనారాయణ రావుగారి చరిత్ర ఈ రెండవ వర్గములోనిది. వారి జీవితము మొదటనుండి తుదివరకు స్వశక్తి మీదనే ఆధార పడి యుండెను. స్వప్రయత్నమే వారి విజయమున కంతకు మూలము. అధికారుల కెప్పుడును తలయొగ్గి యెరుగరు సూర్యనారాయణ రావుగారి తీవ్ర విమర్శలకు బాత్రులై భయగ్రస్తులైన అధికారు లెందరో కలరు. ధనికుల మెప్పుకొరకు స్తుతిపాఠములను జదువు అభ్యాసము వారి ప్రకృతిలోనే లేదు. ఏ ధనికుడైనను వారి యెదుటబడిన, నీ వే ధర్మకార్యము చేసితివని నిర్మొగమాటముగ బ్రశ్నించెడి వారు. కులతత్వ మనునది వారి యం దిసుమంతయు లేదు. దురభిమానములు వారి దరిజేర రాదు. పేరు ప్రతిష్టల కొరకు బెనగులాడి యెరుగరు. ఎన్నడును అధికార పదవుల నాశించలేదు. ప్రజాహర్షము కొరకు స్వకీయాభిప్రాయములను మార్చుకొనిగాని, లేని విశ్వాసమును అభినయించిగాని ఎరుగరు. మిత్రులకు గోపము వచ్చునని సత్యమును మరుగుపరచ లేదు. వారి వాక్కు కొన్నివేళల బహు పరుషమై యుండెడి దను మాట నిజము. అభినవేశము యొక్క తీవ్రతయే పరుష

వాక్కుగ వెల్వడెడిదే కాని, క్రోధ మావహించి కాదు. వారి స్వభావము బహు సరళము. ఎత్తులకు ఎత్తులు వేయుట వారికి గిట్టని పని. ముక్కుకు సూటిగ బోవుటయే వారి స్వభావము. మనోదాస్య మనునది వారియందు బొత్తుగ లేదు. తమకు రుచించనియెడల మహాత్ముని అయినను ప్రతిఘటించెడివారు కాంగ్రెసు పద్ధతులను ఖండించుట కెప్పుడును వెనుదీయలేదు. ప్రజాభిప్రాయమున కెదురీత ఈదగల సాహసి. కేవలము స్వాభిమాన పూరితులు. ఎట్టి సంకట సమయములో నైనను ఆత్మధనమును గోలుపోయి యెరుగరు. బహు గ్రంథములను జదివినారు. కాని పాండిత్యభారముచే వారి తల బరువెక్కలేదు! చాల గ్రంథములను వ్రాసినారు. కాని తాను పెద్ద సాహితీపరుడనని గర్వించలేదు. ఎన్నియో దానములను జేసినారు. కాని త్యాగశీలుడనని ప్రకటించుకొనలేదు. ఆప్తులకు బంధువు, అసత్యవాదులకు ధూమకేతువు, సంస్కర్తలకు సహాయకారి, ఉదారాశయములకు ఆశ్రయము. వీరి మరణము వలన, ఆంధ్రదేశమునకు తీరని విపత్తు వాటిల్లినది. ముఖ్యముగ వారి యభిమానమునకు బాత్రమైన కృష్ణాపత్రికకు గలిగిన నష్ట మపారము;

కృష్ణా పత్రిక
మే 1వ తేదీ, 1937 సం॥

# రెడ్డినాయడు గారు

సర్ కూర్మా వేంకట రెడ్డినాయడు గారీ నడివేసవిలో ఊటీ కొండలపై జల్లగ విశ్రమించక, పాపము గోదావరిజిల్లా గ్రామాదులలో సంచార ప్రచారము లను బ్రారంభించుట జూడ వారిలో నేదియో చిత్త విక్షేపకరమైన కలవరము బయలుదేరినట్లు కన్పట్టుచున్నది. వారు పూళ్ళ గ్రామములో నిచ్చిన ఉపన్యాసము వారి కలవరింతను జెప్పకయే చెప్పుచున్నది. రెడ్డినాయడు గారు వక్తలనుటకు సందియము లేదు. కాని వారి వక్తృత్వము చాల పేలవము. భావగాంభీర్యము మృగ్యము. చింతనాపటిమ యెప్పుడును లేదు. గాలి మూటలుకట్టుట వారికల వాటు. వారి పలుకులలో నెట్టి వెల్తురు నుండదు. వేడిమి యెక్కువ. ఆత్మసమర్థ నము మెండు. ముఖ్యముగ నీ యుపన్యాసమునందు కేవలము ఉడుకుబోతుతనము తప్ప ఇక నేమియు గన్పట్టుటలేదు. ఇతర రాజధానులలోను నడుమంతరపు మంత్రులు కలరు. వారును గ్రామాలలో సంచారము సేయుచున్నారు. కాని వారిలో నెవరును ఇంత వెర్రిగ మాట్లాడినవారు లేరు. బొంబాయిలో జమ్నాదాసుగారిని చూడుడు. యు.పి లో చటారీ నవాబుగారిని తిలకింపుడు బీహారులో యూనస్ సాహెబుగారిని గాంచుడు. వారెల్లరు కాంగ్రెసున కెంత ప్రతికూలురైనను, వారిలో నెవరును బ్రిటిషు అధిరాజ్యమును సమర్థించి యెరుగరు. కాంగ్రెసు మంత్రిపదవు లను స్వీకరింపనందుకు దమ యసమ్మతిని దెలుపుచున్నారేకాని, కాంగ్రెసు లక్ష్యమునెడల, కాంగ్రెసు కార్యక్రమమునుగూర్చి సంపూర్ణ విశ్వాసమునే వెలిపుచ్చుచున్నారు. గవర్నరుల కియ్యబడిన నిరంకుశాధికారములను వీరెవరును సమర్థించుటకు సాహసించలేదు. కాంగ్రెసువారు మంత్రిత్వమును స్వీకరించిన ఏ ప్రణాలికను ఆచరింపబూనెదరో, దానినే తాము స్వతంత్రముగ నిర్వహింప సమకట్టుచున్నామని ప్రకటించుచున్నారు. గవర్నర్లు తమ కడ్డమురాక, తమకు బరిపూర్ణముగ దోడ్పడుచున్నారని కూడ దెల్పుచున్నారు. అంతియగాని

వీరెవరును రెడ్డినాయడు గారివలె వెనుకటి శతాబ్దపు తాతలనాటి మాటలనువద లుటలేదు నాయడుగారిలో నెప్పుడును, ఏ కోశముననుజాతీయభావ మనునది లేనిమాట నిశ్చయమే. వీరు కేవలము మల్లుతాను సభాధ్యక్షులు. బ్రాహ్మణేత రోద్యమములో నెటులనో బయటకు నెట్టుకొని వచ్చిన వారు పానుగల్లు రాజాగారు ఎంత జస్టిసుపార్టీ నాయకుడైనను, వారిలో జాతీయభావము ప్రకోపించి యుండెడిది. బొబ్బిలిరాజులో నట్టిది గాన్పించకపోయినను కార్యసాహసమునం దద్వితీయుడు. తాను రాజధాని నేలినంత కాలము సెక్రటరీల నాడించినాడు కాని, వారికి దోసిలొగ్గలేదు. రెడ్డినాయడుగారిలో పానుగల్లురాజాగారి విశాలదృష్టికాని. బొబ్బిలిరాజాగారి కార్యశూరతగాని గాన్పించదు. న్యాయవాదిగ నెక్కువ పేరును గడించలేదు. శాసనసభలలో నుండి చేసిన పని సున్న. మంత్రిగ సెక్రటరీల నోట్లకు దస్కతుపెట్టుట తప్ప వీరెట్టి పరిపాలనాదక్షతను జూపియుండ లేదు. తాము స్వయముగ మ్యాన్చెష్టరు అభిమానులైనప్పుడు, ఇండస్ట్రీసు మంత్రిగ దేశీయ పరిశ్రమల కెట్టి యుపకారము చేయగల్గుదురు? దక్షిణాఫ్రికాలో గావించిన సామ్రాజ్యసేవ వానికే తెలియవలెను. ఎక్జిక్యూటివుకౌన్సిలరుగ బంధుజనమున కుద్యోగము లిచ్చుటకంటె వీరు స్వతంత్రముగ జేసిన దేమియు లేదు. ఆక్టింగు గవర్నరుగ నుండి నాలుగు మాసములును విందులతో గాలము పుచ్చిరి.

ఇట్టి చరిత్రగల వీరిప్పుడు ప్రధానామాత్యులై క్రొత్తగ నేమి వెలగపెట్ట గలరు? వీరు గవర్నరుగారి పిలుపు నెందు కందుకొనినదియు చెప్పిన సమాధానము వారి చరిత్ర కనుగుణముగనే యున్నది. గవర్నరుగారు రోజుకు రెండు మూడువందల కాగితాలకు దస్కతు పెట్టవలెనట. దస్కతు పెట్టనియెడల ప్రభుత్వమంతయు నిలచిపోవునట. గవర్నరు ఒక్కడిన్ని కాగితముల నెట్లు చూడగలడు? కాబట్టి ప్రభుత్వము ఆగిపోకుండ నిలుపుటకు తామీ యమాత్య పదవిని స్వీకరించిరట. ఈ విషయములో రెడ్డిగారు యథార్థము వచించిరనుట నిస్సంశయము. కాగితముల క్రింద సంతకములను బెట్టుటకే వీరీ కార్యభారమును స్వీకరించిరనుట నిజము. ఈ పనిలో వీరు కడు సమర్థులు. వీరు మొదటి

నుండియు నీ పనిలో నారితేరిన అనుభవజ్ఞులు వీరు సంతకములను బెట్టుటకు సాయపడని యెడల, ఈ బ్రిటిషు సామ్రాజ్యమేమి అయ్యెడిది ? వీరు భూమి క్రుంగిపోకుండ అడ్డుపడిన కూర్మావతారు లనుట నిశ్చయము. ఈ ప్రకటనమును జూచియే బ్రిటిషు మేటి రాజ్యతంత్రజ్ఞుడగు కీతు పండితుడు నవ్వినాడు. ఈ యశాస్త్రీయమైన నడమంతరపు మంత్రివర్గమును నియమించకపోయినను, గవర్నరు రాజుగారి ప్రభుత్వమును గొనసాగించుటకు ౯౩వ సెక్షను క్రింద అధికారము గలదని తెలిపినాడు. రెడ్డినాయడు గారు 1935 చట్టమునైనను సాంతముగ జూచినట్లు లేదు. రాజుగారి ప్రభుతను సాగించుటకు నడమంతరపు మంత్రివర్గమే గత్యంతరమని వీరెట్లూహింప గల్గిరో తెలియకున్నది. చట్టములో నీ ఇంటెరిమ్ - మినిస్ట్రీ విషయము ఏ కోశమున సూచింపబడలేదు ఎప్పుడు స్థిరమైన మంత్రివర్గ మేర్పడదో, అప్పుడు కాన్స్టిట్యూషను విఫలమై నట్లెంచుకొని ౯౩వ సెక్షను క్రింద సర్వాధికారములను గవర్నరు స్వీకరించ వలయుననియే చట్టముయొక్క నిర్ణయము. కీతుపండితుని ఆక్షేపణమునకు రెడ్డినాయడు గారు ప్రత్యుత్తర మియ్యలేకపోయిరి అంతటితో మౌనము వహించినను బాగుండెడిది.

రెడ్డినాయడు గారట్టి మరియాద నెరుగగల సంస్కారులు కారు. రాజుగారి ప్రభుతను తాము నిలువబెట్టుచున్నారట. అయితే కానిండు సంతకములు పెట్టుటకు ముందుకు వచ్చిన వీరు సెక్రటేరియటులో నుద్యోగులుగ నెంచబడదగుదురేకాని మంత్రులుగ భావింపబడుట యెట్లు ? అసెంబ్లీ సమావేశము కానంతవరకే వీరి సంతకములు సాగుచుండును. ఏనాడు అసెంబ్లీ కూడునో నాడు కలము క్రిందపెట్టక తప్పదు ఈయన అసెంబ్లీసభ్యుడు కాడు. కౌన్సిలుకైనను ఎన్నుకొనబడినవాడు కాడు. క్రైస్తవస్త్రీని వివాహమాడుటకు హిందువు మతాంతరు డైనట్లున్నది వీరి నామినేషను. మంత్రిత్వమున కర్హతను గల్పించు నిమిత్తము గవర్నరుగారు వీరిని కౌన్సిలుకు నామినేటు చేసిరి. ఈయన నామక ః కౌన్సిలుమెంబరు కాని వాస్తవముగ గాదు. నియోజక వర్గమునుండి ఎన్నుకొనబడని వీరిని అమాత్య పదవికి నియమించుట అశాస్త్రీయమని జస్టిసు పార్టీవారే తీర్మానించిరి. ఇప్పుడు వీరు తోడు పెండ్లికొమరుని వలె వెంటబెట్టుకొని త్రిప్పు

చున్న ముత్తయ్యచెట్టిగారు కూడ నీ తీర్మానమునకు దోడ్పడినవారే. జస్టిసుపార్టీ వారి విశ్వాసమును గూడ నాకర్షించలేని రెడ్డినాయుడు గారికి దేశములో స్థాన మెక్కడ ? అసలు నడమంతరపు మంత్రివర్గమే అశాస్త్రీయము. ప్రజలచే నెన్ను కొనబడని వానిని ప్రధానామాత్యునిగ జేయుట మరింత కూడని పని. దేశము నందంతట వీరియెడల అవిశ్వాస తీర్మానములు బయలుదేరినవి. వీరి పదవి యొక్క ఆయుర్దాయమును ముగింపునకు వచ్చినట్లు కన్పట్టుచున్నది. కాంగ్రెసుతో రాజీకుదురు సూచన లున్నప్పుడు, వీరి నిష్క్రమణము సన్నిహిత మనుట నిశ్చయము. అంతటితో వీరికి మతి స్థిమితమే తప్పినది. పూర్వమున్న గౌరవమా, అడుగంటినది. అమాత్య పదవియా జారిపోవుచున్నది. జస్టిసు పార్టియా, ఆదుకొనలేదు. కితుపండితుడా, వీరి తెలివితేటలను జూచి నవ్వినాడు. ప్రజలా, ఈ నడుమంతరపు మంత్రులను సరిగ వివాహమాడని ఉంపుడుకత్తెల క్రింద గట్టినారు. శ్రీ రాజగోపాలాచార్యులు గారు మద్రాసు సముద్రపుటొడ్డున వీరి నేదో యన్నారని ఉడికిలి, తాను బ్రాహ్మణేతరు డగుటచేత ఆచార్యులు గారు తనను తూలనాడి నారనుచు దుఃఖమును వెలిపుచ్చుచున్నారు. ఇక వీరు ఉదకమండలములో నెట్లు విశ్రమించగలరు ? కేవలము సంతకములను తగ్గించు అమాత్య శేఖరుని యెడల, ఆ సెక్రటరీలకు మాత్రమేమి గౌరవ ముండును ? క్రొత్తపట్టణం స్కూలును నిషేధించవలయునా, తన సంతకము సిద్ధము. లాటీ చార్జి జరిగినను జరుగలేదని ప్రకటించవలయునా ? జంకకుండ సంతకము పెట్టగలరు. లోకములో గగ్గోలు పుట్టినది.

ఇతర రాజధానులలో తనవంటి మంత్రు లూరేగుచున్నారు. ఈ రాజధానిలో ఎమ్. సి. రాజా గారైనను చెంగల్పట్టు జిల్లాకు బోయి. తోడి హరిజనుల నుండి యభినందన పత్రికలను స్వీకరింప గలుగుచున్నారు. తాము ప్రపంచముతో సంబంధము లేకుండ, జనానాస్త్రీ వలె ఆ మూలసౌధంబులో నెంతకాలము దాగి యుండగలరు? గవర్నరు మాత్రము ఈ యుపేక్ష నెట్లు సహింపగల్గును? వీరికి దేశములోనెట్టి పలుకుబడి యున్నదియు వారింకను సరిగ దెలిసికొనినట్లు లేదు.

ఆక్టింగు గవర్నరు చేసిన ఈ యాంధ్ర ప్రముఖునకు తెలుగు జిల్లాలలో గొంత పలుకుబడి యుండకపోవునా యని గవర్నరుగారికి అనుమానము కలిగియుండును. "రెడ్డినాయడుగారూ. మీరొక్కమారు మీ స్వమండలమున కైనను బోయి, వోటర్లను బలుకరించి రాకూడదా" యని ప్రశ్నించియుందురు. అంతటితో రెడ్డినాయుడు గారు ఊటీకొండల నుండి దిగి పూళ్ళకు బోయి బంధుజనమును గలుసుకొనినారు. వారైనను వీరిపై సానుక్రోశమును జూపకుందురా? ఈ రెండునెలలు నాయడుగారు లోలోపల పడిన అవేదన నంతను బంధువర్గమునకు వెళ్ళబుచ్చుకొనినారు. తాను బ్రాహ్మణేతరు డగుటచే కాంగ్రెసువారు తనను తూలనాడుచున్నారని చెప్పుకొన్నారు. అయితే జస్టిసుపార్టీ వీరి మంత్రిత్వమునెడల నసమ్మతి దెలుపుటకు గారణమేమి యని రావుసాహెబు కళ్ళి చిట్టిఅబ్బాయి నాయడుగారైనను జాటున బ్రశ్నించి యుందురు. మద్రాసులో బొబ్బిలిరాజగారి యింట రెడ్డినాయడుగారి మంత్రిత్వము నెడల అసమ్మతి దెలిపినప్పుడు ముత్తయ్య చెట్టిగారు తోడిమంత్రి యయ్యు అందుకు అంగీకారమును దెల్పుటేల యని కూడ అడిగియుందురు. దీనికి ఏమి సమాధానము చెప్పగలరు? ఆ పరిభవమును మరుగుపరచుటకు ముత్తయ్య చెట్టి గారు రెడ్డినాయడుగారి త్యాగ సాహసములను బ్రశంసింప మొదలిడిరి. రెడ్డి నాయడు గారివంటి మహారధుని క్రింద తాను పనిచేయుట గొప్ప గౌరవముగ నెంచుకొనుచున్నానని కూడ వాక్రుచ్చిరి. అప్పటికిని బంధుజనము సంతృప్తి పడి నట్లు లేదు. పూళ్లకు రోడ్డు వేయించెద మనినారు.పూళ్ళస్కూలును హైస్కూలుగ జేసెద మనిరి. ఎన్ని వాగ్దానములు చేసినను, పూళ్లగ్రామస్థుల సంశయములు వీడినట్లు లేదు.

నాయుడుగారే తమ త్యాగ సాహసము లెట్టివో చెప్ప మొదలిడిరి. తామా యమాత్యపదవిని స్వీకరించినది. ధనాశచేత గాదట. తాము ఏలూరులో ప్లీడరీ చేసికొనుచు ఏ నాలుగు డబ్బులు సంపాదించుకొనిరో అది తప్ప ఇటీవల సమ కూర్చుకొనినది ఏమియు మిగలలేదట. వెనుక మంత్రిగను, తర్వాత దక్షిణాఫ్రికాలో

ఏజంటుగను, పిమ్మట ఎక్జిక్యూటివు కౌన్సిలరుగను, అనంతరము ఆక్టింగు గవర్నరుగను, ఇప్పుడు అమాత్య పుంగవుడుగను బనిచేసి సంపాదించిన సహస్రములన్నియు నేమైనవో తెలియదు. ఇటీవల ఆస్తి యేమాత్రము పెరగలేదట! వీరు చేసిన దానధర్మములా లోక మేమాత్రము ఎరుగదు దొరలకు జేసిన విందులా, ఎక్కువ యున్నట్లు కన్పట్టదు. అయినను వేలకు వేలు తీసికొనిన వేతనములన్నియు నెట్లు హరించిపోయినవో తెలియదు. ''స్త్రీణాం చ చిత్తం పురుషస్య భాగ్యం దేవో నజానాతి కుతో మనుష్యః'' అన్నారు పెద్దలు. ఇంతకును వీరు తమ ఆస్తిని విస్తరింప జేసికొనిరా లేదా యని కాదు ప్రస్తుతాంశము ఈ హోదాలలో ద్రవ్యార్జనము చేసిరా లేదాయనే విషయమే ముఖ్యము నిజమే, ఎంత చెట్టుకు అంత గాలి. వెనుక పానుగల్లురాజాగా రమాత్యులై అప్పుల పాలయ్యేను. పాపం బొబ్బిలిరాజాగారు తమ హయాములో ఆదాయమును మించిన వ్యయము చేసిన విషయము లోకవిదితము కాని వీరు తమ పార్టీని నిలువబెట్టుకొనుట కెంతయో వ్యయపరచిరి. రెడ్డినాయడుగారు పార్టీబాధ్యత నెప్పుడును నిర్వర్తించినట్లు లేదు ఇటీవల వీరికిని జస్టిసుపార్టీకిని సగమెరుక. ఏ కారణమైన నేమి? వీరెన్ని ఘనములైన హోదాలలో నుండియు, హెచ్చు ఆస్తిని సంపాదించనందుకు వారు నిజముగా బంధుజనుల సానుభూతికి బాత్రులు కాగలరు బ్రాహ్మణేతరాభిమానము తోడు, ధనాభావము కూడ జేరినప్పుడు, వారు సానుభూతిపాత్రులు కాకుండ నెట్లుండగలరు?

రెడ్డినాయడుగారు ఆపత్కాలములో ఆదుకొన్నందుకైనను, ప్రభుత్వము వారు వారియెడల కృతజ్ఞత జూపకుండ వారి సలహాను నిరాకరించుట యేటి న్యాయము? కాంగ్రెసువారు గవర్నర్లనుండి ఖరార్నామా కోరుట యశాస్త్రీయము, అక్రమము అని రెడ్డినాయడుగారు ఘోషించుచున్నను, ప్రభుత్వమువారు కాంగ్రెసు కోరికను సంతృప్తిపరుప జూచుట కేవలము కృతఘ్నత. రెడ్డినాయడు గారంతటివాడు అండయై నిలచినప్పుడు ప్రభుత్వము వారికింకను జంకు ఎందులకు? జెట్లెండు ప్రభువు మొదట జేసిన ప్రకటనపై నిలువబడియుండక క్రమక్రమముగ క్రిందకు

దిగవలసిన పని యేమి? కాంగ్రెసు కోరుచున్న షరతుల నన్నింటిని ప్రభుత్వము వారు నేడొప్పుకొనుచున్నట్లు కన్పట్టుటలేదా? సాధారణ పరిపాలనా వ్యవహారములలో మంత్రులకు బరిపూర్ణమైన స్వేచ్ఛ యుండవలెననిగదా కాంగ్రెసు కోరినది. దానికి బట్లరు, జెట్లెండు ప్రభువు మంత్రులదే పూర్తి బాధ్యత యని సమాధానము చెప్పిన పిమ్మట. ఇంకను రెడ్డినాయడుగారి అరణ్యరోదన మెందుకో తెలియకున్నది. గవర్నర్లకున్న ప్రత్యేకాధికారములు గల మూడు సందర్భములలో తప్ప తక్కిన అన్ని వ్యవహారములలోను గవర్నర్లు ఎట్టి జోక్యము గల్పించుకొనరని స్టేటు సెక్రటరీ గారేకాక, బొంబాయి, యు. పి. గవర్నర్లుకూడ హామీ ఇచ్చిరే. ఇదంతయు రెడ్డినాయడుగారిని చిన్నబుచ్చుట కాదా? గవర్నరుగారి ప్రత్యేకాధికార విషయములలో మంత్రులతో ఎంత ప్రయత్నించినను సఖ్యత కుదరనియెడల, మంత్రులు తమంతట తాము రాజీనామా నిచ్చుటయా, లేక గవర్నర్లు వారిని బర్తరఫ్ చేయుటయా యను విషయములో గూడ రెడ్డినాయడుగారు తమ యభిప్రాయమును ప్రకటించుటకు వెనుదీయలేదు. మంత్రులను బర్తరఫ్‌చేయు పద్ధతి ప్రపంచములో నెచ్చటను లేదట. బర్తరపు చేయమని వారిని గోరుట గవర్నర్ల యాత్మ గౌరవమునకు భంగకరమట! అసలు డిస్మిసల్ విషయము చట్టములోనే ఉన్నసంగతి రెడ్డినాయడుగారికి తెలిసినట్లు లేదు.

ఆ డిస్మిసల్ ఏ రూపము దాల్చవలెనను విషయమే ఇప్పుడు చర్చనీయము. మంత్రుల రాజీనామా నంగీకరించుట కూడ డిస్మిసల్ అని రాజ్యాంగ తంత్రజ్ఞులు నిర్వచించి యుండిరి. ఇప్పుడు గాంధిగారు గవర్నరు సరాసరి డిస్మిసు చేయక పోయినను గవర్నరు మంత్రులను రాజీనామా నియ్యవలసినదిగ గోరిన జాలునని మహాత్ములు సూచించినారు. ఇదికూడ డిస్మిసుచేయు పద్ధతులలో నొకటి. చట్టము ప్రకారము అసలు ప్రభుత్వాధికారమంతయు గవర్నరునదై యుండియు, దానిని గవర్నరు మంత్రుల పరముచేయుటకు స్వేచ్ఛ యున్నప్పుడు: ఆ యధికారము నుపసంహరించుటకును స్వేచ్ఛ యున్నట్లుగ భావించక తప్పదు. ఎప్పుడు మంత్రులకు సంక్రమించిన బాధ్యతను గవర్నరు ఉపసంహరించుకొని స్వీక

రించునో! అది డిస్మిసల్ కాక మరియేమి? బలవంతముగ రెజిగ్నేషను ఇప్పించినను డిస్మిసలే Enforced resignation tantamounts to dismissal అను విషయము నెల్ల రంగీకరించుచునే యున్నారు గవర్నరు యొక్క బాధ్యతను నిరూపించుటకే కాంగ్రెసు ఈ షరతును గోరుచున్నది. ఈ విషయములో గూడ రెడ్డినాయడుగారి సలహా పాటింపబడునట్టు లేదు. గాంధిమహాత్ముని సూచనను ప్రభుత్వము వారంగీకరించిన యెడల, రెడ్డినాయడుగారు త్రోసిరాజయినట్లే. పాపం, రెడ్డినాయడుగా రంగుళమంగుళము పోరాడుకొనుచు వచ్చుచున్నారు. అయినను కాలు వెనుకకు వేయక తప్పుటలేదు. గవర్నర్లు కాంగ్రెసు మంత్రులకు హామీ ఇచ్చి వారికి పట్టము గట్టుటకు సిద్ధపడుచున్నట్లు స్పష్టమగుచున్నది. కాంగ్రెసుకును గవర్నమెంటుకును ఏకీభావము కుదిరినను సి. రాజగోపాలాచారి గారు మంత్రిత్వమును స్వీకరింపనందుకు తనకు ఆశాభంగము కలుగుచున్నదని జెట్లెండు ప్రభువు బహిరంగపరచుచున్నాడు రెడ్డినాయడు గారిక పదభ్రష్టులు కాకతప్పదు దానికి సిద్ధమేనట సిద్ధపడక మరి యేమి చేయగలరు? వారింకను చూరు పట్టుకొని వ్రేలాడెదరా? గాలికి ఎగిరిపోయిన పేలపిండిని కృష్ణార్పణమస్తు అన్నట్లు తాము రాజీనామా నిచ్చుటకు సంసిద్ధులమై యున్నామని చెప్పుచున్నారు. అపూర్వమైన త్యాగము!

రెడ్డినాయడుగారీ చర్చతో విరమించినను బాగుండెడిది. వీరి వాచాలత్వమంతటితో గట్టుపడునది కాదు. వారి నోటినుండి ముత్యాలు కోవలుగట్టి రాలినవి. అమూల్యములైన ముత్యములు! ఆ ముత్యములను జూచి పూళ్ల గ్రామస్థులెంత ముగ్ధులైరో? కాని వారమాయికులు కారు. ఎంత బంధపక్షపాత మున్నను, నిజము నరయగల వివేకులు వారు. నాయడుగారు సంకటములో జిక్కుకొనినందుకు వారు విచారించవచ్చును, కాన్‌స్టిట్యూషనుకు సంబంధించిన చర్చల సారాసారములను వారు గ్రహించలేక పోవచ్చును. నాయడుగారు చేసిన అధిక ప్రసంగమునకు మాత్రము వారచ్చెరువొంది యుందురు. కాంగ్రెసు తిట్టులలో బుట్టి, తిట్టులలో పెరిగినదట. బ్రిటిషు ప్రభుత్వము క్రింద ప్రజలు హాయిగా

సుఖము ననుభవించు చున్నారట. బ్రిటిషువారు ఇండియాకు సంపూర్ణమైన సైనిక శిక్షణము నిచ్చిన పిమ్మట కాని ప్రజలు స్వాతంత్ర్యమును గోరకూడదట. రత్నాలవంటి వాక్యాలివి. గవర్నర్ల నోటినుండి సహితము రాలని ముత్యాలివి. ఇట్టి పరమ రాజభక్తులకు ప్రభుత్వాధికారము సిద్ధించిన యెడల, వీరి పరిపాలన మెట్లుండునో వేరుగ జెప్పవలయునా? ఇంతటితో నైనను ఊరకొనిరా? లేదు. తామెప్పుడును రైతుకొరకే పాటుపడు చున్నారట వారి జీవితమంతయు రైతు క్షేమము కొరకు వినియోగపడినదట. తమ శరీరము పుట్టినది రైతుసేవ కొరకట! ఎట్టి రైతుబాంధవు డవతరించినాడు? రైతుపై నిజముగ వీరికి అభిమాన ముండి యుండిన యెడల, వీరు వెనుక నీ జిల్లాలో సెటిల్మెంటు నెందుకు ఆపించలేక పోయిరి? రూపాయకు పావలా హెచ్చుపన్ను కెందుకంగీకరించిరి? డాక్టరు సుబ్బరాయనుగారు నూటికి 25 వంతులు శిస్తును తగ్గింపగోరినప్పుడు, వీరా తీర్మానము నెందుకు ప్రతిఘటించిరి? అప్పుడు లేని అభిమాన మిప్పు డొక్క మారుగ నీ యమాత్యశేఖరు నావహించినది కాబోలు! ఈ నడుమంత్రపు మంత్రిత్వమును స్వీకరించినందుకు లోకకంటకుడ నైపోతిని గదా యను చింత పొంగి పొరలుటచే, వారి నోటనుండి యిట్టి నురుగులు చుట్టలు చుట్టుకొని బయల్పడినవి. పై మాసాంతమున నైనను వీరికి అమాత్యత్వము వదలి విశ్రాంతి చేకూరగలదు.

కృష్ణా పత్రిక
జూన్ 5వ తేదీ, 1937 సం॥

# ఆంధ్రశిల్ప లక్షణములు

మొన్న రాజమహేంద్రవరంలో రామారావు స్మరణదినమున సబ్-కలెక్టరు ఆర్- గెలట్టీగారి యధ్యక్షతక్రింద సభ జరిగినది. ఆ సభలో డా. వేంకట్రావు గారు ఆంధ్రశిల్ప వికాసమును గూర్చి ప్రశంసించుచు రామారావుగారు నవ్యాంధ్ర శిల్ప ప్రతిష్ఠాపకులని ఉగ్గడించిరి. రామారావుగారి శిల్పనైపుణ్య మత్యంత ప్రశంసాపాత్ర మనుటకు సందియము లేదు. కాని ఇందు ఆంధ్ర వైశిష్ట్య మెచ్చట కలదో మాకు మాత్రము బోధపడుటలేదు, ఆంధ్రులలో నిప్పుడిప్పుడే శిల్పకళాభిరుచి తిరిగి మొలకెత్తుచున్న దనుట నిశ్చయము అచ్చటచ్చట ఆంధ్ర యువకులు కళోపాసకులై ఆంధ్రుల ప్రోత్సాహాభిమానములకు పాత్రులగుచున్నందు కెంతయు సంతోషము నొందవలసి యున్నది. కాని ఈ ప్రయత్నములలో ప్రత్యేక ఆంధ్రత్వము వ్యక్త మగుచున్నదని చెప్పుట మాత్ర మతిసాహసము కొంతకాలమున కట్టి సిద్ధి కలుగవచ్చునేమో కాని. నేడు ఆంధ్రమండలములో శిల్పులు బయలుదేరుచున్నంత మాత్రమున, వారి రచనయందింకను ఆంధ్ర సంప్రదాయ సిద్ధములైన విలక్షణములు నవ్యరూపమున గోచరించుచున్నవని చెప్పజాలము. మన ఆంధ్రులలో గొందరు ప్రమోదకుమార చతోపాధ్యాయుల శిష్యులగుటచే, వారు చాలవరకు వారి గురువులనే అనుకరించుచున్నారు. కొందరు రామారావుగారివలె బొంబాయిలోని శిల్పవిద్యాపీఠము నొద్ద చిత్రకళ నభ్యసించి వచ్చుటచే, వారు చాలవరకు ఆ త్రోవలనే త్రొక్కుచుండిరి. కొందరు మద్రాసులో దేవీరాయి చౌదరిగారి అడుగుజాడలలో నడుచుచున్నారు. కొందరు మైసూరు వెంకటప్పగారి పనితనమును లక్ష్యముగ బెట్టుకొనుచున్నారు. వీని యన్నిటి యందును గొంత అజంతా, కొంత రాజపుత్ర, కొంత జపాను, కొంత పాశ్చాత్య పద్ధతుల కలయికలు వివిధ పరిమాణ గతులలో నేర్పడుచున్నవి. కొంతకాలమునకీ సమ్మేళనము నుండి నవ్యాంధ్ర సంప్రదాయ మొకటి బహిర్గతమగునని ఆశించ

వచ్చును. అట్టి సుదినము నే యాంధ్రు డభిలషించకుండును? ఆ విషయ మటుండనిండు.

వేంకట్రావుగారా యుపన్యాసములోనే ఆంధ్రశిల్పము ప్రకృతియొక్క సహజ సౌందర్య స్వరూపమునే ఆశ్రయించెనుగాని, లక్షణకారులు సూత్రీకరించిన నిబంధనలను- కన్వేషన్సు- పాటించి యుండలేదని తెలిపినట్లు ప్రకటించబడినది. ఇందుకు అజంతా, అమరావతి. నాగార్జునకొండ శిల్పములే తార్కాణములని కూడ బ్రతిపాదించిరట ఈ సిద్ధాంతము సత్యదూరమేమో యని చెప్ప సాహసించి నందుకు వారు మమ్ములను మన్నించెదరు గాక! భారత కవితయందు వలెనే, భారత శిల్పవిద్యయందు కూడ గొన్ని లక్షణములు, నిబంధనలు, సమయములు రూఢములై యున్న సంగతి లోకవిదితము ఏ విద్యయైనను గొన్ని రూఢములైన లక్షణములచేత లక్షిత మైనప్పుడే, అందొక పరంపరానుగతమైన సంప్రదాయ మేర్పడుటయేకాక, ప్రాంతిక వైలక్షణ్యమును వ్యక్తపరచుట కొక యుపాధి కల్పింపబడును. ప్రతి జాతికి, ప్రతి ప్రాంతమునకు చిరకాలానుగత వాసనా పూర్వకమైన సంస్కారము అంతర్ధారగ బ్రవహించుచుండును. ఆ ధారయే సంప్రదాయమునకు, "ట్రెడిషను"కు మూలము ఆ ట్రెడిషను ఏ కవియందు, ఏ శిల్పియందు,నిజరూపమున వెల్లడియగునో, వారి రచనలే వారు చెందిన జాతికి, ప్రాంతమునకు లక్ష్యము లగును. లక్షణకారులు వానినిబట్టి కొన్ని సామాన్య లక్షణ ములను సూత్రీకరించి, తద్వారా ఆ సంప్రదాయమును బోషింప జూచెదరు. భారత శిల్పవిద్య సంప్రదాయసిద్ధ మగుటచేతనే, ఆ సంప్రదాయ స్వరూపము నెరుగనివారి కది సుబోధకము కాకుండ పోవుచున్నది. ప్రాచీన చిత్రములలోని హస్తములు, ముద్రలు, భంగిమములు, ఆసనములు. పీఠములు వాహనములు, అలంకారములు, వేషములు, ఆయుధములు చిత్రవిద్యకు పారిభాషికములై వెలయు చున్న విషయము పరిశీలకులకు దెలియనిది కాదు ఇవి యన్నియు భావవ్యంజకము లైన కవిసమయముల వంటివి అంతియకాక, రచనా విన్యాసమునందు కూడ- టెక్నీకులో- ఒక సంప్రదాయ మేర్పడుట కలదు. గాంధార అజంతా సంప్రదా

యములకు వేరువేరు టెక్నీకులు కలవు. రాజపుత్ర పద్ధతియందు గల టెక్నీకు మరొక రూపము దాల్చియున్నది. సారనాదు, అమరావతి, అజంత, మధుర, బార్హూటు, తంజావూరు మొదలగు ప్రాంతములందు భిన్న సంప్రదాయము లేర్పడి, భారత శిల్పవిద్యను కళాసమృద్ధముగ నొనర్ప గలుగుచుండెను. ఆంధ్రశిల్పము భారత శిల్పమునం దంతర్గతమైనదేకాని, దానికి బాహ్యము కాదు. ఆంధ్రశిల్ప మనుటలోనే. అందొక ప్రత్యేక పద్ధతి యున్నదను విషయము ద్యోతక మగు చున్నది. అంతియకాని, అది భారత శిల్పమునకు సంబంధము లేని "అచుంబిత క్రియ'' మాత్రము కానేరదు.

ప్రపంచ పరిచయము దట్టమగుచున్న ఈ ప్రకృత కాలమున, పూర్వ కాలపు నిబంధనల బిగువు కొంతవరకు సడలుట యవసరము, అనివార్యము. ప్రాచీనకాలమునందు కూడ భారత శిల్పము క్రమానుగతమైన మార్పు నొందుచునే యుండెనని భారతశిల్ప చారిత్రమును బరిశీలించిన బోధపడును. వేదకాలమునాటి అచాక్షుష మూర్తులు క్రమముగ రూపరేఖలను దాల్చిరి. అదిని దేవతల నాశ్ర యించిన శిల్పము బౌద్ధయుగములో కైలాసశిఖరము దిగి మానవ జగత్తున నవత రించెను. ఆ శిల్పమే పురాణకాలము నందు అవతార పురుషుల లీలలయందు విలసిల్లెను. మహమ్మదీయ ప్రభువుల రోజులలో మొగలు సామ్రాజ్యలక్ష్మిని మోహించి, పాదుషాల మహలులలో విహరింప జొచ్చెను. ఇవ్విధముగ నీ శిల్పము వస్తువునందేకాక, రూపకల్పనల యందు, ఆయుధాలంకార రీతులందు, రచనా విన్యాసములందు, వర్ణికాభంగములందు పరిణామము పొందుచునే యుండెను. అయినను ఈ వివిధ పరిణామదశల వెనుక ధారావాహికమైన యొక సంప్రదాయ సూత్రము వ్యాపించి యుండుటచేతనే, భారత శిల్పమున కొక ఏకత్వము. ప్రత్యే కత సంఘటించుట కాస్కార మేర్పడినది. అట్లే ఈ వర్తమాన కాలములో గూడ నీ భారత శిల్పము ఇంకను నూతన విలసనమును బ్రదర్శింప గలదనుటకు సందియము లేదు కావున శిల్పము లక్షణలక్షిత మైనంత మాత్రమున, నయ్యది సహజ విలసనమును గోలుపోవు ననుకొనుట ఘోరభ్రాంతి. గెలట్టీగారు నుడివినట్లు

ప్రాచీన శిల్పలక్షణముల నుండి సంప్రదాయ సిద్ధముగ నేర్పడిన శిల్పలక్షణములు నిరాదరణీయములు కావనుట నిశ్చయము. ఆంధ్రకళా కోవిదు లీ విషయమును మరువకుందురు కాక!

ఈ విషయమై ఆంధ్ర జాతీయ కళాశాల ప్రధానాచార్యులగు అడవి బాపి రాజుగారు మాకు పంపిన జాబు నీక్రింద జేర్చుచున్నాము :-

ఈనెల 15వ తారీఖున రామారాయ స్మృతిదిన సందర్భాన దామెర్ల వెంకట్రావుగారు ఉపన్యసిస్తూ ప్రథమంలో ఆంధ్రశిల్పులు ప్రకృతిసౌందర్య ముగ్ధులనిన్నీ, వారు శిల్పసమయాలకు (Conventions) విరుద్ధులనిన్నీ, అందుకు తార్కాణం నాగార్జునకొండ, అమరావతీ, అజంతా శిల్పమనిన్నీ మధ్య కాలంలో ఆంధ్రశిల్పులు శిల్ప సమయాచార పరులగుట చాలా విచారకర మైన దనిన్నీ, రామారావుగారు పూర్వాంధ్ర శిల్పము పునరుద్ధరింప చేస్తూ, దానికి కొంత ఆదర్శవాద (Idealism) గంధము కూర్చినారనిన్నీ సెలవిచ్చినారు.

ఆంధ్ర శిల్పులు ప్రకృతి సౌందర్య ముగ్ధులని వెంకట్రావుగా రనటంలో వారి అభిప్రాయం, ఆంధ్ర శిల్పులు 'బాహ్య జగత్సత్యవాదులు' (Realists) అని అయితే బాహ్య జగత్సత్యవాదం ఆంధ్రశిల్పంలో కాదుగదా, మరి ఏ ఇతర భారతీయ శిల్పంలోనూ లేదు. అజంతాలో, ధాన్యకటకాది స్థూపాలల్లో, నాగార్జున కొండలో, పల్లవ తెలుగుచోడ సాంప్రదాయాలల్లో ఆంధ్రులు ప్రకృత్యనుకరణంగా గాని, ప్రకృతివాదంగా గాని ఏ మాత్రమూ శిల్పించలేదు. బుద్ధ జాతకకథలు, ధర్మచక్రము, బుద్ధపాదుకలు, ఆంధ్ర బుద్ధవిగ్రహాల ముద్రాయుక్త హస్తాలు, శిల్పసమయోద్భవ బోధివృక్షము, స్థూపాలు, ఇంకా అనేకాలు శిల్పసమయ సాంకేతిక సాంప్రదాయ జనితాలుకాని 'రియలిజము' ఎట్లా అవుతవి?

ఇక విగ్రహాలు మొదలైనవి ప్రకృత్యనుకరణోద్భవాలని వెంకట్రావుగారి ఉద్దేశమా? ఆంధ్రదేశంలోని. ఘంటశాల, జగ్గయ్యపేట, ధాన్యకటకము, భట్టి

ప్రోలు వగైరా స్తూపాలల్లో ప్రత్యక్షమైన యావత్తు శిల్పప్రపంచము వెదకినా, అట్టిది కనబడదు. రెక్కలున్న ఎద్దులు ప్రకృత్యనుకరణంలో ఉన్నవా? అజంతా చిత్రలేఖనం లోని ఎగిరే గంధర్వులు, సగం మనుష్యులు సగం పక్షులైన కిన్నరులూ, త్రిభంగాకారాలు, అర్ధనిమీలిత నేత్రాలు, డమరుకకటి, సింహమధ్యమం' ఇవన్నీ పకృత్యనుకరణాలా? శిల్పసమయ (Convention) దూరాలా? గ్రీకు శిల్పంలో నీచ సాంప్రదాయ జనితమైన గాంధారశిల్పము కూడా శిల్పసమయ సాంప్రదాయానికి వ్యతిరేకం గాలేదే?

భారతీయ కళలన్నియు ఎప్పుడును శిల్పసమయ సాంప్రదాయ పూరితాలు. ఆ సంప్రదాయాలల్లో హీనకాలము ప్రాప్తించినప్పుడు, శిల్పవిన్యాసంలో కర్కశత్వము, బలహీనత్వము ఎక్కువైనవి. వాటిని కప్పిపుచ్చటానికి ఆనాటి శిల్పులు సాంకేతికవాదం(Symbolism) ఎక్కువ చేసుకొన్నారు. అంత మాత్రమే

ఆ సభకు అధ్యక్షత వహించిన గాల్లెట్టిగారు భారతీయ శిల్పాశయము ఉత్కృష్టమని గ్రహించి, వారి శిల్పసమయ సాంప్రదాయమే శిల్పోత్కృష్టతకు కారణమని చెప్పకలిగినారు

కృష్ణా పత్రిక

ఫిబ్రవరి 22 వ తేది, 1936 సం॥

# మత స్వాతంత్ర్యము

గత సంచికలో "సందేహము''అను శీర్షిక క్రింద శ్రీ వల్లూరి సూ
నారాయణ రావుగారి పేరున బ్రకటింపబడిన వ్యాసము మాకేకాక, వారి నెరిగి
యున్న మిత్రులందరకును ఆశ్చర్యమును గలిగించుచున్నది. హరిజన ప్రవేశపు
బిల్లు ''పర్మిస్సివు లెజిస్లేషను'' అను విషయము రావుగారికి దెలియనిది కాదు.
దేవాలయముల విషయములో నట్టి పర్మిస్సివు లెజిస్లేషను కూడ జేయరాదని
వాదించుట బహు విపరీతముగ నున్నది. హరిజన ప్రవేశమునకు గ్రామస్థులంద
రేకీభవించినను, ఏ యొక్కరో అడ్డుపెట్టిన యెడల, హరిజను లెవరు నందడుగు
పెట్టకూడదట! చాల దేవాలయము లాగమసూత్రముల ప్రకారము ప్రతిష్ఠింప
బడుటచే, నా నిర్మాతల యుద్దేశమునకు హరిజన ప్రవేశము భంగకరమట ఈ
కారణమున శాసనసభలు సహితము అట్టి చట్టమును జేయరాదని రావుగారు
వాదించుచున్నారు. వీరు దేవాదాయపు చట్టము విషయములో ఎట్లు సమ్మతి
నొసగిరో తెలియకున్నది. తిరుపతి దేవస్థానపు ఆదాయమునుండి ఒక హైస్కూ
లును నడుపుచున్నారు. గ్రంథాలయములను గూడ జాల దేవాలయములలో
నెలకొల్పుచున్నారు. ఈ పనులన్నియు దేవాలయములను గట్టించినవారి ఉద్దేశ
ములకు భంగకరములు కావనియే వాదించెదరు కాబోలు! దేవాదాయముల
యుద్దేశ్యములలో జ్ఞానప్రబోధము కూడ నొకటియై యుండుటచే నట్టి సంస్థలకు
తావిచ్చుట యశాస్త్రీయము కాదని రావుగారు సమర్థించవచ్చును. అట్టి యుదారా
న్వయమును హరిజన ప్రవేశ విషయములో మాత్ర మేల చేయరాదు? అస్పృశ్యు
లని నేడు పిలువబడు పంచములు నిజముగా స్మృతులలో సూచింపబడిన
చండాలురు కారనియు, వారు నాలవ వర్ణమువారే యనియు, కాలవైపరీత్యముచే
నేడు వారు హీనముగ జూడబడు చున్నారనియు నట్టివారికి మాలవ్యగారు
సూచించినట్లు శివమంత్ర దీక్ష నొసగి, నాలవ వర్ణములో జేర్చుకొనవచ్చు ననియు

నిరూపించి, వారికి దేవాలయములను తెరచిన యెడల దేవాలయ నిర్మాతల యుద్దేశమున కెట్లు భంగకరమగును?

ఆచారమే ప్రమాణ మనెదరా? ఏ యాచారము ప్రకారము రజస్వలా వివాహములను జేసికొనిన వారిని, సముద్రయాత్ర చేసివచ్చిన వారిని దేవాలయములలోనికి రానిచ్చుచున్నారు? నేటి బ్రాహ్మణు లెందరో— నూటికి 99మంది అని చెప్పవచ్చును— దేవాలయ ప్రవేశార్హత కలిగిన శిష్యులుగ బరిగణింప దగిన వారేనా? స్మృతులు ప్రత్యక్షముగ నిషేధించిన కార్యముల నెన్నిటినో బ్రాహ్మణులు బహిరంగముగ జేయుచున్నను, వారెల్లరు గర్భగుడిలోనికి బోయి అభిషేకాదులను జేయుట కధికారు లగుచున్నారు. స్మృతుల ప్రకారము బ్రాహ్మణ లాయర్లు, బ్రాహ్మణ టీచర్లు వర్ణభ్రష్టులుగ నెంచవలసి యుండును. ఎంతమంది గృహస్థులు నేడు అగ్నిహోత్రములను, సంధ్యావందనాదులను విసర్జించి కర్మభ్రష్టులగుట లేదు? ఇట్టి వ్రాత్యులందరు అర్చనాదులను జేయు నిమిత్తమే పూర్వకాలములో మహారాజు లాగమసూత్రముల ప్రకారము దేవాలయములను నిర్మించియుండిరా? పరిహాసాస్పదము. రచ్చకెక్కనంత వరకు బ్రతి అనాచారము సంఘములో బరిపాటియై పోవుచున్నది. హరిజనుల విషయములో మాత్రము స్మృతులు, అగమసూత్రములు, ఆచారములు, నిర్మాతల యుద్దేశములు, మొదలగు లా పాయింట్లన్నియు నేకరువు పెట్టబడుచున్నవి.

ఈ విషయములలో ఈ బ్రిటిషు కోర్టు లడ్డురానియెడల, శాసనసభ నాశ్రయించి చట్టములను జేయవలసిన అవసరమే లేకపోయెడిది పూర్వకాలములో ధర్మజ్ఞ సమయములే యిట్టి వివాదములను బరిష్కరించి ధర్మమును నిరూపించెడివి నేడిట్టి ధర్మజ్ఞ సమయములు లేవు ఒకవేళ అట్టి సమయము లేర్పడినను, కోర్టులు వాని నంగీకరించవు. కోర్టులకు ఆచారమే పరమ ప్రమాణము పీఠాధిపతులందరు కలసి దేవాలయములకు హరిజనులను రానియ్యవచ్చునని ఏకగ్రీవముగ దీర్మానించిరనుకొనుడు. అయినను అయ్యది ఆచారవిరుద్ధమని ఎవరైన కోర్టుకెక్కి రుజువు చేసినయెడల, హరిజనులను బ్రవేశింపనీయ రాదని ధర్మకర్తలకు, అర్చకులకు

కోర్టువారు ఇంజక్షను ఇచ్చెదరనుటకు సందియములేదు. ఇక సంస్కారణ మను నదియే అసంభవ మగును. ఆచారవిరుద్ధ మైనను, బహుజనాభిప్రాయ మందుకు సుముఖముగ నుండుటచే, నా విషయము గ్రామస్థుల యనుమతికి వదలివేయ వలయునని శాసనసభ లోక చట్టము చేయనియెడల, ఆచంద్ర తారార్కముగ అస్పృశ్యులకు ఆలయములలో తావుండుటకే ఆస్కార ముండదు. ఇట్టి యవస్థను తెచ్చిపెట్టుచున్నది. కోర్టుల సంప్రదాయముగాని, హిందూ సంఘము గాదు. హిందూ సంఘము స్వాతంత్ర్యము గోరుచున్నది. తమ ప్రతినిధులద్వారా దురాచారములను రూపుమాపుటకు గ్రొత్త వ్యవస్థలను నెలకొల్పుటకు జూచుచున్నది. అవి కోర్టులకు సంబంధించ నంతవరకు నెట్టి చిక్కును లేదు. వారసత్వపు విషయములోనో, లేక దేవాదాయ సందర్భములలోనో కోర్టులు జోక్యము కల్పించుకొనుట కవకాశము కలుగుచున్నది. ఇట్టి సందర్భములో కోర్టుల యభ్యంతరము తొలగించుటకే ఈ బిల్లు ఉద్దేశింప బడినది కాని, నిజముగ నొక సంస్కారణమును శాసించుటకు గాదు. ఈ బిల్లు హరిజనుల విషయములో గ్రామస్థులలోని హిందువులకే శాసనాధికార మిచ్చుచున్నది. అట్టి శాసనాధికారము గ్రామస్థులకు కూడ కూడదనెదరాం ఇక హిందూ సంఘమునకు మోక్షము లేదు. శాశ్వతముగ ఆచార శృంఖలములలో బంధింపబడి యుండవలసి యుండును.

అమెరికాలో నీగ్రోలకు వేరు చర్చిలున్నటుల, హరిజనులకు వేరు దేవాలయముల నేల నిర్మించకూడదని రావుగారు ప్రశ్నించుచున్నారు. అందు మూలమున అస్పృశ్యతా దోషమెట్లు నిర్మూలన మగును? వారికి వేరు స్కూళ్లు, వేరు నూతులు, వేరు గుళ్లు స్థాపించుట అస్పృశ్యతను మరింత బలపరుచుటే యగును గాని, వారిని హిందూ సంఘములో గలుపుకొను పద్ధతి మాత్రము గాదు. పై వర్ణస్థులు ఇంత కాలము వారిని సంఘము బయటకు గెంటి ఉంచిన పాపమునకు బరిహారముగ జేయవలసినది వారిని తమ ఆలయముల లోనికి రానిచ్చుటకాని, వారికి ఊరివెలుపల ఒక మూల గుడిని ఏర్పరచుటకాదు. ఏ గవర్నమెంటైనను, సాంఘిక విషయములలో తటస్థముగ నుండుట శ్రేయస్కర మనుటకు సందియము

లేదు. రేపు స్వరాజ్యము వచ్చినను, మత తాటస్థ్యము పరమ ధర్మముగ నెంచ బడక తప్పదు. కాంగ్రెసువారు "ఫండమెంటల్ రైట్సు"ను నిర్ణయించుటలో ప్రజల మత స్వాతంత్ర్యమునకు ప్రధాన స్థానము నొసగిరి. మత స్వాతంత్ర్య మునకు భంగకరమైన చట్టమును జేయుట కే ప్రభుత్వమునకును అధికార ముండజనదనుట నిస్సంశయము. కాని ఈ హరిజన బిల్లు అట్టి స్వాతంత్ర్య భంగకరమైనదే అయిన యెడల గాంధిమహాత్ముడే దానిని ఖండించెడివాడు. ఈ బిల్లు నిజముగ మత స్వాతంత్ర్యమును బోషించునదికాని, భంగకరమైనది కాదు. హిందూ సంఘములో నెక్కువమంది ఒక్క సంస్కరణమునకు బూనుకొనిన యెడల, ఆచారము పేరట కోర్టులు దానికి అడ్డము రాకూడదనునదియే ఈ బిల్లు యొక్క ముఖ్యసూత్రము.

సూర్యనారాయణ రావుగారు క్రొత్త ఇండియా చట్టమును సొంతముగ బరిశీలించి యుందురు. ఇంతవరకు సాంఘిక విషయములలో చట్టములు చేయ వలసి వచ్చినప్పుడు, గవర్నమెంటునకు గొంత జంకుండెడిది. ఇప్పుడు శాసన సభలను బూర్తిగ బ్రజాయత్తముచేయుటకే క్రొత్త చట్టము సంకల్పించి యుండు టచే, ప్రజాప్రతినిధులు శాసనసభల ద్వారా తమ యిష్టమువచ్చిన సాంఘిక సంస్కరణము చేసికొనుట కికమీదట అధికార ముండునని సూచించబడినది. కోర్టులు సంఘ సంస్కరణమున కాటంకములుగ నున్న సంగతిని బ్రిటిషు మంత్రులు గ్రహించియే శాసనసభలకు స్వతంత్రమైన సంస్కరణాధికారమును బ్రసాదించిరి. బహుశః సూర్యనారాయణ రావుగారి దృష్టిలో ప్రజాప్రతినిధులతో గూడిన శాసనసభలు సహితము సంస్కరణ బాధ్యతను వహించక, పూర్వా చారము కోర్టులద్వారా శాశ్వతముగ నిరంకుశ రాజ్యమును జేయుచుండ వలెననియే యున్నయెడల నిక చెప్పవలసిన దేమియు లేదు. హిందూ సంఘమునకు వినాశ కాలము సంప్రాప్తించిన దనియే ఒప్పుకొనవలసి యుండును.

దేవాలయ విషయములో దాతలకును బ్రతిగ్రహీతలకును సమానములైన బాధ్యతలు కలవను విషయమును మరువకూడదు. దాతలీ కాలమునాటి వారు కారు.

వారి పరిస్థితులు వేరు ఎప్పుడొకమారు తాము నిర్మించిన ఆలయములను ప్రజా యత్తము చేసిరో, ప్రజలు ధర్మకర్తల ద్వారా పరిస్థితుల ననుసరించి వానిని పరి పాలించవలసి యుండును ప్రజలలో దైవచింతనను బురికొల్పి పోషించుటయే ఆలయకర్తల యుద్దేశము. ఆ దైవచింతనను పోషించవలసిన బాధ్యత నేటి ఆలయ పరిపాలకులకు గలదనుట నిశ్చయము కాని ఆ దైవచింతన నెట్లు పోషించవలసినదియు పరిస్థితులనుబట్టి పరిపాలించవలసిన బాధ్యతకూడ వారికి గలదని రావుగా రంగీకరించవలసి యుండును. ఆర్థికముగను నైతికముగను అనేక పరివర్తనము లిటీవల జరిగినప్పుడు, ఈ ఆలయములందలి సాధనవిధాన ములు చెక్కుచెదరకుండ వెనుకటి రీతినే ఉండవలెనని శాసించుట ప్రకృతి విరు ద్ధము. కొన్ని ఆలయములు వాని కర్త లనుకొననిరీతి జీర్ణములై, భ్రష్టములై పూజాపురస్కారములు లేకుండ పోయినవి. కొన్ని ఆలయముల ఆదాయములు వర్ధిల్లి, ఎలెక్ట్రిక్కు లైట్లతోను నవీనాలంకారముల తోడను శోభిల్లుచున్నవి. కొన్ని చరిత్రఘటనలచే మసీదులుగ మారినవి. కొన్ని శైవాలయములు విష్ణ్వాలయము లైనవి. కొన్ని బుద్ధాలయములు శివాలయము లైనవి. కొన్ని ఆలయములలో బీబీనాంచారి వంటి విచిత్ర దేవతలు వెలసిరి. కొన్ని ఆలయములలో పంచమ భక్తులు ఆల్వారుల పేరున దేవతాస్థానముల నాక్రమించి అర్చనలను స్వీకరించు చున్నారు. కొన్ని ఆలయములలో అర్చనాధికారము బ్రాహ్మణుల చేతులలో నుండి బ్రాహ్మణేతరులకు సంక్రమించినది కొన్ని శిక్కుల గురుద్వారములు బ్రాహ్మణ పూజారుల చేతులలో బడినవి. నాటి ఆలయకర్తల పరిస్థితులకును, వర్తమాన పరిస్థితులకును హస్తిమశకాంతర భేదము కలదు. కాని ఈ పరిస్థితులు కోర్టులకు మించిన విషయము లగుటచే నెవరును వీనినిగూర్చి ఆక్షేపించుట లేదు. కోర్టు లేర్పడనంతవరకు ఇట్టి మార్పులెన్నియో సహజరీతిని జరిగిపోవుచుండెను. కాని కోర్టులేర్పడిన పిమ్మట ఆ సహజధార కట్టువడి పోయెను. నేటి ఆచారములకు కోర్టులు రక్షణాలయము లైనవి.

నేడే కోర్టును తిరుపతి వేంకటేశ్వరాలయమును తిరిగి శైవుల పరము

చేయజాలదు. శ్రీ శైలము జంగమువారి చేతులలో నుండవలసినదేకాని, వారిని తరిమివేసి బ్రాహ్మణార్చకులను నియమించు అధికారము కోర్టులకు లేదు. ఏ కోర్టువారును దక్షిణాది కోవెలలనుండి ఆల్వారుల విగ్రహములను బీకించలేరు. గయలోని బుద్ధాలయము బ్రాహ్మణుల యధీనమునుండి తప్పించగల యధికార మే కోర్టునకు గలదు ? ఆ కాలములో సంఘమునకే మతవిషయములలో సర్వాధి కారములు నుండెడివి. ఇప్పుడట్టి సంఘస్వాతంత్ర్యమును గోరుట న్యాయవిరుద్ధ మైనది నేడు అస్పృశ్యులను తమతోబాటు తమ రామాలయములలోనికి దీసికొని పోవుటకు ప్రజలెంత కోరుకొన్నను, ఈ కోర్టు లా కోరిక నరికట్టుచున్నవి. ఈ సందర్భమును శ్రద్ధగ బరిశీలింపుడు. రాజ్యాంగము మతవిషయములలో తటస్థ ముగ నుండవలసిన దని గదా మనము కోరుచున్నది. కాని నేడు రాజ్యాంగ మట్టి తాటస్థ్యమును వహించుచున్నదేమో ఆలోచించుడు. హిందూ సంఘము అస్పృ శ్యుల విషయములో మార్పు కోరుచున్నది. ఇయ్యది కేవలము హిందూసంఘమునకు సంబంధించిన విషయము. రాజ్యాంగము సంపూర్ణముగ తాటస్థ్యము వహించవలసిన సందర్భమిది. అయినను రాజ్యాంగము తన కోర్టుద్వారా హరిజనులకు దేవాలయ ప్రవేశము లేదని తీర్పు చెప్పుచున్నది.ఇది తటస్థభావమో మతస్వాతంత్ర్య భంగమో రావుగారే నిర్ణయించెదరు కాక! మత స్వాతంత్రమననేమి? ప్రజలు ఒక యాచార మును నిలువబెట్టుకొనుటకుగాని మార్చుకొనుటకుగాని గల హక్కే స్వాతంత్ర్యము. కోర్టు లీ హక్కును బ్రత్యక్షముగ భంగపరచుచున్నవి. బహుజనాభిప్రాయ విరుద్ధ మైన హరిజనుల ఆంక్షను తొలగించుటకు ప్రజలకుగాని, వారి ప్రతినిధులకుగాని స్వాతంత్ర్యము లేకుండజేయుట స్వాతంత్ర్యభంగము. మతస్వాతంత్ర్యము పేరిట రాజ్యాంగము వారి మతతాటస్థ్యము కొరకు, కోర్టుల యాటంకమును తొలగించ వలయునని దేవాలయప్రవేశపు బిల్లు కోరుచుండ, సూర్యనారాయణ రావుగారి వంటి ప్రజా స్వాతంత్ర్యవాదులు కోర్టుల యభ్యంతరమును వెనుక వేసికొని వచ్చుట విపరీతముగాక మరియేమి ? బహుజనాభిప్రాయమును మన్నింపజాలని కొలది

పూర్వాచార పరాయణులు దేవాలయములను వదలుకొనుట న్యాయముగాని స్వల్ప సంఖ్యాకుల కొరకు సంఘమంతయు సంస్కారణమును వదలుకొనవలె ననుట కేవల మన్యాయము.

కృష్ణాపత్రిక
ఫిబ్రవరి 29 వ తేది, 1936సం॥

# పరమహంసుని శతవార్షిక జయంతి

శ్రీ రామకృష్ణ పరమహంసుని శతవార్షిక జయంత్యుత్సవము దేశమునందంతట నతిశ్రద్ధాభక్తులతో జరుగుచున్నందు కెంతయు నానందభరితుల మగుచున్నాము. శ్రీ రామకృష్ణులు నవ్యభారత మూలపురుషులలో నొకరు - అగ్రగణ్యు లనియే చెప్పవలెను. ఆస్తిక్యము శుష్కవాద ప్రతివాదములలో జిక్కుకొని మతస్పర్ధలు పెరుగుచున్న కాలమున సకల మత సారమును తమయందు మూర్తీభవింప జేసికొని, "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అను సత్యమును తమ జీవితముద్వారా ప్రదర్శింపగలిగిన మహానుభావుడే పరమహంస రామకృష్ణుడు పండితుడు కాదు. తత్వశాస్త్రజ్ఞు డంతకంటెను గాదు. కేవలము సాధుపుంగవుడు. మమతా గంధ వివర్జితుడైన సాధకునకు స్వమత విమతమను విభేదముండదు. మానవోన్నతికి సహాయ భూతములైన సకల సాధనలును, సమస్త పూజా విధానములును వానివె. రామకృష్ణుడు సాధనసంపత్తియొక్క రహస్యమును హృద్గతము చేసికొన గల్గుటచేతనే. బ్రాహ్మసామాజికుల బ్రహ్మోపాసనయందు పాల్గొనుచు, విగ్రహారాధకుడుగ గూడ నుండగల్గెను. ఒకమూల సంహారరూపిణి అయిన కాళికాదేవిని బూజించుచు, నింకొక ప్రక్కను ఏసునాథుని కరుణరసామృతము నాస్వాదింప గల్గెను. రామకృష్ణు డలవరచుకొనినది పరమత సహనము కాదు—సకలమత స్వీకారమే వాని లక్ష్యము. అనిర్వాచ్యమైన పరమ తత్త్వమును ఏ నిర్వచనము పూర్ణముగ వెల్లడి చేయగలదు? మానవుడు తన సంస్కారమునుబట్టి ఆ పరమతత్త్వముయొక్క భిన్నదిక్కులను దర్శించు చుండును. ఏ దిక్కును సంపూర్ణము కాదు. అన్ని దిక్కులను అంతర్భుక్తముచే అంగీభూతమును జేసికొన గల్గునదియె పరమ సత్యము. సాధనసంపత్తి లేక కేవలము తర్కదృష్టితో జూచువారికి భిన్నమతములందు ద్వైధ్యమే కన్పట్టును. యుక్తికి పరస్పర విరుద్ధములుగ గోచరించు భిన్నమతములు, ఒకమూలమునకు

యొక్క భిన్న నిర్వచనములని తార్కికుని అసంస్కృత బుద్ధి గ్రహింపజాలదు. కాని సాధకుని దృష్టికి సకల మతములు వివిధ సాధన మార్గములు. రామకృష్ణుని జీవితమే యిందుకు ప్రబల నిదర్శనము. వీరిని ద్వైతి అనికాని, అద్వైతి అని కాని, మాయావాది అనికాని, కాదనికాని, చెప్పుటకు వీలు లేదు. పరమహంసుడు అన్నియు నగును — విగ్రహారాధకుడు, బహుదేవతారాధకుడు, ఏకేశ్వరోపాసకుడు, మాయావాది, ప్రకృతిఉపాసకుడు, యోగి, సన్యాసి, గృహస్థుడు, సనాతన వాది, సంస్కర్త, సాధకుడు, సిద్ధుడు- ఎవరు గాదు? ఇన్నియు నేక కాలమునం దగుట యెట్లని తార్కికులు వితర్కించుకొననిందు. పరమహంసుని జీవితము మహాసాగరము వలె సకల జ్ఞాన నదీనదములకును సంగమస్థానమై వెలయగల్గెను. రామకృష్ణుడు ముముక్షువయ్యు జన్మరాహిత్యము నాసించలేదు- వాని గంభీరప్రార్థన నాలకింపుడు:-

"సకల జీవరాసులలోను వ్యాపించియున్న నా భూతాధివాధుని, పతితుల శరణ్యమగు నా పతితపావనుని, బీదల కల్పతరువగు నా దరిద్రనారాయణుని సేవింపగల్గితినేని, నే నెన్ని పర్యాయములైనను పుట్టుచు, గిట్టుచు, దుఃఖసాగరము నానందముతో నీదుటకు వాంఛింతును."

పరమేశ్వరుడు- బహురూపుడు, అనంతగుణుడు, నిఖిల రసామృతమూర్తి. అందుకనియే వానిని సర్వభావముల మూలమున భజింపుడని గీత లాదేశించు చున్నవి. రామకృష్ణ పరమహంసులు గీతల యాదేశప్రకారము సకల సాధననిష్ఠాగరిష్ఠుడై, లోకమునకు నూతన సమన్వయ మార్గమును బ్రదర్శించిన మహనీయుడు- వాని దివ్య చారిత్రము సోదరదేశీయులకే కాక, సర్వమానవైక్యము నభిలషించు సహృదయు లెల్లరకు దివ్యవాణి వలె నిరంతరము ఆత్మప్రబోధమును గావించుచుండును గాక!

కృష్ణా పత్రిక
ఫిబ్రవరి 29వ తేదీ, 1936సం॥

# అనైక్యత మన ప్రకృతిసిద్ధమా?

డాక్టరు రవీంద్రనాథ ఠాకూరుగారు ప్రస్తుతము దేశమును చీకాకుపరచు చున్న అనైక్యతను గూర్చి యిట్లు వ్రాకుచ్చిరి:- దేశము నెదుర్కొనుచున్న సమస్య లలోకెల్ల నా యభిప్రాయములో నిదియే పెద్దది. ఈ వైషమ్యములు కులముల, సంఘముల మధ్యనేకాక, ప్రతి కులములోపలను, ప్రతి సంఘములోపలను గూడ ప్రబల నారంభించినవి. ఈ లోపము మన ప్రకృతిసిద్ధమేమో నాకు తెలియకున్నది. ఆత్మరక్షణ కొరకైనను మనము గలియలేకున్నాము. మనదేశము గొప్ప సంకట సమయములో జిక్కుకొనినప్పుడు కూడ మనము ఏకము కాకపోవుటచే అప జయముల పాలైతిమి ఈ లోపమే మనల నింకను వెంటాడుచున్నది

నేను నిరాశ చెందుటకు దగిన ఆధారము లెన్నియో కలవు. మనము నెలకొల్పు సంస్థలలోను, మనము నడుపు జాతీయోద్యమములందును, ఈ దౌర్బల్యమే వ్యక్తమై మన ప్రయత్నములు సాంతముగ సాగుట దుస్సాధ్య మగుచున్నది. కాంగ్రెసులోనే స్పర్ధలు, అసూయలు చెలరేగుచుండ, నిక చెప్పవ లసినదేమి?

"భారతజాతి, భారతజాతి" యని ప్రగల్భించుచున్నాము. దీనిని మూలమంట ఛేదించు రాష్ట్రవైషమ్యములు నేడు తలయెత్తినవి. రాష్ట్రమునకు రాష్ట్రమునకు గల ప్రయోజనములు, యోగక్షేమములు పరస్పర విరుద్ధములని మనము నమ్మే యెడల, నిక జాతీయైక్యమును గురించి మాట్లాడుట వ్యర్థము. అంతఃకలహములలో జిక్కుకొనిన ప్రజలు గల ఏ దేశమును ఉన్నతస్థితికి వచ్చినట్లు చరిత్రలో నెక్కడను గన్పట్టదు. స్వార్థము స్పర్ధల కాకరము. భిన్న స్పర్ధలకు నెలవైన దేశీయులు పరదేశీయులచే శాసింపబడక తప్పదు. వారికి స్వాతంత్ర్యము అప్రాప్యము.

చీనాయొక్క పరిస్థితులు నాకు గొంతవరకు తెలియును. చీనా దీనికి సాద్శ్యము. చీనాలో స్వార్థపరులైన నాయకులు కొందరు కలరు. వీరు సర్వాధికారములను తమ స్వాధీనములో నుంచుకొనుటకు పెనుగులాడుచుండుటచే, బీదప్రజలు నిరంతరము కష్టపరంపరల పాలగుచున్నారు చీనాను నేడు వెతలపాలు చేయుచున్నది కొలది నాయకుల స్వార్థపరత్వము తమ మేలేదో ప్రజలకు తెలియదు. స్వయంకల్పిత నాయకత్వము గలవారి మాటలు నమ్మి ప్రజలు మోసపోవుచున్నారు. మన చేతులలోనికి ఎక్కువ రాజకీయాధికారము వచ్చినయెడల, మన దేశస్థితి కూడ నట్లే యగునేమో యని భయపడుచున్నాను. ప్రస్తుతము కావలసినది ప్రజావబోధము ప్రజలు తమ సంగతిని తాము తెలిసికొనవలెను తమకేది శ్రేయస్కరయో, ఏది వాంఛనీయమో, దానిని స్వతంత్రముగ నిర్ణయించుకొని దానిని స్వశక్తితో సాధించవలయును చీనాయొక్క దృష్టాంతము మనకు గుణపాఠమగుగాక!

కృష్ణా పత్రిక
మార్చి 21 వ తేది, 1936 సం॥

# ప్రేమ విజయమా?

ఎడ్వర్డు ప్రభువు సింహాసనభ్రష్టుడైనందుకు చింతింపని వారుండరు ప్రపంచములో నేడు రాజులెందరో పదచ్యుతు లగుచున్న మాట నిజము. రష్యా' జర్మనీ, స్పెయినులలో వలె, రాజకీయ విప్లవములు బయలుదేరి, రిపబ్లిక్కులు స్థాపించబడినప్పుడు రాజు లంతరించుటలో నాశ్చర్యము లేదు. కాని ఎడ్వర్డుని పదభ్రష్టత అట్టిది కాదు. బ్రిటిషువారు రిపబ్లికనువాదులు కారు బ్రిటిషు రాజులును నిరంకుశ ప్రభువులు కారు. సమస్త రాజ్యాధికారము బ్రిటిషు పార్లమెంటుది. రాజులు ప్రజాతంత్రమును సర్వవిధముల పోషించు ఉదారాశయు లగుటచే, బ్రిటిషు సింహాసనము చెక్కుచెదరక, చిరస్థాయి కాగలుగుచున్నది. ఎడ్వర్డుప్రభువు కూడ పార్లమెంటు సంప్రదాయమునకు విరుద్ధముగ నడచుకొనిన వాడు కాడు. రాజకీయ విషయములందు ఎట్టి జోక్యతను గల్పించుకొనలేదు. బ్రిటిషు మంత్రుల యభీష్టము నెప్పుడును భంగపరచి ఎరుగడు కాని స్వకీయ విషయములో మాత్రము వ్యక్తిగతముగ గొంత స్వేచ్ఛను గోరుచుండినట్లు కొన్ని సందర్భములనుబట్టి తెలియును. బ్రిటిషురాజు కేవల రాజకీయ విషయములయందే కాక, మతసాంఘిక విషయములయందు కూడ జాలవరకు సంప్రదాయాను గుణముగ బ్రవర్తించవలసిన విధి కలదు. బ్రిటిషురాజు ఇంగ్లీషు ప్రాటెస్టెంటు చర్చికి నిబద్ధుడై యుండవలెనను నియమమున్నది. బ్రిటిషు రాజులకు "డిఫెండరు ఆఫ్ ఫెయితు" అను శపథము గలగు మతము వ్యక్తిగత విషయమని మినహా యింపును గోరుటకు బ్రిటిషు రాజసంప్రదాయ మంగీకరింపదు. సాంఘిక వ్యవస్థలలో గూడ బ్రిటిషు రాజునకు బాధ్యత యున్నది. వాని కే మాత్రము స్వేచ్ఛా చారము కూడదు. రాజు అనగా "ది ఫస్టు సిటిజను అఫ్ ది ఎంపైరు" అని వారి నిర్ణయము ఏది బ్రిటిషు సంప్రదాయమునందు నిబద్ధమై యున్నదో, దానిని బాలించి పోషించుట రాజుయొక్క ధర్మము. బ్రిటిషురాజు ఈ విధముగ ఒక

రాజకీయ విషయములందేకాక, మతాచారములయందును, సాంఘిక వ్యవస్థల యందును ప్రజాపరతంత్రుడై, "కాన్సిట్యూషనల్ మానార్కు"గ మెలగవలసిన ధర్మమున్నది. ఈ సందర్భము లన్నిటిని జూచినయెడల, బ్రిటిషు రాజున కతడు సింహాసనము నధిష్ఠించి యున్నంతకాలము వ్యక్తి స్వాతంత్ర్యము నూటికి 99 పాళ్ళు లేదనియే చెప్పవచ్చును. ఒక్క రాజేకాదు. రాజుయొక్క అర్ధాంగియగు రాణి సహితము బ్రిటిష్ శిష్టాచార నిబద్ధురాలై యుండవలసిన విధి కలదు. రాణి యనగా, "ది ఫస్టు లేడీ ఆఫ్ ది రెల్మ్" అని వారి యభిప్రాయము ఇంగ్లాండులో మతము, సమాజము, రాజ్యాంగము పెనవేసికొని యున్నవి. ప్రజలకు మత స్వాతంత్ర్య మంగీకరించ బడినదేకాని రాజునకు తమ స్వాతంత్ర్యము లేదు బ్రిటిషురాజు ప్రాటెస్టెంటు శాఖకు జెందియుండక తప్పదు. కేథలిక్కు స్త్రీని వివాహమాడుటకు వానికి స్వేచ్ఛ లేదు. ప్రాటెస్టెంటు మతాచార్యులకు ప్రభుసభలో స్థానము విధిపూర్వకముగ నొసగబడి యున్నది. ఆర్చిబిషప్పుగారు జార్డను సరోవరము నందలి జలమును రాజుశిరముపై నభిషే కించినగాని ఆ రాజు పట్టాభిషిక్తుడు కాజాలడు ఈ సందర్భములను సరిగ దెలిసికొనినగాని ఎడ్వర్డురాజు యొక్క రాజ్యత్యాగావశ్యకత బోధపడదు. సామాన్య పౌరుడు తన యిష్టము వచ్చిన స్త్రీని ఆమె పరదార కానంతవరకు వివాహ మాడుటకు సంపూర్ణ స్వాతంత్ర్య మున్నప్పుడు, బ్రిటిషు రాజునకు అట్టి స్వేచ్ఛ నొసగక పోవుట యేమి యని స్వేచ్ఛావాదులు ప్రశ్నించవచ్చును. కాని రాజున కట్టి స్వేచ్ఛ లేనిమాట నిజము బ్రిటిషు పార్లమెంటు రాజునకు రాజకీయముగ నెట్టి స్వేచ్ఛను ఒసగ జాలదో, అట్లే ఇంగ్లీషు చర్చియు బ్రిటిషురాజును మత వ్యవహారములలో నెట్టి స్వేచ్ఛను స్వీకరింపనియ్యదు. రాజు సంప్రదాయ విరుద్ధ మైన వ్యక్తి స్వాతంత్ర్యమును గోరునా, రాజ్యత్యాగమే వానికి శరణ్యము. బాల్డివిను ప్రధానికాని, కేంటర్బరీబిషప్పుకాని, ఎడ్వర్డును బలవంతముగ పదభ్రష్టునిగ జేసిరని తలంచుట వట్టి పొరబాటు పార్లమెంటు ఏకగ్రీవముగ నీ పదభ్రష్టత నంగీకరించినది లేబరుపార్టీ సహితము ఎడ్వర్డు పక్షము పలుకలేదు. ఎడ్వర్డు మిస్సెసు సింప్సను పరిణయమును హర్షించిన బ్రిటిషుపత్రిక యొక్క

టియు లేదు. బ్రిటిషుజాతి యందు పూర్వాచార పరాయణత నాటుకొనిపోయినదని విమర్శించవచ్చును గాని, బాల్డివినువంటి ఏ నలుగురు పూర్వాచార పరాయణులో ఎడ్వర్డును రాజ్యభ్రష్టునిగ జేసిరని తలంచుట న్యాయము గాదు. ఏ సంఘములో నైనను, గొన్ని సంస్కారణములు కాలప్రభావముచే దొర్లిరావచ్చును. వానికి గొంత న్యూనతకూడ నేర్పడియున్నను, ఏ కొలది మందియో వాని నవలంబించు చుండ వచ్చును. వారిని సంఘము నిరోధించనంత మాత్రమున, ఆ సంస్కారణ ములు సదాచారములుగ నెంచబడినట్లెంచ జనదు. విడాకులు పుచ్చుకొనిన స్త్రీని వివాహమాడుట బ్రిటిషు "లా"కు విరుద్ధము కాకపోయినను, అట్టి వివాహములు వారి సంఘములో జరుగుచున్నను, వాని కొక విధమైన న్యూనత యుండుట చేతనే, రాజు విషయములో గొంత పట్టింపు వచ్చినది. "డైవోర్సీ"ని పెండ్లా డుట దోషమా యను విషయము వేరుగ జర్చించిన చర్చించ వచ్చును. అది ఇంగ్లీషు సంఘములో శిష్టులమధ్య గొంత కుసంస్కారముగ నెంచబడుచున్నంత కాలము, శిష్ట సంప్రదాయమును బాటించవలసిన రాజు, ఆ సంప్రదాయమును శిరసావహించ వలసిన బాధ్యత యుండునని వేరుగజెప్ప నక్కర లేదు. ఎడ్వర్డు ప్రభువు విషయములో నీ రాజ్యత్యాగ మెంతవరకు ప్రశంసనీయమైనదను విషయ మును జర్చించుటకిది తరుణము గాదు. ఎడ్వర్డు-సిమ్సనుల ప్రేమ ఎంతవరకు గాఢమై, స్థిరమై, అమూల్యమైనదియు, వారి పూర్వచరిత్రను బట్టి గొంత వరకును, వారి భావిజీవితమును బట్టియు, నిర్ణయించ వలసినదేకాని, రమణికొరకు రాజ్యమును వదిలివేసినంత మాత్రమున, ఎడ్వర్డు మహాప్రేమికుడు అని పొగడు టలో అర్థము లేదు. అయ్యది ధర్మబాహ్యమైన కామాంధతయో, లేక లోకమున కంతకు దాంపత్య ప్రణయము యొక్క మహిమను జాటగల ప్రేమావిజయమో కాలమే నిర్ణయించ వలసి యుండును.

కృష్ణా పత్రిక
డిశంబరు 19వ తేది, 1936 సం॥

# సర్ రాధాకృష్ణన్

ఆక్సుఫోర్డు యూనివర్సిటీయందు ప్రాచ్య తత్వశాస్త్రోపాధ్యాయులుగ నియమింపబడి నప్పటినుండియు వీరిని గూర్చిన ప్రశంసయే నలువైపులనుండియు వినవచ్చుచున్నది. వీరికి బలుచోట్ల జరుగుచున్న సత్కారములు, వివిధ సంఘములచే నర్పింపబడుచున్న అభినందనములు వీరి కీర్తిప్రఖ్యాతులను ఇనుమడింప జేయుచున్నవి. పత్రికాలోక మంతయు వీరి శేముషీ ధౌరంధర్యమును గూర్చి వేయినోళ్ళ ఘోషించుచున్నది. "మాడర్ను రివ్యూ" వంటి వంగజాతితత్వాభియిష్టమైన పత్రికారాజము సహితము ఈ గౌరవమును బురస్కరించుకొని వీరి నభినందించక తప్పినది కాదు. సామాన్యముగ తనలో తాను కూర్మమువలె ముడుచుకొని యుండు బందరుకూడ వీరిని సత్కరించుటకు విజృంభించుట జూడ, ఈ నియామకము దేశీయుల నెంతయో పరవశులనుగ జేసియున్న ట్లెంచవలసి వచ్చుచున్నది. ఇందెంతయో అపూర్వ విశేషము లేనియెడల, నింత యలజడి కలుగుటకు గారణము గన్పట్టదు వీరచ్చట స్వీకరించు వేతనమా, బహుస్వల్పము. నిర్ణీతకాలమా, అయిదేండ్లు వీరు నియమింపబడిన పదవియా, ఆక్సుఫోర్డులో క్రొత్తగ నెలకొల్పబడిన ప్రాచ్యశాఖయేగాని, అసలు తత్వశాస్త్ర పీఠము గాదు. అయినను ఎందుచేత. వీరి కేదియో నోబిలు బహుమానము వంటి అపూర్వ గౌరవము కలిగినట్లు, విద్యాధికమండలి యింత కోలాహలము చేయుట? కేవలము సర్ రాధాకృష్ణన్ గారికి ఒక వ్యక్తిగ గలిగిన గౌరవముగగాక, భారత సభ్యతకు ఆర్య సంస్కృతికి, ఇందుమూలమున గొప్ప ఘనత సంఘటించినట్లు భావింపబడుచున్న దనుటకు సందియము లేదు.

ఆక్సుఫోర్డు చాలా ప్రాచీన విద్యాపీఠము. దీనికిగల ప్రఖ్యాతి యూరపు ఖండమున మరి యే యితర యూనివర్సిటికిని లేదు. ప్రతి పురాతన వ్యవస్థవలెనిదియు సంప్రదాయబద్ధమై, ఒక ప్రత్యేక చారిత్రక ప్రతిష్ఠను బొందియున్నది.

ఇయ్యది జ్ఞానప్రధానమైన విద్యాపీఠమైనను, ప్రగ్ త్త భావములందు సులభముగ జొరవు. ఇటీవల ప్రగ్ త్తగ నెలకొల్పబడిన చిన్న యూనివర్సిటీలలో నున్నంత నూతనత్వముగాని వికాసముగాని ఇందు గాన్పించదు. రాజకీయాభిప్రాయముల యందేగాక, విద్యావిషయముల యందుకూడ నీ సంస్థ కన్సర్వేటివులకు మూల పీఠమని చెప్పవచ్చు. పాశ్చాత్యతత్వమందు పునీతవించి మూర్తించిన విద్యానిలయ మిది ఒక విధమైన ఆరిస్టాక్రాటిక్కు వాతావరణము గల ఈ యూనివర్సిటీయందు యూరపియను పరిజ్ఞానము సంకుచితభావము పొందుటలో నాశ్చర్యము లేదు. మానవ సభ్యతకు మానవ సంస్కృతికి గ్రీసు రోము రే జన్మస్థానములను సిద్ధాంత ముపై నెలకొల్పబడిన విద్యాపరిషత్తునకు ఒక విధమైన స్వాతిశయము అహంకా రము ప్రబలుట సహజము. ఈ పరిషత్తువారికి ప్రాచ్య సంస్కృతియెడల నిర సనభావ మేర్పడుట ఒక వింతగాదు. వారి తత్వశాస్త్రమునకు ప్లేటో, ఆరిస్టాటిలు వంటి గ్రీకు పండితులే మూలపురుషులు. వారి తత్వచరిత్ర యందు భరతవర్షమున కెట్టి స్థానమును లేదు. భరతవర్షమున దర్శనము లున్నట్లు వారికి వినికిడియున్నను అవి కల్పనతో గూడిన పారలౌకికములే గాని, తర్క మీమాంసలతో గూడిన శాస్త్రములను విషయము వారు గ్రహింపజాలరైరి. శ్రీ శంకరాచార్యుని వంటి ధిషణాధురంధరుని పేరు సహితము వారికి గర్ణతాడితము గాలేదు. పాశ్చాత్య యూనివర్సిటీలకు బీద నకళ్లు అయిన మన యూనివర్సిటీలలో గూడ మొన్నటి వరకు ఫిలాసఫీ శాఖయందు ప్రాచ్య తత్వశాస్త్రమునకు తావు లేదు. నేడు యూనివర్సిటీలనుండి ఏటేట వెలువడు ఫిలాసఫీ గ్రాడ్యుయేట్లలో వేదాంతశాస్త్ర పరిచితులు అరుదు.

ఇట్టి సంధర్భములలో ఆక్సుఫోర్డు యూనివర్సిటియందు ప్రాచ్య మతతత్వ మునకును ప్రాచ్య ధర్మశాస్త్రములకును నేటికి ఒక చైరు నేర్పాటుచేయుట ప్రాచ్యులెల్లరు గర్వింపదగిన విషయమనుట నిస్సంశయము. ఈ చైరును ప్రతి ష్ఠించు నిమిత్తము భూరివిరాళము నిచ్చిన స్పాల్డింగు దంపతులు ఆశియాఖండమున కెంతయు కృతజ్ఞతాపాత్రులు ప్రథమ పర్యాయమునకే ఏ జపాను, చీనా పండి

తునో కాక, ఒక భారత ప్రసిద్ధుని నియమించుటవలన గూడ భారతీయులు గర్వింప దగును. కాని ఇందుమాత్రము విశేషము లేదు. యూరపియను సంస్కృతికి గ్రీసుదేశము ఆదిపీఠముగ నెట్లెంచబడుచున్నదో, అట్లే భరతవర్షమే ఆసియను సభ్యతకంతకు మూలకంద మను విషయము లోకవిదితము. ఇట్టి సందర్భమున భారతీయుగే ప్రప్రథమమున నీ శాఖకు ఆచార్యుడుగ నియమింపబడుట యెంతయు సమంజసము. భారతీయులలో నీ పదవికి సర్ రాధాకృష్ణన్‌గా రర్హులుగ నెంచ బడుటలో గూడ విశేషము లేదు. ఆధునిక ఇండియను ఫిలాసఫర్సులో వీరికి గల గణ్యతగాని, జగత్ప్రసిద్ధికాని మరియొకరికి లేదనిన అతిశయోక్తి కాదు

వీరింకను రాజమండ్రి గవర్నమెంటు కాలేజిలో ఫిలాసఫీ ప్రొఫెసరుగ నుండిన రోజులలో వీరి వ్యాసములు యూరపియను మాగజైనులలో నాదరముతో స్వీకరింప బడుచుండెడివి. వీరికి గల రచనాకౌశలము ఆ కాలములోనే హాల్డేను వంటి బ్రిటిషు తత్వజ్ఞుల మెప్పును బడయగల్గెను. పిమ్మట రవీంద్రనాథ ఠాకూరు గారి కవితయందలి "ఫిలాసఫీ"ని గ్రంథరూపమున బ్రకటించిన పిమ్మట, ఠాకూరుగారికంటెను, ఈ వ్యాఖ్యాతయొక్క ప్రతిభయే పాశ్చాత్య దేశములలో మిగుల వ్యాపించెను. ఈ సందర్భములను గనుపెట్టియే సర్ అశుతోషు ముఖర్జీ, రాధాకృష్ణగారిని తమ యూనివర్సిటీలో జార్జి ది ఫిఫ్తు ఫిలాసఫీ చైరునకు ఆచార్యు నిగ నియమించుట తటస్థించెను. తత్వశాస్త్రమునకు నిలయమైన వంగభూమి యందు వేదాంతపండితు లెందరో యుండ, రాష్ట్రేతరునకీ గౌరవపదవి నొసంగు టేల యని రామానంద చాటర్జీవంటి స్వాభిమాన పూరితులైన వంగీయులకు గొంత ఈసు బయలుదేరిన మాట వాస్తవము. వీరిని పదభ్రష్టుని జేయుటకు ఎన్నియో కుట్రలు గావింపబడినను, సర్ రాధాకృష్ణన్‌గారి సహజప్రతిభయే వారికి వజ్ర కవచమై నిలచెను. పైగ వారి ఆచార్యత్వము వలన, కలకత్తా విశ్వవిద్యాలయ మునకు గూడ గొప్ప పేరు ప్రతిష్ఠలు వచ్చినవనుటకు సందియము లేదు. వీరు కలకత్తా ప్రొఫెసరుగ నుండిన కాలముననే, వీరు ఆక్సుఫోర్డులో అప్టను లెక్చర రుగ నియమింపబడుటయే యిందుకు దగిన తార్కాణము దేశములోని యూని

వర్సిటీలలో కెల్ల శిరోభూషణమైన కలకత్తాయూనివర్సిటీయందు జార్జి ది పిఫ్త్ ఫిలాసఫీ ప్రొఫెసరు పదవి ఏనాడు సిద్ధించెనో, ఆనాడే భారత తత్వశాస్త్ర వేత్తలలో కెల్ల రాధాకృష్ణన్‌గారు నాయకమణిగ లోక మంగీకరించి నర్తింపవలసి యున్నది. ఆక్సుఫోర్డు యూనివర్సిటీవారు ప్రాచ్యసంస్కృతి యనుటతోడనే, భరతవర్షము వారికి దృగ్గోచర మైనట్లే, భరతవర్ష మనుటతోడనే, వారికి పరిచితులైన అట్టను లెక్చరరుపై వారి చూపు వ్రాలుట యుక్తము, సమంజసము. వీరు దరఖాస్తు పెట్టి శిఫారస్సులను దెచ్చుకొననిది, అయాచితముగ నీ పదవి రాధాకృష్ణన్‌గారి కెట్లు లభించినదని సర్ శ్రీనివాస శాస్త్రిగారు వ్యంగ్యముగ ప్రశ్నించిరి. కాని రాధాకృష్ణన్‌గారి పూర్వాపర సందర్భములను గమనించి యుండినయెడల, శాస్త్రి గారట్టి హేళన చేయుటకు అవసర ముండెడిది కాదు

సర్ రాధాకృష్ణన్‌గారి ప్రతిభావిశేషమును గూర్చి కొంచెము పరిశీలించుట అప్రస్తుతము గాదు రాధాకృష్ణన్‌గారు 'ఫిలాసఫర్' గ మన విద్యాధికులచేతను, ఖండాంతరులచేతను బరిగణింప బడుచున్నారు. కాని మనదేశములో నింతవరకు 'ఫిలాసఫర్సు' అనువారు లేరు. బ్రిటిషు యూనివర్సిటీ లీ దేశమునకు దిగుమతి అయినతర్వాతనే ఈ క్రొత్తజాతి యొకటి యుద్భవించినది. మన దేశములో జ్ఞానులు కలరు, భక్తులు కలరు, దార్శనికులుకలరు, భాష్యకారులు కలరు, మత కర్తలు, ఆచార్యులు కలరు, కాని ఫిలాసఫర్సు మాత్రము లేరు. ఫిలాసఫీ యనగా తత్వశాస్త్రము గాదా యని ప్రశ్నించవచ్చును కాని మన తత్వశాస్త్రము మతమునం దంతర్భూతమైన విషయముగాని, మతబాహ్య మైనది కాదు మన దార్శనికులు సహితము తత్వమును అనుభూత విషయముగ బరిగ్రహించిరేకాని, ప్రమాణ రహితమైన వట్టి మీమాంసగ స్వీకరించి యుండలేదు. మన దార్శనికులలో నిరీశ్వ రవాదులు లేకపోలేదు. వేదప్రామాణ్యము నంగీకరించని తార్కికు లెందరో కలరు. కాని అట్టి సాంఖ్యముకూడ పరమ తత్వ నిర్వచనమును అనుభూతమైన ఆత్మ ప్రత్యయముగనే విశ్వసించినది. మన దార్శనికు లెంతవరకును భాష్యకారులే కాని పాశ్చాత్యులవలె, అనుభవ శూన్యులైన కేవల జిజ్ఞాసువులు కారు. యూరపీయను

ఫిలాసఫర్లు గ్రీకు సంప్రదాయము ప్రకారము ఫిలాసఫీని ఒక స్వతంత్రమైన శాస్త్రముగ నిర్ణయించుటకు ప్రయత్నించిరి. అట్టి ప్రయత్నమును భారతీయు లెన్నడును జేసియుండలేదు. మన వేదాంత శాస్త్రజ్ఞులు పరమతత్వమును అనుభవైకవేద్యమని ఎప్పుడు నిరూపించిరో, అప్పుడే శాస్త్రములు కొంతదూరము పోయినపిమ్మట కట్టుపడినవి. "అప్రాప్య మనసా సహ". ఇట్లనుటచే మన వేదాంతశాస్త్రమును అజ్ఞేయవాదముగ నెంచదగదు. మనస్సుకంటె అతీంద్రియమైన విజ్ఞానము యోగసాధ్యమను విషయము హిందూమత కర్తలెల్ల రైక్యకంఠముగ సూచించుటచే, దీనిని అజ్ఞేయవాదమని పొరబడుట దోషము. ఇప్పుడిప్పుడు బర్గుసన్ వంటి పాశ్చాత్య తత్వాన్వేషకులు సహితము అనుమాన ప్రమాణముపై నాధారపడు మనస్సుకంటె నధికమైన జ్ఞానమార్గ మొకటి కలదని ఒప్పుకొనవలసి వచ్చెను. ఈ సందర్భములను బట్టి తత్వశాస్త్రము స్వతంత్రమైన విద్యగ నెంచుటకు వీలులేదు. ఆర్యఋషులీ మర్మమును ఆదినే అనుభవగతము చేసికొనిరి.

మన తత్వశాస్త్రము ఈ కారణముచే మతాంతర్గతమైన విషయముగ నెంచబడెనేకాని- పాశ్చాత్త్యులవలె దాని కెక్కువ గౌరవ మియ్యలేదు. పాశ్చాత్త్యులు దీనిని గుణముగ నెంచుకొనుటకు బదులు, ఒక దోషముగ భావించి, "ఇంటలెక్టు"ను పరమదైవముగ బూజింప నారంభించిరి. మనవారైనను బుద్ధిని నిరసించలేదు. మన నవ్యతర్కములో నున్నంత బుద్ధినైశిత్యము వారి 'లాజిక్కు' లో సహితము ఉన్నదో లేదో సంశయాస్పదము. కాని బుద్ధిప్రకాశముకంటె సర్వమును ప్రత్యక్షము చేయగల జ్ఞానజ్యోతి ప్రతివాని యంతరమున నిహితమై, యోగమాత్ర లభ్యమను విషయమును పదేపదే హెచ్చరించుచుండిరి. ఈ కారణము చేతనే ఋషుల అతీతములైన అనుభవములను యుక్తియుక్తముగ మీమాంస చేయుటయే తత్వశాస్త్రముయొక్క లక్ష్యముగ మనవా రంగీకరించిరి. అట్టి వివరణకర్తలే భాష్యకారులుగను, ఆచార్యులుగను బరిగణింప బడుచున్నారు. అంతియకాని యోగసాధన రహితమైన తత్వజిజ్ఞాసను పాశ్చాత్త్యులవలె భారతీయులు ఆదరించి యుండలేదు. సర్వమును ఫిలాసఫీగ నెంచుకొను భారతీయులలో ఫిలాసఫీ ఫేకల్టి

అంతకంతకు ఆకర్షణ లేకుండపోవుటకు గారణమేమి యని మద్రాసుసభలో శ్రీనివాసశాస్త్రి ప్రభృతులు వితర్కించుకొనిరి. దీనికి గారణము ప్రత్యక్షము అనుభవశూన్యమైన తత్వజిజ్ఞాస ఈ దేశములో వ్యాప్తి కానేరదు. ఏ ఫిలాసఫీ పండితుడైను, తన ప్రతిభను తన తరగతులలో ప్రదర్శింపగలుగునే కాని, ప్రజల బుద్ధులను, ఊహలను, వశపరచుకొన జాలడు, జీవనములో నున్న జాగరణశక్తి ఫిలాసఫీలో లేదు. గాంధి, ఠాకురు, అరవిందప్రభృతులు, పాశ్చాత్య పరిభాషలో ఫిలాసఫర్సు కాదు. అయినను వారికి గల జనవశీకరణ శక్తి ఏ తర్కపండితులకును లేదు. వారు యోధులు. వారిది అనుభవగతమైన వెలుతురు. వీరు తార్కికులు. వీరిది బుద్ధిరాపిడి నుండి బయల్పడునది వేడిమి. వెల్తురు లేని వేడిమి నిరర్థకము.

సత్యము అద్వయమును అఖండము నైనను, మానవుడు దానినంతను ఒక్కమారుగ ననుభూతము చేసికొనలేక భిన్నదిక్కుల నుండి, భిన్నరీతుల దాని నభివర్ణింప జూచును. అందుకనియే మన ఋషులు "అనంతా వై వేదాః" అని కీర్తించిరి. భాష్యకారులును వారి వారి యధికార తారతమ్యమునుబట్టి, ఆ యా కాలముల పరిపక్వ దశనుబట్టియు వానిని భిన్నగతుల వ్యాఖ్యానములను గావించి భిన్నమతములకు మార్గదర్శకు లైరి. అందులో మన భారతవర్షమున సత్యమును సాధించు నిమిత్తము అవలంబించిన పద్ధతులు అగణితములు. ఒక్క వేదము నుండియే ఎన్ని మతములు, ఎన్ని దర్శనములు, ఎన్ని నిర్వచనములు, ఎన్ని పూజావిధానములు, ఎన్ని ఆచార విచారములు బయల్వెడలి యుండలేదు? భరతవర్షములోని మతసాధనలను జూచిన ఒక మహారణ్యము వలె గన్పట్టును. స్థూలముగ బరిశీలించిన వీనిలో బరస్పర వైరుద్ధ్య మెంతయో గోచరించవచ్చును. కాని ధర్మతత్వము మాత్రము ఏకసూత్రముగ వాని యన్నిటియందును వ్యాపించి యున్నది. ఋషులు ఏఒక్క మతమునకును గట్టుబడిన వారు కారు. వా రతీతులు-సర్వమతముల నంతర్భుక్తము చేసికొనిన జ్ఞానధనులు,—"ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అని సత్యస్వరూపమును హృద్గతము చేసికొనిన మహాను

భావులు వారనుభవించి ప్రకటించినది అన్యమత సహనము గాదు. సర్వమత సమత్వము వారి సర్వస్వము. భారత సంస్కృతియొక్క ప్రాభవము లిందే కలవు.

వీనిని నేడు పాశ్చాత్యలోకమునకు పాశ్చాత్యుల అన్వయపద్ధతిని, యూరపియను ఫిలాసఫీ పరిభాషలో వ్యాఖ్యానము సేయుటకు భారత తత్వశాస్త్ర వేత్తలలో నెవరైన నుండినయెడల, వారిలో సర్ రాధాకృష్ణన్‌గారు అగ్రగణ్యులని నిస్సంశయముగ జెప్పగలము. వీరి ముఖతః ప్రతిధ్వనించినది భారత సంస్కృతి యొక్క గంభీర సంపద. బహు ముఖములు కలిగిన భారత సభ్యతను నిష్పక్షముగను సమగ్రముగను నిర్వచించుట సామాన్య విషయముగాదు అందులో దానిని పాశ్చాత్యులకు గ్రాహ్యమగు రీతిని ఆధునిక చింతాప్రణాలిక ననుసరించి ఉద్ఘాటించ వలసియున్నది. హిందూదేశములో తత్వశాస్త్రమునందు సుశిక్షితులైన సంస్కృత విద్వాంసు లెందరో కలరు భాషాంతరీకరణముల మూలమున నైనను భారత దర్శనముల నన్నింటిని బరిశీలించిన విజ్ఞులును గలరు. కాని భారతసభ్యతకు అంగీభూతములైన సకల మతములను, సమస్తసాధన విధానములను ఒక్క అఖండ సత్యముయొక్క భిన్న ముఖములుగ బ్రదర్శింపగల ప్రజ్ఞావిశేషము, సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారికే కలదు వారి ధీబలము అతివిశాలమైనది. అది [illegible] మొక్కటియు లేదు. సకల వ్యవస్థల అంతర్యమును జొరగల [illegible] సాహసము వారి హృదయధనము. ఎట్టి [illegible] సరళముగ [illegible], అందలి సారమును హృదయం గమముగ [illegible] వ్యాఖ్యా[illegible]

వారి [illegible] ప్రభుత్వమును వారి [illegible] దగినది. ఉజ్జులను [illegible] శాస్త్రిగారికి తీసిపోరు. [illegible] భాషా [illegible]. భాషా వైదగ్ధ్యముచేత వారెట్టి [illegible] లైనను [illegible]. [illegible] రాధాకృష్ణన్‌గారి భాషావైదగ్ధ్య మట్టిది కాదు. [illegible] భాష. [illegible] భాషయందొక గుళికవలె రూపొం

దును. వీరి వాక్యములు జ్ఞానాంజన శలాకముల వంటివి. వీరి వాగ్ధాటియందు కూడ బ్రత్యేకత కలదు. కేవలము తర్క మీమాంసలతో గూడిన తత్వశాస్త్ర రహస్యములను ఇంత హృద్యముగ నుద్ఘాటించగల ప్రతిభావిశేషము యూరపియను ఫిలాసఫర్లలో గూడ మృగ్యము. వీరిది మహాప్రవాహము- ఆత్మోత్తేజనమును గలిగింపగల వాగ్ఝరి. ఆ మహాప్రవాహములో భరతవర్షముయొక్క జ్ఞానసమృద్ధి యంతయు తొణుకు లాడుచుండును. అయ్యది కేవలము భావవివశత్వముతో గూడిన కావ్యకల్పనమా ? కాదు. యుక్తిజాలముయొక్క తీవ్ర ప్రయోగమునందలి వాదనా చమత్కృతియా ? కాదు. ధర్మప్రసంగమునందు లోకవిస్మృతిని జెందించు భక్తిపారవశ్యమా ? కాదు. ఒక్క త్రుటిలో శ్రోతలను బరంధామము చేర్చగల వాగమృత మది. వీరి తత్వవిచారమునందు వైశాల్య మున్నంతగ లోతు లేని మాట నిజము. కాని హిమవన్నగ శ్రేణిని బ్రదర్శించినప్పుడు, ప్రతి శృంగము యొక్క నిమ్నోన్నతములను వివరముగ జూపుట సాధ్యము కాదు. అయ్యది భారత విరాట్టుయొక్క విశ్వరూప ప్రదర్శనము. అంగ ప్రత్యంగ వర్ణనమున కచ్చట స్థానము లేదు, వ్యవధియు లేదు. భారతవర్షము యొక్క సమగ్రపటమును కొలది రేఖలలో, సుకుమారములైన నీడ వెలుగులలో జూపగల సిద్ధహస్తుడైన చిత్రకారు డీతడు. ఇట్టి మహనీయుని భారతవర్షము తన తత్వప్రవక్తగ బశ్చిమ ఖండమునకు బంపగలుగుట మహద్భాగ్యము. భరతవర్షము యొక్క గౌరవ ప్రతిష్ఠలను లోకమునకు జాటగలిగినది రాజకీయ ప్రచారకులు కారు. భారత భాగ్యముయొక్క అనశ్వరమైన సంస్కృతి స్వరూపమును బ్రపంచ పరిషదములలో ముక్తకంఠమున జాటగల రాధాకృష్ణన్ వంటి జ్ఞానదూతలే భారత పరిజ్ఞాన ప్రదీపకులు. ఈ ధర్మప్రవక్తయొక్క అమృతవాణి ద్వీప ద్వీపాంతరములందు మారుమ్రోగి, మాతృదేశమునకు నిజకీర్తిని బ్రసాదించు గాక !

కృష్ణా పత్రిక

ఏప్రిల్ 4వ తేది, 1936 సం॥

# శ్రీ రామకృష్ణరావు గారి షష్టిపూర్తి.

గతమాసము 29వతేదిని, బందరులో శ్రీరావుసాహెబు డాక్టరు వేమూరి రామకృష్ణ రావు ఎమ్. ఎ. ఎల్. టి., పి. ఎచ్ డి, గారి షష్టిజన్మదిన మహోత్సవము వారిమిత్రులచే నతిముదావహముగ జరుపబడినది. రామకృష్ణరావుగారు విద్యాధిక లోకమునకు చిరపరిచితులు కొంతకాలము బందరు నోబిలు కాలేజీలో ఉపాధ్యాయులుగను, కాకినాడలో పి. ఆర్. కాలేజి ప్రిన్సిపాల్‌గను ఉండి, విద్యార్థి బృందపరంపరల భక్తివిశ్వాసములను జూరగొనిన గురుతుల్యులు. తెలుగు సీమలో ఆంగ్లవిద్యా సంపర్కముగల వారందరకు, వీరి చారిత్రము కొలదిగనో, గొప్పగనో తెలియనిది కాదు. ఏ వ్యక్తియొక్క స్వరూపమును ఇదమిత్థమని నిరూపించుటకు సాధ్యముకాని మాట నిజము. అందులో జ్ఞానసంపన్నులును, గభీర సాధకులును అయినవారి చరిత్ర ఏ యొక సూత్రమును, ఏ యొక ప్రవచనమును బూర్తిగ వ్యక్తీకరింప జాలదు ప్రతి జీవియు నొక బ్రహ్మాండము. అందలి లోతుపాతు లగమ్యములు. బయటకు ప్రత్యక్షముగాని అజ్ఞాతభూమి యెంతయో మరుగై యుండును. ఎవరికి వారే తమ స్వరూపము నంతను సరిగ విషయభూతము చేసికొన జాలరు. ఇక పరులకది మరింత అగోచరము. అయినను ఏ కొలది తటస్థ లక్షణములను బురస్కరించుకొనియో. వారి వ్యక్తిత్వవిశేష మిట్టిదని చరిత్రకారులు నిర్వచింప జూతురు. అట్టి చిత్తరువు వారి బింబమును సమగ్రముగ బ్రతిఫలింప లేకపోయినను, వారి చరిత్రపరిచయమునకు గొంత సాధనభూతము కాగలదనుట నిశ్చయము.

శ్రీ రామకృష్ణ రావుగారిని తలంచుకొనుటతోడనే వారి ఆంగ్లసాహిత్య పాండితి, వారి ప్రౌఢరచనా పటిమ, వారి శిక్షణాసామర్థ్యము, వారి బ్రాహ్మధర్మ

విశ్వాసము, వారి గభీర గురుభక్తి, వారి చరిత్రయందలి వివిధ ప్రకరణములుగ గన్పట్టును. వీని యన్నిటి యడుగున, వీనియన్నిటిని మించి, వీరి జీవితయాత్రను నడుపుచున్న సూత్రమును నిరూపింప దలచితిమేని, అయ్యది ధర్మదీక్ష యని చెప్పవచ్చును. జీవితమునందు తీవ్రమైన ధర్మజిజ్ఞాస పొడమినయెడల అయ్యది జీవితములోని వివిధ ప్రకరణముల నన్నిటిని అంతర్భుక్తము, అంగీభూతము చేసికొన గల్గును. ధర్మావబోధము మానవుని నిత్యజాగరణ మొనర్పజేసి, నిరంతరము జాగరూకునిం జేయును. అయ్యది యెట్టి పమత్తతను సహింపదు, మూలమూలల దాగియున్న మరుగులను సహితము బయటకు లాగి సాధకుని నిర్నిద్రుని గ జేయును. ధర్మసాధనమన ఆత్మోపలబ్ధి ప్రాపకమైన ఆరోహణము, ఊర్ధ్వగమనము —"అసిధారావ్రతము" వంటిది. ఏ యణుమాత్ర పరధ్యానము కలిగినను, పతనము ధ్రువము అంతర్ముఖమైన వివేకము, లక్ష్యమును సదా ధారణ చేయు ఏకాగ్రత, జీవితముయొక్క బాహ్యాభ్యంతరములను సమముగ నేకోన్ముఖము చేయగల సిష్ఠ, లోపలనుండియు వెలుపల నుండియు మూగి చిత్తవిక్షేప మొనర్పజూచు విషయవాసనలను బరిమార్జనము చేయగల చిత్తసంస్కారము, స్మరించిన మాత్రముననే వెలుగుచూపి మార్గమును ప్రకాశవంతము చేయగల దైవకృప- ధార్మికజీవన సమృద్ధికి అత్యావశ్యకములు. రామకృష్ణ రావుగారి సాధనసంపత్తియం దిట్టి ధర్మనిష్ఠ నిదర్శనపూర్వముగ వారి పరిచితులకు గోచరమగుచునే యుండును.

వీరిధర్మదీక్ష హృదయాంతరాళములో నెక్కడనో దృశ్యాదృశ్యముగ దాగి యుండునది కాదు. అయ్యది బట్టబయలుగ వెల్లడియగునది కాకపోయినను, రక్తము శరీరమునంతను ఆవరించి ప్రాణవంతముగ నొనర్చునట్లు, వారి ధర్మనిరతి వారి వేషభాషలను, వారి ఆహార విహారములను, వారి యాచార విచారములను, వారి యాటపాటలను, వారి సంబంధ బాంధవ్యములను, వారి పూజావిధానములను, వ్రతానుష్ఠానములను, ఉద్దీపిత మొనర్చుచుండును. ఈ ధర్మదీక్ష సంప్రదాయ సిద్ధము కానిండు, కాకపోనిండు. అయ్యది వారి స్వతంత్ర వివేచనచే నిర్దేశితమై యుండవచ్చును. లేక వారి భక్తివిశ్వాస భాజనులైన గురువులనుండి స్వీకరించిన దై

యుండవచ్చును. పాశ్చాత్యతత్వమీమాంసా సంకలితమైయుండినను ఉండవచ్చును. ఏదైన నేమి? ఒక ధర్మసూత్రము వారి జీవితయాత్రను నడుపుచున్నమాట నిశ్చయమని వారి నేమాత్ర మెరిగినవారైనను గమనింపకపోరు. లోకమునకు మార్గదర్శకము కాగలిగినది, ఇతరుల కుత్తేజనమును గలిగింప గలిగినది, ఆత్మవిశ్వాసమును బలపరుప గలిగినది వారి ధర్మదీక్షయనుట నిస్సంశయము.

వారి ఆంగ్లభాషా రచనా విన్యాసమునందు కూడ నీ దీక్షయే అక్షర అక్షరమున ప్రత్యక్షమగును. వారు భాషలో నెట్టి స్ఖాలిత్యమును సహింపరు. అపశబ్దముల వాడనొల్లరు. శబ్దముల వ్యుత్పత్తి నెరగినకాని ప్రయోగింపరు. తూనిక, కొలత, తూకము చూచుకొననిది వారి కలము సాగదు. వారు వ్రాతకు బూనుకొనినప్పుడు, కావ్యప్రపంచ మంతయు వారిచుట్టును బరివేష్టించి యుండునా యని తోచును. ఎచ్చటను పొంగులుగాని, పొరువులుగాని గిట్టవు. వారి జటిలమైన ధర్మమీమాంసా ప్రణాలిక ననుసరించి వాక్యములు తిరుగుళ్ళు తిరుగుచుండును అన్వయ కాఠిన్య ముండుగాక! Over - expression అనినను అనుడు. కాని ఎక్కడను ఎగుడుదిగుడు లుండవు. ఒక్క మాదిరిగ మొదటినుండి తుదివరకు ఒక్క రాగము వలె ప్రసరించు చుండును. వారి గురువులగు శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి భాష జలపాతము వలె, వెల్లువ భంగి,నురువులు గ్రక్కుచు పరవళ్ళు త్రొక్కును కాని రామకృష్ణరావుగారి భాష యట్టిది కాదు. వీరిది తామరతంపర వలె జిలిబిగిగ నల్లుకొని, భావసలిలములపై నావరించి యుండును. 18వ శతాబ్దపు క్లాసికల్ స్టైలు వీరిది. ఈనాటి రోమాన్టికు స్టైలు కాదు. కాని వారి రచనా విన్యాసమున గన్పట్టు శ్రద్ధ, దీక్ష, పటుత్వము, నియమము, వారి ధర్మప్రకృతి సిద్ధములే కాని, కృత్రిమములు కావు.

ఏ క్లాసిజము వారి భాషావైదగ్ధ్యమున గన్పట్టునో, వారి శిక్షణాక్రమము నందుకూడ నట్టి క్లాసిజమే వ్యక్తమగును. ఏ గ్రంథమును తాము పఠించినను,

లేక శిష్యులకు బోధించినను, ఒక్కటే విధమైన సర్వాంకషత్వము— "థరోనెస్సు" చూడనగును. ఈరోజులనాటి గరికకొనలను గరచు చదువు వారికి నచ్చదు. శిష్యుని బుద్ధిని సర్వవిధముల వ్యవసాయ పరచినగాని వారికి తృప్తి కలుగదు. ప్రాచీన సంస్కృతాధ్యాపకులు కావ్యశిక్షణమున జేయు అకాంక్షవంటి "మెథడ్"నే రామకృష్ణ రావుగారును అవలంబించెదరని చెప్పవచ్చును. నేటి అల్లాటప్పా చదువులు గురుశిష్య సంబంధమును కుటిల పరచుచున్నవని వారి నమ్మకము. కాలనిర్ణయము, పాఠ్యక్రమము, బోధనాపూర్వకమైన అవధానము— యథావిధిగ, నిర్ణీతములైన నియమముల ప్రకారము, జరిగి తీరవలసినదే ఉపాధ్యాయుడు కానిండు, విద్యార్థి కానిండు ఆ నియమములను తప్పినా, వారు సమముగ దండనార్హులు. తన్ను తాను "డిసిప్లిను" చేసికొనననిని అధ్యాపకుడు విద్యార్థులను "డిసిప్లిను"లో బెట్టలేడని రామకృష్ణ రావుగారి మతము. ఏ వ్యాకరణాభినివేశము, వారి భాషయందు చూపబడునో, వారి బోధనాక్రమమునందు కూడ నట్టి నియమానుష్ఠానము గన్పట్టును వీరి "డిసిప్లిను" గవర్నమెంటు అధికారులు రాజకార్య నిర్వహణము కొరకు, పరిపాలనా సౌష్ఠముకొరకు విధించు "డిసిప్లిను" వంటిది కాదు. విద్యార్థులను సర్వవిధముల చిన్ననాటి నుండియు నియమపటిష్ఠులునుగ, జాగరూకులనుగ, జేయుటకు పితృవాత్సల్యముతో విధించు డిసిప్లినుకాని, కేవల "రెజిమెంటేషను"వంటి శాసనపూర్వకమైన "మిలిటరిజము" కాదు.

వీరి స్వీయ జీవితము నంట్టి "సెల్ఫు-డిసిప్లిను" ప్రతిచేష్టయందు, వారి హావభావ విలాసముల యందు సహితము సదా గోచరించుచుండును. నియమములను బాటించుటలో వీరు పూర్తిగ శైవులనియే చెప్పవచ్చును. కాని బాహ్యానుష్ఠానము కంటె అంతరంగ సంస్కారమే వీరు ముందు ఎక్కువగ బాటించునది. వీరిలో దూకుడనునది అణుమాత్రమును గన్పట్టదు అవేశములో దేనిని జేయరు. సావధానముగ నాలోచించుకొనినగాని కర్తవ్యమును నిర్ణయింపరు. కర్తవ్య నిర్వాహణమునకు దగిన బాధ్యతను, సంస్కారమున ముందు అలవరచుకొనినగాని,

ఆచరణకు దిగరు. ముందు చూచి అడుగు వేయుదురేకాని, పరుగులు, గంతులు వీరికి గిట్టవు వివేచనా పటిమ వీరియందు విశేషముగ నుండుటచేతనే వీరు ప్రతి విషయమున లాభనష్టములను గుణించుకొను వర్తకతుల్యులని కొంద రపోహపడె దరు. కాని వారి వివేచనా పటిమ వ్యాపార సరళికి సంబంధించినది కాదు పునాదు లను దిట్టపరచుకొనినగాని, సౌధములను నిర్మించుటకు సాహసింపరు. సము ద్రాంతరాళమున పుట్టు ప్రవాళ పర్వతము (Coral rock) పెరిగి పెరిగి ఎంతకాలమునకో కాని, నీటిపైకి రాదు. అట్లే రామకృష్ణ రావుగారి బాహ్యోను ష్ఠానమును ముందు లోలోపల క్రమానుగతముగ బుష్టినొందు చిత్తసంస్కారము యొక్క క్రియావిశేషము వీరి సాధనవిధానము లోపలనుండి వృద్ధిచెందు (Endogenous) వృక్షము వంటిది వీరి బ్రహ్మచర్యదీక్ష వీరి యాంతరంగిక సంస్కారమునకు ప్రబల నిదర్శనము వీరు చిన్ననాటనే భార్యావియోగ హతు లైనను, పునర్వివాహమునకు సమ్మతింపక, బ్రహ్మచర్యమునందు సుస్థిరులగుట అభావాత్మకమైన వైరాగ్యముచే గాదు ఏకపత్నీవ్రత భూయిష్ఠమైన సాధుజీవన మది. స్త్రీకే కాక, పురుషునకు గూడ వివాహసంస్కారము ఒక్క పర్యాయమే యను "Monogamist" మతమువారు వీరు. వివాహ బంధనము ఈశ్వర ప్రేరితమని నమ్ముదురేని మరణము ఆ బంధనమును ఛేదింపజాలదు. ఈ విశ్వాసము వారియందు ఆత్మజ్యోతివలె నిర్ధూమముగ వెలుగుచుండుట చేతనే వారు బ్రహ్మచర్య దీక్షయందు నిష్ఠాగరిష్ఠులై యుండ గలుగుచున్నారు.

రామకృష్ణ రావుగారి ప్రకృతి సహజముగ Ethical mould అని నిరూపించవచ్చును. వీరి యుపాస్యము ధర్మము ప్రపంచమంతయు నియమ బద్ధము వీరితత్వసిద్ధాతము Subjective Idealism దర్శనమునకు జెంది నను, కాంటు దార్శనికుని "Categcrical Imperatives" వారి విశ్వాస మును వశపరచుకొనెను. బ్రాహ్మధర్మమునందు "Ethical values" లేని సాధన విధానములు గర్హ్యములు. రామకృష్ణ రావుగారి నీ విషయమున రామ భక్తునిగా భావించవచ్చును. పితృవాక్య పరిపాలనము, ఏకపత్నీ వ్రతము, దుష్టని

గ్రహము, ధర్మసంస్థాపనము. శ్రీరామచంద్రుని కేవల ధర్మావతారముగ జేసి వైచినవి. శ్రీకృష్ణతత్వ మిట్టిదికాదు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" యను అనన్యభక్తి,గోపీసుందరుల యందు మూర్తీభవించి యున్నది. శ్రీకృష్ణుని భాగవతతత్వము కేవలము ధర్మబాహ్యముగ నెంచబడక పోయినను, రామతత్వము వారి కెక్కువగ రుచించుటలో నాశ్చర్యము లేదు వారి లక్ష్యములో బృందావనము కంటెను, కైలాసమే ఎక్కువగ ప్రకాశించుట బ్రాహ్మధర్మ సంప్రదాయ సిద్ధము.

బ్రాహ్మ ధర్మావలంబకుల భక్తిజ్ఞానము లెంత కొరవడినను, శీలము నందును, నీతివర్తనము నందును లోకమునకు మార్గదర్శకులై వెలయుచుండవలెనని వారి యాశయము. ఈ యాశయమునకు భంగము వాటిల్లిన, వారికి గలుగు దుఃఖము వర్ణింప నలవికాదు. కాకినాడ మ్యునిసిపలు ఎన్నికలలో బ్రహ్మసమాజము ప్రత్యేకముగ నీతి మార్గమును వీడినప్పుడు వారు కేవలము క్రుంగిపోయిరి. వారికి కండ్లనీళ్ళ పర్యంతము వచ్చినది. "భ్రష్టస్య కావా గతిః" యని ఆక్రోశించిరి తుదకు గురుపాదులను గూడ మందలించకుండ వదలలేదు.శీలము పోయిన పిమ్మట, ధర్మాలు, ఉపదేశాలు, అర్చనలు, పూజలు ఎందుకు ? మానవుడు దుర్బలుడని తెలియక కాదు, వారిట్లు పరితపించునది. కాని అపరాధము గావించిన వెంటనే ప్రాయశ్చిత్త పూర్వకమైన కాండ జరుగనియెడల, ధర్మజీవనమున కంతటితో సమాప్తియని వారి నమ్మకము. ఈ విషయములో వారి నెక్కువగ క్రైస్తవసాధన ఆకర్షించును వారుక్రైస్తవులవలె మానవుడు జన్మతః పతితుడని విశ్వసించక పోయినను అజ్ఞాన వశముచే, ధర్మచ్యుతుడు కాకుండ నుండజాలడని వారికి దెలియును. కాని "పాపోహం" అని ఆత్మనిర్వేదముతో శరణు జొచ్చిన వానికే భగవానుడు పతితపావనుడుగ వెలసి ధర్మబలము నొసగగలుగును. భగవానుడు దనంతుడు. భక్తుడు మాయావశుడు. ఉభయుల మధ్య అనంతమైన అంతరము గలదు. "శివోహం" ఎంతటి వానికి ? ఈశ్వరుని కృపారసము తప్ప, భక్తుని తరింపజేయ గలుగు వారధి మరి యొకటి లేదు. కాని దానికి "ఆత్మనిర్వేదము" -Repentence అను మ్రొక్కుబడిని జెల్లించవలెను.

పరిత్రాత - Redeemer- శరణ్యము లభించనేరదు. వైష్ణవ సంప్రదాయములో గూడ నీ భక్తిప్రపత్తి యున్నను, క్రైస్తవ ధర్మమునందిది విశిష్ట లక్షణములతో విలసిల్లుచున్నది ఈ విషయమున బ్రహ్మధర్మము క్రైస్తవ మతమునకు ఋణ పడి యున్నదనుట నిశ్చయము. రామకృష్ణ రావుగారి హృదయాంతరాళమున నప్పుడప్పుడు అగ్నిపర్వతములు ప్రజ్వలించుచుండును ఆ మహాజ్వాలలు చెలరేగు చున్నప్పుడు, వారెట్టి దుర్భరములైన మహాపాతకములను గావించిరో యని భయము వేయును. కాని సాధకుని దృష్టిలో మహాపాతకముగ గోచరించు దోష ములు సాధకులు కానివారికి దోషములుగనే తట్టవు ధర్మసాధకుని దృష్టి తీక్ష్ణమైన కొలదియు, ఏ స్వల్పస్ఖాలిత్యమైనను వారికి మహాదోషము వలె గోచరించును. వారి యంతర్వాణి సుకుమారమైన కొలదియు, దాని గర్జనము మెండు. ఆ యంతర్వాణి మానసవీథుల యందు పోలీసువాని వలె గస్తీ తిరుగుచుండును. కన్ను చెదరనీయదు. వాక్కు నెప్పుడును శాసించి యుంచును. మనస్సుపై నే మాత్రము మలినము పడినను, శాంతి నొసగదు. అపశ్రుతి సహించదు. అందు కనియే ధర్మనిష్ఠ "అసిధారా వ్రతము'' వంటిదని ఋషులు చెప్పినారు. రామ కృష్ణ రావుగారి ధర్మదృష్టి సూక్ష్మదర్శిని వంటిది. భాషలో ఒక "కామా'' కూడ లోపించుట కెట్లు ఒప్పుకొనరో, విద్యార్థులలో "డిసిప్లిను'' భంగము నెట్లు సహింపరో, అంతరంగమున నే యణుమాత్ర విక్షేపము నైనను భరించుట కొడం బడరు ధర్మనిష్ఠ యంత తీవ్రమైనది ఇట్టి మహనీయుని ధర్మజీవనము సమకా కాలికులకే కాక, తరతరముల వారికీ దివ్యజ్యోతి వలె జ్వాజ్వల్యమానమై వెలయుగాక!

కృష్ణా పత్రిక
డిశంబరు 5వ తేది, 1936 సం॥

# శర్మ దేవీ గురుకులము

ఈ గురుకులమును గూర్చి యిప్పు డతివిచిత్రమైన పోరాటమును గల్పించి నది సుప్రసిద్ధులైన డాక్టరు వరదరాజులు నాయుడుగారు వీరు నాన్-కోఆపరేటర్లు. కారాగృహ వాసముచే కృతార్థులైన త్యాగశీలురు. గాంధిమహాత్ముని కారాగార విముక్తి సిద్ధించువఱకు పన్నుల నిరాకరించి అందునిమిత్తము తమ మోటారు బండిని గోలుపోయిన ప్రఖ్యాత పురుషులు. నిరంతర కార్యదీక్షచే తమిళనాడు కాంగ్రెసు కమిటీకి అధ్యక్షులై క్రొత్త పరిస్థితులను గల్పించుమన్న సాహసోపేతులు, ఇటీవల స్వరాజ్యవాదమునం దభిమానము వహించి తత్పక్షమునకు జయము గూర్చ నిశ్చయించిన స్థిర సంకల్పులు. ఇంగ్లాండునకు గూడ బోయి తద్దేశజనులకు హితము గరుప సంకల్పించిన మహోదారులు. యౌవనము యొక్క యుద్రేకము, పరిణతి, వయస్సుయొక్క నాయకత్వము, వీరియందు మూర్తీభవించినవి. వీరి కాత్మవిశ్వాసము మెండు. ఎట్టి క్రొత్త విషయమునందైనను జంకు గొంకు ననునది యెరుగరు. ఏసందర్భము నందైనను ముందడుగు వేయ జూతురు. గుంపులో మునిగిపోయి ప్రత్యేకతను గోలుపోవుట కిచ్ఛగింపరు. తరంగ శిఖరము నధిరోహించి ఉత్సాహ శంఖమును బూరించుచు ప్రజావళి నాకర్షింపజూచు విలాసము వీరి సహజరూపము. వీరు "తమిళనాడు" అను పత్రికను స్థాపించి తమ సహజ సంపద నంతయు నందుల కుపయోగించుచున్నారు. ఉద్రేక స్వభావులగుటచే బ్రతిఘటించుటకు వారి చిత్త మెప్పుడును గలవర పడుచుండును-ఎవరైనను అవకాశము కొఱకు వేచియుందురేమో కాని, వరదరాజులు నాయుడుగారు సంకల్ప మాత్రముచే నవకాశములను తక్షణము సృష్టించి వెంటనే కార్యకారు లయ్యెదరు. దేశము మొత్తముమీద కాంగ్రెసు సభ్యులు నిరుత్సాహులై తమ కర్తవ్యము నెటులనో నిర్వర్తించుచుండ, వరదరాజుల నాయుడుగారొక్క మాసములోపల దక్షిణ ప్రాంతమున నొక యపూర్వమైన కలవరమును కల్పింప గలిగిరి, వైకాములోని

సత్యాగ్రహము కంటెను, కోహటులోని హిందూ మహమ్మదీయ సంఘర్షనము కంటెను, జైటోలోని శిక్కుజతల కంటెను, శర్మదేవి గురుకులమును గూర్చి వరదరాజుల నాయుడుగారు ప్రచండ బీభత్స రసమును ప్రదర్శించుచున్నారు- ప్రస్తుత సందర్భమేమి?

శర్మదేవి యను గ్రామమున కొందరు దానశీలుర సాహాయ్యముతో వి-వి-ఎస్. అయ్యరుగారు సబర్మతీ ఆశ్రమపద్ధతిని ఒక గురుకులమును స్థాపించిరి. వి. వి. ఎస్. అయ్యరుగారు విశేష శేముషీ ధురంధరులు. ప్రాచ్య పాశ్చాత్య శాస్త్రములయందు సమానముగ గృషి సలిపిన జ్ఞానసంపన్నులు - పుదుచ్చేరిలో అరవింద ఘోషు యోగియొద్ద నుపదేశము నొందిన తత్వజ్ఞులు- ప్రప్రథమమున స్వాతంత్ర్య సంపాదనమార్గము రక్తపాత మూలకమని విశ్వసించియు, గాంధి మహాత్ముని శుశ్రూషచే, శాంతి భూయిష్టమైన అహింసాపద్ధతి యందు బుద్ధిని నిలిపిన సాధువులు. ఖండాంతరముల యందు ప్రవాసము చేసియుండి మాతృభూమి యెడల నిగూఢానురాగ బలిమిని జీవనోత్సర్గము చేయ నిశ్చయించుకొని నళందా తక్షశిల కాలమునాటి విద్యాపద్ధతిని స్మరించుకొనుచు శర్మదేవి చేరి యచ్చట గురుకులమును స్థాపించెను. ఈ గురుకులమును స్థాపించి రెండు సంవత్సరములైనను గాలేదు. వారి పుణ్యవిశేషము వలననో, దైవసహాయము వలననో వారికి ధనసహాయము సంతృప్తికరముగ జేకూరెను. తమిళనాడు కాంగ్రెసు కమిటీవారు కూడ నీ గురుకులమునకు అయిదువేల రూపాయల విరాళము నొసగిరి. డాక్టరు వరదరాజుల నాయుడుగారును స్వకీయముగ నూరు రూపాయల విరాళము నొసగిరి. వి. వి ఎస్. అయ్యరుగారు తాము సంకల్పించిన సంస్థ దినదిన ప్రవర్ధమాన మగుచున్నందు కెంతయు సంతసించుచుండిరి ఇంతకాలము వీరి జీవితమునకు స్థాయి చిక్కలేదు. ఈ ప్రపంచ సంబంధమైన భోగభాగ్యముల యందు వీరు బుద్ధి నిలిపియుండిన యెడల వీరిపాటి కే యున్నతపదవి యందో హెచ్చు ధన మార్జించి సౌఖ్యమనుభవించుచుండెడి వారు. కాని దేశభక్తి యను అగ్నికణము వారి హృదయమున చిన్నవాటనే జొచ్చెను. విదేశములలో నుండియు నెప్పుడును స్వదేశమునే ధ్యానించుచుండెడివారు. స్వదేశ విముక్తికొఱకు ఎన్ని దేవు

ళ్ళకో మొక్కెను. ఎన్ని యాత్రలనో చేసెను. ఎన్ని నోములనో పట్టెను. కాని యేదియు ఫలించలేదు. అన్ని పతకములును భంగ మగుచుండెను - స్నేహితులు సహితము ద్రోహము చేయుచుండిరి- వారు పడిన కష్టములు దైవమునకే యెరుక. నరక మను నొక స్థలమే యుండినయెడల అయ్యారుగారు పడిన బాధలా నరక వాసులు కూడ ననుభవించెదరో, లేదో తెలియదు. ఎన్ని యిడుముల బడినను వారియందు నిహితమై యున్న దేశభక్తి మాత్రము చల్లారలేదు.- అంతకంతకు వారి చిత్తము మాత్రము ప్రసన్నమగుచుండెను. లోకానుభవముచే గలుగవలసిన సంస్కారఫలము సిద్ధించుచుండెను కేవల గ్రంథపఠనముచే గలుగజాలని జ్ఞాన సిద్ధి మనన ధ్యానాదులచే జేకూరుచుండెను- కాని ఎట్టి జ్ఞానము, తపోబలము చేకూరినను, సాధనకొక కర్మక్షేత్ర మవసరము- ఈ కర్మక్షేత్ర మింతకాలము వారికి దొరకక పోవుట చేతనే వారికి శాంతి లేకపోయెను- శాంతి లేని సాధకుని మనస్సు యెట్లుండునో సాధకునికే తెలియును— భౌతిక సంబంధమయిన తాప త్రయము ఆ యశాంతిముందర బరిగణింపదగినది కాదు - వి-వి-ఎస్. అయ్యరు గారి మన మొక బడబానలము వలె నహరహము దహించుకొని పోవుచుండెను- మహాత్ముం డొక్కడే తనకు శాంతి నొసగగలడను ఆదేశ మాతని హృదయ కవాటమును తట్టెను- మహాత్ముని సన్నిధిని జేరి అహింసా తత్వమును గ్రోలి గురుకులమును తన కర్మక్షేత్రముగ స్థాపించుకొనెను- తలవని తలంపుగ నెప్పుడు సహాయ ప్రోత్సాహములు వెనువెంట జేకూరెనో, అప్పుడొక విధమగు భయముతో గూడిన విస్మయ మాతని ఆవహించెను. ఎప్పుడును తన జీవితమున బయటనుండి ప్రోత్సాహమును బొంది యెరుగడు అడుగడుగునకు గష్టములే యక్షౌహిణులుగ వాని నెదుర్కొనుచుండెడివి- ఇప్పుడవి యన్నియు నంతర్ధానమై శాంతముగ, సోల్లాసముగ గురుకులమున, కోమల హృదయులైన బాలురయందు జ్ఞానదీపికలను వెలిగించుచుండెను- ఈ సందర్భములో నెట్టి చిత్తవికారము వానికి కలిగెనో తెలియదు— వారి పురాకృత కర్మ యింకను శేషించి యుండెనేమో యెరుగము. "తపోధనం వేత్సినమా ముపస్థితాం" అనునట్లుగ వరద రాజుల నాయుడుగారి దూర్వాస శాపమునకు అయ్యారుగారు గురియైరి. ఎందుచేత ?

అనైక్యము మన దేశమునకు దాపరించిన పిశాచము ఇందుమూలముననే భరతవర్షము రాజ్యభ్రష్ట మయ్యెను- నేటికి ఈ పిశాచము పట్టుకొని వదులుట లేదు. కార్యము ఫలోన్ముఖమునకు వచ్చునప్పుడెల్ల నది దాపరించి బోర్లించి పోవును ప్రాచీన చరిత్రయేకాక, అధునిక చరిత్రకూడ నిందు కనేక నిదర్శనములను జూపగలదు. తమిళనాడు సంఘములో నీ భేదభావ మంకురించి క్రమ క్రమముగ వృద్ధి నొందుచుండెను సి- రాజగోపాలాచార్యులుగారును దీనిని సహింపజాలక దీనినుండి తొలగి ఒక వనాంతమున నొక యాశ్రమము నేర్పర చుకొని శిష్యులతో సుఖముగ కాలము గడుపుకొనుచున్నారు. వీరివలెనే అయ్యరు గారును ఆశ్రమము నేర్పరచుకొనినను, తమిళకాంగ్రెసు నుండి విరాళము పుచ్చ కొనుటచే దాని ఫలము ననుభవించక తప్పక వచ్చినది- అయ్యరుగారు జ్ఞానుల గుటచే సహజముగ నీ ప్రస్తుత వర్ణభేదమును బాటించువారు కాదు- పైగా చాలకాలము విదేశసీమలలో గాలము గడపినవారు పాఠశాలలో వర్ణభేదమును బాటింతురనుట దురూహ్యము- కాని దేశముయొక్క ప్రకృత స్థితిగతులను గమ నించి ఆశ్రమములో గొంతవరకు వర్ణవిభేదమును బాటించుచు వచ్చిరి కాని డాక్టరు వరదరాజులునాయుడుగారి కిది మహాపాతకముగను, దేశద్రోహము గను, బ్రాహ్మణేతరుల యెడల ధిక్కారముగను దోచినది ఆశ్రమవాసు లెల్లరు నేకపంక్తిని భుజించుటకు అయ్యరుగారికి సమ్మతమే కాని ఎవరిని అట్లు చేయవల సినదని నిర్బంధింపజాల మని చెప్పిరి. ఆశ్రమములో నిద్దరు బ్రాహ్మణ బాలురు మాత్రమే వేరుపంక్తిని భుజించుచున్నారు కాని తక్కినవారందరు నేక పాంక్తే యులే. కాని భేద మీషణ్మాత్రమయినను సహింపజాలమని నాయుడుగారు, నిర్బం ధపద్ధతిని బ్రవేశపెట్టజాలమని అయ్యరుగారు సంఘర్షణపడిరి. ఈ తగాయిదాను దీర్చువారెవరు? మహాత్ముని పంచాయతీగ బరిష్కరించుట కుభయులును గోరిరి- "ఇక ముందునుండి బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదము లేకుండ ఏకపంక్తి భుజించుట కిష్టపడువారినే ఆశ్రమమున జేర్చుకొనవలయును. ఈ నియమమునకు ముందు జేరినవారిని నిర్బంధించవలదు, వంట చేయువారు బ్రాహ్మణులుగ నుండవలయును" అని మహాత్ముడు తీర్పుచెప్పెను- ఈ తీర్పును అయ్యరుగారు శిరసావహించెద

మనిరి- కాని నాయుడుగారు శరించిరి. బ్రాహ్మణులే వంటవాండ్రుగ నుండవలయు ననెడి నియమము బ్రాహ్మణేతర తిరస్కారమని నాయుడుగారి వాదము-బ్రాహ్మణ బ్రాహ్మణేతరులలోనే చాల శాఖ లుండుటచేతను, ఒక వర్ణమువారి వంట నింకొక వర్ణమువారు ముట్టకపోవుటచేతను, ప్రస్తుత కాల సందర్భమును బట్టి బ్రాహ్మణులు వంటవార లైనయెడల నే వర్ణస్థులకు నభ్యంతరము లేకయుండుననుఁ అభిప్రాయముతో మహాత్ముడట్లు తీర్మానము చేసెను. అంతియేకాక, దృష్టిదోషము పాటించు వర్ణస్థులను ముందా దోషమును బాపి ఏకపంక్తిని గూర్చుండ బెట్టిన యెడల క్రమముగ వంటవిషయములో గూడ మార్పుచెందవచ్చునను విశ్వాసము మహాత్మునకు గలదు- కాని వరదరాజులు నాయుడుగారి కా శాంతపద్ధతులు పని కిరావు- తనకు సమ్మతముకాని సందర్భములో రాజీ కూడదు- "మహాత్ముడు చెప్పనీ, ఎవరయిన చెప్పనీ, వంట చేయుటలో, భోజనము చేయుటలో బూర్తిగ వర్ణభేదము పాటింపకుడు-లేదా బ్రాహ్మణేతరులు ఆశ్రమమున కిచ్చిన విరాళములను తిరిగి ఇచ్చివేయుడు. ఇయ్యరా, సత్యాగ్రహ పద్ధతిని ఆశ్రమముపై దాడివెడలి, ఆశ్రమమును స్వాధీన పరచుకొనెదను. వాలంటీరులారా! ఈ రణరంగమున జేర దలచుకొనినవారు రండు" అని అంత్యసందేశ మొసగి దక్షిణదేశ మందంతట సభలను గావించుచు రణోత్సాహమును బ్రజ్వలింప జేయుచున్నాడు- అయ్యరు గారికి శాంతి యెక్కడ? తాము ఆచార్య పదవియందుండి ఆశ్రమమును రణరంగముగ మార్చుటకు గల యుద్రేక బీభత్సములు అయ్యరుగారి యొద్ద లేవు- నిప్పులను మింగగల సహన మేర్పడెనేకాని నిప్పులను గ్రక్కు రోషము వారియందంతరించినది- అయ్యరుగారు సాంఘిక విషయమును గడుపుటకు దగిన తపోబలము తమయొద్ద లేదని చెప్పి, తమ యాచార్యత్వమును వదులుకొని ఆశ్రమమును కార్యనిర్వాహకుల పరము చేసెను. కాని యిదికూడ నాయుడుగారికి చాలలేదు తన తమిళనాడు కాంగ్రెసు కమిటీ పరముచేయక, కార్యనిర్వాహకుల పరముచేయుట యేల యని ప్రశ్నించుచున్నాడు- ఆశ్రమమును బట్టుకొనిన "జలగల" నన్నిటిని నిలిపివేసినగాని తాను సమరము నాపజాలమని ప్రకటించిరి.

అయ్యరుగారి సాధనమార్గ మింకను కంటకావృతమై యున్నది- నాయుడుగారి కార్యసాహసములకు దగిన బరిస్థితులును కల్పితమైనవి ఉభయులును వారి వారి కర్మపరిపాకము ననుభవింపక తప్పదు.

కృష్ణా పత్రిక
ఏప్రిల్ 25వ తేదీ, 1925 సం॥

# ప్రకృతి పరిశోధనము

అమెరికాలో ప్రతి విషయము బృహత్తరమైన పరిమాణమున జరుగును. చిన్న యత్నములు స్వల్ప సంఘటనలు వారికి బనికిరావు ! ఇతర దేశములలో మేడలు ఏడెనిమిది యంతస్థులు లేచినయెడల అమెరిగాలో నవి యిరువది ముప్పది యంతస్థులు దాటి ఆకసము నంటజూచును రైళ్ళితర దేశములలో గంటకు అరువది డెబ్బది మైళ్ళు నడచినయెడల అమెరికాలో నవి వందమైళ్ళు పరుగెత్తవలెను. కర్మాగారములు, వర్తకకూటములు, విశ్వవిద్యాలయములు, నాటకశాలలు, చిత్రప్రదర్శనములు—ఇవి యవి యననేల, సమస్త విషయములయందు అమెరికా తక్కిన దేశములను మించి అగ్రస్థానము వహింపజూచును. వారి దేశము విశాలము. వారి నదులు పెద్దవి. వారి తలంపు లపూర్వములు. వారి నిర్మాణము లద్వితీయములు. వారి కోటీశ్వరులు కుబేరులు— వారి యూహలు ప్రపంచము నంత నొక్కమారు కబళింపగల శక్తిని ప్రదర్శించును. వారి దానములు సహితము అట్టి పెద్దయెత్తుననే జరుగుట ఆశ్చర్యకరము– అమెరికాలో జాన్ సైమను గగన్హీమను ఒక గొప్ప కోటీశ్వరుడు కలడు. వీని కుమారు డిటీవల కీర్తిశేషు డయ్యెను వీని జ్ఞాపకార్థముగ తండ్రి తొంబది లక్షల రూపాయలు నిధితో నేటేటను ఏడువేల అయిదువందల రూపాయల చొప్పున 64 గురు గొప్ప శాస్త్రజ్ఞులకు తమ యభిమాన విద్యలయందు పరిశోధనమును గొనసాగించుటకు సహాయము చేయుటకేర్పాటు చేసెను– ఈ వేతనము లొక్క యమెరికనుల కనియే నిర్ణయింపబడ లేదు– ప్రపంచములో, నే పండితుడైనను, లోకోపకారకమైన ఏ విద్యాపరిశోధనము కొరకైనను వేతనమును బొందదగును. జాతి, మత, దేశ విభేదములను బాటించకుండ సమస్త దేశములలోను వీనిని బంచిపెట్టుటకై యీ మహాదాత నిర్ణయము చేసెను ఒక వైపున జాతి మదమాత్సర్యములు బీభత్స రూపమును బ్రదర్శించుచుండ, సైమను గగన్హీము

మహాశయుడు ప్రపంచములో జ్ఞానాభివృద్ధి కొరకిట్టి మహాదానమును గావించు టెంతయు లోకాభ్యుదయ సూచకము— అమెరికనులు వైజ్ఞానికాభివృద్ధికై వెచ్చించుచుండిన ధన మపరిమితము— పాశ్చాత్యులు విజ్ఞానమును విశేషముగ బరరాజ్యాపహరణము కొరకును విషయభోగముల కొరకును వినియోగించు చుండిన మాట నిజము— కాని అమవసనిసి యందు తారాగణ మెక్కువ దీప్తితో వెలుంగునటుల, ఈ భోగలాలసత మధ్య వైజ్ఞానము మానవ దుఃఖోపశమనము గావించిన ఉపకృతి కూడ నెక్కువగ వ్యక్తమగుచున్నది. ఈ వైజ్ఞానిక పరిశోధన మూలమున లోకమునకు గలిగిన మేల్లు మహత్తరములు, ''ఇన్సూల్యిను'' అను ఔషధము అతిమూత్రముచే బాధింపబడుచున్న రోగుల పాలిట సంజీవిని యైనది. ఏ యౌషధమును జికిత్సచేయలేని ఉబ్బసపు వ్యాధికి ''అడ్రినలిను'' అమృత మైనది. ''క్రమవికాస'' సిద్ధాంతము కనుపెట్టబడిన పిమ్మట జ్ఞాన ప్రపంచమున గలిగిన మార్పు అద్భుతము. అంతకు బూర్వము కట్టుకథలవలె నుండిన ననేక ప్రకృతిరహస్యములీ సిద్ధాంతము మూలమున అన్వయము లయ్యెను. అమెరికనులు కేవలము భౌతిక విజ్ఞాన పరిశోధనల కొఱకేకాక, తత్త్వాలోచన విషయములయందు కూడ జాల ధనసహాయము గావించుచున్నారు "ఫిజిక్సు''లో "నోబిలు ప్రైజు'' ను బొందిన ప్రొఫెసరు మైకేల్సనుకు, ఈన్స్టెను పండితుని ''రెలెటివిటీ'' సిద్ధాంతమును బరీక్షించుట కేబది వేల రూపాయల పిరాశ మొసగ బడినది ఈమధ్య జంతుశాస్త్రజ్ఞుడగు విలియంబీ పండితుడు మత్స్యములలో క్రొత్త వైచిత్ర్యములను గనుపెట్టుటకు ఉత్తర సముద్రములకు బంపబడెను. కొన్ని మత్స్యములు సముద్రగర్భమున నుండి వాని యెరల నాకర్షించు నిమిత్తము రంగు రంగుల కిరణములను ప్రసరింపజేయ గల్గునని అతడు కనుపెట్టగల్గెను హిమాలయ శిఖరములలో నత్యున్నతమైన ఎవరెస్టు శృంగము నెక్కుటకు ఎంతమంది అమెరికను భూగోళ శాస్త్రజ్ఞులు పంపబడుచుండిరో పాఠకులకు దెలిసియే యుండును. హిందూదేశములోను కోటీశ్వరులు లేకపోలేదు. ఎందఱో సంస్థానాధిపతులు కలరు వీరి పూర్వులు జ్ఞానోపార్జనాపరులగు విద్వాంసులకు అగ్రహారములను, మాన్యములను, ఇచ్చి విద్యలను బోషించు

చుండెడి వారు కాని యీ కాలపు సంస్థానాధీశులును, జమీందారులును ఎంతవరకు విజ్ఞాన పరిశోధనలకు ధనసహాయము చేయుచున్నారు? సర్ హర్‌సింగు యూరపు ఖండములో స్త్రీలపై లక్షలకొలది ధనమును దూబరా చేసెనని యిటీవల బయల్పడలేదా? ఇండోరు సంస్థానాధీశుడు మమ్మటజు బీగమను ఉంపుడుకత్తెపై కోట్లకొలది వజ్రములను, వైడూర్యములను, విరజిమ్మినట్లు వినుచుండుట లేదా? బరోడా గాయక్వారుగారు స్వదేశమును వీడి సీమలోనే మహాభోగముల మధ్యను కాపురము చేయుచున్నారు ఇట్టి లక్ష్మీపుత్రులెల్లరు తమ కర్తవ్యములను గమనించిన యెడల జ్ఞానభూమియగు భరతవర్షము ఆధునిక విద్యలలో నెందుకు వెనుకబడి యుడును? విశ్వవిద్యాలయముల నుండి మెరికలవంటి వారెందరో యుత్తీర్ణు లగుచున్నారు. వారికి దగిన ధనసహాయము లేకపోవుటచే వారి యభిమాన విద్యలయందెక్కువ పరిశోధనను గావించుట కవకాశము లేక, కడుపాత్రము కొఱకు ఏ వృత్తిలోనో ప్రవేశించి, వారిలోని జ్ఞానదీపము నార్పుకొన వలసివచ్చుచున్నది. ప్రతి యూనివర్సిటీలోను పరిశోధకులకు దగిన వేతనము నొసగినయెడల నెందరు జే. సి. బోసులు, ఎందరు పి. సి. రాయలు, ఎందరు సి. వి. రామన్లు పుట్టుకురారు. భరతవర్షము రత్నగర్భ యని పేరొందినది. భూగర్భమున సమూల్యములైన లోహములు, ధాతువులు, దాగియున్న వి- బొగ్గు, రాగి, ఇనుము, బంగారము మొదలగు పదార్థములు హిందూదేశపు గనులలో మూలుగుచున్నను దేశీయులు దరిద్రులై కాటకముల చిక్కుచున్నారు— ఇంతకంటె దుఃఖకరమైన విషయము మరియొకటి లేదు- టెలిగ్రాపు తీగలపై నెన్నియో పిట్టలు వ్రాలి కిచకిచలాడును కాని ఆ తీగల గుండ నెట్టి వార్తలు దుముకుచుండునో వానికి తెలియదు - అట్టులనే యున్నది దేశీయుల స్థితి - ప్రకృతి పరిశోధనము లేకపోవుటచే దేశగర్భమున దాగియున్న ధనము నుపయోగించుకొన లేక అల్లల్లాడుచున్నారు - వెనుక నాదర్షా మొదలగు తార్తారులు, మొగలాయిలు, హిందూదేశముపై బడి కోట్లకొలది ధనమును దోచుకొని పోయిరి. కాని ఆ దోపిడిగాండ్రు బయటనున్న ధనమును దోచుకొనిపోయిరే కాని, భూగర్భము నందలి ఐశ్వర్యము నపహరించలేదు- ఇప్పుడట్లు కాదు— ప్రకృతి ఉపాసకులగు పాశ్చాత్యులు దేశగర్భమున జొరబడి

యందనాదినుండియు గర్భితమైయున్న ధనము నాకర్షించుచుండ, దేశీయులు నిర్ఘాంతపోయి చూచుచున్నారు. వెనుక దక్షిణాఫ్రికాలో నొక పొలమునం దొక కాపు గుడిసె వేసుకొని జీవనము గడువక కృశించుచుండెను. కాని ఆ గుడిసె క్రింద నున్న గుప్తధన మాతనికి తెలియదు. విదేశముల నుండి వైజ్ఞానికులు వచ్చి భూగర్భమును బ్రద్దలుచేసిరి- అందుండి నేటివరకు బంగార మవిచ్ఛిన్నముగ ప్రవహించుచున్నది- ఆ కాపును, వాని పిల్లలను నేడా బంగారు గనులలో కూలి పని చేసికొనుచున్నారు కాని వానిని గసుపెట్టిన వైజ్ఞానికులు కోటీశ్వరులయిరి- మన విశ్వవిద్యాలయము లెంతవఱకును ధనము నుత్పత్తి చేయలేని విద్యాధికులను తయారు చేయగలుగు చున్నవి. గులాంఖానాలో చాకిరీ చేయగల సమర్థులు తప్ప దేశముయొక్క యైశ్వర్యమును బెంపొందింపగల వైజ్ఞానికులు వచ్చుటలేదు. ఇందుకు కారణము మన యూనివర్సిటీల లోపముకాక మరియొకటి లేదు. ప్రకృతి పరిశోధనను జరుపుటకు తగిన అవకాశములను గవర్నమెంటువారుకాని మన సంస్థానాధీశులుకాని కల్పించుట లేదు-స్విట్జరుల్యాండులో జీవింపజాలక అమెరికాకు వెడలిన సైమను గగహీన్నమను యూదీయుడు, నేడు కోటీశ్వరుడై ప్రకృతి పరిశోధనయొక్క యావశ్యకతను గమనించి అందుకై తొంబది లక్షల రూపాయల నిధిని దానమొసంగినప్పుడు మన సంస్థానాధీశులు తమ బాధ్యతలను గుర్తింపకపోవుట శోచనీయము ఇండోరు మహారాజుగారు తమ రాజమందిరములో చిత్తరువులను వేయు నిమిత్తము ఇరువది లక్షల రూపాయలను ఒక యూరపియను కంపెనీ పొట్టబెట్టగలిగెనే కాని, దేశభాగ్యమును బెంపొందించుట కొక విజ్ఞానాలయమును నెలకొల్ప లేకపోయెను బెంగుళూరులో నొక తాతా విజ్ఞానాలయము తప్ప చెప్పదగిన పరిశోధనాలయము మరియొకటి లేదు. అధికారులు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకై పతకములను వేయుచున్నారు. ఈ నిమిత్తమై యధికారిగ నియమింపబడిన స్టాధాముగారు రాజమహేంద్రవరము, విశాఖపట్టణము, బెజవాడ, మొదలగు పట్టణములను దర్శించుచున్నట్టు ప్రకటింపబడినది. ఆంధ్ర ప్రముఖులును స్వస్థలాభిమాన ప్రేరితులై యీ క్రొత్త యూని

వర్సిటీని వారి వారి పట్టణములయందు నెలకొల్పుడని ఒకరికంటె నొకరు ముందుగ నివేదికలను బంపుకొనుచున్నారు ఈ యాందోళన యంతయు నెందుకో తెలియదు ఆంధ్రదేశములో నింకను గ్రాడ్యుయేటు గుమాస్తాలును, న్యాయవాదులును, డాక్టర్లును బడిపంతుళ్లును, వృద్ధికావలెను గాబోలు. ఈ విద్యా పద్ధతి యరిష్టదాయక మని యింకను దేశప్రముఖులు గమనించకపోవుట విచార కరము. అమెరికా యూరపు ఖండముల యొక్క యభివృద్ధి యంతయు వారి ప్రకృతి పరిశోధనలపై నిలచియున్నదని మన విద్యాధికులకు దెలిసియు మాయ పుంతలు బట్టుట మఱింత దుఃఖకరము.

కృష్ణా పత్రిక
మే 2వ తేదీ, 1925 సం॥

# సెకండరీ విద్య

ఎట్టివారయినను ఎప్పటికైనను కాలముయొక్క యొత్తిడికి లోబడక తీరదు. మన విద్యాధికారులు చిరకాలము వర్తమాన కాలముయొక్క చిహ్నము లను గమనించక ఏ 19వ శతాబ్దారంభముననో ప్రవేశబెట్టిన విద్యావిధానమును బట్టుకొని వ్రేలాడుచుండిరి దేశములో నీ విషయమై యెంత యాందోళనము జరిగినను వారు తమ పద్ధతులను మార్చుకొనలేదు. వారి మాతృకయగు ఇంగ్లాండు లోనే విద్యాస్వరూపము మారినను, దాని కనుబంధముగ నీ దేశములో నేర్పడిన విద్యాక్రమము మారకుండ బట్టుకొని వచ్చుచుండిరి. ఏ మార్పులు జరిగినను అవి పైపై మార్పులేకాని, దేశముయొక్క కొఱతలను దీర్పగలిగిన మార్పులు కావు. యూనివర్సిటీలను హెచ్చించిరి. ప్రైమరీవిద్యను సార్వజనీనము చేయుచుండిరి. కాని సన్నగిలిన వృత్తులను తిరిగి యుద్ధరింపగల విద్యావిధానము మాత్రము వారి దృష్టి నాకర్షించ లేదు. పైగ నీ యాధునిక విద్య దేశములో నిర్వ్యాపారత నభి వృద్ధి పరచుచున్నది. చదువు రానివాడు చదువుకొనిన వానికంటె మేలనిపించు కొనుచున్నాడు. చదువుకొనని వాడు తన కులవృత్తి నవలంబింప సమర్థుడై యుండును. వ్యవసాయకుడు నాగలికొయ్యను బట్టగలడు. కమ్మరి సుత్తి కొట్ట గలడు. శిల్పి గృహములను నిర్మింప గలడు. సాలి బట్ట నేయగలడు. వారెల్లరు దేశముయొక్క యైశ్వర్యము నుత్పత్తి చేయగల ప్రజ్ఞావంతులు కాని యీ కాలపు స్కూళ్ళలో జేరి పట్టబిరుదములను సంపాదించుకొను విద్యాధికులు ఇతరుల ధనమును బీల్చగల వారగుదురే కాని, దేశభాగ్యము నుత్పత్తి చేయగలవారు కాజాలకున్నారు. ఉద్యోగి ధనము నుత్పత్తి చేయడు ప్రజలిచ్చు పన్నులపై బ్రతుకువా డుద్యోగి. ప్లీడరైనను, డాక్టరైనను అన్యుల ధనము నపేక్షించువారే కాని స్వతంత్రముగ ధనము నుత్పత్తి చేయగలవారు కాదు ఆధునిక విద్యావిధాన మిట్టి పరాన్న భుక్కులనే తయారుచేయుచున్నది. ఇందైనను పూర్తిఫలము సిద్ధిం

చుట లేదు స్కూళ్లకు బోవుచున్న వారిలో నెంద ఱుద్యోగు లగుచున్నారు? ఎందరు డాక్టర్లుగాను, లాయర్లుగను నెగ్గ గలుగుచున్నారు? నేడు పట్టపరీక్ష నిచ్చిన వారెందరో యుద్యోగములు లేక యిల్లల్లాడు చున్నారు విఫ మనోరథులైన డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు, ఓవర్సీర్లు, బి ఏ లు ఎందరో గలరు వీరు రెంటికిని జెడిన రేవడ లగుచున్నారు. వారు వారి పూర్వుల కులవృత్తినా స్వీకరింపజాలరు వారికి దగిన ఉద్యోగపదవులా సిద్ధించుట లేదు. యూనివర్సిటీ లేటేట వేలకొలది గ్రాడ్యుయేట్లను తయారు చేయుచున్నవి ఒక కలకత్తాయూనివర్సిటీ నుండి ప్రతిసంవరము అయిదు వేలమంది గ్రాడ్యుయేట్లు బయల్వెడలుచున్నారు కాని యింతమందికి యుద్యోగము లెక్కడనుండి వచ్చును? వృత్తు లెక్కడ? కూలిచేసికొని జీవించువానికైనను పనులు దొరుకుచున్నవి కాని విద్యాధికుల మనుకొను వారికి బ్రతుకు తెరువు గానవచ్చుట లేదు యూనివర్సిటీ మనుష్యుల స్థితియే యింత ఘోరముగ నున్నప్పుడు, సెకండరీ విద్యాభ్యాసకుల గతియేమి? నానాటికి వీరి సంఖ్య పెరిగి పోవుచున్నది. ప్రతిగ్రామములోను వీరు ప్రత్యక్షమగుచుందురు ఒక యిరువది రూపాయల పనికి వందలకొలది దరఖాస్తులు వచ్చును. దీనికంతకు గారణము ప్రస్తుత విద్యాపద్ధతి తప్ప మరియొకటి కాదు ఈ విషయమును గూర్చి సంస్కర్తలెంతకాలము నుండియో మొత్తుకొనుచుండిరి. ఇప్పటి స్కూళ్లు కేవలము గులాం ఖానాలని చెప్పినయెడల అధికారులు కోపగించెదరు కాని స్వతంత్ర వృత్తులను గల్పించలేని స్కూళ్ళు గులాంఖానాలు కాక మఱియేమి? మదరాసు విద్యాంగమంత్రి యీమధ్య నీ పట్టణమునకు వచ్చి నోబిలు కళాశాలలో విద్యార్థులను గవర్నమెంటు నౌకరీల నపేక్షింపవలదని హెచ్చరించుచు నుపన్యసించెను. విద్యార్థులు తెల్లబోయిరి. వారు యే వృత్తి నవలంబింప గలరు? ఈ ప్రశ్న తప్పక విద్యాంగమంత్రిని వేధించుచుండవలెను. ఇప్పుడు వీరు సెంకడరీ విద్యను బూర్తిగ మార్చివైచి, చేతిపనులను గూడ హైస్కూళ్ళలో నేర్పుటకు దగిన సౌకర్యముల నమర్చుటకు బ్రయత్నించుచున్నట్లు ప్రకటింపబడినది. విద్యార్థులలో చేతిపనులయందభిరుచిని గల్పించుటకు బ్రయత్నింపబడునట సాహిత్యవిద్యతో బాటు కర్మవిద్యలనెట్లు జతపరచెదరో చూడవలసి యున్నది. ఈ ప్రయత్నమే జాతీయ

విద్యాలయములలో గొంతవఱకు సాగింప బడుచున్నది. ఇంతకాలమునకు గవర్న మెంటువారే యీ సంస్కరణము యొక్క యావశ్యకతను గమనించుట శుభ సూచకము. సాహిత్యముతో బాటు కర్మవిద్యా విభాగమును మేళవింప జేయుటకొరకు కమిటీ నియమింపబడునని తెలియుచున్నది. కాని కేవలము కమిటీ తీ సమస్యను బరిష్కారము చేయజాలవు. దేశములో చేతిపనులకు బ్రోత్సాహము గల్పించుట ప్రథమ కర్తవ్యము. స్కూళ్లలో కర్మవిద్యలను బోధించుటకు దగిన ధన సహాయము చేయుట రెండవ కర్తవ్యము. ఈ రెండు కర్తవ్యముల విద్యాంగ మంత్రి యెట్లు నిర్వహింప సమకట్టెనో చూడవలసి యున్నది.

కృష్ణాపత్రిక
జూన్ 13వ తేదీ, 1925 సం॥

# దాసు అనంతరము?

"బ్రతికినను దేశము కొఱకే బ్రతికియుందు
మరణ మొందిన దేశమ్ము కొరకె పోదు."

"దాసు సుఖనిద్రయందు దేలుచున్నాడు. కార్యభారమంతయు మనపై బడినది." అని మహమ్మదాలీ తన దుఃఖమును బహుసూత్ర ప్రాయముగ వ్యక్తీకరించినాడు. దాసు చాల యదృష్టవంతుడు. తన యశోబింబము దినమణి పగిది మింటిమధ్యమున బ్రచండ దీప్తితో బ్రజ్వలించుచుండిన తరుణమున నస్తమించుట కంటె భాగ్యమేమి కలదు? వంగభూమియే కాదు, భరతవర్ష మంతయు భూకంపము వచ్చినట్లు దద్దరిల్లిపోయెను. ఆనాడు కలకత్తా నగరరాజ మంతయు గగ్గోలు పెట్టుచు వీథిని బడెను. అంతఃపుర స్త్రీలు సహితము గృహములలో నిలువజాలక పోయిరి. ఆ పవిత్ర కళేబరమును చితిపై బరుండ బెట్టినప్పుడు ఆ ప్రజావళినుండి బయల్వెడలిన దుఃఖరోదన మసదృశము. దేశబంధువన్న నేమో నాడు సకలజనులకు హృద్గతమైనది. రక్తబంధువుని మరణముకంటె నీ వియోగము ఎల్లరను శోకవహ్నియందు ద్రేల్చివేసినది. ఏడులక్షల గ్రామములలోను సానుతాపమును వెల్లడింపని గ్రామ మొక్కటియు లేదు. సకల పక్షములు, సమస్త ప్రాంతములు నీ వివత్సమ్ముఖమున నొక్కటి యయ్యెను. భారత ప్రవాసు లెక్కడెక్కడ నుండిరో, దక్షిణాఫ్రికా, మెడగాస్కరు, ఫ్రాన్సు, ఇంగ్లాండు, జపాను, అమెరికా, ఈ ఖండము ఆ ఖండ మననేల, భారత రక్తము, స్పందించుచున్న ప్రతి జీవుని గలచివైచిన నీ బాంధవ్య మెట్టిదో యొకమారు యోజింపుడు. శత్రుపక్షమునకు జెందిన అధికార ధూర్వహులు సహిత మీ తరుణమున శిరము వంచిరి. భారతీయునియం దింకను రాష్ట్రీయ భావ ముదయించలేదని యిప్పు డెవరు చెప్పగలరు? ఈ సహానుభూతి తాత్కాలికమని చెప్పిన చెప్పుదురుగాక! ఆసేతు హిమాచల పర్యంతము త్రింశత్కోటి భారత సంతానమునందును అట్టి

డుగున నొక యైక్యత లేనియెడల, తాత్కాలికముగ నైనను, ఈక్షణమున నది యెట్లులికి, పొంగి, పొరలగలదు? ఎల్లర నొక్కటిగ జేసిన యీ యనుబంధ మేమిటి? దేనికొరకు ఆ మహానుభావుడు జీవన సర్వస్వ మర్పించి చరితార్థు డయ్యెనో, అయ్యదియే భారతీయు లెల్లరిలో నొక్కమారు కలవరము నొందినది. దాసు గారొక నూతన వస్తువును గల్పించలేదు. ఒక క్రొత్త విషయమును సృష్టించలేదు. ముప్పది కోట్ల భారతీయులలో నే దేశాత్మ గర్భితమై యున్నదో దానినే తన మరణమునందు సహితము సోదర దేశీయు లెల్లరకు ప్రత్యక్ష మొనర్పగలిగెను. చిత్తరంజను దేనాడు సకుటుంబముగ శ్రీకృష్ణుని జన్మస్థానమునకు నడచెనో అనాడే భారతవర్ష మంతయు నాతని కుటుంబ మయ్యెను. ఎప్పుడు తన దివ్యహర్మ్యమును దేశమునకు దానము చేసి యిల్లులేని సన్యాసి యయ్యెనో అప్పుడే వానికి దేశమంతయు స్వగృహ మయ్యెను. చిత్తరంజను డనేక ధర్మకార్యములను జేసి యుండవచ్చును. ఎందఱినో దీనులను బోషించినమాట నిజము వాని భాగ్యభోగములను బాల్గొనిన తరుణవయస్కులు వందలకొలది కలరు. కవితల నల్లెను. పత్రికలను నెలకొల్పెను. వాదములను బయలుదేరదీసెను. కట్టడులను గట్టించెను. మత్తగజమువలె ప్రతికక్షులతో బోరా డెను కాని దేశమునంత నొక్కటిగ జేసి జాతీయభావము ననుభవైకవేద్యము చేసినది, వాని దేశభక్తితప్ప మరియొకటి కాదు. "ప్రాణముండిన ప్రాణము పోయిన ప్రజలకొఱకె" యని వానిజీవితము ముక్తకంఠముతో గానము సేయు చున్నది ఇట్టి సంకల్పసిద్ధుడు సుఖనిద్రయందు దేలక మరి యెవరు నిద్రింప గలరు? చిత్తరంజను డస్తమించుచున్నప్పుడు హిమగిరి సహితము ప్రణమిల్లినది. ''ధన్యుడవు ధన్యుడవు'' అని అష్టదిక్పాలురు ఘోషిల్లిరి భారత ప్రపితామహు లగు మహాఋషులు, సాధుపుంగవులు హిమవత్పర్వత సానువులనుండి దిగివచ్చి యీ మహోదారుని స్వర్గధామమునకు గొనిపోయిరి భారత జననియు వాని కళే బరమును తన యంకమున జేర్చుకొని తన్మయత్వము నొందెను. గంగాభవాని వాని చితానల భస్మమును స్వీకరించి కరుణారసమున వెల్లి విరిసెను. చిత్త రంజను డిక సుఖనిద్రయందు తేలకయేమి? కొఱత యుండినగదా నిద్రకు

భంగము కలుగుట ? చిత్తరంజనుడు మిగుల్చుకొనినదేమి ? తన విద్యను, కాల మును, ధనమును, కుటుంబమును దేశమున కర్పించిన పిమ్మట వానికిక దేనిపై మమకారముండగలదు ? వంగదేశములో నన్ని పక్షములవారి ననుసంధాన పరచి నప్పుడా సమ్మేళనము నడుపగల నాయకుని నిర్ణయించుటయందు కొంత యిల జడి కలుగునేమోయని ఒక ఆంగ్లేయుడు సూచించినప్పుడు దాసుగారు చెప్పిన సమాధానమేమి ? "సర్వపక్ష సమ్మేళన మత్యవసరము ప్రస్తుత పద్ధతులు నిలువజాలవు.- సరియైన నాయకునకు నాధ్వర్యము నొప్పగించెదను నా నాయ కత్వముపై నాకెట్టి మోహమును లేదని నిష్కపటముగ జెప్పుచున్నాను". ఈ వాక్యరత్నములు చిత్తరంజనుని నిర్మమత్వమును చెప్పకయే చెప్పుచున్నవి ప్రతికక్షుని శతించుటలో చిత్తరంజను డెట్టి యహంకారమునైన, ఎంత రాజసము నైన జూపించును. కాని స్వవిషయము వచ్చినప్పుడు కేవలము మమతాగంధ వివర్జితుడు. అహంకార శూన్యునకు సుఖనిద్రకాక మరియెవరికి ? వంగరాష్ట్రి ప్రభుత్వమునందు మంత్రుల శాఖలు తిరిగి గవర్నమెంటుపరము చేసికొనబడెనను సువార్త 16వ తేదిని ప్రకటింపబడెను. 16వ తేదిని దాసుగారు ప్రాణములను విడచిరి. వారు పట్టిన శపథముకూడ నెగ్గినది ఇక సుఖనిద్రకాక మరి యేమి ?

ఈ సమయములో గాంధిమహాత్ముడు కలకత్తాలో నుండుట యదృష్టమని వంగీయు లెల్లరు తలపోయుచున్నారు. నాయకమణి పోయినపిమ్మట, అనుచరులు దుఃఖార్తులై నిరాశ జెందుటలో నాశ్చర్యము లేదు దాసుగారి యనుచరులెల్లరు దిక్కులేని పక్షులవలె వెలవెల బోవుచున్నారు. మహాత్ముడు వారిమధ్య నుండి వారికి ధైర్యము చెప్పి, తాను చేయగలిగినంత సహాయము నంతను జేసెదమని వాగ్దానము చేసెను. వంగీయులు భావోన్మాదులు. ఏ ప్రాంతమును వారి భావో ద్వేగము ననుకరింప జాలదు. నేడు వంగభూమి చూపుచున్న ఆక్రోశము మిన్నంటుచున్నది. మహాత్ముడును దుఃఖించెను. అశ్రువులను రాల్చెను. మూర్ఛితు డయ్యెను. కాని ఒకక్షణకాలము. సీతామహాదేవి యదృశ్యమైనప్పుడు శ్రీరామ చంద్రుడు సహితము నేలకూలెను. కాని యయ్యది కరుణారసము యొక్క విలా

సము. వెంటనే యా ధీరోదాత్తుడు కార్యకారి యయ్యెను. మహాత్ముడును తన దుఃఖమునేకాక ఎనిమిది కోట్ల వంగీయుల దుఃఖావేశమును క్రియారూపమున బరిణమింప జేయుటకు బ్రయత్నించుచున్నాడు దాసుగారి జ్ఞాపకార్థము ఒక స్త్రీ వైద్యాలయమును నెలకొల్ప నిశ్చయించి పదిలక్షల రూపాయల నిధిని సమ కూర్చుచున్నాడు. వంగదేశములో తీవ్రములైన కక్షలు ప్రబలియుండెను. అన్యోన్య వైమనస్యముచే బెద్దలు కార్యవిముఖు లగుచున్నారు హిందూ మహమ్మదీయ సమస్యకూడ నానాటికి తీవ్రత దాల్చుచున్నది. స్వరాజ్య సంఘమునందు సహి తము చీటికలు వాఱినవి దాసుగా రెటులో వానిని ఒకటిగా బట్టుకొని వచ్చు చుండెను. దాసుగారు చెప్పినటుల యీ స్థితి యెంతకాలమో నిలువజాలదు- అనైక్య మెప్పుడును స్థిరముగ నుండదు. కలయిక ప్రకృతిసూత్రము. ఆ కూడిక యెట్లో తెలియక నాయకులు వెతల పాలగుచుండిరి. ఈశ్వరవిధాన మగ్రాహ్యము. ముందుక్షణ మేమి రానున్నదో యెవరును జెప్పజాలరు ఈ వైకల్యము పోయి సామరస్యము గలుగుటకొక బలి యవసర మయ్యెను- వంగభూమికి బ్రాణము పోసిన చిత్తరంజనుడు తప్ప మరి యెవరీ యాత్మ బలిదానము చేయగలరు దేశ బంధువే తన తనువును విడచెను. "నేను బ్రతికినను చచ్చినను దేశముకొఱకే" యని దేశబాంధవుడు నుడివిన మాటలు సార్థకములైనవి వాని మరణము మూలమున నేడు వంగభూమి యంతయు నైక్య మయ్యెను దుఃఖమున కక్షలు మరపునకు వచ్చినవి హృదయ కాఠిన్యము శోకరసమున గరగిపోయినది. ఈ సందర్భమును కార్యకుశలుడైన మహాత్ముడు చూచెను. ఐక్యానుసంధానమున కీ తరుణము ఈశ్వర ప్రేరితమని తెలిసికొనెను. మహాత్ముడు స్వకీయ విశ్వాస ములను వదులుకొన జాలకపోయినను, తాను స్వరాజ్య పక్షమునకు చేయగలిగి నంత సహాయము నంతను చేయుటకు సంకల్పించుకొనుటయే కాక వారిమధ్య నుండి వాడిన ఆశాలతకు తిరిగి నీరు పోయుచున్నాడు. ఎల్లరిలోను సంక్రమించిన సానుక్రోశమును ఒక సంస్థరూపమున నిమగ్నము చేసి సర్వపక్ష సమ్మేళనమున కొక బాట నేర్పరచెను. సర్ సురేంద్రనాథ బ్యానర్జీ, సింహా ప్రభువు, నరేంద్ర నాథ సర్కార్, ఎస్. ఆర్. దాసు ప్రభృతులు సహిత మీ కార్యమున నగ్రసరు

లనుగ జేయుట యాశ్చర్యకరము. ఒక కార్యమునం దేకీభవించి పనిచేయ ప్రారంభించినప్పు డదివఱకు గలవరపరచుచుండిన వైరస్యములు క్రమముగ దొలగ గలవు. దాసుగారి జీవితము బాహ్యమున రాజకీయ పరిస్థితులచే గొంత కాఠిన్యము వహించెనేకాని, అంతరంగమున దయారసము జలోచ్ఛ్రమువలె నిరంతరము పొంగుచునే యుండెను. దయారసమున కక్ష లెట్లుండగలవు? దయారసము జాతి మత భేదముల నన్నిటిని అతిక్రమించి విశుద్ధ మానవప్రకృతిని మూర్ధాభిషిక్తము చేయును. దయ సర్వచిత్తరంజకము శ్రీవైద్యాలయము దయారసమునకు దగిన స్మారక చిహ్నము. ఇట్టి స్మారక చిహ్నమును నెలకొల్పుట కెవరి కే పక్షము, ఏ మతము, ఏ జాతి, ఏ సంప్రదాయము ఆటంకముగ నుండగలదు? ఇంతకంటె నైక్యానుసంధాయకమైన సాధనము మరియెచ్చట నుండును? మహాత్ముడు దాసుగారి మరణద్వారమున వంగదేశము నంతను నొక్కపెట్టున పక్షవిభేదముల కతీతమైన ఒక యున్నత స్థానమునకు దీసికొని పోగల్గెను. ఈ మరణము వలన గలిగిన చిత్తసంస్కారమును, ఈస్మారక చిహ్నము నెలకొల్పుటలో గల ఐక్యభావమును ముందు రాజకీయ విషయములయం దెట్లు తోడ్పడ గలుగునో కాలమే నిర్ణయించ గలదు.

"దేశచరిత్రలో బహు క్లిష్టసమయము వచ్చుచున్నది. పై సంవత్సరము నిర్వహించ వలసిన కార్యభార మత్యధికముగ గలదు. నాకు జబ్బుగనున్నది. మీ యారోగ్యమును సరిగ లేదు. ముందేమి జరుగనున్నదో దైవమునకె యెరుక —" అని దాసుగారు మూడు దినముల క్రిందనే పండిత మోతీలాల్ నెహ్రూగారికి వ్రాయుట ఆశ్చర్యకరము. ఇకముందు స్వరాజ్య రథము నెట్లు నడుపుటయని దాసుగారు కలవర పడుచుండిన మాట స్పష్టము అందులో వారు గతించిన పిమ్మట నీ ప్రశ్న మరింత కాఠిన్యమును దాల్చుచున్నది. ఇక స్వరాజ్య రథమును నడుపు టెట్లు? దయార్కి భగ్నము చేయబడెను. శాసన సభల నిరర్థకత లోకమున కంతకు వెల్లడి యయ్యెను. ఇక ముందడుగు యేమి? అధికారవర్గము ముందేమి చేయునో యని యెక్కువగ నాలోచింప నవసరము లేదు, దాసుగారు

తమ పరిద్పుగుపన్యాసములో గవర్నమెంటును రాజీకి రావలసినదని కోరి యుండెను. అధికారవర్గ మింతలో రాజీకి దిగునని దాసుగా రాశపడి యున్న యెడల, ఇక దేశచరిత్రలో బహుక్లిష్ట సమయము రానున్నదని చెప్పియుండరు. బర్కెనుహెడ్డు, రీడింగుప్రభువుల యాలోచనలన్నియు స్వరాజ్య పథమును మఱింత కఠినముగ జేయుటకే తోడ్పడునని దాసుగారు తప్పక యూహించి యుండవలెను అంతియకాక స్వరాజ్యవాదులలోనే భేదములు పొడసూపుచున్నవి. మంత్రిపదవులను స్వీకరించుటకు మహారాష్ట్ర స్వరాజ్యవాదు లాతురత చెందు చున్నారు. తాము మంత్రిపదవులను స్వీకరించుట మితవాదులు మంత్రిత్వమును స్వీకరించుటవంటిది కాదని డాక్టరు ముంజీగారు బయటకు ఘోషించుచున్నను, ఆ మార్గ మెంతమాత్రమును దాసుగారి సమ్మతిని బడయలేదు మంత్రివర్గము ద్వారా గవర్నమెంటును ప్రతిఘటించుట అర్థవిహీనమని లాలా లజపత్రాయిగారు కూడ నుడివియున్నారు. ఎప్పుడు స్వరాజ్యవాదులు మంత్రిపదవులకు చేయి చాచెదరో, అప్పుడు వీరికిని మితవాదులకును భేద ముండజాలదు— ఇండిపెండెంటు పక్షము నానాటికి దూరమై పోవుచున్నవి. వారికిని స్వరాజ్యవాదులకును గలయిక యెట్లు కుదరవలెనో తెలియుటలేదు. వారిద్ద రేకీభవించినగాని, స్వరాజ్యసభ్యులు తమ ప్రతిఘటనా పద్ధతిని గొనసాగింపజాలని స్థితిలో నున్నారు. పై సంవత్సరము తిరిగి యెన్నికలు జరుగును. తిరిగి స్వరాజ్యవాదులు వోటర్లకు దెలుపు కార్య క్రమ మేమి? ప్రతిఘటనయే యందురా? మంత్రుల సహాయము లేకయే ప్రభుత్వము సాగునటుల నిర్విఘ్నముగ గవర్నమెంటుచట్టములో సంస్కరణము జరుగ బోవుచున్నది. అప్పుడు ప్రతిఘటనలు నిరర్థకములే యగును. ప్రతిఘట నలను మానుకొని మంత్రిత్వమును స్వీకరించెదరా?

అప్పుడు స్వరాజ్యవాదులకును మితవాదులకును భేదమేమియు మిగులదు. శాసనోల్లంఘమునకు గడంగెదరా? అందుకై దేశము సన్నద్ధ మగుచున్నట్లు లేదు. గవర్నమెంటువారా- రాజీకి రారు. ప్రతిష్టంభనములా నిరర్థము లగు చున్నవి. మంత్రిత్వ స్వీకరణమా మితవాదపద్ధతి యనిపించుకొనును. శాసనో

ల్లంఘనమా - ప్రస్తుత మతీతమైన విషయము ముందడుగు తోచుట లేదు. హిందూదేశ చరిత్రలో ఖఠూక్లిష్ట సమయ మాసన్న మగుచున్నదని దాసుగారే బహుదూరదృష్టితో భరికించి యుండిరి- ఇప్పుడు దాసుగారు లేని లోపమీ సమయమును మఱింత క్లిష్టముగ నొనర్చుచున్నది - ఇప్పుడు స్వరాజ్య రథమును నడుపుట కే యరవింద ఘోషుగారో వచ్చిన బాగుండునని కొందఱు రిత్త కోరికలను గోరుచున్నారు. వారు పుదుచ్చేరి వదలి వచ్చెదరని మాకు నమ్మకము లేదు- ఏ యొకరు వచ్చినను అలౌకిక క్రియలను, అప్రాకృత కార్యముల నొనర్ప జాలరు. ఏది బయలుదేరినను ప్రజలనుండియే బహిర్గతము కావలెను మహాత్ముడు చెప్పినటుల తిలకుగారు గతించినప్పుడు దేశ మత్యుత్సాహవంతముగ నుండెను - హిందూమహమ్మదీయైక్యము సమకూడెను. ఇప్పుడన్ననో- దాసువంటి నాయకుడు మరియొకరు లేడు- పరిస్థితులు మారుచున్నవి. క్లిష్టసమయ మాసన్న మగుచున్నది హిందువులకును మహమ్మదీయులకును వైమనస్యము భయంకర రూపము దాల్చుచున్నది. కాని నిరాశ చెందవలసిన పనిలేదు. దాసుని కర్మవీరునిగ జేసిన గాంధిమహాత్ముడు దైవానుగ్రహము వలన మంచి ఆరోగ్యము నందుచున్నాడు- ఎవరైనను ప్రస్తుతము దేశమును నడుప గలిగిన యెడల మహాత్ముడు తప్ప మరియొకడు లేరు. వాని దృష్టియంతయు ప్రజలపైననే కలదు. ప్రజలను విశ్వసించినవారి కెప్పటికిని ఆశాభంగము కలుగజాలదు

కృష్ణా పత్రిక
27వ తేది, 1925 సం॥

# సంస్కృత సాహిత్య సభ

ఆంధ్ర మహాసభలతో బాటు బందరు నందీయేడు సంస్కృత సాహిత్య సభ కూడ సమావేశ మైనందు కెంతయు సంతసించుచున్నాము. ఈ సమావేశ ప్రయత్నము చాల యవ్యవధిగ జరిగినను, ఆంధ్ర మండలమునకు శిరోభూషణములగు పండితవర్యు లెందరో సభ నలంకరించు టెంతయు ప్రశంసనీయము. ఈ సభ యందు ప్రప్రథమమున గవర్నమెంటుయొక్క విద్యాంగ శాఖవారును మద్రాసు యూనివర్సిటీవారును ఏర్పరచిన విద్వాన్ శిరోమణుల పరీక్షాపద్ధతుల యందలి లోపములను గూర్చి చాల విచారణ చేయబడెను. ప్రస్తుతము సంస్కృత భాషాభ్యాసమునకును, శాస్త్రాధ్యయనమునకును, నేడీ సంస్కృత పాఠశాలలే సాధన భూతము లగుచుండుటచే నీ సభవారు వీని లోపాలోపములను శ్రద్ధగ బరిశీలించుట మిక్కిలి యత్యావశ్యక మనుటకు సందియము లేదు. ముందీ పాఠశాలల యోగ క్షేమముల మీదనే సంస్కృత భాషాభివృద్ధి చాలవఱకు నిలచియుండు ననుట నిశ్చయము. మన మద్రాసు యూనివర్సిటీ కంటె బొంబాయి, కలకత్తా యూనివర్సిటీలు సంస్కృత విద్య నెక్కువగ బోషింప గలుగుచున్నవి. బొంబాయి యూనివర్సిటీలో నున్నత విద్యాభాగమున సంస్కృతము నిర్బంధముగ జేయబడినది. బొంబాయి యూనివర్సిటీయందు దారితేరు పట్టభద్రు లెల్లరకు సంస్కృత పరిజ్ఞానమొకింతయైనను గలుగుట కవకాశము కలుగుచున్నది. ఆ రాజధానియందు సంస్కృతము నిర్బంధము చేయబడినను వారి దేశభాషలగు గుజరాతీ మహారాష్ట్రము లభివృద్ధి పొందక పోవుటలేదు. సంస్కృత పరిజ్ఞానము దేశభాషలను మఱింత సజీవములుగ జేయగల్గెనని కూడ జెప్పవచ్చును. సంస్కృత భాషాజ్ఞానమీ దినములలో ననవసరమని వాదించు ప్రతిపక్షులు కొందఱు కలరని మాకు దెలియును. కాని హిందూ సభ్యతను సంరక్షించి పోషించవలె ననిన సంస్కృత విద్య యత్యవసరమని యొకించుక పరిశీలించిన తెలియగలదు. హిందూ సభ్యతా

స్వరూపమును దెలిసికొనుటకు యారపియనులే వారి యూనివర్సిటీల యందు సంస్కృత విద్యాపీఠములను బ్రతిష్ఠించి విశేష కృషి సలుపుచున్నప్పుడు, భారతీయులు తమ దేశభాషయెడల నుపేక్ష వహించుట మాత్రము దుస్సహము. ఈ సాహిత్యసభ దేశీయుల దృష్టిని తిరిగి సంస్కృత భాషవైపున కొకింత త్రిప్ప గలిగిన యెడల చాల యుపకృతి కావించిన నగ్గించదగును.

కాని యీ సభ తుదకు బర్యవసించిన విధమును దలచుకొని నప్పుడు మాత్రము చాల విచారము కలుగుచున్నది. స్వధర్మ పోషణము నిమిత్తము రామాయణాది పురాణ గ్రంథ కాలక్షేపము లవసరమను తీర్మానమును హరినాగ భూషణముగారు ప్రతిపాదించిరి. స్వధర్మ నిరూపణమునకు వేదములు ప్రమాణము లగుటచే వేదార్థ ప్రచార మవసరమని సూచించుచు కావ్యకంఠ గణపతి శాస్త్రిగారొక సవరణను గోరిరి ఈ వేదార్థ ప్రబోధము సర్వ వర్ణములలోను గావించవలయునని భావయ్య చౌదరిగారు మరియొక సవరణను దెచ్చిరి. అంతటితో పండితవర్యుల యందును సభాసదులందును గలిగిన ఆందోళనము వర్ణింప నలవి కాదు లోకమునకు తీరని ముప్పు వాటిల్ల బోవుచున్నట్లు ఎల్లరి ముఖముల యందును భీతి తాంతవమాడెను. వేదము నర్థము చేసికొనగలవారు, చెప్పగలవారు ప్రస్తుత కాలములో నెవరును లేరని మహామహోపాధ్యాయులగు తాతా రాయడు శాస్త్రిగారు ఘంటాపథముగ ఘోషించిరి. బ్రాహ్మణేతరులు కూడ సమావేశమైన ఈ సభలో వేదార్థ ప్రకాశ మవసరమని కావ్యకంఠ గణపతి శాస్త్రిగారివంటి విద్వాంసులు చెప్పగలుగుట కడు సాహసముగ దలంపబడెను. సర్వవర్ణముల మధ్యను వేదప్రచారము గావించవలెనని భావయ్య చౌదరిగారు మడువబోవుచుండిన పలుకులు విప్రోత్తముల చెవులకు ములుకులవలె తగిలి సభయందంతటను కలకలారావములు ప్రతిధ్వనించెను. ఇట్టి సంకట సమయమున దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వర రావుగారీ చర్చనీయాంశము అప్రస్తుత మని చెప్పి హరి నాగభూషణం గారిచేత నుపసంహరించు కొనునటుల జేసిరి.

ఈ యాందోళనమును గమనించినయెడల పండితులలో నింకను నెట్టి

విశ్వాసములు ప్రబలుచున్నవియు దెలియగలదు. ఈ కాలములో వేదము నర్థము చేసికొన గలవారు లేరని శరించిన మహామహోపాధ్యాయ తాతా రాయడు శాస్త్రి గారే సంఘసంస్కరణ విషయములు చర్చకు వచ్చినప్పుడు నిందు సభలో తమ వాదమును సమర్థించు కొనుటకు శృతివాక్యముల ననువదించుటకు జంకని విషయము ఎల్లరకును దెలిసిన సంగతి. యూనివర్సిటిలలో ఎమ్. ఏ. తరగతు లందు సంస్కృతాధ్యయనపరులకు ఋగ్వేద భాగము పాఠ్యగ్రంథముగ నిర్ణయింప బడుచుండ, ఈ విద్వాంసులే వర్ణమత వివక్షత లేకుండ వేదార్థమును బోధించు చున్న సంగతి కూడ సభాసదులకు దెలియని విషయము కాదు. సంస్కృత సాహిత్య సభయందు వేదాధ్యయన విషయ మెట్లు అప్రస్తుతమో మాకు గోచర మగుటలేదు. భావయ్యచౌదరి గారును, కావ్యకంఠ గణపతి శాస్త్రిగారును, తమ సవరణలను దీసికొని రానియెడల నీ విషయము వివాదగ్రస్తము కాకుండ ప్రస్తుతాంశ మయ్యెడిదే సభలో గంద్రగోళము పుట్టుటకు దాని నుపశమింప జేయుటకు మరియొక్క విధము తోచక, అప్రస్తుతాంశమను హేతువొకటి నుడువబడినది. సంస్కృత సాహిత్యమున కెల్ల వేదము మూలము కాదా! దేశీయులలో స్వధర్మానుష్ఠానమును ప్రబోధించుటకు వేధాధ్యయన మవసరము కాదనెదరా? కేవల వైదిక మతావలంబకులకె కాక, చరిత్ర పరిశోధకులకు, కాల నిర్ణేతలకు, సామాజిక నీతికోవిదులకు, ఆలంకారికులకు, సాహిత్య విమర్శకులు మొదలగు వివేచనాపరుల కెల్ల వేదాధ్యాయన మత్యవసరమని వేరుగ నివేదింప నవసరము లేదు. కలకత్తా యూనివర్సిటీలో సంస్కృత భాషయందేకాక, ప్రాగైతి హాసిక యుగస్వరూప నిర్దేశకారులకును, చరిత్ర పరిశోధకులకును, తత్వశాస్త్ర శిక్షితులకును వేదములు పాఠములుగ నిర్ణయింపబడుచున్నవి. బాల గంగాధర తిలకుగారు ఆర్కటిక్ సముద్రతీరము ఆర్యుల ఆదిమ నివాసమని నిరూపించు టకు వేదములనే ఆధారముగ జేసికొని వారి యపూర్వ పరిశోధనా పటిమను వెల్లడిపరచిరి. రమేశ చంద్ర దత్తుగారు భరతవర్షము యొక్క ప్రాచీన చరిత్రమును వ్రాయుటకు ఋగ్వేదములోని చాల భాగముల నాధారములుగ గొని వాని నుల్లేఖించిరి. అరవింద యోగి వేదములకును ఉపనిషత్తులకును గల

సామరస్యమును జూపి, వేదములు పంచభూతముల యారాధన నుపదేశించునని చెప్పు సామాన్య పాశ్చాత్య విమర్శకుల అపోహలను బారద్రోలుటకు వేద రహస్యోద్ఘాటనము గావించెను. జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు మొదలగు దేశములలో "ఇండాలజిస్టు"వారి యథాశక్తిని వేదములను బరిశోధన జేసి భారతీయ సభ్యతా పరిణామా క్రమమును వెల్లడిబరుప బ్రయత్నించుచున్నారు. ఈ కాలములో గూడ వేదమున కిట్టి ప్రాముఖ్య మియ్యబడుచుండ, సంస్కృత సాహిత్య సభలో నీ విషయ మప్రస్తుతమని చెప్ప సాహసించుట చోద్యముగ దోచక మానదు. సంస్కృతమును పేటికలలో దాచిపెట్టి పరుల కంటబడకుండ జేయుచుండుట చేతనే దేవభాష మృతభాష యని పిలువబడుటకు గారణ మగుచున్నది. వేద మొకరి సొత్తు కాదు. ఋషులు ఒక కాలముచే బధింపబడు వారు కారు. వేదము కాలాతీతమైన జ్ఞానధనము ఆ మహా సాగరము నుండి ఎవరి యధికారమునుబట్టి వారు వారివారి సంస్కారానుగుణ్యముగ జ్ఞానము నార్జింప గలుగుదురు. వేదపురుషునకు మైల సోకునేమో యని భయపడి వాని బూడ్చిపెట్టుట కంటె మహాపాతకము మరియొకటి లేదు. స్వదేశములో గంటె ఖండాంతరములలో వేదమున కెక్కువ యాదరణ జూపబడుట దేశీయులకే లజ్జాకరము. ఋగ్వేదము అన్ని యూరపియను భాషలలోనికి అనువదింప బడినది. జర్మనీలోని కీలు యూనివర్సిటీ యందు వేదపీఠము నెలకొల్పబడినదని వినినప్పుడు, మన దేశములోని యూనివర్సిటీ లన్నియు తల వంచుకొనకుండ నెట్లుండగలవు? వేదములు మహత్తరములైనవని నవీనులకు బ్రశంసించ వలసి వచ్చినప్పుడు, మన పెద్దలు మాక్సుముల్లరు, మానియరు విలియమ్సు మొదలగు పాశ్చాత్య పండితుల యభిప్రాయములను బ్రకటించుకొనుచు, సోదర దేశీయులు మాత్రము వానిని వినకూడదనియు, చదువ గూడదనియు, చెప్పుటకంటె బరిహాసాస్పదమైన విషయ మేమి కలదు? ప్రథమ సంస్కృత సాహిత్యసభ తన విధికృత్యమును నెరవేర్చుటలో ధైర్యసాహసములను జూపజాలనందు కెంతయు జింతిల్లుచున్నాము.

కృష్ణా పత్రిక

అక్టోబరు 31వ తేది, 1925 సం॥

# "డెమాక్రసీ"

పాశ్చాత్య రాజనీతిజ్ఞుల యభిప్రాయము లత్యాశ్చర్యముగ మారిపోవు చున్నవి. గతయుద్ధమునకు బూర్వమువరకు "డెమాక్రసి"యే రాజ్యతంత్రజ్ఞులకు బరమ లక్ష్యమై యుండెను. ఇంకను రాజులు నిలచియున్న దేశములలో గూడ వారు కేవల మలంకార విగ్రహములుగ జేయబడిరి. రాజ్యపరిపాలనలో వారికెట్టి స్వతంత్రాధికారములును లేవు. ప్రజలచే నెన్నుకొనబడు ప్రతినిధుల సంఘములకే సర్వాధికారములును గలవు. మంత్రివర్గము ప్రతినిధిసంఘములకు బాధ్యత వహించి శాసనమును నిర్వహించుచుందురు. ప్రస్తుత మీ పద్ధతియే నాగరక రాజ్యముల సమ్మతి బడసిన రాజ్యతంత్రము. ఈ పద్ధతిలో దేశదేశమునకును గొన్ని స్వల్పభేదములు కలవు. ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లాండు, అమెరికా, ఆస్ట్రేలియా, కనడా మొదలగు దేశముల రాజ్యాంగము లన్నియు నొక మాదిరివి కాకపోయినను, నవి మొత్తముమీద "డెమాక్రెటికు" పద్ధతిని అనగా ప్రతినిధి సభలగు పార్లమెంటరీ వ్యవస్థలపై నెలకొల్ప బడినవి. రాజ్యములోని ప్రతి తెగయొక్క స్వప్రయోజనమును, ప్రతి పౌరుని స్వత్వమును ప్రతిబింబింప గల పార్లమెంటరీ పద్ధతియే యింతవఱకును పాశ్చాత్య రాజనీతి కనుగొనిన రాజ్యతంత్రము. లాయిడు జార్జి మొదలగు ఆంగ్లేయ మంత్రిపుంగవులు గత యుద్ధమునకు నీ డెమాక్రసియే "make the world safe for Democracy" పరమ లక్ష్యమని కంఠోక్తిగ బలుకుచుండిరి. ఆశియా ఖండ మనాదినుండియు నిరంకుశపద్ధతి కభ్యాసపడి యుండుటచే నీ ఖండమునందు పార్లమెంటరీ వ్యవస్థలు వర్ధిల్ల నేరవని కూడ జెప్పుచుండిరి. హిందూదేశమునకు స్వరాజ్యమొసగిన యెడల నే స్వల్పసంఖ్యాకులగు విద్యాధికులో యొక కూటముగ నేర్పడి, సర్వాధికారులై ప్రజలను బీడించెదరని యాంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు

వాసించని రోజు లేదు. ముప్పది కోట్ల ప్రజలు గలిగిన హిందూదేశమునం దారు లక్షల వోటర్లచే నెన్నుకొనబడు శాసనసభ్యులు ప్రతినిధులుగ బరిగణింప బడజాలరని బర్కెన్‌హెడ్డు ప్రభువే నొక్కి వక్కాణించెను కాని గత యుద్ధా నంతరము యూరపుఖండములో జరుగుచున్న మార్పులను బరిశీలించితిమేని, యూరపునకు ఇష్టదైవమగు "డెమాక్రసీ" యెడల పాశ్చాత్య విద్వాంసులకే భక్తి విశ్వాసములు తగ్గుచున్నట్లు స్పష్టపడ గలదు ఇటలీ రాజ్యాంగము నిన్నటి వరకు బ్రిటిషు ''కాన్‌స్టిట్యూషను''ను అనుకరించుచుండెను. ఇటలీరాజు బ్రిటిషు సార్వభౌమునివలె కేవల మలంకారవిగ్రహము. మంత్రులు పార్లమెంటునకు బాధ్యులై ప్రభుత్వమును శాసింపుచుండిరి ఇప్పుడీ పద్ధతి తారుమారు చేయబడి నది ఇటలీ ప్రధానమంత్రి రాజునకు తప్ప, మరియేరికిని బాధ్యుడు కాదని ఇటాలియను చేంబరొక చట్టమును గావించినట్లు ప్రకటింపబడినది అధికారము లేని రాజునకు బాధ్యత వహించుట యనుటలో నెట్టి యర్థమును లేదు ఈ చట్టము మూలమున ఇటాలియను పార్లమెంటు కూడ ఇటలీరాజుతో బాటు కేవలమలంకార ప్రాయమైన దగుట నిస్సంశయము. ఇటలీ ప్రధాని యగు మస్సొలినీ యింతటితో సర్వాధికారి యగును. ప్రభుత్వ మీతని హస్తగత మయ్యెను. ప్రజలకు గాని, వారి ప్రతినిధులకుగాని యీతడు బాధ్యుడు కాడు. మస్సొలినీ నిరంకుశ ప్రభువు ఇయ్యది యిరువదవ శతాబ్దములో నానారాజ్య సభా సమ్ముఖమున, ''డెమాక్రసీ" ఆరాధకులగు పాశ్చాత్యుల దేశములలో జరుగుచున్న మార్పు. ఇయ్యది ప్రత్యేక ముగ ఇటలీ విషయమేకాని యూరపున కంతకును సంబంధించినది కాదని చెప్ప వచ్చును. కాని నేడు రష్యాతప్ప మస్సొలినీ యొక్క నిరంకుశత్వమును హర్షించని యూరపియను దేశము లేదు. ముఖ్యముగ ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశములు, మస్సొలినీగారు ''బొల్షివిక్కు'' విప్లవము యూరపు ఖండమును ముంచివేయకుండ గాపాడిన మహావీరులని పొగడుచున్నవి.

ఇంగ్లాండులో కూడ "డెమాక్రసీ'' యెడల విముఖత్వము ప్రబలుచున్న దని ఆంగ్లేయ పత్రికలను బఠించువారికి దెలియని విషయము కాదు. వెనుక

మద్రాసులో పబ్లిసిటీ ఆఫీసరుగ నుండిపోయిన జే టీ. గ్విన్నుగా రేమి వ్రాయు చున్నారో తిలకింపుడు:- హిందూదేశమునకు స్వరాజ్య మియ్యవలయునా? మన కియ్యవలయునని కోరిక యున్నను, నియ్యజాలము. నేడు చైనా యనుభవించుచున్న స్వాతంత్ర్యమువంటి రాజ్యాంగము నీయగలుగుదుము. కాని హిందూదేశము కోరుచున్న స్వరాజ్య మట్టిది కాదు. మన మిక హిందూదేశమును శాసింపజాలమను భయము కలిగించునంతటి సంకట స్థితిలో గాంధిమహాత్ముడును, వాని యసహాయోద్యమమును మనలను బడవైచెను. కాని ఇండియాదేశము తనంతట తాను స్వతంత్రముగ బరిపాలించుకొన గల్గునని మన మెప్పుడు నూహించి యుండలేదు హిందూదేశములో నెప్పటికైనను సుస్థిరమగు ప్రభుత్వమును నెలకొల్ప గలమా యను సంశయముకూడ మనకు గలదు. ఈ సంశయము తోడనే, మన రాజనీతిని నడుపుచుండిన యెడల మానవకోటి కెప్పుడును మంచి దినములు రావను అవిశ్వాసమునకు బాల్పడిన వార మగుదుమని యంగీకరింపక తప్పదు. ఓపికతోడను, సహనముతోడను బనిచేసిన యెడల హిందూదేశమును స్వతంత్రముగ శాసింపగల ప్రభుత్వమును సృష్టించెద మను నమ్మకముతో మనము కర్తవ్యమునకు గడంగ వలయును. ఆ దేశీయ ప్రభుత్వము డెమాక్రసీయా? కాజాలదనుట నిక్కము. పూర్వాచార పరాయణుల మత సిద్ధాంతముల వలెనే డెమాక్రసీపై విశ్వాసము కూడ నస్తమించుచున్నది. యూరపు ఖండములో డెమాక్రసీ బహిరంగముగా బరిహసింప బడుచున్నది. ఇంగ్లాండునందు పార్లమెంటులో ప్రవేశింప గోరువారు డెమాక్రసీని బహిరంగముగ ఖండించుట లేదు. కాని, ఆచరణయందు మాత్రము దానిని పరిహాసపాత్రముగ జేయుచునే యున్నారు. మానవులలో సమానత్వము లేదనియే మనము నమ్ముచున్నాము. ఎల్లరకు సమానావకాశములను గల్పించుటయా? అయ్యది సాధ్యమైన ఆదర్శము కాదు. అందరు అన్ని యవకాశములను బొందగలుగుట కంటె గొలదిమంది మహత్తరమైన యవకాశములను గలిగియుండుట యెక్కువ ముఖ్యము. ఎల్లరును ఆక్సుఫోర్డు యూనివర్సిటీలకు బోగలుగుచుండిరా? అందుచేత నా యూనివర్సిటీని భగ్నము చేసి, పట్టణమున కొక ప్రొఫెసరు చొప్పున వెదజల్లెదమా? ఎంతమా

త్రము కాదు మనమందరము విద్యాధిక్యత ప్రమాణబుద్ధితో నంగీకరించు చున్నాము. హిందూదేశములో సాధ్యమైనంత వరకు శ్రేష్ఠులైన గొందరిని సమకూర్చి, వారికి సర్వాధికారముల నొసగి, వారి చేతులలో ప్రభుత్వము నప్పగించ వలయును. ఎవ రధికారమునం దుండెదరో, వారు పరమ శ్రేష్ఠులైనను, కాక పోయినను, ఆత్మవిశ్వాసము గలిగి, తాము పొందిన యవకాశములను, తమకు తోచినటుల, నుపయోగించి, ప్రజలను వశీకరణము చేసికొననిండు. వారు వారి శత్రువులతో రాజీపడికాని, వారి సహాయము నపేక్షించిగాని ప్రభుత్వము సేయ దగదు. పద్ధతులలో వ్యత్యాసమున్నంత మాత్రమున మనతో సరిసమానముగ నుపలక్షించుచుండిన వారిని మనకు శత్రువులుగ జేసికొనుట యనవసరము లెనిను, మాస్కోవీనీ యీ యిరువురను మనమెంత అసహ్యించుకొనుచున్నను, వారినుండి మనము చాల నేర్చుకొనుటిసుని మన మంగీకరించదగును.

ఇంగ్లాడులో గూడ డెమాక్రసీ యనునది మాటలలో తప్ప క్రియలో లేదని, గ్రీవ్సుదొరగారు సహిత మొప్పుకొనుచున్నారు పాశ్చాత్య దేశములలో ధనాఢ్యుల యాటలు సాగుచుండినంత కాలము "డెమాక్రసీ" యని కేకలు వేయుచుండిరి ఎప్పుడు జనసామాన్యము దీర్ఘ సుషుప్తినుండి మేల్కొని రాజకీయ రంగమున పలుకుబడిని, ప్రాముఖ్యమును వహించి, పూర్వ వ్యవస్థలను తారుమారు చేయ నారంభించిరో, అప్పటినుండియు పార్లమెంటరీ పద్ధతి నిర్దుష్టమైన రాజనీతిగ భావింప జనదనియు, నిరంకుశత్వము కొంతవరకు మానవోన్నతికి ప్రయోజనకారి యనియు బోధింప మొదలిడిరి ప్రజాస్వామికము నిజముగ నే దేశమునందును సిద్ధింపలేదనుమాట నిజము. సోవియటు ప్రభుత్వము గల రష్యాలో సహితము ప్రజలు శాసనాధికార బలముచేతను సైనిక నిరంకుశత్వముచేతను నణచిపెట్ట బడుచున్నారేకాని, వారి స్వచ్ఛందాశయములచే బరిపాలింపబడుట లేదు. అమెరికావంటి స్వతంత్ర దేశములో సమష్టివాదులకు రాజ్యాంగమునందు స్థానము లేకుండ జేయబడుచున్నది. మాజినీకి జన్మభూమియైన ఇటలీ, మసోలినీ మంత్రికి సర్వాధికార మర్పించి డెమాక్రసీని మంటగలిపెను. ఇంగ్లాండులో

కన్సర్వేటివు లధికారమునకు వచ్చి షాహుకారుల దోపిడిని బలపరచుచున్నారు. ఫ్రాన్సులో యుద్ధానంతరము సర్వసమానత్వము నీటగలిసి జాతిద్వేషము మిన్ను ముట్టుచున్నది జర్మనీలో రిపబ్లిక్కు స్థాపింపబడినను హిండనుబర్గు వంటి వీర సేనానిని ప్రెసిడెంటుగ జేసినగాని ప్రభుత్వము సాగుట లేదు ఇంకను డెమాక్రసీ యెక్కడ ? పూర్వము రాజనీతి శాస్త్రజ్ఞుల స్వప్నములతో నైనను బాసిల్లుచుండెడిది. ఇప్పుడు వారును బహిరంగముగ పార్లమెంటు వ్యవస్థలనే ఖండింప సాహసించుచున్నారు. హిందూదేశము "డెమాక్రసీ" యెరుగదు గనుక స్వరాజ్యము కూడదని వెరితర్క మిక కట్టుబడును గాక ! తమ దేశములో లేని డెమాక్రసీని హిందూదేశీయు లర్థముచేసికొని యాచరించువరకు విజాతీయాధిపత్యము తప్పదనుటకంటె పరిహాసపాత్రమైన విషయము మరియొకటి లేదు

కృష్ణా పత్రిక
డిశంబరు 5వ తేదీ, 1925 సం॥

# జాతి ద్వేషములు

ఋషులు విశ్వమును బ్రహ్మమనిరి. కవులు వసుధనంతయు నొక కుటుంబముగ భావించిరి మతకర్తలు లోకమునంతయు నొక్క సంప్రదాయ బద్ధముగ జేయజూచిరి. సంస్కర్తలు సర్వమానవైక్యము నభిలషించిరి. ఈ భావనలన్నియు పరమార్థదృష్ట్యా సత్యములైనను, వ్యావహారిక జగత్తులో మాత్రము వాస్తవములు కావు. కాలగర్భమున నేమి దాగియున్నదో తెలియదు కాని, ప్రస్తుతకాలమున ప్రపంచము యొక్క స్థితిగతులను ముఖాముఖిని జూచితిమేని మానవైక్యము సుసాధ్యమా యను సంశయమెట్టి యుదారభావు నైనను బాధించును. ఏ దేశపు పత్రికనైనను విప్పిజూచిన యెడల జాతిసంఘర్షణను గూర్చిన వృత్తాంతము తప్ప మరియొకటి కనుపించదు. ప్రతి ఖండము, ప్రతి దేశము జాతిద్వేషములచే విదారితము లగుచున్నవి. ప్రతి దేశము నందును ఏ నలుగురు సహృదయులో, ఏ పదిమంది విజ్ఞులో సర్వమానవ సమ్మేళనము నభిలషించుచున్నట్లు కన్పట్టును గాని, ప్రభుత్వములును, ప్రజాసంఘములును గూడి సకల వ్యవహారములందును, జాతిద్వేషపూరితములై ఐక్యభావము కేవలము కలలోని వార్త యను నమ్మకమును దృఢపరచుచున్నవి. పూర్వకాలమున గూడ జాతిద్వేషములు ప్రబలిన మాట నిజము. కాని తీవ్రతయందుగాని బహుళవ్యాప్తి యందు గాని అవి వీనిముందర ఒక గణనలోనికి రావు. ప్రాచీన కాలమున వివిధ దేశముల మధ్య రాకపోకలకు దగిన సౌకర్యములు లేవు. ఏ దేశమువారా దేశములోనే సర్వసామాన్యముగ గాలము గడిపెడివారు. అంతియకాక, రాజులకు రాజులకు గలిగెడి సంఘర్షణలు ప్రజలనంతగ గలవర పెట్టెడివి కావు ప్రజలు వారి వారి గ్రామములలో సంసారములను నెమ్మదిగ నీదుచుండెడి వారు. ఎప్పుడైన విప్లవములు తటస్థించినను, అవి తాత్కాలికముగ గాలివానల వలె వచ్చి పోయెడివి. ప్రాచీన చరిత్రలలో వానిని గూర్చియే యెక్కువగ

ప్రాయబడి యుండుటచే నా కాలములన్నియు నశాంతి సంక్షుభితము లైనట్లూహిం చెదము. ఆ వృత్తాంతములను సరిగ బరికించితిమేని, అవి యే కొలది రాజులకో సంబంధించి, మధ్య మధ్య నే కొలది సంవత్సరములలోనో సంఘటించినట్లు తెలుసుకొన గలుగుదుము ఆ వృత్తాంతము లాయా కాలములయొక్క వైపరీత్య విశేషములే కాని, సామాన్య లక్షణములు కాదని కూడ దెలియగలదు.

ఇప్పటికాలపు సంఘర్షణ లట్టివి కావు. ప్రపంచములో నే యొక భాగమునకో, యొక కాలమునకో, యొక ఋతువునకో సంబంధించక, దావానలము వలె భూవల యము నంతను జుట్టి, ప్రజలలో బ్రతి తెగను గలపరపెట్టు వ్యవస్థ యేర్పడినది. ఈ జాతిద్వేషమునకు ఆయువుపట్టు ఒక దేశమని కాని, ఒక సంఘమని కాని, నిర్ణయించుటకు వీలు లేక పోయినను, ప్రపంచము మొత్తముమీద నెక్కువగ కలవర పెట్టుచున్నది వర్ణద్వేష మనుట నిస్సంశయము. ప్రతి దేశమునను ప్రభుత్వాధికారులకును ప్రజలకును, ధనాఢ్యులకును పాటకపు జనమునకును, విద్యాధికులకును, పామరులకును, వర్తకులకును వర్తకులకును, రాజ్యమునకును రాజ్యమునకును నిరంతరము సంఘర్షణ పుట్టి సంఘములను గలవరపెట్టుచున్న మాట వాస్తవమైనను, ప్రపంచము మొత్తముమీద తెల్లజాతులకును, నల్లజాతులకును సంఘటించుచున్న పోరాటమే బృహత్తర రూపము దాల్చుచున్నటుల ప్రకృత బరిస్థితుల నొక్కమారు పరికించినచో తెలియగలదు. మొరాకో, ట్రిపోలీ, ఈజిప్టు, సిరియా, మెసపొటేమియా, దక్షిణాఫ్రికా, ఇండియా, చీనా మొదలగు నల్లవారి దేశములు భూతలమునుండి యంతర్ధానమైన యెడల ప్రపంచములో నేడు ప్రబలుచున్న అశాంతిలో ముప్పాతిక భాగము అంతరించును. ప్రతిదినము ఏదోయొక దుఃఖవార్త యీ ప్రదేశముల నుండియే వినవచ్చుచున్నది. ఒక రోజున మొరాకోలో రిఫ్ జాతీయుల గ్రామములపై ఫ్రెంచివారు బాంబులను విసరిరని విందుము. ఇంకొక రోజున ఆఫ్రికాలో పోర్చుగీసువారు నీగ్రోలను బాధపెట్టి బానిసలుగ జేయుచున్నారని బ్రకటింపబడును. మరియొక రోజున అమెరికావారు హైయిటీ ద్వీపములో నల్లవారిని వధించిరని తెలుపబడును.

ఒకప్పుడు చీనాలో షాంగుహే పట్టణమునందు బ్రిటిషు పోలీసు చీనావిద్యార్థులపై తుపాకి బారులను వదిలిరను వార్తను జదివెదము. తిరిగి ఈ దేశములలోనే ప్రజలు ప్రభుత్వములపై తిరుగుబాటు చేయుటయు, ప్రభుత్వములు తిరుగుబాటుల నణచుటకు కఠినములైన ప్రతీకారములను సలుపుటయు మొదలగు వృత్తాంతములే పత్రికలలో పుటలకొలది వ్రాయబడుచున్నవి.

పూర్వమువలె నే దేశమువారా దేశములోనే ముడుచుకొని యుండుట యసంభవము. రాకపోకల సౌకర్యముల చేతను, వర్తక వ్యాపారముల చేతను, జాతికి జాతికి, దేశమునకు దేశమునకు, సంబంధ బాంధవ్యములు పెరుగుచున్నవి. వీనితోబాటు పరస్పర గౌరవము, స్వాతంత్ర్య నిరతి పెరుగుటకు బదులు, పరధనాపహరణము స్వాతంత్ర్యభంగము, జాతీయ దురహంకారము విచ్చలవిడిగ విజృంభించుచున్నవి. ప్రపంచ పరిచయము మెక్కువైన కొలదియు స్వాభిమానము కూడ వృద్ధినొందుట ప్రస్తుతము మానవ జాతియందు వ్యక్తమగుచున్న వికారముగ గన్పట్టుచున్నది. దీనికంతకును గారకులెవ్వరు? పచ్చని రంగుగల చీనాదేశీయులను బ్రశ్నింపుడు? ఎర్రని రంగుగల ఫిలిప్పైను ద్వీపవాసుల నడుగుడు. చామన చాయగల హిందూ దేశీయులను గనుగొనుడు. పసిమి వర్ణముగల అరబ్బులను బరీక్షింపుడు నల్లని నీగ్రో జాతివారిని బృచ్ఛింపుడు. వీరి నెవరి నడిగినను శ్వేతవర్ణుల దురాశా విజృంభణమే తమ యశాంతికి, బాధలకు, గారణ మని ఐకకంఠ్యముగ బ్రత్యుత్తర మిచ్చెదరు. ఇప్పుడు ఆఫ్రికా ఆశియా ఖండములు యూరపు అమెరికాలపై తిరుగుబాటు చేయుటకు గారణము ఈ తెల్లజాతులు నల్లవారి యెడల గావింపుచున్న అన్యాయ ప్రవర్తనముకాక మరియొకటి కాదు. నేడు మానవోన్నతికి భంగమును గల్పించుచున్నది, ఆధునిక సభ్యతను పీడాకరముగ బరిణమింప జేయుచున్నది, లోకము నశాంతిపూరితముగ నొనర్చుచున్నది- ఈ శ్వేతజాతీయుల నిరంకుశ రాజ్యాధిపత్యమని విజ్ఞులెల్ల రొప్పుకొనక తప్పదు. తెల్లవారికంటెనల్లజాతులే యధికసంఖ్యాకులైనను, తెల్లవారే తమదేశములతో తృప్తి చెందక, ప్రపంచములో నెక్కువ భాగము నాక్రమించుకొనిరి. అట్లా

క్రమించుకొనిన భూభాగముల లోని ఆదిమ నివాసులతో సరిసమానముగ నైన నుండక, వారిని తమ కధీనులుగ జేసికొనుటయే కాక, తమ భాగ్య భోగ్యములకు వారి నుపకరణములుగ జేసికొనుచున్నారు. తెల్లవారి యీ ధనశోషణ పద్ధతియే లోకమునకు ముప్పు తెచ్చిపెట్టుచున్నది.

నల్లజాతుల తిరస్కారమునకు నీ యార్థిక రాజకీయ దాస్యమే ముఖ్య కారణము కాదు తెల్లజాతుల వారు తమ సభ్యతను నల్లజాతులపై రుద్దజూచుట కూడ నొక కారణము. తెల్లజాతుల వారెక్కడకు పోయినను తమ యాధిక్యతను సర్వవిధముల బ్రతిష్ఠించ జూచెదరు. ఇతర మతములను నిరసించెదరు. ఇతరుల యాచారములను నీచముగ భావించెదరు తమ యధీనములో నున్న జాతులు తమను సర్వవిధముల ననుకరించునటుల శిక్షావిధానము నేర్పరచెదరు. ఎప్పుడొక జాతి యిన్ని విధముల బంధింపబడునో అప్పుడది యెప్పటి కైనను తిరుగుబాటు జూపక తప్పదు. రాతిగోడలోని మొక్క సహితము తన వికాసము కొరకు రాళ్ళను ఛేదించుకొని బయట పడజూచును అటులే నల్లజాతులు కూడ నీ హైన్యము నెంతకాలము భరింపజూచును? నల్లజాతులలో నాత్మజ్ఞానము వికసించ నంత కాలము శాంతికి భంగము గలుగదు. ఎప్పుడు నల్లజాతులు కూడ తెల్లవారి వలె స్వాతంత్ర్యమును, ఆత్మగౌరవమును గోరజూచునో, అప్పటి నుండియు స్పర్ధ, సంఘర్షణము హెచ్చును తెల్లవారి నూతన సంఘటనమున తమ యాధిక్యతను నిలుపుకొనుటకు ప్రప్రథమమున గొన్ని విపరీత సిద్ధాంతములను ప్రకటింప నారంభించిరి. తెల్లవా రనుభవించుచున్న రాజకీయస్వాతంత్ర్యము నల్లవారికి అర్హమైనది కాదను సిద్ధాంతము మొదటిది. తెల్లవారి యాధిపత్యము తొలగిన యెడల నల్లవారు తమలో తాము నరుకుకొని అరాచకము పాలయ్యెదరను సిద్ధాంతము రెండవది. నల్లవారిని నాగరకులనుగ జేయు భారము తెల్లవారిపై గలదను సిద్ధాంతము మూడవది. తాము ఖడ్గబలముచే సంపాదించిన దేశములలోని ధనమును, ఖనిజములను ఆకర్షించుటకు తమకు న్యాయతః హక్కు కలదను సిద్ధాంతము నాలుగవది. తాము ఖడ్గముచే రాజ్యమును సంపాదించినను, పరాధీనులైన

ప్రజలు తిరిగి ఖడ్గబలముచే స్వాతంత్ర్యమును సంపాదింప జూచుట యశాస్త్రీయము, విద్రోహము, దండనార్హము అను సిద్ధాంతము అయిదవది.- ఈ అయిదు సిద్ధాంతములు తెల్లజాతివారి సభ్యతయందు మూర్తీభవించినవి. కాని యీ సభ్యత ఒక నల్లవారికే హానికర మగుట లేదు. తెల్లవారికి కూడ నిందుమూలమున అశాంతి కలుగుచున్నది. నేడు యూరపును జీకాకు పరచుచున్న సమస్యలన్నియు ఆశియా ఆఫ్రికా ఖండములకు సంబంధించియున్నవి ఎవరెన్ని భూములకు ఖామందులు? ఎవరికెన్ని వర్తకస్థలము లుండవలెను? ఎవరే విధమున ఋణము లియ్యవచ్చును? ఒక మాటలో నల్లజాతులపై నాధిపత్య మెవరిది? ఈ పశ్నపైననే పాశ్చాత్య రాజనీతి యంతయు నిలచియున్నది.

తెల్లజాతుల యాధిపత్యము నల్లజాతులతో తిరస్కార భావమును గల్పించుటయేకాక, తెల్లవారిలోనే స్పర్ధలు కలిగించి అశాంతికి కారణ మగుచున్నది. ఈ యశాంతి నానాటికి హెచ్చుచున్నదేకాని తగ్గుట లేదు. ఇందుకు నిదర్శనముగ తెల్లరాజ్యముల వారు నేడు సైన్యములపై వ్యయము సేయుచున్న ధనమును జూపవచ్చును. తెల్లవారి యాధిక్యత నేడు కేవలము వారి జ్ఞానాధిక్యత మీదగాని, వారి ధర్మబలము మీదగాని ఆధారపడి యుండలేదు. వారి యాధిపత్యమును రక్షించుచున్నది వారి యుద్ధనావలు, వారి శతఘ్నులు, వారి ఆకాశ విమానములు వీని సహాయమే లేనియెడల తెల్లజాతు లొక్కమారుగ ఆఫ్రికా, ఆసియా ఖండములను వదలివేసి స్వదేశోన్ముఖములు కావలసి యుండును. తెల్లవారి కీ రహస్యము నానాటికి హృద్గోచర మగుచున్నది. కేవలము బాహుబలముచే సామ్రాజ్యములను రక్షించుట యసంభవమను సంగతి వారికి బాగుగ దెలియుచున్నది, తెలియుటయే కాదు, వారి సైనికవ్యయములు వారి ప్రభుత్వములనే కూలద్రోయుచున్నవి. వారి వర్తకపద్ధతియే వారిలో వారికి పోటీలను గల్పించుటయేకాక, ధనికులకును పనివాండ్రకును నిరంతర స్పర్ధను గలిగించి సంఘ వినాశనమునకు దోడ్పడుచున్నది. పరాధిపత్యము నల్లవారిలో తిరస్కార బావమును బుట్టించి రాజ్య పరిపాలనమునకే భంగము వాటిల్లుచున్నది. ఈ ద్వేషములు, స్పర్ధలు, తిరుగుబాటులు, విప్లవములు, లోకము నశాంతికరముగ జేయుచున్నను,

సామ్రాజ్య భావమున కంత్యదినములు వచ్చినవని సూచించుచున్నవి. ప్రకృతి కపచారము జరిగినప్పుడది యూరకుండదు. ప్రకృతి యీ రూపమున తనకసి తీర్చుకొనుచున్నది. మానవుడు తన జీవితము దుర్భరమైనప్పుడుకాని సంస్కారణమును గోరడు. అట్టి సంస్కారోత్సాహమును బురికొల్పుటకే ప్రకృతి నేడు మానవలోకమును ద్వేష భూయిష్టముగను అశాంతిప్రదముగను జేయుచున్నది.

కృష్ణా పత్రిక
డిశంబరు 12వ తేది, 1925 సం॥

# గ్రీకు రిపబ్లికు

గ్రీసుదేశ చరిత్ర బహు పురాతనమైనది. యూరపుఖండముయొక్క సభ్యత కంతకును గ్రీకు నాగరికతయే మూలము. ఈ కారణము చేతనే ప్రపంచములో నెచ్చట నే నాగరక చిహ్నము గన్పట్టినను అయ్యది గ్రీసునుండియే ఆయా ప్రాంతస్థులు గొనిపోయి యుందురని పాశ్చాత్య పురాతత్వవిదులు సామాన్యముగ చెప్పుట తటస్థించుచున్నది యూరపులోని తక్కిన దేశము లన్నియు నంధకార బంధురమై యున్న కాలములో గ్రీసులో ఏథెన్సు స్పార్టా నగరరాజములందు, నే డాదర్శప్రాయముగ నెంచబడుచున్న, రిపబ్లిక్కు పద్ధతి నెలకొని జగద్విఖ్యాతి గాంచెను. అట్టి గ్రీసు నేడు సర్వవిధముల యూరపు ఖండములో నెల్ల వెనుకబడి యుండుట శోచనీయము. గ్రీసు యూరపులోనిదైనను ఆశియాఖండమునకు సన్నిహితమై యుండుటచే దొల్లిటి యౌన్నత్యమును గోలుపోయి దుర్గతి పాలయ్యెనని పాశ్చాత్య విమర్శకుల యభిప్రాయము. కాని గ్రీసుయొక్క ఆధునిక చరిత్రను సరిగ బరికించితిమేని గ్రీసుయొక్క దుర్గతికి జాలవరకు యూరపియను రాజ్యతంత్రజ్ఞులు కారకులని తెలిసికొన గలుగుదుము. ఆశియా ఖండమునకు బోవు నౌకామార్గము లన్నియు మధ్యధరా సముద్రము మీదుగ నుండుటచే నెవరీ మధ్యధరా సముద్రమైనాధిపత్యమును సంపాదింప గలుగుదురో వారికే ఆశియాఖండముతో నిరాఘాటముగ వర్తక వ్యాపారములను సాగించుటకు మంచియవకాశమును గలుగునను కారణముచే ఫ్రాన్సు ఇటలీలమధ్యనొక విధమైన పోటీ యేర్పడినది క్రమముగ ఫ్రాన్సు ఇటలీ దేశములు మధ్యధరా సముద్రముపైనుండు దమకే యీ యాధిపత్య ముండవలెనని కోరుట సహజము కాని దూరమున నున్న ఇంగ్లాండునకే మధ్యధరాసముద్రముపై ఆధిపత్యము సిద్ధించి ది మధ్యధరా సముద్రమునకు బశ్చిమ ద్వారమనదగు జిబ్రాల్టరు జలసంధి ఇంగ్లీషువారిది. తూర్పు ద్వారమగు సూయజు కాలువగూడ ఇంగ్లీషువారిది. మధ్యనున్న మాల్టాద్వీపము ఇంగ్లీషువారి నావికాదళమునకు ఆశ్రయమై యున్నది.

ఈ సందర్భములచే ఇంగ్లీషువారికి మధ్యధరా సముద్రాధిపత్యము కలిగినదని చెప్పవచ్చును కాని మధ్యధరా సముద్రమునకు దూర్పుభాగమున నున్న తుర్కీ ఇంగ్లాండున కంతగ ననుకూలముగనున్న దేశము కాదు ఏ యుద్ధ సందర్భములోనైనను తుర్కీయొక్క నౌకాదళము సూయజుకాలువ కుపద్రవము కలిగించవచ్చును. మధ్యధరా సముద్రములో ఇంగ్లాండుయొక్క ఆధిపత్యము భద్రముగ నుండవలెననిన తుర్కీప్రక్క నున్న మరియొక దేశమును దమ పక్షమున జేర్చుకొనుట యవసరము గ్రీసు తుర్కీకి బ్రక్కనున్న దేశము. దీనికి విశేషమైన తీరము గలదు చుట్టుపక్కల నెన్నియో ద్వీపములు కలవు గ్రీసునకును తుర్కీకిని చిరకాలము నుండియు బద్ధవైరము కలదు. కావున ఈ గ్రీసుయొక్క సఖ్యతను సంపాదించుకొనిన యెడల ఇంగ్లాండుయొక్క సముద్రాధిపత్యమున కెంతయో సాహాయ్యకారి కాగలదు ఇటు తుర్కీకిని అటు ఇటలీకిని భయముగ నుండును ఈ సందర్భముల నాలోచించియే ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు గ్రీసును దమ పక్షమున నుంచుకొనుటకు నెన్నియో పన్నుగడలను బన్నుచుండిరి ఎప్పుడు గ్రీసు, విదేశ రాజ్యతంత్రజ్ఞుల చేతులలో కీలుబొమ్మయయ్యెనో, అప్పటి నుండియు గ్రీసునకు శాంతి లేదు. సౌఖ్యము లేదు. తుర్కీతో నెప్పుడును వైరముతో నుండవలసి వచ్చెను. ఇటలీ యెడల గూడ నంతగ ననుకూలముగ నుండుటకు వీలు లేకపోయెను బాల్కను రాష్ట్రముల తగాయిదాలన్నిటిలోను జిక్కుకొన వలసి వచ్చెను. గ్రీసురాజు జర్మనీయెడల సానుభూతి జూపుచుండుటయు, వెనిజులాసుమంత్రి ఆంగ్లేయుల పక్షము వహించుటయు, మొన్న జరిగిన చరిత్ర పాఠకులకు దెలిసియే యున్నది జర్మను యుద్ధములో బ్రిటిషువారు గ్రీసుయొక్క తాటస్థ్యమును భంగపరచిన విషయము లోకవిదితము. గ్రీసురాజంతట దేశభ్రష్టుడు గావలసి వచ్చెను. యువరాజు యెటులో సమాధానపడి సింహాసన మెక్కెను. కాని దేశములో మాత్రము శాంతి సిద్ధించినది కాదు మంత్రివర్గము పలుమారు మారుజొచ్చెను. తుదకు వెనిజులాసు మంత్రియే దేశాంతరము పారిపోవలసి వచ్చెను. స్థితిగతులెట్లు మారుచున్నను, ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు మాత్రము గ్రీసునకు మద్దతుగ నుండి తుర్కీపై

దుమికించిరి. బ్రిటిషు ప్రభుత్వమువారు బయటకు దటస్థులుగ నున్నను, ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు మాత్రము గ్రీసును బురికొల్పుచునే యుండిరి కాని యీ రాజనీతి యంతయు దనకు లాభకారి కాజాలదని గ్రీసు తెలిసికొనలేక పోయెను. తుదకు దురుష్కులు ముస్తఫా కమల్‌పాషా యొక్క నాయకత్వముక్రింద గ్రీసును బూర్తిగ నోడించిరి. గ్రీసుసైన్యము నాశన మయ్యెను. గ్రీసు కోశాగారము సన్నగిలెను. తుదకు గ్రీసునకు బుద్ధివచ్చెను. ఆపత్కాలములో మిత్రు లక్కఱకు రారు. వెనుకనుండి యాడించిన మిత్రులు గ్రీసును విడనాడిరి. లూసానీ సంధి తిరిగిపోయెను. గ్రీసున కపారమైన నష్టము వాటిల్లెను. ప్రజలలో నసంతృప్తి హెచ్చెను. రాజ్యాంగము తీవ్రముగ మాఱినగాని గ్రీసునకు శాంతి సౌఖ్యములు కలుగవని ప్రజలకు నమ్మకము కగిగెను. రాజు స్వతంత్రుడు కాడు. దుష్టమంత్రు లందఱును జేరి యాడించుచుండిరి. రాజును వాని మంత్రులును బారద్రోలబడ వలెనని ప్రజలు సంకల్పించుకొనిరి. రాజును రానున్న విప్లవమును గ్రహించెను. ప్రజలకు సమ్మతి లేనియెడల తాను సింహాసనమును వదలివేసెదనని చెప్పి, మెల్లిగ దేశాంతరుడయ్యెను. మంత్రులును యెవరిత్రోవ వారు చూచుకొనిరి. ప్రజాప్రతినిధి సభ సమావేశమై రాజ్యాంగమును హస్తగతము జేసికొనెను. రాజవంశీయులను దేశము బయటకు బంపివైచెను. రాజ మందిరములను, రాజుయొక్క యితర వస్తువులను విక్రయించి ఈ నెల 25 వ తేదిని రిపబ్లిక్కును స్థాపించిరి ప్రజావబోధము కలిగిన పిమ్మట నెట్టి నిరంకుశత్వమైనను విలుప్తము కాకతప్పదు. ఈ నూతన రాజ్యాంగ పద్ధతిక్రింద గ్రీసు వెనుకటి స్పర్ధలకును, కుట్రలకును దావియ్యక, చుట్టుప్రక్కల రాజ్యములతో వైరమును వదలుకొని, స్వతంత్ర మార్గమున బురోభివృద్ధి నొందునుగాక ! గ్రీసు యింతకాలము దుర్బలముగ నుండుటచేతనే తా నభివృద్ధి పొందలేక పోవుటయే కాక, విదేశ రాజ్యతంత్రజ్ఞుల చేతులలో కీలుబొమ్మయై తుర్కితో నెప్పుడును స్పర్ధ పెట్టుకొని దుఃఖముల పాలైనది. ఇప్పుడు తుర్కిలో రిపబ్లిక్కు స్థాపింపబడినది గ్రీసులోను రిపబ్లిక్కు స్థాపింపబడినది. ఈ రెండును ప్రజాస్వామిక

ములు- ఈ రెండు రాజ్యాంగములును బూర్వవైరములు మాని ఒకటి ఆశియా ఖండ ప్రతినిధిగను, రెండవది యూరపుఖండ ప్రతినిధిగను జేతులు కలుపుకొని ఆన్యోన్య విశ్వాసముతో మెలగుచు లోకకళ్యాణమును జేకూర్చునుగాక !

కృష్ణా పత్రిక

— ర్చి 29 వ తేది, 1924 సం॥

# జయిటో — వైకాము

జర్మనీ యుద్ధమునకు బూర్వము బెల్జియములోను ఫ్రాన్సు ఉత్తర భాగముననున్న, ఊరు పేరు లేని పల్లెలు, కొండలు, గుట్టలు, దిబ్బలు, యుద్ధము ముగియుసరికి చరిత్ర విఖ్యాతములైనవి. వీరుల రక్తాభిషేచనముచే వానికి అమరకీర్తి సిద్ధించినది స్వాతంత్ర్య సంరక్షణ నిమిత్తము వీరశయన మలంకరించి స్వర్గము జూరకొనిన యోధుల సమాధులా క్షేత్రములకు బూజా పురస్కారములను గలుగజేసినవి. అటులే మొన్నటివఱకు నెవరెరుగని జయిటో - వైకాము గ్రామముల పేర్ల నిప్పుడు యెల్లరును స్మరించుచున్నారు. హిందూ దేశములోని ప్రతి పత్రికయు వీనిని బెద్దయక్షరములతో ప్రకటించుచున్నది. విదేశముల యందు కూడ నీ గ్రామములలో జరుగుచున్న విచిత్ర సంగ్రామ వృత్తాంతముల నాతురతతో బఠించుచున్నారు. జయిటో హిందూ దేశమునకు శిరమన దగిన పంజాబులోని ఒక కుగ్రామము. వైకాము దక్షిణాగ్రమున నున్న తిరువాన్కూరులోని చిన్నయూరు. హిందూదేశము యొక్క ఉత్తరమున, దక్షిణమున నొకమారుగ నపూర్వ సంఘర్షణము సంఘటించినది. రెండుయుద్ధములును ధర్మమునకు సంబంధించినవి. ధర్మ స్వాతంత్ర్యము కొఱకే జయిటో వైకాము గ్రామములయం దొక్కమారుగ రణదుందుభి మ్రోగుచున్నది. జయిటో యుద్ధమును నిర్వహించుచున్నది అకాలీ వీరులు. వారి దేవాలయములలో వారి మత గ్రంథమును బఠించుటకు వారికి బూర్ణ స్వాతంత్ర్యముకలదు.ఆ స్వాతంత్ర్యమునకు నిప్పుడు భంగము కలిగినది- నాభా సంస్థానాధికారులు అనగా ప్రస్తుతము బ్రిటిషు యధికారులు జయిటోలోని గురుద్వారమున కొక్కమారు ఏబదిమంది శిక్కుల కంటె నెక్కువమంది పోకూడదని ఉత్తరవు చేసిరి. పోయినవారు తిరిగి వచ్చువఱకు గ్రొత్తవారు పోకూడదు. ఏల యీ నిర్బంధము? వారు పోవుచున్నది కేవలము గ్రంధపఠనము కొరకు. అఖండ గ్రంథపాఠ మను సంస్కార మొకటి

శిక్కులలో గలదు. శిక్కు గురువుల ఉపదేశ వాక్యములను శిక్కుభక్తు లందరు సమావేశమై పారాయణము చేయుదురు ఈ పఠనకును రాజ్యాంగమునకును ఎట్టి సంబంధమును లేదు తక్కిన గురుద్వారములలో నిట్టి పఠనములు జరుగుచునే యున్నవి ఎందలకొలది శిక్కుయాత్రికు లచ్చటకు నొక్కమారుగ బోయి పురాణ శ్రవణమును గావించు చున్నారు. జయిటో గ్రామమునందు మాత్రము అధికారు లెందు కభ్యంతర పెట్టవలెను? ఏబది మందికంటె నెక్కువ మంది యాత్రికులు దేవాలయమునకు బోయిన యెడల సంస్థానమునకు గాని రాజ్యాంగమునకు గాని వచ్చిన ఉపద్రవమేమి? ఎక్కువ మంది వచ్చిన ప్రభుత్వముపై తిరుగుబాటు చేసెదరనియా? దొమ్మి జరుగునను భయామా? అట్టి యుపద్రవము సంభవించునని ఊహించుట కేమాత్రము కారణములేదు. ఒకవేళ అట్టి ఆపత్తే సంభవించునెడల బ్రిటిషు అధికారులకు తుపాకులు లేవా? కాని అధికారులట్లు నిర్ణయించిరి. వారి నిర్ణయమే మతముకంటె ధర్మముకంటె, స్వాతంత్ర్యముకంటె నెక్కువ ప్రమాణము. కాని ధర్మవిశ్వాసులగు శిక్కులెట్లీ యధర్మ శాసనమునకు లోబడగలరు? వారి ధర్మ స్వాతంత్ర్యమును ప్రతిష్ఠించుకొనుటకై ఐదువందల మంది చొప్పున జట్లుగ బయలుదేరి అధికారుల అక్రమ యుత్తరువుల నుల్లంఘించుచుండిరి. ఈ సమరము ఫిబ్రవరినెలలో ప్రారంభమైనది. ఆయిదువందల తరువాత అయిదువందల వీరు లొక్కవిధముగ నీ యుల్లంఘనమును గావించుచున్నారు. మొదటి అయిదు వందల మందిపై ననవసరముగ తుపాకులు పేల్చబడెను. చాలమందికి గాయములు తగిలెను. కొందరు హతులైరి. కాని యెవరును భీరులు కాలేదు. గ్రామ గ్రామముల నుండియు నింకను ముఠాలు బయలుదేరుచున్నవి. రెండవ అయిదు వందల జట్టుకూడ నరెస్టయినది. మూడవ జట్టు బయలుదేరుసరికి జయిటోలో బొబ్బలజాడ్యము ప్రబలసాగినదని వదంతులు బయలుదేరినవి. తుపాకులు కాల్చనీ, ప్లేగు రానీ, ఏమియైనను, ఎట్టి కష్టములు వాటిల్లినను ధర్మస్వాతం

త్ర్యము ప్రతిష్ఠింపబడు వరకు జట్టులు తరువాత జట్టులు పరంపరలుగ బయలు దేర దీయుటకు ప్రతిజ్ఞబట్టిరి. మూడవ జట్టుకూడ నెట్టి కలవరమును లేక జైలు చేరగలిగెను. కాని నాలవ జట్టు బయలుదేరునరికి గ్రామములలో పోలీసుయొత్తి డెక్కువ కారంభించినది. ఈ జట్టు అమృతసరమునుండి కాలినడకపై బయలు దేరును మార్గములో గ్రామస్థులీ యకాలీదళములకు స్వాగత మొసగకుండ నడ్డగించుచున్నట్లు ప్రకటింపబడినవి రేపో మాపో నాలవ జట్టుకూడ గమ్య స్థానము చేరగలదు. నిరంకుశత్వమునకు దోసిలొగ్గు రోజులు పోయినవి. అధికార దౌర్జన్యముచే స్వాతంత్ర్య మడుగంటు కాలము గతించినద లోకమంతయు నీ సమరమును విచిత్రదృష్టితో జూచుచున్నది ఈ సమరమున నెవరు గెల్చెదరను ప్రశ్నవేయ నవసరము లేదు జయిటో క్షేత్రమునందు నూతన భారతజాతి యుద్భవించుచున్నది. అచ్చటనుండి నూతన త్యాగశక్తి భారత వర్షమునంతను ప్రబోధింప గలుగును. జయిటో సంఘర్షణ ఒక్క శిక్కులకు సంబంధించిన దైనను, ఒక్క దేవాలయసందర్భమైనను దాని ప్రయోజనను మాత్రము అఖిల భారతజాతికి నుపకరించుచున్న దనుట నిస్సంశయము. తాత్కాలికముగ నాభా యధికారి తన యాధిక్యతను నిలుపుకొనవచ్చును ఆయుధబలము కొంతకాల మట్టహాసము చేయవచ్చును. కాని భారతవర్షములో నే యొక్క మానవుడైనను ఆ యధికారయొక్క దౌర్జన్యమును జూచి సంతసించుచున్నాడేమో కనుడు. ఏ యధికారియైనను లోలోపల నిట్టి యకార్యము చేయవలసి వచ్చెనని గుందకుండ నుండగలడని తలంపజాలము ప్రతిష్ఠకొరకు, మాటపట్టింపు కొరకు, అధికారు లీ పెడత్రోవను త్రొక్కవచ్చును. కాని వీరి యకార్యమువలననే శిక్కులలో దాగియున్న శౌర్యత్యాగశక్తి, శమదమములు, బహిర్గతమై భరతఖండము నంతను సజీవముగను దీప్తివంతముగను జేయగలుగుచున్నవి. జయిటో సంగ్రామ మును నిర్వహించుచున్నది యోధాగ్రేసరులగు శిక్కులు. వీరజాతికి జెందిన పురుషసింహులు. కాని వైకాములో జరుగుచున్న సంగ్రామభారము అంత్యజాతిపై బడినది వీరు అంటరానివారు, చెప్పరానివారు పశువులకంటె హీనులుగ జూడ బడువారు. వేలకొలది సంవత్సరములనుండి పాతాళలోకమున బంధింపబడియున్న

నర కీటకములు. వీరికి విద్య లేదు, ధనము లేదు, దేశములేదు. ఇండ్లు లేవు. పేరునకు హిందువులు కాని వారి దేవాలయములో వీరికి స్థానము లేదు. వారి వీథులలో వీరు నడువరాదు. వారి బావులలో వీరు నీరు తీయరాదు. కాని వారి పొలము దున్నువారు వీరు. వారి పంటలను పండించువారు వీరు. వారి కొట్లను ధాన్యరాసులతో నింపునది వీరు. వీరు చెమటనోడ్చని యెడల వారికి తిండి లేదు, మిద్దెలు లేవు, మేడలు లేవు. పొలముల యెరువుకొరకు ఎముకలను బొడిచేసి మట్టిలో గలిపినట్లు, భూస్వాముల భాగ్యభోగముల కొరకు ఈ యంత్యజులను మట్టిలో బూడ్చిపెట్టుచున్నారు. ఎంతకాల మీ క్రౌర్యము సహింపబడును.దీని ప్రతి ఫలమును యావద్భారతవర్షము పొందుచునే యున్నది. భారతజాతి స్వాతంత్ర్యము లేని జాతి యైనది. ప్రపంచములో నే దేశమునకు బోయినను, వీరికి గౌరవము లేదు, మరియాద లేదు దక్షిణాఫ్రికాలో, బ్రిటిషు గయానాలో, కెన్యాలో, సర్వత్ర వీరి నస్పృశ్యులనుగ, చెప్పరానివారినిగ జూచుచున్నారు. కాని హిందూదేశమున కింకను బుద్ధి రాలేదు. ఉత్తమ వర్ణస్థులలో నను తాపము కలుగలేదు. ప్రాయశ్చిత్తమునకు గడంగలేదు. పరులమీద నాధార పడినంతవఱకు ముక్తి కలుగదు. పంచములును మేల్కాంచిరి. స్వయంసహాయమునకు గడంగిరి ఈశ్వర సంకల్పముచే నిప్పుడు వైకాము గ్రామము రణక్షేత్ర మంగ మారినది. అచ్చట నీ యస్పృశ్యులు తమ మానవత్వమును ప్రతి ష్ఠించుటకు నిశ్చయించుకొనిరి. పురవీధులలో బోవుటకు వీరికి హక్కు లేదట. ఆ వీథులలో కుక్కలు తిరుగవచ్చును, పందులు పొర్లవచ్చును. ఆ పుర వాసులకు బంటలను బండించు వీరు మాత్రము అడుగు పెట్టకూడదు. పాపము పండినది. తల్లి బలి కోరుచున్నది. పంచములు ముగ్గురు చొప్పున నా వీథులలో నడుగిడుటకు సంకల్పించుకొనిరి. దినదినము అరెస్టగుచున్నారు. జైళ్ళలో కూడ పంచములకు స్థానము లేదు కాబోలు. నాలుగు దినములైన పిమ్మట నధికారులు వీరి నరెస్టు చేయుట మాని బలవంతముగ నడ్డగింపసాగిరి. అంతట అభోజన ప్రతమునకు దిగిరి. కాని మహాత్ముడిది వలదని హితబోధన చేయుటచే దానిని వదలుకొనిరి. ప్రతి దినము ముగ్గురేసి చొప్పున అడ్డగింప బడుచున్నారు. కాని

అధికారులు వీరి బలమును గనిపెట్టక పోలేరు పంచముల నరెస్టు చేయకుండ మానుట ఒకటి. వీరికి తోడ్పడుచున్న కాంగ్రెసు ప్రముఖుల నరెస్టు చేయుట రెండవది. ఆ వీధులు దేవాలయమునకు సంబంధించినవని సమర్థించుట మూడవది. ఈ మూడు సందర్భములును అధికారుల దౌర్బల్యమును బయలుపెట్టుచునే యున్నవి. జయిటోలో వలెనే యిదియు ధర్మసంగ్రామము. అక్కడ శిక్కులు మతస్వాతంత్ర్యమునకు పోరాడుచున్నారు. ఇక్కడ నంత్యజులు మానవత్వమును స్థిరపరచు కొనుచున్నారు రెండు యుద్ధములు రక్తపాత విహీనములైనవి రెండును స్వదేశ సంస్థానములలోనివి రెంటికిని రాజకీయ సంబంధము లేదు బయటకివి స్థానికములుగ గన్పట్టుచున్నను, అంతరంగమున భారత జాతినంతను ప్రేరేపించుచున్నవి జయిటోయుద్ధము వలన భారతీయులు ధర్మస్వాతంత్ర్యమును హృద్గతము చేసికొనుచున్నారు. వైకాము సంఘట్టనముచే హిందువులు అస్పృశ్యత యను చిరకాలానుగతమైన కళంకమును తొలగించుకొనగలరు.

కృష్ణాపత్రిక
ఏప్రిల్ 19వ తేది, 1924 సం॥

# వేశ్యల దత్తత

గుంటూరులో గతమాసము కళావంతుల సంఘ సంస్కరణ సభకు అధ్యక్షత వహించిన ఎన్. ఆంజనేయులు బి ఎ,బి ఎల్ గారు వేశ్యలలో నాచారముగ వచ్చుచున్న స్త్రీదత్తతను గూర్చి యిట్లు నడివిరి:-

వేశ్యకులము లోని స్త్రీలనేకు లితర కులములలోనుండి పిల్లలనుదీసికొందురు. ఆకులములో బుట్టినవారి కనేకులకు వ్యభిచార దోషమువలన గర్భము చెడి పిల్లలు విశేషముగా బుట్టుట లేదు అందుచేత నితర బీదలనుండి పిల్లలఁగొని పెంచి దత్తుకుమారెలని పేరుఁ బెట్టెదరు ఇతర కులములో నార్జనఁ జేయువారు పురుషులు కాన వారు వంశవృద్ధికై బాలురను దత్తు చేసికొందురు ఈ కులములో నార్జనఁ జేయునది స్త్రీ కాన నాదాయమునకై బాలికలను గొని వారిని దత్తు చేసికొందుదు గవర్నమెంటువారు 1862 వ సంవత్సరములోనే వ్యభిచార వృత్తిని జరుపుటకై బడుచులను దత్తుదీసికొనట నేరమగునని పీనలుకోడు 372,373 వ సెక్షనుల ప్రకార మేర్పరచి యున్నారు వ్యభిచార వృత్తికిగాను పడుచుల నమ్మువారును శిక్షార్హు లగుదురు అయినను పోలీసు ఉద్యోగస్తు లనేక కారణములనుండి నీ సెక్షను అమలులోనికి దెచ్చుట లేదు అందుచేత బై చట్టము లున్నవనియే చాలమందికిఁ దెలియదు. ఒకవేళఁ జర్చకు వచ్చినయెడఁ బడుచులఁ దీసికొన్నవారు దేవాలయములో సేవఁ జేయుటకు పెంచెదమని సంజాయిషీ చెప్పి యప్పటి తొందరలఁ దప్పించుకొని పిమ్మట తమ యిష్టానుసారము వ్యభిచార వృత్తినే నేర్పి యాదాయ మందెదరు. మరియు వారిని నాక్షేపించువారే లేరు. కులములోఁ బుట్టిన కన్యలకే వృత్తి నేర్పి చెఱుపుటయేకాక యితర కన్నియలఁ గూడ జెరపుట చాలా హేయము గదా?

వ్యభిచారవృత్తి నీతికిని, జనక్షేమమునకును భంగకరముగా నుండుటచే

నీ వృత్తివారి Contracts అనగా నిబంధనలు చట్టప్రకార మంగీకరింపఁ బడవు. ఇట్లుండ నీ వృత్తికే తీసుకోబడిన దత్తు సహితము చెల్లదగినది కాదనునది తేటతెల్లమే గదా? మరియు నది 372,373 సెక్షనులకు విరోధమై యున్నది. మొట్టమొదట అనఁగా 1888,1889 సంవత్సరములో మదరాసు హైకోర్టువారు పురాతన పద్ధతి కనుగుణ్యముగ మంజూరు చేసిరి. ఇటీవలి తీర్పులీ తీర్పునుఁ గొంత మార్చినవి. వ్యభిచారమే యుద్దేశములేక కన్యను మైనరుదశ తీరువరకుఁ పెంచిన పిమ్మట నా బిడ్డ యిష్టానుసారము వృత్తి నవలంబించినను మొదటి దత్తు చెల్లునని తీర్మానించి యున్నారు అనుభవమునుఁబట్టి చూడగా నిట్లుఁ దీసికోబడిన కన్యలందరును నదే రీతిగానే పెంచబడుచు నిదే వృత్తిలో దింపఁబడుచున్నారు మైనరుదశ 16 సంవత్సరముల వర కుండినది అదృష్టవశాత్తు డాక్టరు గవర్‌గారి ప్రయత్నములచే నిటీవల మైనరుదశ 16నుండి 18సంవత్సరముల వరకు హెచ్చింపబడినది. వ్యభిచార వృత్తికిఁ బెంచక పోనియెడల వీరినిఁ బెండ్లిచేసియే తీరవలసివచ్చును. అయిన నిర్బంధముఁ దప్పించుకొనుటకై మైనరుదశలోనే యాటపాటల నేర్పించి బొట్టు గట్టించి బహిరంగముగా నాడించుచుఁ బాడించుచు బాలికల బెంచుచున్నారు. రహస్యముగా నీ వృత్తి సహితము జరిపించు వారెందరు లేరు? అధికారు లొకవేళనడిగిన మాత్రము "వృత్తిచిఁ జరుపుట లేదు, ఆటపాటల నేర్పుట తప్పుకాద''ని చెప్పుదురు. ఈ రహస్యము చిదంబర రహస్యమని యందఱకును దెలిసిన విషయమే.

ఆటపాటల నేర్చికొని బహిరంగముగాను బదుగురి యెదుట నాడి పాడిన పిమ్మట నీ బాలికల నెవరు పెండ్లి చేసికొందురు? కాన నా మైనరుదశలో నాటపాటల నేర్పుటయే వ్యభిచారవృత్తినిఁ జేయఁ బ్రయత్నపడినట్లు చట్టము చేసిన యెడల (బై చట్టమునకుఁ బ్రాణ మిచ్చినట్లగును. లేనియెడల నిష్ప్రయోజనమైన చట్టముగా ఉండును. ఇతరకులజులు గొందరు మైనరుల కాటపాటలు నేర్పుట తప్పుకాదని చెప్పుచుండుట నేను వినియున్నాను. ఆటపాటలు నేర్పిన తరువాత పెండ్లి యేల జేయరాదని చెప్పుచున్నారు. వీరు నిజముగఁ జెప్పుచున్నారో లేక

రహస్యముగాఁ జెప్పుచున్నారో తెలియదు తమ కులములోని కన్యలచే బహి రంగముగా పాటకచ్చేరీలు జరిగించినయెడల వారికిని( బెండ్లి చేయుటకు సాధ్యపడు నాయని యాలోచన చేసి మాటలాడుట మంచిదని వారికిఁ జెప్పవలసి యున్నది. ఇది యపహాస్యపు మాట కాని వేళుకాదు. హాస్యమున కిదియా సమయము ? స్త్రీ దత్తత నీ కులమువారిలోఁ దప్ప మఱియెచ్చటను లేదు. మద్రాసు హైకోర్టువారి కొన్ని తీర్పులనుండి యొకపడుచునే కాక యా పడుచు జీవితములోనే యితర బాలికలను దత్తు తీసుకొనుట న్యాయమైనదని కనపడుచున్నది ఇంతటి యన్యా యమునకు న్యాయస్థానమువారు తోడ్పడుట మిక్కిలి చిత్రముగా నున్నది కాన బాలికాదత్తత సర్వథా న్యాయసమ్మతము కాదని గవర్నమెంటువారు చట్టము జేయుట లోకసమ్మతముగను శ్లాఘనీయముగను ప్రజాక్షేమకరముగా నుండును. దత్తు తీసికోబడు మైనరు కన్యలను వ్యభిచారవృత్తికి బెంచినట్లయిన శిక్ష వేయు టకై చట్టను నేర్పఱచిన ప్రభుత్వమువారు ఇంటబుట్టిన మైనరుపిల్లలను నిదే వృత్తికి బెంచినయెడల వారిని సహితము శిక్షించుటకు జట్టమేర్పఱచుట ధర్మము కదా ? పసిబిడ్డలై యజ్ఞానులై యనాథలై యుండు దశలో వారిని బడుపువృత్తి నవలంబింపజేసి వారి జీవితకాల మంతయు వృథా చేయుటకు దలిదండ్రులకు హక్కు గలదా ? తలితండ్రులే తమ మైనరుబిడ్డలను జంప యత్నించినచో ప్రభుత్వమువారికి దెలిసిన నూరకుందురా ? అట్టి తలిదండ్రులను శిక్షించి బిడ్డ లను వారి స్వాధీనమునుండి తప్పించి వారిని సంరక్షించుట ప్రభుత్వమువారి ధర్మము కాదా ? అట్లయిన ననాథలయిన బిడ్డల జీవితకాల మంతయు బాడుచేసి వారిని మృతజీవనలుగాను లోకనింపితులుగాను జేయుట చంపుటకంటెను నెక్కుడు తప్పుగాదా ? ఇట్టితప్పును దెలిసి ప్రభుత్వమువా రూరకుండుట రాజధర్మమా ? కాదు.

హిందువుల సంఘపద్ధతులలోను మతాచారములలోను ప్రవేశింపమని ప్రభుత్వమువారు వాగ్దాన మొసగియుండుటచే నూరకుండునట్లు గానబడుచున్నది. అయినను మనదేశములో నుండిన ననేక దురాచారములను ప్రభుత్వమువారు

నిలిపివేయలేదా? వారు సహగమనమును బానిసవ్యాపారమును నరబలులును మొదలయిన పద్ధతులను నిలిపివేసి కీర్తిగట్టుకొని యున్నారు. కాన నీ కులము వారును సంఘక్షేమము గోరు నితరులును గోరు పక్షమున ప్రజాక్షేమ భంగకర మైన నీ చెడ్డపద్ధతిని గూడ నిలుపుటకు నావశ్యకములైన చట్టములను గవర్న మెంటువారు సేయబూనెద రనుటకు సందియము లేదు. పీనల్‌కోడు 372, 373 సెక్షనులు చేసినపుడే ఈ చెడ్డపద్ధతి నిలుపు నుద్దేశ్యమున్నట్టు కొంత గానవచ్చు చున్నది. ఈ సెక్షన్‌లో నెవరయినను 16 సంవత్సరములకు లోనగు మైనరు బిడ్డల శరీరములను వ్యభిచారములకై "బాడుగకునిచ్చినను, అమ్మినను, లేక తదుద్దేశ్యమైన మరే రీతిగా వినియోగించినను" అను పదములు ప్రయోగింప బడినవి అనగా తలితండ్రులు పడుచుల మైనరుదశలో గన్నెరికము జేసి యిచ్చినను, పయికము తీసికొని వ్యభిచారము జేయించినను పై సెక్షన్‌లు అన్వయించునట్లుగా నర్థము సాధారణముగ నగుచున్నది. అనగా నింటబుట్టిన బిడ్డలకేమి, తీసుకోబడిన బిడ్డలకేమి యొకటేరీతిగ నీ చట్టము లన్వయించునట్లు పై పదముల రీతిగా నర్థమగుచున్నది. అయిన మద్రాసు హైకోర్టువారీ పదము లను విపరీతముగా నర్థము చేసియున్నారు వారి యభిప్రాయప్రకార మింటం బుట్టిన బిడ్డలకు మైనరుదశలో గన్నెరికము చేసినను లేక పైకము దీసికొని వ్యభిచారవృత్తిని జరిపించినను పై చట్ట మన్వయింపదు. పురాతన తీర్పు లట్లుండ 1928లో (24M.L.J.77) మద్రాసు హైకోర్టువారు పై సెక్షన్‌లోని "వినియోగ" మను పదమును స్థిరముగా గొంతకాల మితరుల స్వాధీనము చేయుట యనియు నట్లు స్వాధీన పఱచుకొన్నవారికి మైనర్లయందు హక్కు గలిగి యుండ వలయుననియు మఱియు నప్పుడప్పు డితరులు మయినర్ల వ్యభిచారము నకై వినియోగించిన పై పద మన్వయింపదనియు యర్థము చేసియున్నారు. ఈ యర్థప్రకార మింటబుట్టిన మయినరు బిడ్డ వ్యభిచారమున కుపయోగించిన పై చట్ట మన్వయింపదని యేర్పడుచున్నది. ఈ తీర్పు నీతి సమ్మతముగాని న్యాయ సమ్మతముగాని కాదు సెక్షన్‌లలోని పదముల కపార్థము జేసినట్లు గనంబడు చున్నది. కాన నీ తీర్పులను రద్దుపఱచి పై సెక్షన్‌లలోని పదము లన్నివిధము

లైన మయినరుల వ్యభిచారమున కన్వయించునట్లు సవరణ చేయుట యత్యావశ్యకమైయున్నది.

ఇదివరలో జెప్పిన ట్రిటీవల పై సెక్షన్‌లోని మైనరువయస్సు 18 సం॥కు వృద్ధిచేయబడి యున్నది ఈ సవరణ జేసినయెడల బాలికలను 18 సం॥ వరకును వ్యభిచారవృత్తి కుపయోగించుటకు వీలుండదు. ఇదియునుగాక బహిరంగముగా ఈ మైనర్లను 18 సం॥ లలోపల గచేరీలలో గజ్జెగట్టి యాడించినను, బాడించినను లేక దేవాలయములలో నాడించి పాడించినను వ్యభిచారము చేయ ప్రయత్నించుచున్నట్లగునని కూడా పై సెక్షనుయర్థము విశదీకరించినయెడల చాలా మేలగును. అట్లయిననే వ్యభిచారవృత్తి తప్పక నిలిచిపోయి పెండ్లిండ్లు చేసియే తీరవలసి వచ్చును. పై సెక్షనులు జారీలోనికి దీసికొని రావలయునని క్రింది యధికారులకు గవర్నమెంటువారు తీక్ష్ణమైన తాకీదును జేయవలయును. పై సెక్షన్‌లోని నేరములను పెద్ద నేరములుగా భావించి యెన్నికేసులలో సెక్షన్లను జారీలోనికి దెచ్చినది. ప్రతి సంవత్సరము పైవారికి దెలుపవలెనని యాజ్ఞాపించుటావశ్యకము మఱియును నీ కులమువారి మయినరుబాలికల జాబితా పేర్లతోను, వయస్సుతోపాటు తయారు చేయించవలెను ఇతరులనుండి తీసికోబడిన కన్యలవిషయమై వారి తల్లులనుండి యుద్దేశ్యవిషయము సుంజాయిషీకూడ దీసియుంచు నట్లాజ్ఞాపించ వలసియున్నది అ కన్యలు మేజరగు 18 సం॥లు ఈడు వచ్చువఱ కపుడపుడు విచారించుటకూడ నాజ్ఞాపించ బడవలెను. ఈ విచారణలో మైనర్లుగా నుండునపుడు చట్టమును ధిక్కరించి వ్యభిచారవృత్తికి పెంచుటకు ప్రయత్నించు నట్లేర్పడిన యే మైనర్లనైనను వారి స్వాధీనమునుండి తప్పించు హక్కును సరియయిన అధికారులకు గలుగజేసి యట్టి మైనరునకు వేఱుగా నీతివర్తనకు బెంచుట కవకాశము గలుగజేయ వలసియున్నది. ఈ విషయమై బెంగాలు రాజధానిలో నొక చట్టము చేయబడి యున్నది. మన దేశములో కూడా పై విషయమై యొక చట్టము చేయుటావశ్యకము మైనరుల బెంచుటకై మైనర్ల

నుండియు నాయకులు, ప్రచారకులు శతసహస్ర వేదికలనుండి చాటుచుండిరో, ఏది ప్రతి కాంగ్రెసు సభ్యుడును లక్ష్యముగ నెంచుకొని యథాశక్తిని ననుసరింప గోరుచుండెనో, దానినే మహాత్ముడీ తీర్మానరూపమున బెట్టెను కాని యా ప్రాత విషయమే మనకు క్రొత్త యయ్యెను. మన నోటినుండి వెలువడిన వాక్యములే మనకు భీతిని గొల్పినవి మన లక్ష్యములే మనకు బరిహాసాస్పదము లయ్యెను. మహాత్ముడే కారణముచే నీ తీర్మానములను బెట్టవలసి వచ్చెనో గ్రహించలేక పోతిమి. పైగ మనకుండు యల్పత్వము వారికి గూడ గలదని తలచి, వారి కెన్నియో దురుద్దేశముల నారోపించితిమి. స్వరాజ్యవాదులను కాంగ్రెసునుండి తరిమివేయుటకే యెత్తు యెత్తెనని చాలమంది బహిరంగముగ జాటిరి ఆల్ ఇండియా నాయకులు గూడ నూలు వడకవలసినదని నిర్బంధించుటకంటె బరిహాసాస్పదమైన విషయమేమి కలదనిరి. చచ్చిపోయిన పంచ బహిష్కార ములను దగులబెట్టగ, ఆ శవములను తిరిగి యింటిలోనికి దీసికొనివచ్చు ఉన్మాదు డెవడైన నుండునా యని ప్రశ్నించిరి. రెండు సంవత్సరములు రాతిగోడల మధ్య నుండి బయటకు వచ్చి దేశము దిరుగకుండ, దేశపరిస్థితులను దెలిసికొనకుండ, రాటము రాటము అని మొత్తుకొను నాయకుడు లభించుట మన దురదృష్ట మనిరి. ఈతడు కేవలము సర్వాధికారిగ, నిరంకుశ ప్రభువుగ నుండవలెననెడి దురాశతో నిట్టి కుతంత్రములను బన్నుచున్నాడనిరి. ఈ యారోపణలను జేసినది ఆంగ్లేయ పత్రికాధిపతులు కాదు. బ్రిటిషు అధికార వర్గమునకు జెందిన విదేశ పరిపాలకులు కాదు. మహాత్ముని పద్ధతులయందు నమ్మకము లేని మితవాదులు కాదు. కాంగ్రెసు ప్రతికక్షులు కాదు. కేవలము మహాత్ముని శిష్యకోటిలోని వారు. మహాత్ముడు లోకైకపూజ్యుడని ప్రతి యుపన్యాసము నందును, ప్రతి సందర్భమున బహి రంగముగ స్తోత్రము చేయుచుండు మహానాయకులే యిట్టి దోషారోపణలు చేయ సాగిరి. మహాత్మున కిది గొప్ప పరీక్షాసమయము. వెనుక నిట్టిది రాలేదు ముందింతకంటె విషమస్థితి వచ్చునేమో తెలియదు. వెనుకటి బ్రిటిషుకోర్టులో జరిగిన విచారణ కూడ నిట్టి పరీక్షతో బోల్చదగినది కాదు ఆ విచారణ జరిగినది బ్రిటిషుకోర్టు విచారణకర్త ఆంగ్లేయ న్యాయాధిపతి నేరము విదేశ

ప్రభుత్వ పద్ధతిపై నసంతుష్టిని గలుగ జేయుట- విచారణ సక్రమముగ జరిగెను- ముద్దాయి నేరము నొప్పుకొనెను- శిక్షాస్మృతి ప్రకారము శిక్షింపబడెను- ఆ విచారణ లోకచరిత్రలో నంకితమైనది ముద్దాయి యొసగిన వాగ్మూల మపూర్వమైనదని లోకమంతయు ప్రశంసించినది- కాని నేటి విచారణయొక్క రూప మట్టిది కాదు. ఈ విచారణ కూడ అహమ్మదాబాదులోనే జరిగెను. కాని కోర్టు మాత్రము ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ— విచారణకర్తలు మహాత్ముని ప్రియ అనుయాయులైన సుప్రసిద్ధ నాయకులు నేరము ఒక సెక్షను క్రింద కాదు- కాంగ్రెసు నిబంధన యెడల ద్రోహము, నాయకులను తరిమి వేయవలెననెడి దురుద్దేశము, సర్వాధికారి కావలెననెడి దురాశ, వ్యవహారజ్ఞాన శూన్యమైన సంకుచిత భావము, దేశపరిస్థితులను గుర్తింపజాలని అంధత్వము, మూర్ఖత్వము, ఉన్మాదము, పట్టుదల, మొదలగు దోషముల నారోపించి విచారణ జరిపిరి. మూడు దినములు విచారణ జరిగెను,విచారణయొక్క పద్ధతియును పర్యవసానమును, ఇదివరకే పాఠకులకు దెలిసియున్నవి అయినను నీ విచారణలో ముద్దాయి మొదటనుండి తుదివఱ కెవ్విధమున బ్రవర్తించెనో తెలిసికొనుటకు గొన్ని సందర్భములను మాత్రము పేర్కొనెదము.

ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సభ్యులు అహమ్మదాబాదు చేరిరి. కమిటీలోని ఇరుపక్షముల వారును సహజముగ సభకుముందు మహాత్ముని గలుసుకొనుటకు గోరుచుండిరి. కాంగ్రెసులో నొక పార్టీవారు మహాత్ముని తీర్మానముల కనుకూలురను సంగతి యెల్లరకును దెలియును. కాని మహాత్ముడు సభకు ముందుగ తన పార్టీవారు తనను గలుసుకొనుటకు సమ్మతింపనని ప్రకటించెను. వల్లభాయి పటేలు, రాజగోపాలాచార్యులు, వంటి ప్రియశిష్యులకు సహితము దర్శన మీయలేదు. వారితో నే విషయమును సంప్రతించలేదు. తన తీర్మానమున కనుకూలముగ నెన్ని వోట్లు వచ్చునదియు లెక్కించుకొనలేదు. స్వరాజ్యపార్టీవారెవరినైనను గలుసుకొనుట కనుజ్ఞ నిచ్చెను. దాసు,నెహ్రూ ప్రభృతులను గలుసుకొనెను. వారితో గంటలకొలది మాట్లాడెనేకాని స్వపక్షమువారి నొకరిని దరినైన జేరనియ్య లేదు - ఇట్టి నిదర్శనము ఏ నాయకుని జీవితమునందైన సాధ్యమని ఊహింప

గలమా ? దీనిని బట్టి మహాత్ముడు వోట్లకొరకుగాని, ఫలితముకొరకుగాని జూడ లేదని స్పష్టపడుచున్నది. ఇంకొక సందర్భము—దాసు, నెహ్రూ ప్రభృతులు వచ్చి; "మహాత్మా ! నిన్ను సర్వాధికారినిగ జేసెదము. కమిటీలను నీ యిష్టము వచ్చిన వారితో నింపుకొనుము. నీ కార్యక్రమమును నడుపుటకు మేమును దోడ్ప డెదము. కాని శాసనసభలో బనిసేయుటకు మాత్రము మా కనుమతి నొసంగుడు" అని రాజీకి వచ్చిరి. కాని మహాత్ముడు వీరి యమాయకత్వమునకు నవ్వి "నన్ను సర్వాధికారినిగ జేయుటకు మీరెవ్వరు ? మీరు రాజీపడవలసినది మీ ప్రతిపక్షు లతో గాని నాతో కాదు. ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీలో మీరు చర్చించు కొనుడు. మీ యిష్టమువచ్చిన తీర్మానములకు రండు. తుదకు మీరు తీర్మానమునకు వచ్చినను, రాకపోయినను, నాకు కబురు పంపినయెడల నేను వచ్చి నా కర్త వ్యమును నేనాచరించెద నని" చెప్పి వారిని బంపివేసెను - వోట్ల బలము చూచుకొని యిట్లు చెప్పెనా ? కాదు స్వరాజ్యపార్టీవారిని వారి ప్రతిపక్షులను సమావేశపరచి వారి బాధ్యతలను గుర్తించునటుల చేయుటకే యిట్లు చేసెను. గాంధి పట్టము గట్టుకొనుటకే తీర్మానములను బెట్టుచున్నాడని చెప్పుచుండినవారు శిరములను వంచుకొనవలసి వచ్చెను. ఇంకొక సందర్భము- మహాత్ము డశాస్త్రీ యముగ బ్రవర్తించుచున్నాడని తమ యాగ్రహమును దెలుపుటకై మొదటి తీర్మా నము వోటునకు వచ్చినప్పుడు స్వరాజ్యపార్టీవారు సుమారు నలుబదిమంది సభ నుండి లేచిపోయిరి.కాని మహాత్ముడు పెద్దలు వెడలిపోయినందుకు భయపడలేదు. పోయినదే చాలునని సంతసించను లేదు. ఎన్నికల వ్యవహారధర్మము ప్రకారము ఎన్నికవేళలో లేనివారి వోట్లను లెక్కపెట్టకూడదు. కాని మహాత్ముడు వెడలి పోయిన వారి వోట్లనుగూడ లెక్కపెట్టించి తన తీర్మాన మోడిపోయినట్లుగ నెంచ వలసినదని దెలిపెను. రాజకీయ నాయకుల చరిత్రలలో నెక్కడనైన నిట్టి సాదృ శ్యము గలదా ? ఇంకొక సందర్భము-లా కోర్టులను బహిష్కరించుటలో గొన్ని కష్టములను గనుపెట్టెను. నాన్‌కోఆపరేటర్లు కోర్టులకు దిగరను గారణముతో గొందఱియ్యవలసిన ఋణము లెగవేసి వారిపై కేసులు తెచ్చి కష్టముల పాలు చేయుచున్నారు. ఈ స్థితిగతులను గనుపెట్టి వారి విషయములో కోర్టు బహిష్కార

నియమమును సవరించుచు మహాత్ముడొక తీర్మానమును ప్రతిపాదించెను. మహాత్ముడు కూడ బహిష్కార వ్రతమును విడనాడుచున్నాడని కాబోలు ఆ తీర్మానమును ప్రతిఘటించి అయ్యది అశాస్త్రీయమను కారణముతో త్రోసివేయించిరి ఇది చేయించినది. స్వరాజ్యపార్టీవారు కాదు మహాత్ముని యనుచరులమని జెప్పుకొను వారే యిట్లు చేసిరి వారు నిజముగ బాధ్యతను గుర్తించి చేసినయెడల నెట్టి యాక్షేపమును లేదు వారట్లు చేయలేదను సంగతి మహాత్మునకు బాగుగ దెలియును అయినను ప్రతిఘటించుచున్నవారు తన యనుచరులైనను అడ్డము చెప్పలేదు. అశాస్త్రీయమని త్రోసివేయుచున్నను, నిర్ఘాంతపోయి చూచుచుండెనే కాని మారు పలుకలేదు. మహాత్ముని హృదయమున దుఃఖము పొంగి పొరలుచున్నది. కాని అపుకొనుచుండెను. కాని పరీక్ష యింకను బూర్తికాలేదు. నిజమైన పరీక్ష యింకను ముందు రానున్నది. దాసు నెహ్రూలు మహాత్ముని యొద్దకు బోయి "మీరు కాకినాడ కాంగ్రెసు రాజీతీర్మానము నంగీకరించరా" యని ప్రశ్నించిరి. నేను దానిని దాటనని మహాత్ముడు ప్రత్యుత్తర మిచ్చెను. స్వరాజ్యవాదులు కమిటీలలో నుండకూడదని మహాత్ముడు తీసికొని రాబోవుచున్న తీర్మానము దానికి విరుద్ధము కాదని వాని యభిప్రాయము. కాని రాజీతీర్మానమును తమ యిష్టము వచ్చినటుల అర్థము చెప్పుకొనుటకు స్వాతంత్ర్యము కలదనియు, స్వరాజ్యవాదులు కూడ కమిటీలలో నుండుటకాలమున తమ ప్రతిపక్షు లొప్పుకొనిరని కూడ జెప్పిరి. మహాత్ముడు నిజానిజములను రాజగోపాలాచార్యులుగారిని గాని పటేలుగారిని గాని అడుగలేదు. అట్లయినచో దన తీర్మానమును వారిష్టమువచ్చినట్లు సవరించుకొనవచ్చునని చెప్పి, వారి సవరణ ప్రకారమే తా నంగీకరించెను. మహాత్ముని ఇంతకంటె నెక్కువ దుఃఖపెట్టినది గోపీనాథ సాహాయిని గూర్చిన తీర్మానము. ఇది అరాచకుల హత్యపద్ధతిని ఖండించిన తీర్మానము. అహింసాతత్వమును తిరిగి ప్రతిపాదించిన తీర్మానము. దీనిని మహాత్ముడు ఏ యుపన్యాసమును జేయకయే సభలో బ్రవేశపెట్టెను. మహాత్ముడీ తీర్మానమును కేవలము తన విశ్వాసతీర్మానముగ భావించుకొనెను. ఈ తీర్మానము ఎనిమిది యెక్కువ వోట్లతో నెగ్గినను, 70 మంది

ప్రతికూలురుగ నుండుటచే తన కపజయముగ నెంచుకొనుటలో ఆశ్చర్యము లేదు. విచారణ పూర్తియైనది సభా ప్రారంభముననే మహాత్ముడు తన యుద్దేశము నిటుల దెలిపెను- "నా స్థితి, మీ స్థితి, దేశస్థితి తెలుసుకొనుటకే యీ తీర్మానములను బెట్టుచున్నాను" ఇప్పుడు నాయకు లెంతవరకు తనవెంట నున్నది వ్యర్థతమైనది." కాంగ్రెసునుండి నన్ను వెడలగొట్టు దినమెప్పుడు వచ్చునా" యని తన హృదయవేదనను వెలిపుచ్చుచున్నాడు. నాయకులపై విశ్వాసము పోయినను, ప్రజలపై నింకను నమ్మకము పెట్టుకొనినాడు ప్రజల స్థితినిగూడ ప్రత్యక్షముగ గనుగొనుటకు త్వరలో బయలుదేరెదనని ప్రకటించెను. కాలగర్భమున నేమి దాగియున్నదో తెలియదు. కాంగ్రెసుకమిటీ సభ పూర్తియయిన పిమ్మట మహాత్ముని నయనయుగ్మమునుండి ప్రవహించిన అశ్రుధారలు భారతవర్షమును బునీతము సేయుగాక!

కృష్ణా పత్రిక
జులై ౫వ తేది, 1924 సం॥

# ఆంధ్ర నట సాహిత్య మహాసభ

శ్రీ ముత్తరాజు సుబ్బరాయ మెమోరియల్ క్లబ్బువారి యాజమాన్యమున నీ నెల 4,5,6,వ తేదీలను బందరు పురమందినమున ఆంధ్ర నట సాహిత్య మహా సభ సమావేశమయ్యెను. నటసభకు బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారధ్యక్షత వహించిరి. సాహిత్యసభకు విద్వత్కవులగు కాశీ కృష్ణాచార్యులుగారు సభాధిపతిగ నుండిరి. ప్రథమమున శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులు ఎమ్. ఏ. గారు సభకేతెంచిన కవులకును, నటులకును, స్వాగత మొసగి సభోద్దేశ్యమును వెల్లడిపరచిరి. ఉమ్రా అలీషా, భమిడిపాటి కామేశ్వర రావు, గొల్లపూడి శ్రీరామశాస్త్రి, వెదురుమూడి శేషగిరిరావు, నెల్లూరు నగరాజ రావు, ముప్పిడి జగ్గరాజు, హరి ప్రసాదరావు, కోపల్లె హనుమంతరావు, కందాడై శ్రీనివాసాచారి. కొలచిన కృష్ణసోమయాజి మొదలగు విద్వాంసులు, కవులు, రసజ్ఞులు, నటులు విచ్చేసిరి. సభలో భిన్నాభిప్రాయములు చాల పొడసూపినవి. నాటకరచన విషయమున బూర్వ సంస్కృతనాటక లక్షణములను యథావిధిగ బాటించ వలెననువారు కొందఱు, నవీనాంగ్లేయ నాటకముల ఫక్కిని నాటకములను రచించుట యెక్కువ రంజకమని కొందఱు. వేంకటశాస్త్రిగారు పూర్వాచార పరాయణులైనను గొన్నిసందర్భములలో గొంత సంస్కరణము వాంఛనీయమే యని అభిప్రాయపడిరి. ఆధునిక నాటకమునందు చేయబడుచున్న రంగవిభజనము అలంకారికుల మతమునకు విరుద్ధమైనను ప్రదర్శనమున కెక్కువ యనువుగ నుండునని శాస్త్రిగారు సూచించిరి. గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు రూపకములనుగూర్చి చదివిన వ్యాసము సభ్యుల నెక్కువగ నానందపఱచినది. వీరు పూర్వ పాశ్చాత్య నాటకతారతమ్యములను గూర్చి చేసిన విమర్శ బోధకముగ నున్నది. కాని పాశ్చాత్యనాటకములు కేవల మైహిక విషయికములని చెప్పుట,

సమంజసముగ లేదు షేక్స్పియరు మహాకవి మానవ ప్రకృత్యంతర్గతమైన శక్తి స్వరూపమును నిరుపమానముగ జిత్రించి యమరకీర్తి బడసెను కాళిదాస భవ భూతులయం దుండినంత రససిద్ధి పాశ్చాత్య నాటకకవులయందు గన్పట్టక పోయినను వారి నాటకరచనా విన్యాసము భారతకవియందు కంటె నెక్కువ యౌన్నత్యము నందినదేమో యని సందియము కలుగును నాటక రచయితలు పాశ్చాత్య పద్ధతుల ననుకరించకూడదని రామశాస్త్రిగారు చెప్పిన విషయము గమనింపదగినది ఈ కాలమున బూర్వ సంస్కృతకవులను ననుక రించుట గూడ దోషమేయని చెప్పిన సమంజసముగ నుండెడిది. పాశ్చాత్యుల ననుకరించినను, ప్రాచ్యుల ననుకరించినను అనుకరణము అనుకరణమే. అనుక రణము సృష్టి కాదు. కవులు చేయవలసినది సృష్టి. పూర్వ సంప్రదాయములను సంరక్షించుట యుక్తమే కాని, పూర్వ లాక్షణికులు విధించిన సూత్రముల నేమాత్ర ముల్లంఘించ కూడదని చెప్పుట మాత్రము సహేతుకముగ లేదు కవులు నిరంకుశ ప్రభువులు. వారిని నిబంధనలచే నిర్బంధింప జూచుట సరస్వతిని జెరసాలయం దుంచుట వంటిది. కాలములు మారినవి కాలానుగుణ్యముగ కళలు కూడ గొంత మార్పు చెందకతప్పదు. లేనియెడల నవి మృతప్రాయము లగును. కాని నేటి నాటకరచయితలు చూపుచున్న విశృంఖలవృత్తి మాత్రము గ్రాహ్యము కాజాలదు. వీరిలో బూర్వకవుల రససిద్ధికాని, పాశ్చాత్యకవుల భావోద్దామముకాని కనుపించదు. పైగ రసజ్ఞుల మనముల కేవగింపును గలిగించు సందర్భము లెన్నియో కలవు. నాటకములు నీతిదాయకములుగ నుండవలెననెడి సిద్ధాంతము నంగీకరింపజాలము. రసోద్దీపనమే కవితయొక్క లక్ష్యము. రసము నీతిబా హ్యము కాదు, నీతిదాయకమును గాదు. ధర్మాతీతమైన రసమును వ్యావహారిక నీతి నియమములచే బంధింప జూచుటవలన రసభంగము కలుగునేకాని రససిద్ధి లభింపదు. మతద్వేషములను బురికొల్పు నాటకములను రచించుట గర్హ్యమని ఉమ్రా అలీషా కవిగారు సూచించు విషయమును కవులెల్లరు బుద్ధిస్థము చేసికొ నదగినది. ద్వేషాంకురములను బెంచు రచనలుదేశమున కపకారము లేకాక రసభంగ కరములని కూడ కవులకు దెలియని విషయము కాదు. భమిడిపాటి కామేశ్వర

రావుగారు నాటక కంపెనీల సంగీతముపై దాడివెడలి సభాసదుల నల్లకల్లోల పర చిరి. నటులు పద్యములను జదివి అభినయించ వలసినదేకాని రాగములతో సాగ దీసి పాడకూడదని వీరి వాదము ఈ విషయములో తీవ్రమయిన భేదాభి ప్రాయములు కలవు-కాని కామేశ్వరరావుగారి మీమాంస సభ్యుల నెల్లరను జిజ్ఞాసు వులనుగ జేయగల్గె ననుట నిశ్చయము కంపెనీ నాటకములలోని హార్మోనియము పాటను బారద్రోలుటకు మేము అంగీకరించెదము కాని, అభినయమునకు సంగీత ముపకరించదను వాదము నామోదింపజాలము. అట్లు చెప్పితిమేని భరత శాస్త్ర మునకు శరణ్యమే యుండదు. వచనమునకును పద్యమునకును నెట్టి భేదము కలదో, అట్లే నేటి కంపెనీ "ఆక్షను"కును భరతశాస్త్రానుగుణ్యమయిన నాట్య కళకును అంత ప్రభేదము కలదు నవీన నటుల "ఆక్షను'' వ్యావహారిక చేష్టా విలాసాదుల యనుకరణమేకాని, రససిద్ధులైన కళావిజ్ఞులచే నిర్దేశింపబడిన హావ భావ విలాసాదులు కావు వర్తమాన కాలమున జనుల రుచులు మారినవి. మన చూపు వ్యావహారిక వాస్తవ రూపములను మించిపోవుటకు జంకును. ప్రత్యక్ష ప్రమాణమును గోరు ఈకాలపువారికి వ్యావహారిక చేష్ట లెక్కువగ రుచించుటలో నాశ్చర్యము లేదు. నేటి నటులెందరు పాశ్చాత్యుల సినిమా ప్రదర్శనములను గాంచి తదనుకూలముగ నభినయించుట లేదు? ఇది కౌశల మనుపించుకొనునేకాని కళ యనుపించు కొనదు. గాయకులు తమ యనిర్వాచ్యానందమును వెలిపుచ్చు టకు వ్యావహారిక భాషాతీతమయిన స్వరసమ్మేళనములను ఎటులగల్పించిరో, అటులే నటులును తమ రసానుభవములను వెలిపుచ్చుటకు వ్యావహారిక చేష్టల కతీతములైన హావభావ విలాసములను గల్పించుకొన వలసిన అవసరము కల దని గుర్తించినగాని జీర్ణమై పోవుచున్న మన అభినయకళ తిరిగి యుద్ధరింప బడదు. భరతకళ యొక్క ప్రత్యేకతయు నిలువదు. ఈ నటసభయందీ విషయ మెక్కువ యాలోచనలోనికి రాకపోవుట విచారకరము, కాని ప్రకృత నాటక కంపెనీల సంస్కరణమే యీ సభ్యుల నెక్కువగ నాకర్షించుట సహజము. ఈ నాటక కంపెనీలు గానసభలా కావు. అభినయ కళా ప్రదర్శనములా కావు, సరియైన పురాణ కాలక్షేపములా కావు. కావ్యాభిరుచిని గలిగించు పరిషదములా

కావు. సర్వవిధముల నాటకరంగము నిరసనమున కాశ్రయమైనది. కారణ మిలను గనుకొని సంస్కారణములకు బూనుకొనుట కొరకే యీ సభ సమావేశమయ్యెను. నాటకములను రచించుచున్న వారును, ప్రదర్శించుచున్న వారును గలసి సభచేయు చుండుటచే నుభయులకును జాల చిత్త సంస్కారము కలుగుట కాస్కార మేర్పడినది. కఠినమైన విమర్శనలు ప్రారంభమైనవి. మీమాంస గ్రంథములను వ్రాయుచున్నారు. దీనినంతను జూచి నాటకపు పిచ్చి బయలుదేరిన దని కొందరు పరిహసింపవచ్చును. కాని యిది పిచ్చి కాదు, వేళాకోళము కాదు. అన్ని శాఖలలో వలెనే నాట్యరంగముకూడ సంస్కారణము నొందవలసి యున్నది. "ప్యూరిటనులు" కొందరు దీనిని అస్పృశ్య విషయముగ నెంచినంత మాత్రమున నిది మానవునకు దూరము కాజాలదు సజీవమైన జాతియందు సచేతనమైన కవితయందు,నాట్యకళ సహజముగ వికాసము నొంది తీరును నాట్యకళను సక్రమ మార్గమున వికసింప జేయవలసిన విధి విద్యాధికులది. విద్యాధికులు దీనిని ముట్టకుండ నిరసించుట చేతనే యింతకాల మిది పెడత్రోవను బట్టి సంఘము యొక్క రసజ్ఞతనే చెరుపు చుండెను సుబ్బరాయ మెమోరియల్ క్లబ్బువారు నాట్య సంస్కారణ ప్రాముఖ్యమును గమనించి యీ సభను సమావేశ పరచినందుకు వంద్యులు. ఇది ప్రథమ ప్రయత్న మగుటచేత సభవలన గలుగవలసిన ఫలమంతయు గలుగక పోవచ్చును. సభ నలంకరించిన నటులును, కవులును గొలదిమంది. రాఘవాచార్యులుగారి వంటి నాటక కవులు రాకపోవుటయు చింతాకరము. కాని యిది నడివేసవిలో జరిగినది. 114 డిగ్రీల ఉష్ణములో నాట్యకళను గూర్చి ప్రసంగములను జరుపుమనుట కేవలము హింసాకర మనుటకు సందియము లేదు. కాని యీ సభను విఘ్నేశ్వర పూజగనే భావించవలయును. నాట్యాభిమానులు పోటీపరీక్షలను బెట్టుటకంటె నిట్టి యాలోచన సభలను సమకూర్చి దేశీయుల కళాభిజ్ఞతకు దోహద మొసగుట యావశ్యక కర్తవ్యము.

కృష్ణా పత్రిక
జూన్ 7వ తేదీ, 1924 సం॥

# రాజ్యత్యాగమా?

ఈమధ్య ఎడ్వర్డురాజు ఆ డియాటికు సముద్రతీరమునకు నౌకావిహారము వెడలినప్పుడు వారివెంటనున్న మిత్రబృందములో మిస్సెసు సిమ్సను అను ఒక అమెరికను యువతి కలదను విషయము ప్రకటించబడినది. ఈ యువతిని గూర్చి ఆ సందర్భములో బ్రిటిషు పత్రికలేమియు ఎక్కువగ బ్రకటించలేదు. ఈమె పుట్టుపూర్వోత్తరములు తెలుసుకొనుట కెవరికిని అవసరము కలుగదయ్యె. కాని ఈ యువతి ఎడ్వర్డు రాజువెంట రొమేనియా, యుగోస్లావియా, టర్కీ మొదలగు దేశములకు బోయినప్పుడు అనుసరించి యుండుటయు, అచట జరిగిన రాజసత్కారములలో నీమె ద్వితీయ స్థాన మాక్రమించి యుండుటయు, నా దేశములలోని పత్రికాధిపతుల గౌతూహలమును బురికొల్ప, ఆటలలో, విందులలో, ఈతలలో, క్రీడలలో నీమెకూడ రాజుగారితో బాల్గొనుచుండిన దృశ్యముల ఫొటోలు ప్రచురింపసాగిరి. అమెరికను పత్రికలును ఈమెను గూర్చి విశేషముగ వర్ణించుచు, నీమె త్వరలో బ్రిటిషు రాణి కానున్నదని కూడ సూచించెను అప్పటికిని బ్రిటిషు పత్రికలీ సందర్భమును గూర్చి ఒక మాట యైనను వ్రాయలేదు. బ్రిటిషు పత్రికల నిగ్రహ మత్యద్భుతము!

ఇప్పు డే పత్రిక చూచినను, ఈమె వృత్తాంతములే. ఈమె రూప పటమును ముద్రించని పత్రిక లేదు అమెరికను పత్రికలనుండి ఉల్లేఖములు తామరతంపరగ బ్రకటించ బడుచున్నవి. ఈమె వంశవృక్షమును గూడ పెళ్ళగించి, మూలపురుషుల వృత్తాంతములను సహితము వెల్లడించుచున్నారు. ఈ వృత్తాంతములముందు తక్కిన లోకవార్త లన్నియు వెలవెల బోవుచున్నవి. స్పెయిను పితూరీ వార్తలు కూడ ఎక్కువగ వచ్చుట లేదు. ఎడ్వర్డురాజు ఈమెను వివాహమాడుటకు రాజ్యమునైనను వీడునా యను విషయ మొక్కటియే పత్రికలను, రాజ్యతంత్రజ్ఞులను కలవరపరచుచున్నది. ఈమధ్య నే విషయమును

ఇంత ప్రాముఖ్యమునకు వచ్చియుండ లేదు. సర్వసామాన్యముగ నిబ్బరముగ నుండు బ్రిటిషు ప్రజలు సహితము ఈ విషయమెట్లు పర్యవసించునో యని తహతహ లాడుచున్నారు. బ్రిటిషు మంత్రుల సంప్రదింపులకు అంతు లేకున్నది. మిస్సెసు సిమ్సను ఫ్రాన్సులో కేనీసు అను మారుమూల గ్రామమున విశ్రమింప గోరినను, పత్రికలు ఆమెను వెంటాడుచున్నవి ఆమె గృహమువెలుపలకు వచ్చుటకుగూడ ఆస్కారము లేకున్నది. పత్రికాధిపతులు ఊహాలకొలది స్వకపోల కల్పితములైన సంవాదములను బ్రకటించుచున్నారు. సినీమా నటీమణియగు గార్బోయైనను స్వదేశములో స్వేచ్ఛ ననుభవించుచున్నది కాని, ఈ యువతి తెరలచాటుననే దాగుకొనవలసి వచ్చుచున్నవి. ఆధునిక ప్రపంచ మతి విచిత్రమైనది.

ఎడ్వర్డురాజు వలచుటవలన, నీమెకింత లోక ప్రాచుర్యము కలిగెనుగాని, ఈమె జీవితములో నెక్కువ విశేషము లేమియు గానరావు అమెరికాలోని బాల్టి మోరు అను పట్టణము ఈమె జన్మస్థానము. ఈమె వయస్సు 83వ సంవత్సరము దాటినది. ఈమె కుటుంబము నార్మనుజాతికి జెందిన గొప్ప వంశము. వంశ వృక్షము ప్రకారము ఈయమ ప్రపితామహుడు వైటుద్వీప రాజునకు బంధువైనట్లు తెలియుచున్నది. అమెరికను యువతి అయినను, నార్మనుజాతి రక్తము ఈమె నాళముల యందు ప్రవహించుచుండుటచే ఆంగ్లసంజాతయే యని చెప్పవచ్చును. ఈమె 1916లో అమెరికను నౌకాసేనానులలో నొకరగు స్పెన్సరును వివాహ మాడెను. ఆరు సంవత్సరములు వానితో కాపురము చేసెను. పిల్లలు కలిగినట్లు లేదు. పిమ్మట కేప్టెను ఆర్నెస్టు సింప్సను అను లాయరును పెండ్లి చేసికొనెను. ఈ సింప్సను లాయరయ్యు ఇంగ్లాండులో షిప్పింగు ఏజెంటుగ నియమింపబడెను. మిస్సెసు కూడ వానితో లండను రావలసివచ్చెను. భార్యాభర్త లిరువురును ఎట్టి పొరపును లేక సుఖముగ గాలము గడుపుచుండిరి. ఇట్లుండ, రెండు సంవత్స రముల క్రితము ఎడ్వర్డు వేల్సుయువరాజుగ నుండగానే వానిని గలుసుకొనుట తటస్థించెను. అంతకంతకు వారి పరిచయము స్నేహముగ బరిణమించెను. స్నేహము ప్రణయరూపమ్ము దాల్చెను. రాజుగారికిని ఈమెకును రాజమంది

రములలో భోజన ప్రతిభోజనములు కూడ సాగెను. ఆ భోజనములకు బ్రిటిషు మంత్రులు సహితము వచ్చిపోవుచుండిరి. కాని లోలోన గుసగుసలు బయలు దేరెను బ్రిటిషు పత్రికలీ గుసగుసలు దాచిపెట్టినను, అమెరికను పత్రికల నోళ్లను మూయగల వారెవరు? ఎడ్వర్డురాజునకును మిస్సెసు సిమ్సనుకును త్వరలో పరిణయము జరుగునని కూడ బ్రకటింపసాగిరి రాజుగా రీమెతో బరిణయము సల్పుట బ్రిటిషు శ్రోత్రియులకు సమ్మతము కానేరదు. ఒకమారీ మిస్సెసు సిమ్సనుగూడ నాహ్వానింపబడిన విందునకు, తాము రాజాలమని కేంటర్బరీ ఆర్చిబిషప్పును యార్కు బిషప్పును, తెలియబరచిరి మిస్సెసు సిమ్సను రాజ వంశమునకు జెందినది కాదు- మధ్యతరగతికి జెందిన యువతి- ఇద్దరితో గాపురము చేసి విడాకులు పుచ్చుకొనిన ప్రోఢ ఇట్టి భామను రాజమందిరము లోనికి రానిచ్చుట కొందరు న్యూనతగ నెంచిరి డైవోర్సు చేసికొనిన యువతితో పరిచయము చేయుట ఎడ్వర్డుతల్లి యగు మేరీరాణిగారి కేమాత్రము ఇష్టముండదు వెనుక విక్టోరియా మహారాణి పునర్వివాహము చేసికొనిన వితంతువులను గూడ దన ఆస్థానమునకు రానిచ్చెడిది కాదట బ్రిటిషు రాజాస్థానములో అట్టి మరియాదలు అనుశ్రుతముగ వచ్చుచున్నవి. ఈ కాలములో జాల మరియాదలు చాలవరకు సడలినను, మిస్సెసు సిమ్సనువంటి కామనరును రానిచ్చుట, రాజమరియాదలకు భంగకరముగ నెంచబడుచుండెను. ఈ కారణముచే నీ విషయము రాజకుటుంబములోనే కాక మతాచార్యులలోను, బ్రిటిషు మంత్రులలోను ఆందోళనను గలిగించెను.

ఇట్లుండగ మిస్సెసు సిమ్సను ఇప్సివిచ్ కోర్టులో భర్తపై డైవోర్సుదావా పడవేసెను. తన భర్త ఒక అన్యస్త్రీతో కూడని చెలిమిని గావించుచున్నాడని అమె చేసిన దోషారోపణము హోటల్ డి పారిసు అను హోటలులో సిమ్సను ఒక యువతితో నొక శయ్యాగృహమున నుండినట్లు ఇద్దరు వెయిటర్లు సాక్ష్యమిచ్చిరి. కోర్టువారు సాక్ష్యమును నమ్మిరి కడచిన అక్టోబరు 23వ తేదిని విడాకులకు "నీసీ డిక్రీ" ఇచ్చిరి. అనగా పై సంవత్సరము ఏప్రిలు 27వ తేదికిగాని ఈ డైవోర్సు స్థిరపడదు తదనంతరము ఈమె తన యిష్టప్రకారము

ఎవరినైనను పెండ్లాడవచ్చును. ఈలోపుగ వివాహము నిషిద్ధము. ఎడ్వర్డురాజును వివాహమాడ నిశ్చయించుకొనినను, ఏప్రిల్ 27 అనంతరముగాని ఈమధ్య గాదు, కాని ఈ మధ్యలో వివాహ ప్రయత్నములు గావించుకొనుట నేరము గానేరదు. ఎడ్వర్డురాజును, మిస్సెసు సిమ్సనును ఒండొరులు ప్రేమించుకొనిన మాట నిశ్చయము. పెండ్లిమాటలు కూడ జరిగినట్లే ఎంచుకొనవలసి యుండును. కాని బ్రిటిషు రాజు ఎంత స్వతంత్రుడైనను, ఆచార విరుద్ధముగ పెండ్లి చేసుకొన వలసి వచ్చినప్పుడు, మంత్రుల యనుమతిని బడయక తప్పదయ్యెను రాజ వంశమునకు జెందని వాలిసు కుమారి బ్రిటిషురాణి యగుటకు ఎడ్వర్డురాజునకే ఇష్టమున్నట్లు కనబడదు. కావుననే ఆమెను "మార్గనాటికు" వంటి గాంధర్వ వివాహము చేసికొనెదనని బాల్డివిను ప్రధానితో ఆరువారముల క్రిందట సూచించి నట్లు తెలియుచున్నది. మార్గనాటికు పెండ్లి అనగా, భార్య రాణి కానవసరము లేదు ఆమెకు గలిగిన సంతానమునకు వారసత్వముండదు. రాజు రాజే. ఆమె ఎప్పటివలె కామనరే. ఉభయులును భార్యాభర్తలు. రాజకీయ సంబంధమైన పబ్లిక్కు వ్యవహారములతో నామెకెట్టి సంబంధము ఉండరాదు. ఎడ్వర్డు అనంతరము వాని సోదరుడు వారసుడగును. ఇట్టి మినహాయింపులతో ఎడ్వర్డురాజు వాలీసుకుమారిని వివాహమాడ గోరెను. కాని బాల్డివినుప్రధాని అందుకంగీకరించ లేదు.

బ్రిటిషురాజు తానెవరిని వివావాము చేసికొనినను ఆమె తప్పక రాణి అయితీరును. అది శాస్త్రసిద్ధము. ఎడ్వర్డురాజు ఈ నియమమునకు మినహాయింపు గోరునెడల, అందునిమిత్తము వేరుచట్టము చేయవలసియుండును. బ్రిటిషు సంప్రదాయ విరుద్ధమైన చట్టమును జేయుటకు మంత్రులంగీకరించుట లేదు. మతాచార్యులును క్రొత్త చట్టము చేయుటకు సమ్మతింప జాలరు. రాజు మిస్సెసు సింప్సనును వివాహమాడునా, ఆమె రాణి కాకతప్పదు. ఆమె రాణియగుటకు ఇష్టము లేదా, తాను రాజ్యమునైనను వదలుకొనవలెను. లేదా వివాహమునైనను మానుకొనవలెను. ఇదియ నేడు రాజుగారిని. బ్రిటిష మంత్రులను ఎదుర్కొను చున్న విషమ సమస్య రాజు యావజ్జీవము బ్రహ్మచారిగ నుండవచ్చును వెనుక

ఎలిజబతురాణి అవివాహితగనే ఉండెను. విక్టోరియారాణి వివాహమాడినను అల్బర్టు రాజుగ నంగీకరింపబడలేదు. తాను రాణిఅయినను. ఆమెభర్త రాజుగ నెంచబడకుండెను కాని రాజుభార్య మాత్రము రాణి కాకతప్పదు. ఇట్లయినచో, మిస్సెసు సిమ్సనును ఏల రాణిగ భావింపరాదు. అని ప్రశ్నించవచ్చును కాని ఆమె రాజవంశమునకు జెందినది కాదు. అమెరికను యువతి. తాను వదలివేసిన భర్తలింకను సజీవులై యున్నారు. అట్టి సాధారణస్త్రీ రాణిగ పరిగణింపబడుటకు బ్రిటిషువా రంగీకరించుటకు జంకెదరు. ఎడ్వర్డురాజు సహితము జంకు చూపు చున్నట్లు ఎంచవలసి వచ్చుచున్నది.

ఇక గత్యంతరమేమి ? ఎడ్వర్డురాజు ప్రజానురంజకడు. ధనికులను కంటెగూడ బీదజనులుండు తావులకు బోయి, వారి కష్టనిష్ఠురముల నెక్కువగ నారసి వచ్చుచుండును. మిల్లులలో బనిచేయు కర్మకారుల బసలకు బోయి వారి పరిస్థితులను బరిశీలించుచుండును. వీరి యాంతరంగికాభిప్రాయములు సోష లిజము సిద్ధాంతానుగుణము లైనవను అనుమానము గూడ కలదు. ఇట్టి రాజు నెడల జనసామాన్యమున కెక్కువ భక్తివిశ్వాసము లుండుట సహజము. పై మేనెలలో పట్టాభిషేక మహోత్సవము జరుపుటకు సామ్రాజ్యము నందంతట అపూర్వములైన ప్రయత్నములు గావింపబడుచున్నవి. ఇట్టితరి ఎడ్వర్డు తన రాజ్యాధికారమును తన సోదరునకు సంక్రమింపజేసి, పరదేశముల పాలగుట కెవరు ఒప్పుకొనెదరు ? కాని రాజు తాను వలచిన యువతిని వివాహమాడకుండ జేయుట ఏటి న్యాయమని కూడ ప్రజలు సహజముగ నాలోచించెదరు. రవి అస్త మింపని అఖండ బ్రిటిషు సామ్రాజ్యాధిపతికి తన యిష్టప్రకారము పరిణయ మాడుటకు స్వేచ్ఛ యుండవలదా? కాలములు మారినవి. సాంఘిక వ్యవస్థలు పరివర్తనము నొందుచున్నవి. వ్యక్తిస్వాతంత్ర్యము గ్రొత్తపుంతలు త్రొక్కు చున్నది. ఇట్టి పరిస్థితులలో రాజును పూర్వాచారములకు బంధించియుంచుట సమంజసమా? సామాన్య పౌరునకు గల స్వేచ్ఛయైనను రాజున కుండవలదా? డైవోర్సు చేసికొనిన స్త్రీని వివాహమాడుట బ్రిటిషుధర్మశాస్త్రు విరుద్ధముకానప్పుడు, రాజు విషయములో మాత్రమీ సందర్భము వెగటుగనె ఛదగునా? ఈ మొదలగు

చర్చలు బయలుదేరుచున్నవి. ఎడ్వర్డుగారి హృదయాంతరాళమున నేడెట్టి భావ తరంగములు లేచిపడుచున్నవో ఎవరు చెప్పగలరు? ఒకవైపున వాలిసు కుమారికి మాటయిచ్చినాడు. ఇంకొక ప్రక్కను తనమంత్రులు పరిణయమున కంగీకరించుట లేదు. రాజునకు శాస్త్రతః సర్వాధికారము గలదు. మంత్రులను బర్తరఫ్ చేయ వచ్చును. క్రొత్త మంత్రులను నియమించవచ్చును. కాని, ఇప్పుడధికారములో లేని లేబరుపార్టీవారు కూడ బాల్డివిను ప్రధానితో నేకీభవించి యున్నయెడల, క్రొత్త మంత్రివర్గ మేర్పడ జాలదు. అప్పుడు పార్లమెంటునే విచ్ఛిన్నము చేయవచ్చును కాని పార్లమెంటు అనుమతిలేనిది పన్నులను విధించుటకు వీలు లేదు. పన్నులు లేనిది ప్రభుత్వము సాగదు. కావున నేటి పార్లమెంటును విచ్ఛిన్నము చేసినను తిరిగి యెన్నికలను జరపక తప్పదు. క్రొత్త పార్లమెంటుకూడ నీ పరిణయమున కిష్టపడని యెడల, ఏమగును? తాను రాజ్యభ్రష్టుడు కాక తప్పదు. బహుసంకట సందర్భ మేర్పడినది. ఈ చిక్కులోనుండి తప్పించుకొనుటకు ఒకటే సులభో పాయము గలదు. మిస్సెసు సింప్సను ఈ సందర్భములో పరిణయ వాగ్దానమును ఉపసంహరించుకొనిన యెడల, చిక్కు దానియంతట నదియే తీరిపోవును. మిస్సెసు సిమ్సను ఇప్పుడు బ్రిటిషురాజ్యములో లేదు. ఫ్రాన్సులోని దక్షిణభాగ మునకు బోయి యున్నది.ఎడ్వర్డు రాజుగారి అంతరంగిక సహవాసి అయిన బ్రౌన్ లోన్సు ప్రభువు ఆమెవెంట నున్నాడు ఎడ్వర్డుగారి రాజ్యాధికారమునకు భంగము కలుగునంతటి చిక్కు వచ్చిన యెడల,ఎడ్వర్డు తనను పెండ్లాడవలసిన నిర్బంధము లేదని యామె కంఠోక్తిగ బల్కినట్లు బ్రౌన్ లోన్సు ప్రభువు ప్రకటించినాడు. ఈ ప్రకటనను బట్టి మబ్బులు విచ్చి పోవుచున్నట్లెంచవచ్చును. ఈ ప్రకటనకు దోడుగ మరియొక వార్త కూడ ప్రకటించ బడినది. మిస్సెసు సిమ్సను లండనులో తనకు గల భవనమును విక్రయింప నిశ్చయించు కొనెనట ఈ విక్రయదస్తావేజు వ్రాసి యిచ్చుటకు, తన సొలిసిటరును, గుమాస్తాను లండనునుండి పిలిపించుకొని నట్లును, వారకస్మాత్తుగ బహురహస్యముగ ఆకాశయానముపై ఫ్రాన్సులో దిగినట్లును పత్రికలు చాటుచున్నవి. ఈ సందర్భముల నన్నింటినిబట్టి చూచిన యెడల మిస్సెసు సిమ్సను తిరిగి ఇంగ్లాండునకు వచ్చు భాగ్యమున్నట్లు గనపట్టదు.

లేనియెడల, లండనులోని స్వగృహము నమ్ముకొనవలసిన పని యేమి? ఈమె తిరిగి ఇంగ్లాండునకు రాకూడదను నిషేధము శాస్త్రతః లేకపోయినను, అంతటి పని జరిగినదేమో యని తలంచవలసి వచ్చుచున్నది. మిస్సెసు సిమ్సను అకస్మాత్తుగ ఇంగ్లాండునుండి ఫ్రాన్సుకు బోవుటయు, లండనులోని స్వగృహమును అమ్ముకొనుటయు, ఎడ్వర్డురాజునకును వాని సింహాసనమునకును మధ్య తాను అడ్డము రానసియు– తనను వివాహము చేసికొనవలసిన నిర్బంధము లేదనియు– మొదలగు ప్రకటనలు యాదృచ్ఛికములు కాజాలవు. ఇవి యన్నియు మంత్రుల రహస్యాలోచనలతో జరిగియుండును. ఈ వివాహ సంబంధమే తప్పిపోయినయెడల, ఈమధ్య వచ్చిన చిక్కు– దానియంతట నదియే తీరిపోయి నట్లెంచవలసి వచ్చును. కాని ఎడ్వర్డు ప్రభువు రాజ్యపదవికొరకు, తాను వలచిన పడతిని నిరాకరించునా? దుర్భరము! రాజ్యమా? రమణియా? లోకము ప్రత్యుత్తరమునకై నిరీక్షించుచున్నది రమణియే యని వాని సమాధానము?

కృష్ణా పత్రిక
డిశంబరు 12వ తేది, 1936 సం॥

# ఢిల్లీ శాసనసభ

ఈ సభనుండి క్రొత్త ధ్వనులు వినబడుచున్నవి! నిద్రనుండి లేచిన సింహమువలె ఘీంకృతులు సలుపుచున్నదే! కూసము విడిచిన త్రాచువలె బుసలు కొట్టుచున్నదే! ఏమి? క్రొత్తరక్తము పట్టెనా? క్రొత్త బాధ్యతలు కలిగెనా? లేదే. ఏ చట్టముక్రింద వెనుకటి సభ పుట్టెనో, ఆ చట్టముక్రిందనే యీ సభయు ప్రభవించెను. వోటర్లు వెనుకటివారే ప్రతినిధుల సంఖ్యయు నంతియే. వైస్రాయిగారి నిరంకుశాధికారము జెక్కు చెదరలేదే అయినను, సభామందిరములలో నిదివఱ కెన్నడును వినని పలుకులు, కనని కట్టడులు, బయలుదేరుచున్నవి! పూర్వము శాసనసభ్యుల వేషమే వేఱుగ నుండెడిది. నిగనిగలాడు సీమఉన్ని దుస్తులు, తళతళ మెరయు బూట్సులు, మెడచుట్టు రంగురంగుల త్రాళ్ళబిగింపులు, జేతులపై పెళపెళలాడు షర్టుకప్పులు — ఆ వేషము స్వదేశమునకుగాని, విదేశమునకుగాని సంబంధింపక, కేవల మంతరాళమున వ్రేలాడు ఒక విచిత్రజాతిని సూచించుచుండెడిది. స్వదేశముయొక్క చిహ్నము, మఱుగుజేయుటకు వీలులేని ముఖమండలమునందు గనుపడవలసినదేకాని, వారి వేషభాషలయందించుకేనియు గోచరమయ్యెడిది కాదు. నేటికిని ఆ సంప్రదాయస్థులు కొందఱు శేషించియున్నను, మొత్తముమీద నా నవనాగరిక వేషధారణము మృగ్యమైనది. ఎప్పుడైన నీ సభామందిరములో మోటైన నాటుగుడ్డలు, తెల్లవారి కత్తిరింపులు లేని గుడ్డగుండీల జుబ్బాలు, మోకాలు దిగీదిగని జామార్లు, స్టాకింగులచేగాని బూట్సులచేగాని అలంకరింపబడని నల్లటి కాళ్ళు, పాదములు— గోచర మయ్యెడివా? ఎంత సాహసము! గాంధిమహాత్ముని యనుగ్రహ ప్రసాదమువలన నేడు దాస్యసూచకములగు విదేశపు దుస్తులు సభ్యులలో జాలవఱకు అంతర్ధానమైనవి. కద్దరు వస్త్రధారణముచే, సభ్యు లధమపు వేషము నందైనను దేశీయుల ప్రతినిధులను భావము వ్యక్తమగుచున్నది. ఏ పల్లెటూరు రయత్తైనను వెనుకటి సభను జూచియుండినయెడల నది తన దేశముదే యని

ఎంచుటకు శక్యము కాకుండెడిది పండిత మోతీలాల్ నెహ్రూగారు వెనుకటివలె ప్యారిసులో కుట్టించి తెప్పించిన ఫ్లానల్ సూట్లను ధరించి కూర్చుండినయెడల, నాతడు సోదర దేశీయుడైన ప్రయాగపండితుడె యని ఆ పల్లెటూరురయతు గుర్తింప గలిగెడివాడా? అసంభవము. ఇప్పుడన్ననో తన మోటుగుడ్డలనే, తాను ధరించిన రీతినే, పండితునియందు గాంచినప్పుడు వానియందొక సన్నిహిత బాంధవ్య మేర్పడును కద్దరు వేషమున దేశముయొక్క పరిశ్రమ, దేశము యొక్క దారిద్ర్యము, దేశముయొక్క నిరాడంబరత్వము వ్యక్తమగును. అందు ఆత్మగౌరవము కలదు, కార్యదీక్ష కలదు, స్వాతంత్ర్య దీప్తి కలదు. హాట్లు బూట్లవారి ముందర కద్దరుధారులు వరుసగ నిలువబడినప్పుడు, అందు గనుపడు ప్రభేదము బహుచిత్త సంస్కారకమైనది. స్వ పర భేదమే కాక, భారతజాతి నంతను గలవర పఱచుచున్న ప్రాచీప్రతీచీ సంఘట్టనము గోచరమగును. నేటి శాసనసభయం దిట్టి క్రొత్తరూప మేర్పడుట మహద్విషయము.

ఈ శాసనసభలు విదేశ వ్యవస్థలనుటకు సందియము లేదు. దేశమును దమ రాజ్యాంగమునం దిమిడ్చి బంధించుట కేర్పడిన తంత్రములనుట నిస్సంశయము. ఎట్టి చిత్తసంస్కారి యైనను సభాద్వారము దాటి, లోపలకు బోవుసరికి జిత్తవిభ్రమము కలిగి తీరును. అక్కడి గాలియట్టిది. అచ్చటి వ్యామోహ మట్టిది. పూర్వముండిన సంకల్పములు, ఉత్సాహములు, అభిలాషలు మాఱిపోవును. శాసన సభలపై నొక మమకార మేర్పడును. తమ చాకచక్యము చేతనే రాజ్యాంగ చక్రము తిరుగుచున్నట్లుగ భ్రమ కలుగును. తాముకూడ ప్రభుత్వములో నొక ప్రధానాంశమను అభిప్రాయము కలుగుటయేకాక, దేశముయొక్క భావ్యభివృద్ధికి తామే కారకులమను స్వాభిమాన ముదయించును. అంతటితో శాసనసభ బయట జరుగు ఉద్యమములయెడల నిరసనము, అసహనము బుట్టును. బయటి విమర్శకులను కర్తవ్యాకర్తవ్య మెఱుగని మూఢులనుగ నెంచుట తటస్థించును. ఇవ్విధమున గ్రమక్రమముగ సభ్యులు దేశీయులనుండి దూరస్థులై అధికారవర్గమువారి యొడిలోనికి జేరుదురు. ఈ మార్పు ఒక్క క్షణములో జరుగునది కాదు. ఒక

సందర్భములో నేర్పడునది కాదు. ఎన్నికల హడావుడి అణగిన పిమ్మట, సభ్యతా గౌరవమును బొందిన వెనుక, సభామందిరములో నున్నత పీఠముల గూర్చుండి, అధికారవర్గమువారి ముఖమండలములందలి వికాస వికారములను గాంచుచు, వారితోడ విందులను, సరస సల్లాపములను, గావించుచు, వారి యను గ్రహ నిగ్రహములకు లోనై చెలిమిని సంపాదించిన యనంతరము, రాజకీయ విషయములను బరికించు దృష్టి పూర్తిగ మాఱిపోవును. అంతవరకు స్వాతంత్ర్య వాదిగను, స్వదేశీయుడుగను విమర్శించుచున్నవాడిప్పుడు కేవలము పరిపాల కుల దృష్టితో విమర్శింప జూచును. ఈ మార్పు స్వార్థముతో గూడియుండ నవ సరము లేదు. కాపట్యముండ నక్కరలేదు. శ్రీనివాసశాస్త్రి వంటి మహనీయుడు స్వార్థపరుడని ఎవరనగలరు? కాని ఈయన సభ్యుడై, రాయబార పదవులను సహితము స్వీకరించిన పిమ్మట, బొందిన మార్పు ఆశ్చర్యకరము. గవర్నరులును వైస్రాయిలును ఎంత బాధ్యతతో మాట్లాడుచున్నట్లు కన్పట్టుదురో అంత బాధ్య తతోనే శాస్త్రిగారు కూడ మాట్లాడుదురు. కేవలము కార్యనిర్వాహక సభ్యులైన తరువాత బొందు మార్పును గూర్చి వేఱుగ జెప్పనక్కఱయే లేదు. ఇందుకు సింహా, సి. పి రామస్వామిఅయ్యరు, స్రపూ, నరసింహశర్మగార్లే నిదర్శనము. రాజకీయ జీవితములో మూడు దశలు కనుపట్టును. మొదట కాంగ్రెసూవాలా. తరువాత శాసనసభ్యుడు. మూడవది ప్రభుత్వోద్యోగి. కాంగ్రెసులో నున్నప్పుడు కేవలము స్వాతంత్ర్యవాంఛలు అగ్నికణముల వలె బయల్వెడలుచుండును. శాసన సభ్యుడైన పిమ్మట నా కణములు చల్లారును. విమర్శనలు బాధ్యతతో గూడి, దేశీయుల యొక్కయు, పరిపాలకుల యొక్కయు మధ్య రస్తాదీయుటకు ప్రయ త్నించును. ప్రభుత్వోద్యోగి అయినతరువాత పరిపాలకుల మార్గమునే సమర్థించి బలపఱచును, శాసనసభ లింతకాలము గవర్నమెంటుఆలయము ముందు గట్ట బడిన గాలిగోపురము వలె ప్రవర్తించుచుండె ననుట నిశ్చయము.

నేటి ఢిల్లీసభకూడ నట్టి గాలిగోపురముగానే యుండునా? అప్పుడే జ్యోతి షము జెప్పుటకు వీలు లేదు. దేశములోని పరిస్థితులు మాఱినవి. ఆసహా యోద్యమము యొక్క శాసనసభా బహిష్కారము శాసనసభల గౌరవమును-మంట

గలిపినది అంతకు బూర్వము శాసనసభ్యులనిన "గౌరవనీయులు" మాననీయులు జిల్లా కాన్ఫరెన్సులకు, రాజధాని కాన్ఫరెన్సులకు, వివిధ సంఘముల వార్షికోత్సవములకు, సామాన్యముగ నే సభ జరిగినను ఆధిపత్యము వహించుటకు ఆనరబిల్సు గోరబడెడివారు. సామాన్యముగ వీరే సభావేదికల నలంకరించుచుండెడివారు అగ్రపీఠములు వారికి రిజర్వు అయియుండెడివి. వారి మాటయే ప్రమాణము వారి ఉపన్యాసములు పవిత్రములు దొరతనమువారికి దేనిని తెలియబఱచవలసినదు, "ఆనరబిల్సు" మధ్యవర్తులుగ నుండెడివారు. వారి శిఫారస్సు దెచ్చుకొనిన గొంతవఱకు గార్యసాఫల్య మగుచుండెడిది. లాయరు ఆనరబిల్ అగుటతోడనే ఎక్కువ ధనము నార్జించుట కవకాశము కలిగెడిది. మ్యాజిస్ట్రేట్లు, కలెక్టర్లు, రివెన్యూబోర్డు మెంబర్లు, ఎగ్జిక్యూటివు కౌన్సిలర్లు మొదలగు అధికారులయొద్ద నే పనియైన గావలసివచ్చిన యెడల "ఆనరబిల్సు"ను నియమించుకొనుట యాచారమైనది. వారి ఫీజులుకూడ నట్టి సందర్భములో హెచ్చు చేయబడెడివి. ఇదంతయు మొన్న మొన్నటివఱకు జరుగుచుండిన విషయము కాని అసహాయోద్యమము వచ్చినసిమ్మట శాసనసభ్యుల మరియాదలు పోయినవి వీరి మొగము జూచువారు లేరు. దేశీయ సభలలో వీరికి తావు లేదు. వీరి హితోపదేశముల నామోదించువారు లేరు. పైగ శాసనసభ్యులనిన బిరుదాంకితులతో బాటుగ ననుమానస్థులుగ నెంచబడుచుండిరి. శాసనసభలలో వారేమైన నోరాడించవలసినదే కాని బయట వారి యూరుగాని పేరుగాని లేదు. వోటర్లు వారిని నిరాకరించిరి. ప్రజలు వారిని బహిష్కరించిరి. ఎప్పుడు వీరికి ప్రజలలో బలుకుబడి పోయినదని అధికారులు గ్రహించినారో, వారును వీరిని మన్నించుటకు మానుకొనిరి. అధికారులు తమ రాజ్యాంగమును బ్రజలలో బలపరచుటకు శాసనసభ్యులను దమ సాధనములనుగ నుపయోగించుకొనెడి వారు. ఎప్పుడు వారట్టి సాధనములుగ నుపయోగము కాజాలక పోయిరో, వారి ప్రయోజనమే పోయినది. శాసనసభా బహిష్కారము వలన, శాసనసభలు నిర్మానుష్యములు కాకపోయినను, నిర్జీవములును, గళావిహీనములును నిస్సారములును అయినవని ఒప్పుకొనక తప్పదు. ఇట్టి సందర్భములో ఢిల్లీ సభకు నేడు వచ్చిన గౌరవమేమి?

శాసనసభా బహిష్కారమునకు జయప్రదముగ దోడ్పడిన అసహాయవాద ప్రముఖులిప్పుడు స్వరాజ్యపక్షము పేరున దిరిగి శాసనసభల కెక్కుటవలననే వీనికి గొంత బలము, గౌరవము జేకూరినది. కాని వీరుకూడ వెనుకటి సభ్యుల వలెనే మోహపాశములలో జిక్కుకొని నిరర్థకులు కాగూడదా యను సంశయము కలుగవచ్చును. ఈ సంశయమును దొలగించుటకే స్వరాజ్యసభ్యులు ముందుగ గొన్ని కట్టుదిట్టములను గావించుకొని అధికార వర్గమువారి మైకముమందు తమపై బనిచేయకుండ గొన్ని తాయత్తులు, బిళ్లలు గట్టుకొనిరి. తాము కద్దరుతోనే సభ లోనికి బోవలెనను నియమ మొకటి ముందుగ జేసికొనిరి కద్దరు స్వాతంత్ర్య దీక్షకు సూచకమైనది. ఈ దీక్షావస్త్రములను గట్టుకొనునంతవఱకు సభ్యులు తమ స్వరాజ్య శపథమును మఱువజాలరను నమ్మకమును గలిగించుచున్నారు. ఇందు గొంత సత్యమున్న మాట నిజము. కాని కాషాయవస్త్రములు కపటస్వాముల కుపకరించినట్లే, కద్దరుకూడ కేవలము వేషములోనికి దిగవచ్చును. పై వేషము నకు దగిన సంయమ నియమాదులు లేనియెడల, కద్దరుయొక్క పవిత్రతకూడ బోవచ్చును. కాని స్వరాజ్యవాదులు కద్దరుతోబాటు మఱికొన్ని నిబంధనలను గావించుకొనిరి. తాము ఉద్యోగములను స్వీకరింపమని మఱియొక వ్రతమును బూనిరి. ఉద్యోగవాంఛయే మహామహులను సహితము తలక్రిందులు జేసినది. అ యొక్క వాంఛ దృశ్యాదృశ్యముగ దలలో ప్రవేశించినయెడల, నెట్టివాడైనను బదచ్యుతుడగును. చాలమంది ప్రముఖులీ మోహమునకు వశులై దేశశత్రువులైరి. ప్రస్తుతము సభ్యులను మోహపెట్టగల పదవులెన్నియో నేడు కల్పింపబడినవి. మంత్రి పదవులు, ప్రెసిడెంటు పదవులు, సెక్రటరీ పదవులు, ఎగ్జిక్యూటివు కౌన్సిలరు పదవులు, హైకోర్టు జడ్జీ పదవులు, రాయబారి పదవులు, ఎన్నో క్రొత్త క్రొత్త పేరులతో, ఎన్నో విధములుగ గల్పింపబడుచున్నవి. ఇవి సభ్యుల నన్ని వైపుల జుట్టుకొని మోహాంబుధియందు బడవైచుటకు జూచుచుండును. ప్రజా ప్రతినిధు లైనవారు, స్వరాజ్య సమరము పూర్తియగువఱకు వీరులవలె బోరాడ దలచినవారు"ఉద్యోగములను, స్వీకరింపమని వ్రతము-బూనుట శ్రేయస్కరము.

ఉద్యోగమోహమే యింతకాలము శాసనసభలకు జెడ్డ పేరు తెచ్చినది. స్వరాజ్య పక్షపు సభ్యులు ఉద్యోగ నిరాకరణ దీక్షావలంబకు లగుటచేత శాసనసభలకు దిరిగి కొంత గౌరవము కలుగగలదు. దీనితోబాటు ప్రయాణపు భత్యములను గూడ బుచ్చుకొనకుండుటకు అంగీకరించిరి. కట్టుకొనినవి దీక్షావస్త్రములు. ప్రయాణపు ఖర్చులు సర్కారు బొక్కసమునుండి పుచ్చుకొనరు. ఉద్యోగములను స్వీకరింపరు. ఈ నియమత్రయమును సాధన చతుష్టయములోని ఫలభోగ విరాగము వంటిదని చెప్పవచ్చును. ఈ మూటి నవలంబించు నంతకాలము స్వరాజ్య సభ్యుల శీలమునందు గౌరవముండును. వీరి మాటలలో బవిత్రత యుండును, వారి తీర్మానముల వెనుక శక్తి యుండును.

ఇది చాలదు. నియతి సాధనమేకాని సాధ్యము కాదు. నియతివలన గలుగు శక్తికి బ్రయోజనమును గల్పించవలెను. స్వరాజ్యసభ్యు లిందునిమిత్తము ఒక పతకమును వేసిరి. శాసనసభలో బ్రధానముగ రెండు కక్షలు కలవు. ఒకటి అధికార కక్ష, రెండవది ప్రజాకక్ష. ఒక స్వరాజ్యమునందీ రెంటికిని ఐక్యత కలుగునుగాని ప్రస్తుత రాజ్యాంగ విధానము ప్రబలుచున్నంత కాలము వీనికి సామరస్యము కుదరదు. అధికార కక్షకు లోబడుటయే మితవాదు లింతకాలము కల్పించుచున్న సామరస్యము. స్వరాజ్యవాదు లిప్పుడు ప్రజాకక్షగనే శాసనసభలో బ్రవేశించినయెడల ఐక్యతకు అవకాశము లేదు. సామరస్య మసంభవము. వారైనను వీరికి లోబడవలెను, వీరైనను వారికి లోబడవలెను. ఈ రెంటికంటె గత్యంతర మెక్కడ? కనుక సంఘర్షణ తప్పదు ఈ సంఘర్షణకొఱకే స్వరాజ్య సభ్యులు శాసనసభలోనికి బ్రవేశించిరి. ఈ సంఘర్షణవలన లాభము కలదా యను ప్రశ్న వేఱు. రాజకీయ శకట మింతకాలము మెల్లగ గదలిపోవుచున్నది. అప్పుడప్పుడు చక్రములలో గొంత కిఱ్ఱుశబ్దము పుట్టినను. కదలికకు బ్రతిరోధ మేమియును లేదు. శాసనసభా చరిత్రయందు గోపాలకృష్ణ గోక్లేగారి ప్రబల వివాద సందర్భమును మఱువజాలము. కర్జను ప్రభువుతో గోక్లే మహాశయుడు

పట్టిన కుస్తీ పట్లు చరిత్ర ప్రసిద్ధములు కాని ఆ వివాదము లెంతవఱకును రథ చక్రములలో జమురు పోసి, రథచలనమును సులభసాధ్యముగ చేయుటకేకాని, రథమును వశపరచుకొనుటకుగాని, రథము నాపుటకుగాని కాదు. ప్రస్తుతము స్వరాజ్యవాదులు తలపెట్టిన సందర్భము వేరు. రథమును వశపరచుకొనవలెను. లేదా అటకాయించవలెను. ఇది ప్రస్తుత సంఘట్టనము ఈ సంఘట్టనము ప్రారంభమగుట చేతనే నేడెల్లరి దృష్టియు తిరిగి శాసనసభపై వ్రాలినది, శాసన సభలలోని తీర్మానములును ఉపన్యాసములును, పూర్వపు ధోరణివి కావు. కాంగ్రెసు మండపమున నెట్టియుద్బోధలు, ఎట్టి ఖండనలు, ఎట్టి బెదిరింపు లింతకాలము విన పడుచుండెనో, అట్టివే నేడు రాజసభలో ప్రతిధ్వనించుచున్నవి. ఈ కారణముచేతనే శాసనసభకు క్రొత్త రక్తము పట్టినట్లు కన్పట్టుచున్నది,

పూర్వమెప్పుడు పండిత మోతీలాల్ నెహ్రూ, మాలవ్య, పటేల్, మొదలగు స్వరాజ్యసభ్యు లిప్పుడు గావించిన ఉపన్యాసములను వింటిమి? శాసనసభలలోని ఉపన్యాస సంప్రదాయము వేరుగ నుండెడిది ఎంతవఱకును బ్రిటిషు రాజ్య తంత్రజ్ఞుల యుదార వాగ్దానములు సంస్మరింప బడుచుండెడివి విక్టోరియా మహారాజ్ఞి యొక్క ప్రకటనను వేదప్రమాణముగ ఘోషింప బడుచుండెది. రాయల్ కమిషన్లవారు వ్రాసిపోయిన శిఫారస్సు లెత్తిచూప బడుచుండెడివి. బ్రిటిషు జాతియొక్క న్యాయబుద్ధి, సహజౌదార్యము మొదలగు గుణగణములు ప్రశంసింప బడుచుండెడివి. దేశీయులు క్రమక్రమముగ "బ్రిటిషు కేరక్టర్" అలవడుచున్నదని కడు కృతజ్ఞతతో వొప్పుకొనుచుండెడివారు పరీక్షాధికారి ఎదుట విద్యార్థి చేతులు కట్టుకొని యెంత వినయ విధేయతలతో సమాధానము పలుకుచుండునో అంతకంటె నెక్కువ విధేయతను జూపి, వారి విశ్వాసమునకు బాత్రులగుటకు సభ్యులు ప్రయత్నించుచుండెడివారు. అంతటితో జాలక, సభ్యులు బయటి యాందోళకులు పూడిపోవునటుల వారిపై తట్టలకొలది దుమ్మెత్తి పోసెడివారు. రామదాసు ద్వారకదాసుగారు నాన్-కో - ఆపరేటర్లను శాసన సభలో నిలుచుండి తిట్టిన తిట్లు యింకను ఆ గోడలమధ్య గింగురు మనుచునే యున్నవి. అధికారులును చేత బెత్తము పుచ్చుకొని సభ్యులకు శ్రద్ధాభక్తులను

గలుపుచుండెడివారు. గవర్నమెంటుసభ్యుడు మహాత్ముని నోటినిండ తిట్టుచున్న ప్పుడు సభ్యులు నోరు మూసుకొని ఎంత సహనముతో ప్రవర్తించినది యెవరు మఱువగలరు ? ఆ దినములు, సందర్భములు గతించినవి. స్వరాజ్యవాదు లిప్పుడు ప్రతిఘటన నిమిత్తము సభామందిరమున జేరిరి. గతవార మంతయు జరిగిన ఉపన్యాసముల ధోరణి కేవలము క్రొత్తపక్కి ననుసరించి యున్నది. ఏ సభ్యు డును, తుదకు మితవాదులు సహితము, మాగ్నాచార్టా పేరెత్తలేదు. రాజప్రకటన లను సంస్మరింపలేదు. మాంటేగ్యూకు కృతజ్ఞతను తెలుపలేదు. పూర్వమిత్రులగు లిబరల్ పార్టీవారి నభినందించలేదు. బ్రిటిష్‌వారి ధర్మబుద్ధిని శ్లాఘించలేదు. బ్రిటిష్‌వారు దేశీయులకిచ్చిన యోగ్యతా ప్రత్యములను బఠించలేదు. ఎల్లరును స్వయంనిర్ణయ సూత్రప్రకారము స్వరాజ్యవిధానము నుపక్రమించుటకు దగిన తరుణము వచ్చినదని ఘంటాపథముగ జాటిరి. అప్పుడప్పుడు సభ్యులలో కొందరికి బూర్వస్మృతి కలుగుచు వచ్చినను, మొత్తముమీద వెనుకటి స్తోత్ర పాఠములను, విజ్ఞప్తులను, విరమించుకొనిరి. తుదకు సర్ శివస్వామి అయ్యరు గారు సహితము నెహ్రూగారి తీర్మానమునకు బ్రతికూలముగ వోటిచ్చినను, సైన్య విషయములో దేశీయులకు ప్రాముఖ్యము నియ్యనియెడల, బ్రిటిష్ సామ్రాజ్యమునకు ముప్పు వాటిల్లునని స్నేహపూర్వకముగ తెలియజెప్పెను.

మోతీలాల్ నెహ్రూగారి తీర్మానము కోరినది రాజ్యాంగ సంస్కరణములు కావు. క్రొత్త అధికారములు కావు. క్రొత్త యుద్యోగములు కావు ఈ యుప న్యాసములలో రాజ్యాంగ విమర్శనమే లేదని చెప్పవచ్చును. పూర్వము రాజకీయ పరిపాలనమునందు లోపములను జూపి తన్నివారణోపాయములను గనుపరచుట యాచారమైనది. ఆ సందర్భములో గవర్నమెంటువారు రాజ్యాంగానుభవము గలవారగుటచే నా లోపములను సమర్థించుకొనుట కవకాశ ముండెడిది ఇప్పుడు వచ్చిన సందర్భమే వేరు. స్వరాజ్యవాదు లిప్పుడు శాసనసభను చట్టములను గావించుట కుపయోగించుట లేదు. దానిని దమ రాజకీయాందోళనమునకు సాధనముగ నుపయోగించుకొన మొదలిడిరి. అందుచేతనే నిర్జీవమై యున్న శాసన సభకు గ్రొత్త జీవము వచ్చినట్లైనది.

ఇంతకాలము ప్రకాశముగనో అప్రకాశముగనో, బ్రిటిషు వారే హిందూ దేశము యొక్క రాజకీయ నిర్మాతలను సిద్ధాంతము ఒప్పుకొన బడినది. శాసన సభయొక్క సంప్రదాయమె యట్టిది బ్రిటిషువారు గురువులు, యజమానులు, దాతలు. హిందూదేశ ప్రజలు శిష్యులు, దాసులు, ప్రతిగ్రహీతలు బ్రిటిషు వారి చేయి పైది, దేశీయుల చేయి క్రిందది. వారిచ్చుటలోను, వీరు పుచ్చుకొనుటలోను వారు నేర్పుటలోను, వీరు నేర్చుకొనుటలోను, వారు విధించుటలోను వీరు నిర్వర్తించుటలోను గమనికలు మారవచ్చునేమో కాని, అసలు తారతమ్యము మాత్రము సుస్థిరమై యుండెను ఇప్పుడు వచ్చిన సందర్భ మిదికాదు. కేవలము దానికి విరుద్ధమైనది అది స్వయంనిర్ణయ సూత్రము. "స్వరాజ్యమును మేము పొంద నిశ్చయించుకొంటిమి. మా ప్రతినిధులు సమావేశమై మా దేశమున కనువగు రాజ్యాంగ క్రమమును నిర్ణయించెదరు దానిని బ్రిటిషు పార్లమెంటువారు యథావిధిగ నంగీకరింపవలెను" ఇది నెహ్రూగారి తీర్మానమునకు అర్థము. ఏమి? హిందూదేశీయులు రాజ్యాంగమును నిర్మించువారా! బ్రిటిషు పార్లమెంటు దానిని శిరసావహించుటయా? ఇది యెచ్చటనైన గలదా? ఎంత వైపరీత్యము? అని హెయిలీగారే తెల్లబోయిరి. అన్నివైపుల నుండియు ప్రతిధ్వనులు వినవచ్చెను. కనడాలో అట్లు చేయలేదా? ఆస్ట్రేలియాలో అట్లు చేయలేదా? మొన్న ఐర్లాండులో గూడ నట్లు చేయలేదా? అని శాసనసభ్యులు ప్రత్యుత్తర మిచ్చిరి. కాని శాసనసభ్యులు హెయిలీగారి భీతావహము నర్థము జేసికొనలేదు. హెయిలీగారికి వలసదేశముల చరిత్ర తెలియకకాదు, వారట్లు అరచినది. హిందూదేశము కెనడావంటిది కాదు. ఐర్లాండువంటిది కాదు. అవి తెల్లవారి దేశములు- తెల్లవారు తమ రాజ్యాంగములను నిర్ణయించుకొనుటకు అర్హులు నల్లవారు కూడ నట్టి యర్హతను ప్రకటింపదగునా? యని హెయిలీగారు వెలవెల బోయిరి, డిల్లీ శాసనసభ కోరినది స్వయంనిర్ణయ ప్రకారము దేశీయుల యిష్టము ననుసరించి రాజ్యాంగము నేర్పరచుట ఇంతవరకును బ్రిటిషు రాజ్యాంగము చెప్పుచున్నది చేయుచున్నది వేఱు బ్రిటిషుపార్లమెంటే హిందూదేశము యొక్క రాజ్యాంగనిర్మాత. పార్లమెంటువారే దేశీయుల యోగ్యతాయోగ్యతలను

బరిశీలన జేసి సంస్కరణములను గావించవలెను. సంస్కరణములను ద్వరిత గతిని జేయవచ్చును, లేదా మందముగా జేయవచ్చును. కాని అధికారము వారిది. ఈ యధికారమును భారతీయులు కోరుటకంటె ధిక్కారమేది కలదు ?

ఇండిపెండెంటు పార్టీవారి తోడ్పాటును బడయుటకు, స్వరాజ్యపక్షము వారు తమ తీర్మానమును గొంత సడలించినను మూలసూత్రములో మాత్రము వారు చలింపక నిలువబడి యుండిరని ఒప్పుకొనక తప్పదు. ప్రస్తుతము దేశమునకు శాసనరీత్యా బ్రిటిషు పార్లమెంటువా రధికారులైనప్పుడు, వారు వెనుక జేసిన గవర్నమెంటు ఆఫ్ ఇండియా యాక్టును హిందూదేశ ప్రతినిధులు సూచించు విధమున మార్చవలయునని కోరుటలో స్వరాజ్య వాదమునకు విరోధ మేదియు లేదు రౌండుటేబిలు కాన్ఫరెన్సును సమావేశ పఱచుటలో గవర్నమెంటు కొంత తొందరపాటు జేయుట కవకాశము కలదు కాని ముందు హిందూదేశీయులకు రాజ్యాంగ విధానమును నిర్మించుటకు అధికారము కలదని ఒప్పుకొనిన తరువాత కదా, వారేమి చేసినను జేయుటకు ? భారతవర్షమునకు స్వయం నిర్ణయాధికారము నొప్పుకొనునంత చిత్తసంస్కారమే వారికున్నయెడల, నట్టి తొందరపాటు జేయవలసిన అవసరమును ఉండదు— బ్రిటిషు పార్లమెంటువారైనను, ప్రస్తుతము లేబర్‌పార్టీవారు మంత్రిత్వము స్వీకరించినను, హిందూదేశమున కట్టి స్వాతంత్ర్యము నంగీకరించెదరని నమ్మజాలము. సిద్ధాంతములో లేబరుపార్టీవారు ప్రతి దేశమునకును స్వయం నిర్ణయాధికారము గలదని ఒప్పుకొనినను, హిందూదేశ విషయములో ప్రస్తుత సందర్భమున నొప్పుకొనెదరా ? లిబరల్ పార్టీ వారి తోడ్పాటు లేనిది లేబరు ప్రభుత్వము సాగనేరదు. లేబరుపార్టీవా రెంత మాత్రము స్వయంనిర్ణయము నామోదింపజాలరు. ఇదికాక ఇండియా గవర్నమెంటువారు అనగా ఈ దేశములోని అధికారవర్గమువారి నోళ్లను మూయలేరు అధికారవర్గము ప్రస్తుతము కొనయూపిరితో నున్న మాట నిజము. కొనయూపిరితో నున్నప్పుడే ఇంకను జీవించవలెననెడి తృష్ణ మఱింత ప్రబలమగును అధికార వర్గమువార్లు చ్చూచ్చుచు చ్చూచ్చుచు ఆత్మ

హత్య జేసికొనజాలరు. తమ యధికారములను గాపాడుకొనుటకు దమ యావ చ్ఛక్తుల నుపయోగించెదరు. తమ యధికారములను గొన్నిటిని ఇటు ప్రజలకు గాని, అటు పార్లమెంటునకుగాని దఖలు చేయజాలరు అట్లు చేసినయెడల వారి పని అడక త్తెరలో బడిన చెక్కవలె నలిగిపోవును. కావుననే హెయిలీగారు నెహ్రూగారి తీర్మానమును బ్రతిఘటించుచు, ప్రస్తుతపు చట్టములోని లోపములను విచారించుటకు డిపార్టుమెంటల్ కమిటీని నియమించెదమని ప్రకటించెను. ఇందు వలన గవర్నమెంటు ఆఫ్ ఇండియా యాక్టు మాఱదు. ఆ యాక్టును మార్చకుండ దానిక్రింద నెట్టి మార్పులను జేయుటకు అవసరమో దానిని అధికారవర్గమువారే రహస్యముగ విచారణ జేసి లోపములను సవరణ చేసెదరు. వారు చేయగలిగిన సవరణల నన్నిటిని జేసెదరని ఒప్పుకొనినను, ప్రస్తుత రాజ్యాంగ విధాన మేమియు మాఱదు. మరికొన్ని శాఖలు దేశీయుల పరము కావచ్చును. మినిష్టర్ల విషయము ఎలో గొన్ని రూల్సు మాఱనచ్చును. కాని అధికార వర్గమువారి నిరంకుశత్వము తగ్గజాలదు, శాసనసభ కెక్కువ బాధ్యతలు సిద్ధింపవు. శాసనసభ్యుల మొఱలకు అధికార వర్గమువారు చూపిన సానుభూతి యింతవఱకు వచ్చినది. ఈ సభ కేవలము మితవాదులదే ఆయియున్న యెడల నిందుకే వారానంద భరితు లయ్యేడి వారు. జిన్నావంటి జాతీయవాది సహితము హెయిలీగారు సూచించిన కమిటీ యొక్క వ్యాప్తిని సరిగ గ్రహింపజాలక ఇండియా గవర్నమెంటువారి నభి నందింప సాగెను. పారశీ ప్రతినిధియగు డుమేషియా పొంగిపోయెను. స్వయం నిర్ణయసూత్రమా పోయినది. గవర్నమెంటు ఆఫ్ ఇండియా యాక్టును సవరణ జేయుటయైనను లేదు ఇది యన్నిటికంటెను జివరమెట్టు. దీనికంటె నెక్కువది రాయల్ కమిషన్. బ్రిటిషు చక్రవర్తిగారు ఇంగ్లాండునుండి కొంతమంది రాజ్య తంత్రజ్ఞులను బంపవచ్చును. వారీదేశమునకు వచ్చి ప్రజలయొద్దను, అధికారుల యొద్దను, సాక్ష్యము బుచ్చుకొని, ఇండియా ఆక్టు నెంతవఱకు మార్చవచ్చునో చక్రవర్తిగారికి సలహా నిచ్చును. ఇందు మూలమున ఇండియా యాక్టు కొంత వఱకు సవరణ యగుట కవకాశము కలదు కాని వీరి విచారణ అధమము రెండు సంవత్సరములైనను బట్టును. రెండు సంవత్సరములు సాక్షివిచారణ జేసి,

అధికారులు కాదనినదానిని, దేశీయులు అవునను దానిని బోల్చి తుదకు వారు దేల్చబోవున దేదియో తెలియదు ఈ పద్ధతివలన బ్రిటిషువారి చెయి పైననే యుండును. వారే పరీక్షాధికారులను సిద్ధాంతము బలపడును. వారు చేయు పరీక్షలో దాళగలిగిన యెడల దేశీయులకు మఱికొన్ని యధికారములు ప్రసాదింప బడవచ్చును. దీనికిని స్వయంనిర్ణయమునకును జాల దూరము. నెహ్రూగారు కోరినది శాసనసభ్యులలో 76గురు బలపఱచినది, స్వయంనిర్ణయ సూత్రము. రాయల్ కమిషనుకు గూడ నొడంబడనివారు హిందూదేశముపట్ల స్వయంనిర్ణయం సూత్రమును ప్రయోగించెదరనుట వట్టి కల్ల గవర్నమెంటువారే రాయల్ కమిషనుకు ఒడంబడిన యెడల శాసనసభలో గొంత యిబ్బడి కలిగెడిది మితవాదులు కొంతవఱకు జారెడివారు నెహ్రూగారి తీర్మానమునకు 70 వోట్లు వచ్చెడివి కావు. అదృష్టవశాత్తు ఇండియా గవర్నమెంటునకట్టి బుద్ధి పుట్టలేదు డిపార్టుమెంటల్ కమిటీపై మితవాదులకు గూడ విశ్వాసము లేదు నెహ్రూగారి తీర్మానమునకు జయము కలుగక తప్పినది కాదు హెయిలీగారు సభ్యుల కట్టును బద్దలుకొట్టుటకు జాల ప్రయత్నించిరి మహమ్మదీయులను జీలదీయ జూచెను. మితవాదుల వెన్ను జరచెను స్వరాజ్యవాదుల పూర్వపు ఉపన్యాసములనుండి విరుద్ధవాక్యముల నెత్తిచూపుటకు బ్రయత్నించెను. ఏవి చేసినను లాభము లేక పోయెను దేశములో ఆత్మవంచనము చాలవఱకు బోయినది. అధికార వర్గముపై నిసుమంతయైన నమ్మకము లేదు సంస్కరణలు బూటకమను సంగతి మితవాదులకు సహితము హృద్గతమైనది. ఇక హెయిలీ ఏమి చేయగలడు? ఇండియా గవర్నమెంటు ఏమి చేయగలదు? ఇంగ్లాండుకోని మినిష్టర్లనయినను అడ్డుపడిన యెడల గొంత లాభముండెడిది. అధికార వర్గమువారు బయటి పార్లమెంటు పరీక్షకు లోబడుటకిష్టము లేదు శాసనసభ్యులకు స్వయంనిర్ణయ సూత్రమును వదులుకొనుటకిష్టము లేదు. రాయల్ కమిషను అక్కఱలేదనుటలో ఇండియా గవర్నమెంటువారును, శాసనసభ్యులును ఏకమైరి. డిపార్టుమెంటు కమిటీ మాకక్కఱలేదని శాసనసభ్యులు వెడలిపోయిరి. రెంటకుచెడిన కాన్పరెన్సు కొప్పుకొనజాలమని గవర్నమెంటువారు వెడలిరి. ఎవరింటికి వారు జనిరి మొత్తమీ యంకమైనది.

ఇక రెండవయంక మెట్లుపక్రమించును? శాసనసభ-యొక్కటి మాత్రమే. ఇక యంతయు ముందేకలదు. ఇండియా గవర్నమెంటుకాని, బ్రిటిషు మినిష్టర్లుకాని నెహ్రూగారి తీర్మానమునకు జెవియొగ్గని యెడల నిక శాసనసభ్యు లేమిచేసెదరు? మార్చి 10వ తేది వచ్చుచున్నది. అప్పుడు బడ్జెట్టు విచారణ జరుగును. స్వరాజ్య వాదుల ప్రతిఘటనా శపథమెంతవఱకు నెఱవేరునదియు నప్పుడు తేటపడును. ఇంతలో సెక్రటరీ ఆఫ్ స్టేట్సుగారు యెట్టి ప్రకటన చేయునోయని దేశమెదురు చూచుచున్నది

కృష్ణా పత్రిక
డిశంబరు 23వ తేది, 1924 సం॥

# కిలాఫత్ పతనము.

తురుష్క ప్రభుత్వమువారు కిలాఫత్ గురుపీఠమును దొలగించి తత్సంబంధీకులను దేశభ్రష్టులనుగ జేసియుండుటచే హిందూదేశములోని మహమ్మదీయులలో నసంతుష్టి బయలుదేరినది. మహమ్మదీయ మత విషయములను గూర్చి మేము విమర్శింప బూనుకొనుట సాహస మనుటకు సందియము లేదు. కాని కిలాఫత్ విషయము ప్రస్తుతము రాజకీయ సంబంధము గలిగియుండుటచే నొకింత విమర్శింపవలసి వచ్చుచున్నది. ఈ విషయమై తుర్కీ రిపబ్లిక్కు ప్రెసిడెంటగు కాజీ ముస్తాఫా కమల్‌పాషాగారు కిలాఫత్ కమిటీ కొసగిన సమాధానము మహమ్మదీయు లెల్లఱు ఆదరముతో గమనింపదగిన విషయము ఒక ఒరలో రెండు కత్తు లిముడజాలవు. తుర్కీని రెండు ప్రభుత్వము లేకకాలమున బరిపాలించుట దుస్సాధ్యము. ఒకమూల తురుష్క ప్రజలు రిపబ్లిక్కును స్థాపించుకొనిరి. దీని ప్రక్కను చిరకాలానుగతమైన కిలాఫత్ కూడ నెట్లు ప్రభుత్వము సేయగలదు ? కిలాఫత్ యనగా ప్రభుత్వమని కమల్ పాషా గారర్థము చెప్పుచున్నారు. కిలాఫత్తును దొలగింపని యెడల నది తురుష్క రిపబ్లిక్కునకు ప్రక్కలోవి బల్లెమువలె నుండునని కమల్ పాషాగారి అభిప్రాయము. కిలాఫత్తు పీఠమునుండి రాజకీయాధికారము లూండబెరకబడిన మాటనిజమే. కాని కేలిఫులు పరంపరానుగతముగ రాజవైభవము ననుభవించి యుండుటచే అప్పుడు రాజకీయాధికారములు లేకుండా కేవలము మతగురువులుగ నుండుటకు సమ్మతింపరు. ప్రస్తుతపు కేలిఫ్ కాకపోయినను వారి సంతతివారయినను దిరిగి రాజ్యాధికారమును బొందుటకు గుట్రలు బన్నుచునే యుందురు. కేలిఫ్‌గారి కుటుంబము చాల పెద్దది. ఎందరో భార్యలు, బిడ్డలు, పరివారము వారి నాశ్రయించుకొనిన పురోవర్గమెంతయో కలదు. వారింతకాలము భాగ్యభోగములతో దులతూగుచుండిరి. వారి చిత్తము శాసనముగ జెల్లుచుండెను. పీఠాధిపత్యమును రాజ్యాధిపత్యమును ఒకని యందే యుండుటచే నాతనికి గల నిరంకుశత్వ మమోఘమై యుండెనని వేఱుగ

జెప్పనక్కరలేదు. అట్టి కేలిఫ్ నేడు పించను బుచ్చుకొని కేవలము మతాచార్యుడుగ లోబడియుండుట యసంభవము. రిపబ్లికునకు ప్రతిపక్షులైన వారెల్ల కేలిఫ్ ప్రక్కను జేరి కుట్రలు బన్నుచునే యుందురు. జనసామాన్యము మూఢభక్తి గలవారగుటచే కేలిఫ్ యొక్క యుత్తరువులను శిరసావహించి రిపబ్లికుపై దిరుగుబాటు జేయుటకు దుముకుచుందురు కమల్ అనుభవజ్ఞుడు, ప్రజాస్వాతంత్ర్యవాది, కార్యదక్షుడు. ఈ జాతీయోద్ధారకుడు సంగతి సందర్భముల నెల్ల నాలోచించెను. తురుష్క సామ్రాజ్యము యూరపియనులచే 'రోగి' యని పిలువబడుచున్నది. తుర్కీ కాలాను గుణ్యమగు సంస్కరణములను జేసికొనక, నిర్జీవములై పోయిన ప్రాత కాలపు సంస్థలను బట్టుకొని వ్రేలాడుచుండుటచే దానికిట్టి చెడ్డపేరు వచ్చినది. తుర్కీ భూతలమునుండి ఊరుపేరు లేక తుడిచిపెట్టుకొని పోకుండ నిలువవలెననిన, దిరిగి నూతన జవసత్త్వములతో విలసిల్లుచు సభ్యరాష్ట్రములలో దలయెత్తుకొని తిరుగవలెననిన, ఒక్కటే మార్గము కలదు. అది రిపబ్లికు సంస్థాపనము. కమల్ షాషా రిపబ్లిక్కను స్థాపించెను. దానితోబాటు దాని సంరక్షణ మార్గములను గూడ నరయుట జాతీయోద్ధారకుని విధి. కిలాఫత్ పీఠము తుర్కీలో నున్నంతకాలము దేశమునకు శాంతికాని, జాతిలో ఐకమత్యముకాని రిపబ్లికునకు బలముగాని యుండదని కమల్ పాషా కనుపెట్టి, మహమ్మదీయ పూర్వాచారమునకు విరుద్ధమైనను కిలాఫత్తును దీసివేసెను. పూర్వోత్తర సందర్భములను దెలిసినవారు కమల్ పాషాను నిందింపజాలరు. తన దేశక్షేమమున కేది శ్రేయస్కరమని తోచెనో దానిని నిర్ణయముగ జేసెనేకాని, మతమునందు విశ్వాసము లేక కిలాఫత్తును నిషేధించలేదు. కమల్ పాషా మహమ్మదీయ చరిత్రను హృద్గతము జేసికొనిన దేశభక్తుడు. ఒక కాలములో ఇస్లాము మత సంరక్షణార్థము మహమ్మదీయ దేశములన్నిటిని ఏకఛత్రాధిపత్యముగ క్రిందకు దీసికొని వచ్చుటకై తుర్కీలో కిలాఫత్ స్థాపింపబడెనని కమల్ షాషా సమాధానము జెప్పుచున్నాడు. ఆ ప్రయత్నము సఫలము కాలేదు. తుర్కీ యొక్కటే మహమ్మదీయ దేశము కాదు అఫ్ఘనుస్థానము, పర్షియా, బల్గేరియా, పాలస్థానము సిరియా అరేబియా, అల్బేనియా, ఈజిప్టు, అర్మీనియా, ట్రిపొలీ, మొరాకో, మొదలగు

దేశములన్నియు మహమ్మదీయులతో నిండియున్నవి. ఇవన్నియు నేడు వేరు వేరు రాష్ట్రములైనవి. కిలాఫత్‌యొక్క యుద్దేశము నెరవేరలేదు. ఉద్దేశరహితమైన సంస్థ యుండిననేమి, పోయిన నేమి? అందులో తుర్కీ యశాంతికి గారణభూతముగ నుండునప్పుడు దానిని తొలగించుటలో దోషమేమి?

కాని సమస్త మహమ్మదీయులకును సంబంధించిన పీఠమును తొలగించుటకు ఒక్క తురుష్కుల కేమి యధికారము కలదని కొందరు అధిక్షేపించుచున్నారు. తురుష్కులు కిలాఫత్తును తమ దేశమునుండి పంపివైచిరేకాని దానిని బూర్తిగ నాశనము చేయలేదు. కిలాఫత్తు వారి దేశములో నున్నంతకాలము వారి దేశమునకు క్షేమము కాదని వారు నమ్ముచున్నారు. ఆ నమ్మకముతో నా పీఠమును ఆ పీఠాధిపతిని బయటకు బంపివైచిరి. వారి దేశమును సంస్కరించుకొనుటకు వారికి స్వాతంత్ర్యము లేదా? కిలాఫత్తు తుర్కీకి క్షేమకరమయినను, కాకపోయినను దానిని తుర్కీలోనే యుంచవలెనని తురుష్కేతరులు నిర్బంధించుట న్యాయమా? వారి దేశమున కేది యుపయుక్తమో దానిని వారు చేసుకొనిరేకాని, తక్కిన దేశములవారి స్వాతంత్ర్యము నపహరించలేదు. ఈ సందర్భములో హిందూదేశములోని మహమ్మదీయులు కమల్ పాషాను నిందించుట యుచితముగ గన్పట్టదు పోనీ తక్కిన దేశములవారు కేలిఫు నేల తమ దేశమున కాహ్వానించకూడదు? కేలిఫు ఇప్పుడు మహమ్మదీయులు లేని స్విట్జర్లండు రాజ్యములో తలదాచుకొని యున్నాడు. అరేబియావారుకాని, ఈజిప్టువారుకాని, ఆఫ్గనుస్థానమువారుకాని, వారిని ఆహ్వానించి తిరిగి మతాధికారిగ జేసికొనవచ్చును. అట్టి పని నెవరును జేయ సాహసించుట లేదు పైగ, ఈజిప్టుసుల్తానునో, మక్కాషరీఫునో కాబూల్‌అమీరునో కేలిఫ్‌గ జేయుటకు బ్రయత్నములు జరుగుటకు కారణమేమి? ఈజిప్టుసుల్తాను తాను కేలిఫగుటకు సమ్మతించునేమో కాని, కేలిఫును తన దేశములో పీఠమును స్థాపించుట కొప్పుకొనడు అట్లొప్పుకొనిన యెడల నెప్పటికైనను తన రాజ్యాంగమునకే ముప్పు వాటిల్లునని వానికి భయము కలదు ఈ రోజులలో రాజులను మతాచార్యులనుగ జేయుట శుభప్రదము కాదు. ఎప్పుడు రాజ్యాం

గమును మతాధికారమును గలిసియుండునో అప్పుడు నిరంకుశత్వము ప్రబలము కాక తప్పదు. ఎల్లరును స్వాతంత్ర్యమును గోరుచున్న రోజులివి. ప్రజలు పూర్వమువలె దాస్యకూపమున బంధింపబడి యుండజాలరు. మత శృంఖలములచే రాజ్యాంగమును గట్టివైచుట అనర్థదాయకము. తుర్కీ యింతకాలము అట్టి గొలుసులచే బంధింపబడి యుండుటచేతనే మృతప్రాయమై రోగి యను నామమునకు పాత్రమయ్యెను. ఈ కాలములో రాజును మతగురువునిగ జేసికొని ఏ దేశమును వృద్ధిపొంద జాలదు. మహమ్మదీయులు కేవలము మతావేశమున ఏ యమీరునో, షరీఫునో, సుల్తానునో కేలిఫ్‌గ జేసినయెడల, నా దేశప్రజలను దౌర్గత్యము పాలుచేసిన వారగుదురు

టర్కీ రిపబ్లిక్ యొక్క ప్రెసిడెంటునందే యీ కాలిఫ్ అధికారము నేల యుంచకూడదని మరికొందఱు ప్రశ్నించుచున్నారు. అట్లు చేయుటవలన మత శృంఖలములనుండి తప్పించుకొని స్వాతంత్ర్యపదవి ననుభవించుచున్న టర్కీని తిరిగి దాస్యకూపమున బడద్రోసినట్లగును. టర్కీలో నధికసంఖ్యాకులు మహమ్మదీయులైన మాట నిజము. కాని ఇతర మతములవారు కూడ జాలమంది కలరు. ఎంతమందియో యూదీయులు కలరు. క్రైస్తవులు కలరు. కేలిఫ్ రాజకీయాధికారిగ నున్నంతకాలము, తుర్కీలోని క్రైస్తవులకును, యూదీయులకును, తురుష్క రాజ్యాంగముపై నభిమానముకాని, అందు స్థానముగాని లేదు. యూదీయులును, క్రైస్తవులును తురుష్కాధికారులచే వధింపబడిన వృత్తాంతములు, తురుష్క చరిత్రలో నత్యంత విషాదకరములైన అధ్యాయములు. తుర్కీలో నట్టి క్రౌర్యములు జరుగుచుండుటచేతనే తుర్కీయెడల యూరపియనులకును, అమెరికనులకును జాల యసహన మేర్పడినది కమల్‌పాషావంటి జాతీయోద్ధారకు లీ రహస్యమును గమనించిరి. తుర్కీలోని మహమ్మదీయేతరులకు తురుష్క రాజ్యాంగములో స్థానము గౌరవము గలుగజేసినగాని తుర్కీ శాంతిసుఖముల బొందజాలదని గ్రహించిరి. ఇప్పుడు తుర్కీలో సర్వమతముల వారికిని ప్రతినిధులను బంపుకొను స్వాతంత్ర్య మొసగబడినది. తుర్కీలోని

ప్రతినిధిసభయం దిప్పుడొక్క మహమ్మదీయులే సభ్యులు కారు యూదీయ సభ్యులు కలరు, క్రైస్తవ సభ్యులును కలరు టర్కీ రిపబ్లిక్కు యొక్క మొదటి ప్రెసిడెంటగు కమల్‌పాషా మహమ్మదీయుడైనను, రేపు ఒక క్రైస్తవ సభ్యుడో లేక యూదీయ సభ్యుడో, ప్రజానురంజకుడైనచో, ప్రెసిడెంటు పదవికి ఎన్నుకొనబడవచ్చును. టర్కీలోని రిపబ్లిక్కునకు శాశ్వతముగ మహమ్మదీయుడే ప్రెసిడెంటుగ నుండవలయునని నియమము చేసినయెడల తురుష్క ప్రజలలోని మహమ్మదీయేతరులకు తప్పక యసంతృప్తి కలిగితీరును. అప్పుడు తురుష్క రాజ్యాంగమునకు స్థిరత్వముండ జాలదు తుర్కీలోని చిన్న సంఘములకు గూడ బెద్ద సంఘముతోబాటు సమానాధికారము లొసగబడుట చేతనే మహ్మదీయేతరు లిప్పుడు రిపబ్లిక్కునకు దోడ్పడుచున్నారు. తుర్కీలో బూర్వము ప్రబలుచుండిన వైరములు తొలగి జాతీయభావము విజృంభించుట కాస్పదమైనది.

కిలాఫత్తు లోపించుటవలన మహమ్మదీయమండలి కంతకు ఐక్యానుసంధాయకమగు ఒక చిహ్నము లేకుండపోయెనని మరికొందఱు ఆధిక్షేపించుచున్నారు. కిలాఫత్తు ఒక విధముగ మహమ్మదీయుల కందఱకు ఏకలక్ష్యముగ నుండిన మాట నిజమేకాని, వారినందఱిని ఒక్క రాజ్యాంగమున నిమడ్చజాలక పోయెను. కిలాఫత్తునందు లక్ష్యముగల మహమ్మదీయులు తుర్కీపై తిరుగుబాటు చేసి, తురుష్క సామ్రాజ్యమునుండి విడిపోలేదా? మక్కాషరీఫ్ వంటి మతాచార్యుడే కిలాఫత్తు యొక్క ఆధిపత్యమును తిరస్కరించలేదా? కిలాఫత్తు మహమ్మదీయులలో నైకమత్యమును గూర్పగలిగెనని చెప్పుటకు చరిత్ర తోడ్పడజాలదు. తురుష్క సామ్రాజ్యము ఒక కాలమున పర్షియా మొదలుకొని యూరపులోని స్పెయిను దేశము వఱకు వ్యాపించి యుండెను. అట్టి సామ్రాజ్యము క్రమక్రమముగ విచ్ఛిన్నమగుటకు గారణమేమి? మహమ్మదీయులతో నిండిన దేశములే తురుష్క సామ్రాజ్యమునుండి విడివడినప్పుడు, కిలాఫత్ పీఠము మహమ్మదీయులలో గలిగించిన ఐక్యత మృగ్యము. ఎట్టి మతమైనను దేశాచారములను, జాతిభేదములను రూపుమాప జాలదు. స్వల్పజాతులు సహితము నేడు తమ వ్యక్తిత్వమును గాపా

దుకొన జూచుచున్నవి ఏ దేశమునకా దేశమునకు దగిన రాజ్యాంగమును. సామాజిక విధానమును, గల్పించుకొనుట మానవోన్నతికి అవసరము సంగతి సందర్భములనెల్ల నిష్పక్షముగ నాలోచించిన యెడల, తురుష్కేతరులగు మహమ్మదీయులు కమల్ పాషా యొనర్చిన సంస్కరణమును నిందింపజాలరని మా యాశయము.

కృష్ణా పత్రిక
మార్చి 15వ తేదీ, 1924 సం॥